సీతారామయ్య, వెల్లాల

# జాతక ఫలచింతామణి

చెన్నపురి, 1928

Record no. 32

## Bibliographic Record Target

సీతారామయ్య, వెల్లాల.
జాతక ఫలచింతామణి : ఆంధ్ర తాత్పర్య సహితము / వెల్లాల సీతారామయ్య. - చెన్నపురి : శ్రీరాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాల, 1928.
16, 544 p. ;18 cm.
Record no. 32

Sītārāmayya, Vellāla.
Jātaka phalacintāmaṇi : Āṃdhra tātparya sahitamu / Vellāla Sītārāmayya. - Cennapuri : Śrīrājarājēśvarī nikētana Mudrākṣaraśāla, 1928.
16, 544 p. ;18 cm.
Record no. 32

శ్రీరస్తు.

# జాతకఫలచింతామణి

ఆంధ్ర తాత్పర్య సహితము.

ఇది

వెల్లాల. సీతారామయ్యా గారిచే

వ్రాయబడినది.

చెన్నపురి: ప్రాతచాకలపేటయందుండు

పమ్మి - త్యాగరాయసెట్టిగారిచే

స్వకీయ

శ్రీరాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రకటింపబడినది.

1928

# ప్రకటన.

ఇవి మొదలైన సంస్కృతాంధ్ర గ్రంథములు వలయువారలు ఈదిగువ కనఁబఱచియుండు పైవిలాస దార్లకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

గ్లేజు కాలికోబైండు రూ. 2—8—0.

రఫ్ సాధారణబైండు రూ. 2—0—0.

స్వామి - త్యాగరాయసెట్టి అండు సన్సు,
శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ప్రెస్,
చాకలపేట—మద్రాస్.




# పీఠిక.



జన్మాంతరమందు పుణ్య పాప రూపకంబగు నెట్టి కర్మ సంపాదింపబడెనో దాని యనుభవ మీ జన్మమునందు కలిగి యా ఫలము దశాంతర్దశాదులవల్ల సమస్త జనులును తమ తమ జాతకములయందలి జననకాల గ్రహములయొక్క బలాబలముల కనుగుణముగా శుభాశుభ ఫలముల నెఱుంగవచ్చును. అట్లు తెలియుటయే గాక ఆ దశాదులవల్ల కలిగెడు యనిష్టములకు యథావిధిగా శాంతులు చేయుటవల్ల ననిష్ట పరిహారమై జాతకుడు అభీష్టసిద్ధిని, సుఖమును, పొందును. కాబట్టి జన్మకాల ఘడియలనుబట్టి కాల సాధన లగ్న స్ఫుట సాధనలవల్ల గ్రహములనుకనుగొని స్థానాదిషడ్బలములవల్లను, ఆధిపత్యస్థితి సాహచర్య, వీక్షణాదులవల్లను, మహా దశానాథునకును అంతర్దశానాథునకు గల సంబంధా సంబంధ మూలకముగ గ్రహములకును కలిగెడు శుభాశుభత్వములను చక్కగా పరిశీలించి బలాబలములను, గుణదోషములను గణితమార్గములవల్ల గణన చేసి పిమ్మట వాని వాని శుభాశుభ ఫలములను చెప్పినట్లయిన స్ఫుటతరముగా నుండును.

అయినను ఫల భాగమునకు సంబంధించిన జ్యోతిష గ్రంథము లనేకములున్నను, పైచెప్పిన ప్రకారముగా ఫలములను క్రోడీకరించి తెలిపెడి గ్రంథము లేనట్టి కొఱతను దీర్చుటకై అనేక ప్రాచీన జ్యోతిష గ్రంథముల యందలి ఫల భాగాధ్యాయములలోని ముఖ్య సారాంశమును ఒకచోట

## పీఠిక.

చేర్చి సవిస్తరముగా సంస్కృతభాషలో వ్రాయబడియున్న ఈ జాతక గ్రంథమును గ్రంథ ప్రచారకులగు మహారాజరాజ శ్రీ పమ్మి - త్యాగరాయసెట్టిగారి ప్రేరణవల్ల ఆంధ్రీకరించి యున్నాను. ఈ గ్రంథమును జ్యోతిషాభిమానులందఱు తగు ప్రోత్సాహ మిత్తురని ప్రార్థన.

గ్రంథకర్త,
వెల్లాల - సీతారామయ్య.



శ్రీరస్తు

# జాతకఫలచింతామణి

## విషయసూచిక.

విషయము. పుట.

### ప్రథమ ప్రకరణము.

## ద్వితీయ ప్రకరణము

| విషయము. | పుట. |
|---|---|




| విషయము. | పుట. |
|---|---|


విషయసూచిక.

సమాప్తము.

| | |
|---|---|
| బృహజ్జాతకము సాధారణప్రతి | ౧-౮-౦ |
| డిటో గ్లేజు కాలికోబైండుగలది. | ౨-౦-౦ |
| కాలామృతము. ౦-౧౨-౦ డిటో గ్లేజు. | ౧-౦-౦ |
| ముహూర్తదర్పణము. | ౦-౮-౦ |
| జాతకచంద్రిక. | ౦-౨-౦ |
| ముహూర్తసంగ్రహము. | ౦-౩-౦ |
| జ్యోతిషముహూర్త ఫల బాలబోధామృతము. | ౦-౪-౦ |
| జ్యోతిషార్ణవ నవనీతము. | ౧-౮-౦ |
| గోచారదర్శిని ప్రథమభాగము. | ౧-౦-౦ |
| డిటో ద్వితీయభాగము. | ౦-౧౨-౦ |
| వాస్తుఫలసంగ్రహము. | ౦-౧-౦ |
| జినేంద్రమాల. | ౦-౧౦-౦ |
| ముహూర్తచంద్రిక. | ౦-౧౦-౦ |
| దైవజ్ఞశిఖామణి ఆంధ్రతాత్పర్యసహితము. | ౨-౮-౦ |
| కృష్ణవాస్తు. | ౦-౬-౦ |
| ఆర్తవచంద్రిక. | ౦-౫-౦ |
| జలార్గళశాస్త్రసంగ్రహము. | ౦-౩-౦ |
| అష్టకవర్గు. | ౦-౫-౦ |
| చప్పన్నము ప్రశ్నశాస్త్రము. | ౦-౬-౦ |
| ప్రశ్నచూడామణి సాధారణప్రతి. | ౧ ౦-౦ |
| డిటో గ్లేజుకాగితములప్రతి. | ౧-౮-౦ |
| సీతారామాంజనేయసంవాదము. టీ. తా. వి. సహితము. | ౨-౮-౦ |

పమ్మి - త్యాగరాయసెట్టి అండు సన్సు. చాకలపేట—చెన్నపట్టణము.



శ్రీరస్తు.

శ్రీమహాగణపతయేనమః.

# జాతకఫలచింతామణి.

ఆంధ్రతాత్పర్యసహితము.

మంగళాచరణము.

శ్లో॥ శ్రీమద్గఙ్గాధరసుతం చన్ద్రరేఖావతంసినమ్।
సిద్ధిదం సర్వవిద్యానాం వన్దే దన్తావళాననమ్॥

తా. గంగనుధరించిన శివునికి కుమారుడును, చంద్రుని కళ శిరోభూషణముగా గలవాడును, సర్వవిద్యాసిద్ధి నొసంగువాడును, నగు గజాననునకు నమస్కరించెదను.

శ్లో॥ నక్షత్ర గ్రహవాయ్వగ్ని జల భూమండలాశ్రయః।
హంసః కాలాత్మకః పాయాత్కర్మసాక్షీ జగత్సదా॥

తా. ఆకాశమునందగుబడియెడు నక్షత్రములకును, చంద్రాది గ్రహములకును, గాలికిని, పిడుగు, మెరుపు మొదలగు జ్యోతికిని, నీటికిని, భూగోళమునకును, చలనాదిక్రియానిమిత్తుడగుటంజేసి యాధారభూతుండును, పిండాండంబున ప్రాణాపాన చైతన్యరూపుండును, ప్రాణుల పుణ్యపాపకర్మములకు సాక్షిభూతుండును, కాలమూర్తియును, అగు సూర్యుడు ఎల్లప్పుడును జగమును బ్రోవుగాత.

## అ ను బ ం ధ చ తు ష్ట య ం.

శ్లో॥ తాత్కాలిక్యాఖేటే గత్యాయత్ఫలంజాత కోచితం।
విషయ స్తస్య విజ్ఞానం ప్రయోజన ముదీరితం॥
జిజ్ఞాసురధి కారిస్యా చ్ఛాస్త్రస్య విషయస్యచ।
వాచ్యవాచక భావశ్చ సంబంధోత్ర నిగద్యతే॥
ప్రేక్షావతాం ప్రవృత్త్యర్థ మనుబంధ చతుష్టయం।
జ్ఞాత్వాశాస్త్రే ప్రవృత్తానా మనినిష్టస్య నివర్తనే॥
శాంత్యా ద్యుపాయకథనం ధర్మశాస్త్రే ప్రసిధ్యతి।
ఆయుర్వృద్ధ్యాది లాభస్తు శ్రౌతాయుష్టోమ కర్మణా॥
ప్రసిద్ధమితి శాస్త్రస్య చామోఘత్వం ప్రకాశితం॥

తా. జన్మకాల గ్రహస్థితులను బట్టి జాతకునికి కలుగ బోవు ఫలమే విషయము. దానిని తెలియడమే ప్రయోజనము. దానిని తెలియ నపేక్షించువాడే అధికారి. శాస్త్రములవల్ల ఫలములను తెలియబడుటయే సంబంధము. ఈవిధముగా నాలుగు అనుబంధములు చూపి యుండుటవల్ల బుద్ధిమంతులు ఈ శాస్త్రమునందు ప్రవర్తించి విషయ విచారముచేత తెలియు నట్టి అనిష్టములను, ధర్మశాస్త్రోక్తమైన శాంత్యాదికర్మలచేత పరిహారముబొంది, వేదోక్త ఆయుష్టోమేష్ట్యాది కర్మలచేత ఆయుర్వృద్ధి మొదలగు శ్రేయస్సులను పొందుటకు ఉపయుక్తమైన ఈశాస్త్రము ప్రసిద్ధమైనదనియు, అమోఘమైనదనియు ప్రకాశింపబడుచున్నది.

## రాశిషష్ట్యంశములు.

సర్వార్థ చింతామణౌ.

శ్లో॥ యుగ్మేక్రమా ద్వ్యుత్యయమేవరాశౌ।
షష్ట్యంశకాదా మధిపా స్త్వయుగ్మే।



ఘోరాంశకో రాక్షస దేవభాగా।
కుబేర రక్షోగణ కిన్నరాంశాః।
భ్రష్టః కులఘ్నో గరళాగ్నిసంఘా।
మాయాంశకః ప్రేతపురీశభాగః।
అపాంపతిర్దేవ గణేశభాగః।
కాలాహిభాగా సమృతాంశచంద్రా।
మృద్వంశకః కోమల పద్మభాగా।
లక్ష్మీశవాగీశ దిగంబరాంశాః।
దేవేంద్రభోగా కవినాంశభాగః।
క్షితీశ్వరాంశః కమలాకరాంశః।
క్రమేణమందాత్మజ మృత్యుకాల।
దేవాగ్నిఘోరా యమకంటకాంశాః।
సుధామృతాంశౌ పరిపూర్ణచంద్రః।
విషప్రదగ్ధో కులనాశముఖ్యా।
వంశక్షయో త్పాతక కాలసౌంప।
సౌమ్యాంశ మృద్వంశ సుశీతలాంశాః।
దంష్ట్రికరాళేందు ముఖః పురీషాః।
కాలాగ్ని దండాయుధ నిర్మలాంశాః।
శుభాశుభాంశా వతిశూలభాగః।
సుధాపయోధి భ్రమణేందు రేఖాః।
జ్ఞేయం క్రమా ద్వ్యుత్యయమేవయుగ్మే।
శుభాన్వితాంశో యది శోభనా ప్తిః।
క్రూరషష్ట్యంశకా స్సర్వేనాశయంతిఖచారిణః।
యదిపూర్ణబలైర్యుక్తాస్సోచ్చమూలత్రికోణగాః॥ 1

తా. రాశిని 60 భాగములు చేయగా 30 లిప్తలుగల అంశము ఏర్పడును. ఇవియే షష్ట్యంశము లనబడును. ఓజరాశి యందు షష్ట్యంశములకు క్రింద చెప్పబోయ్యేడి క్రమంబున అధిపతులగుదురు. ఎట్లనిన, 1 ఘోరాంశము, 2 రాక్షసాంశము, 3 దేవాంశము, 4 కుబేరాంశము, 5 రక్షోగణాంశము, 6 కిన్నరాంశము, 7 భ్రష్టాంశము, 8 కులఘ్నాంశము, 9 గరళాంశము, 10 అగ్నిఘాతాంశము, 11 మాయాంశకము, 12 ప్రేతపురీశాంశము, 13 అపాంపత్యంశము, 14 దేవగణేశాంశము, 15 కాలాంశము, 16 సర్పాంశము, 17 అమృతాంశము, 18 చంద్రాంశము, 19 మృద్వంశకము, 20 కోమలాంశము, 21 పద్మాంశము, 22 లక్ష్మీశాంశము, 23 వాగీశాంశము, 24 దిగంబరాంశము, 25 దేవాంశము, 26 ఇంద్రాంశము, 27 కలినాశాంశము, 28 క్షితీశ్వరాంశము, 29 కమలాకరాంశము, 30 మందాత్మజాంశము, 31 మృత్యంశము, 32 కాలాంశము, 33 దవాగ్న్యంశము, 34 చోరాంశము, 35 యమకంటకాంశము, 36 సత్యాంశము, 37 అమృతాంశము, 38 పరిపూర్ణచంద్రాంశము, 39 విషప్రదగ్ధాంశము, 40 కులనాశాంశము, 41 ముఖ్యాంశము, 42 వంశక్షయాంశము, 43 ఉత్పాతకాంశము, 41 కాలరూపాంశము, 45 సౌమ్యాంశము, 46 మృద్వంశము, 47 సుశీతలాంశము, 48 దంష్ట్రాంశము, 49 సితాబ్జాంశము, 50 ఇందుముఖాంశము, 51 పూర్ణాంశము, 52 కాలాగ్న్యంశము, 53 దండాయుధాంశము, 54 నిర్మలాంశము, 55 శుభాంశము, 56 అశుభాంశము, 57 అతిశీతలాంశము, 58 సుధాపయోధ్యంశము, 59 ద్యుమణ్యంశము, 60 ఇందు రేఖాంశము. ఇట్లు ఓజరాశియందు షష్ట్యంశాధిపతులం క్రమంబుగ నెఱుంగునది. యుగ్మరాశియందు వ్యత్యయ



ముగ నెఱుంగదగినది. శుభముతోఁగూడిన అంశముగలదియైన యెడల శుభప్రాప్తికలుగును. క్రూరాంశముగలదియైనయెడల పాపఫలము సంభవించును. అనగా అంశనామమునకు తగినట్లు శుభాశుభ ఫలముల నూహించతగినది. ఇదియొక సాధారణ ఫల నిర్ణయము.

రాజాదిగ్రహాః.

శ్లో॥ దినేశచంద్రౌ నరపాలకాఖ్యౌ ।
నేతాత్మజ స్సోమసుతః కుమారః ।
శుక్రేంద్రపూజ్యౌ సచివౌశనిశ్చ ।
ప్రేష్యంతు తద్వృత్తి ముపైతిజాతః॥ 2

తా. సూర్య చంద్రులు రాజులు, కుజుడు సేనాధిపతి, బుధుడు యువరాజు, గురు శుక్రులు మంత్రులు, శని భృత్యుడు యగును. జననకాలమందు బలాధిక్యముగల గ్రహమునకు తగినట్లు జాతకునియొక్క వృత్తిని యూహింపతగినది.

ఆత్మాదిగ్రహాః.

దైవజ్ఞ భూషణే.

శ్లో॥ ఆత్మారవి శ్శీతకరోమనస్తు ।
సత్వంకుజో భాషణమబ్జసూనుః ।
వాచాంపతిర్జ్ఞానసుఖంమదేశ ।
శ్శుక్రోభవే దర్కసుతస్తు దుఃఖః॥ 3

తా. సూర్యుడు ఆత్మ, చంద్రుడు మనస్సు, కుజుడు బలము, బుధుడు వాక్కు, గురువు జ్ఞానము- సుఖము, శుక్రుడు కామము, శని దుఃఖమును యిట్లు కాలపురుషునకు గ్రహంబులగుదురు.

రవ్యాది రస నిర్ణయః.

దైవజ్ఞవిలాసే.

శ్లో॥ తిక్తస్తు శనిరాహ్వోశ్చ మధురంతు బృహస్పతిః ।
ఆమ్లంభృగో ర్విధోఃక్షారం కుజస్య క్రూరజోరసః ।
తువరస్సోమ పుత్రస్య భాస్కరస్య కటుర్భవేత్॥ 4

తా॥ శని రాహువులకు వగరు, గురునకు తీపు, శుక్రునికి పులుసు, చంద్రునకు లవణము, కుజునకు చేదు, బుధునకు షడ్రసములకూటమి, సూర్యునకు కారము, ఈ ప్రకారముగా రవ్యాదిగ్రహములకు రసనిర్ణయము చెప్పబడియున్నది. దీనికి ప్రయోజనము. భోజనవిషయమైన ప్రశ్నయందు ప్రశ్నయొక్క లగ్నగత గ్రహమునకుగాని తన్నవాంశాధిపతికిగాని చెప్పబడిన రసముతోఁగూడిన భోజనము అని తెలియుట మొదలగునవి.

గ్రహాణాం జాతిభేదాః.

శ్లో॥ విప్రౌభవేతాం గురుదానవేజ్యౌ ।
దినేశభౌమౌ నరపాలకాఖ్యౌ ।
సోమశ్చ విద్వైశ్య కులప్రసూతౌ ।
దినేశపుత్రస్తు చతుర్థ గోత్రః ।
చండాలజాతిస్తు స సైంహికేయః ।
కేతుశ్చ జాత్యంతక మేతి మాన్యః॥ 5

తా. గురుశుక్రులు బ్రాహ్మణులు, రవి కుజులు క్షత్రియులు, చంద్రబుధులు వైశ్యులు, శని శూద్రుడు, రాహువు చండాలుడు, కేతువు అంత్యజాతి. ఈప్రకారముగా గ్రహముల యొక్క జాత్యభిమానముల నెఱుంగునది. ఇది గ్రహబలవశంబున చోరాది వర్ణజ్ఞానమందు ప్రయోజనకారి యగును. (పాఠాంతరమునందు రాహువునకు మ్లేచ్ఛజాతియనియు, ధూం



దిగ్రహమునకు సంకరజాతియనియు, ధూమాది గ్రహంబులకు విలోమజాతియనియు, చెప్పబడియున్నది.)

రవ్యాది గ్రహాణాం స్థానాని.

కేరళతంత్రే.

శ్లో॥ దేవస్థానం భాస్కరస్యాంబువాసం ।
చంద్రస్యాగ్ని స్థాన మంగారకస్య ।
క్రీడాస్థానం సోమపుత్రస్య కోశ ।
స్థానంజీవస్యైవ మాహు ర్భృగోస్తు ।
సుప్తస్థానం భానుజస్యోషరంతు ।
సార్పస్థానం సంహికేయశ్చ చైవం॥ 6

తా. దేవస్థానమునకును, దేవపూజా గృహమునకును, సూర్యుడు అధిపతి, జలసమీపమునకును స్నాన శాలకును చంద్రుడు అధిపతి, అగ్ని సమీపమునకును పాకశాలకును కుజుడు అధిపతి, క్రీడాగృహమునకు బుధుడు అధిపతి, బొక్కసపుగృహమునకు బృహస్పతి అధిపతి, శయనమునకును, శయనగృహమునకును శుక్రుడు అధిపతి, ధూపరాగరాశికి శనైశ్చరుడు అధిపతి, సర్పస్థానమునకు రాహువు అధిపతి, ఇందుకు ప్రయోజనము జన్మకాలమందు బలవద్గ్రహ వశంబున ఆయా గ్రహములకు చెప్పబడిన స్థానమందు ప్రసవమనియు, హృతనష్టాది ప్రశ్నల యందు చోరుడుగాని చోరుడపహరించిన ద్రవ్యముగాని బలవద్గ్రహ స్థానమందుండు ననియును తెలియవలయును.

గ్రహాణాం వస్త్రనిర్ణయః.

కేరళే.

శ్లో॥ జీర్ణంశనేర్వాసరనాయకస్య ।
స్థూలంగురో ర్మధ్యమకం భృగోస్తు ।

కాఠిన్యమబ్జస్య నవంబుధస్య ।
శైత్యంకుజస్యాగ్ని హతంచ వస్త్రం ।
కంథా ఫణీంద్రస్యతు చిత్రరూపాః ।
కేతోర్మహో చిత్రయుతా విశేషాత్ ॥ 7

తా. చినిగినవస్త్రము శనికి, ముదుగైన వస్త్రము సూర్యునికి, నడిపాతదైన వస్త్రము (అనగా సగము జీర్ణమైన వస్త్రము) గురునికి, గట్టివస్త్రము శుక్రునికి, క్రొత్తవస్త్రము చంద్రునికి, నీళ్ల చేతపికిలిన వస్త్రము బుధునికి (తడిసిన బట్టయనియు), కాలినవస్త్రము కుజునికి, బొంత రాహువునకు చిత్రవస్త్రము కేతువునకుప్రీతి. ఇందునకు ప్రయోజనము, బలవద్గ్రహ వశంబున సూతికా వస్త్రంబును. హృతనష్టాది చింతయందు చోరాదివస్త్రమును తెలియుట.

గ్రహాణాం లోహాదయః.

కేరళే

శ్లో॥ తామ్రందినేశస్య నిశాకరస్య ।
మణిర్హిరణ్యంతు ధరాసుతశ్చ ।
శుక్తిర్బుధే దేవగురోస్తు రౌప్యం ।
ముక్తా భృగోరాయసమర్కసూనోః ।
రాహోస్తుసీసం శిఖినశ్చనైల్యం ।
ధరాసురాస్తత్కథయంతి తద్జ్ఞాః ॥ 8

తా. తామ్రము సూర్యునికి, మణులు చంద్రునికి, బంగారము కుజునికి, ఇత్తళి, కంచు మొదలైనవి బుధునికి, వెండి బృహస్పతికి, ముత్యములు శుక్రునికి, ఇనుము శనికి, సీసము రాహువునకు, నీలము కేతువునకు ద్రవ్యంబులు, స్వస్థానగతుడైన బృహస్పతికి స్వర్ణమని లఘుజాతకమునందు "స్వస్థానే



హేమజీవేపి" యనిచెప్పబడి యున్నది, బాదరాయణాచార్యులుకూడ "జీవస్యరౌప్యం స్వగృహేస్థితస్య తస్యైవహేమో శనసశ్చ" యనిచెప్పియున్నారు. ఇందుకు ప్రయోజనము. బలవద్గ్రహ వశంబున సూతికాగృహమందు దీప భాజనాది పరిజ్ఞానము, హృతనష్టాది ప్రశ్నయందు చోరాదిహృత ద్రవ్యపరిజ్ఞానము. జన్మకాలమందు ఏగ్రహము బలవంతమై యుండునో ఆగ్రహదశయందు తదుక్తద్రవ్యలాభము, హీనబలగ్రహ దశయందు తదుక్తద్రవ్య క్షయము.

వర్ణాదయః.

బృహజ్జాతకే.

శ్లో॥ రక్తశ్యామో భాస్కరోగౌర ఇందు ।
ర్నాత్యుచ్చాంగో రక్తగౌరశ్చ వక్రః ।
దూర్వాశ్యామోజ్ఞో గురుర్గౌర గాత్ర ।
శ్వేతశ్శుక్రో భాస్కరిః కృష్ణదేహః ।
రాహుస్తు ధూమ్రవర్ణశ్చ ।
చిత్రవర్ణో ధ్వజస్మృతః ॥ 9

తా. సూర్యుడు రక్తశ్యామ మిశ్రవర్ణుడు అనగా పాటల పుష్పవర్ణము గలవాడు, చంద్రుడు శ్వేతవర్ణుడు, అంగారకుడు రక్తగౌరవర్ణుడు అనగా దీప్తాగ్ని సమానవర్ణుడు, బుధుడు లేతగరికవలె ఆకుపచ్చవర్ణము గలవాడు, బృహస్పతి పసపువర్ణము గలవాడు అనగా తప్తకాంచన వర్ణుడు, శుక్రుడు తెల్లనివాడు, శని నీలవర్ణుడు, రాహువు ధూమ్రవర్ణము గలవాడు, కేతువు చిత్రవర్ణముగలవాడు, ఇందుకు ప్రయోజనము. జన్మకాలమందు ఏగ్రహము బలవంతమై యుండునో ఆగ్రహము యొక్కవర్ణముగలవాడు జాతకుండౌననియు, హృతనష్టాదిప్రశ్న

లయందు చోరాదులు బలవద్గ్రహ సమానవర్ణు లనియును తెలియుట.

గ్రహాణాం సువస్త్ర నిర్ణయః.

కేరళే.

శ్లో॥ చీనాంబరం దేవగురో ర్భృగోస్తు ।
క్షౌమాంబరం రక్తిమమబ్జ బంధోః ।
శుక్లక్షౌమ రాత్రినాథస్య శ్యామం ।
క్షౌమంసౌమ్యస్యాతిరక్తం కుజస్య ।
వస్త్రంచిత్రం పట్టవస్త్రం శనేస్తు ।
నైల్యంరాహో ర్జీర్ణచిత్రా న్వితంచ ।
రూపాన్వితం తద్వసనంచ కేతో ।
ర్బలాన్వితానాంతు వదేద్గ్రహాణాం ॥ 10

తా. బృహస్పతికి చీనావస్త్రంబును, శుక్రునకు వెలిపట్టి వస్త్రంబును, సూర్యునకు ఎఱ్ఱనివస్త్రమును, చంద్రునకు తెల్లని పట్టువస్త్రమును, బుధునకునల్లని పట్టువస్త్రమును, కుజునకు చిత్రముతోగూడిన రక్తవస్త్రమును, శనికి చిత్రముతో గూడిన పట్టువస్త్రమును, రాహువునకు చినిగిననీలివస్త్రమును, కేతువునకు చిత్రముతో గూడిన వస్త్రమును, యిట్లునష్టాది ప్రశ్నలయందు బలాధిక్య గ్రహము ననుసరించి మతాంతర వస్త్రనిర్ణయము చేయతగినది.

గ్రహాణాం సప్తవింశతి సమయాః.

దైవజ్ఞాభరణే.

శ్లో॥ మేషాది జన్మ రాశ్యంతం ।
ధ్రువంమేషాది యేగ్రహాః ॥
రాశీగుణ్యంచ తత్తుల్యం ।
తద్దశాగుణితం పునః ॥
సప్తవింశతి భాగంచ ।
తచ్ఛేషం సమయంవిదుః ॥ 11

తా. మేషరాశి మొదలుకొని జన్మరాశి పర్యంతము లెక్కపెట్టిన సంఖ్యను మేషము మొదలు గ్రహమువుండే రాశి వరకు లెక్కించిన సంఖ్యచేతగుణించి, యీగుణించిన సంఖ్య నుమరల ఆగ్రహ దశావర్షములచేత గుణించగా వచ్చినమొత్తపు సంఖ్యను, 27 చేతభాగించగా వచ్చిన శేషమే ఆగ్రహ సమయమగును. ఇదియొకమతము. గ్రంథాంతర పాఠము.

శ్లో॥ మేషాద్యా లగ్నసంఖ్యాభిః ।
మేషాద్యాః ఖేట సంజ్ఞికాః ॥
సంగుణ్యచ సఖేటాంతం ।
ధృవంస్యాత్త ద్యుచారిణాం ॥
స్వధృవం స్వదశావర్ష ।
సంఖ్యయా గుణయేత్పునః ॥
పూర్వోక్త భాజకాల్లబ్ధం ।
గ్రహాణాం సమయం విదుః ॥ 12

తా. అనగామేషరాశి మొదలుకొని జన్మలగ్నమువరకు లెక్కించి సంఖ్యనుకనుగొని, ఏగ్రహమునకు సమయము కనుగొనవలయునో ఆగ్రహము మేషాదిగా ఎన్నవరాశి యందున్నదో ఆసంఖ్యను తెలిసికొని, పైసంఖ్యతో గుణించగా ఏర్పడిన ధృవ సంఖ్యను ఆగ్రహ దశావర్షములచేత గుణించి 27 చేత భాగించగా వచ్చినశేషము ఆగ్రహ సమయ మనబడును.

శ్లో॥ ఆద్యాస్నానం మహాభీతి శ్శత్రుబాధా ధనక్షయం ।
ద్వితీయం సుఖమాప్నోతి వస్త్రాలంకార భూషణం ।

తృతీయం వాహనారూఢం బహుసేనాది సంభవం ।
చతుర్థసమయేజాతః శౌర్యోదారస్స సంభ్రమః ।
సమరే యుద్ధసంపన్నః యశఃకీర్తిస్తు జాయతే ।
పంచమే బుద్ధిసంపన్నో పంచాక్షర పరాయణః।
దేవబ్రాహ్మణ భక్తిశ్చ ధనవాన్ గుణవాన్భవేత్ ।
షష్ఠమం శత్రుహంతాచ బహు దేశాధిపత్యతాం ।
దేవబ్రాహ్మణ భక్తిశ్చ శివపూజా ఫలం విదుః ।
సప్తమం యజ్ఞసమయం నృత్తవాద్యాది సంభవః ।
బహుదార సుతోత్పన్న స్సచివేంద్ర సమోభవేత్ ।
అష్టమం విష్ణుపూజాచ అష్టాక్షర పరాయణః ।
అన్నదాన రతోనిత్యం సదావిభవ సంభవః ।
నవమేభోగసమయే జాతశ్చండాభి మానవాన్ ।
గమనే బహురాజ్యంచ నృత్తవాద్యాది కోవిదః ॥
దశమే కీర్తి సంపన్నః నృత్తభేర్యాది వాద్యకృత్ ।
అఖండరాజ్య మాప్నోతి రాజారాజ్యాధిపో భవేత్ ॥
ఏకాదశం రుద్రపూజా గాంభీర్య ధనికోభవేత్ ।
గీతపాఠం శాస్త్రపాఠం సభాపూజ్యో భవేన్నరః ॥
ద్వాదశ్యా మతిథింపూజా దేవబ్రాహ్మణ తోషితః ।
స్నాపహోమాదికం కృత్వా సదాధ్యాన పరాయణః ॥
త్రయోదశి సౌఖ్యభోజీ గోమహిష్యాది సంభవైః ।
స్వర్ణముక్తాది శోభాఢ్యః క్రయవిక్రయ కౌశలః ॥
చతుర్దశ యశోభిశ్చ విద్యాశాస్త్ర ప్రసంగతః ।
అగ్నిహోత్రాదికం కృత్వా రాజావా తత్సమోపివా ॥
పంచాదశంచ కోపంచ సదా కలహమిచ్ఛతి ।
మిత్రద్రోహమవాప్నోతి బంధుత్యాగీ దరిద్రవాన్ ॥



షోడశే సమయేజాత స్సదా తాంబూలమిచ్ఛతి ।
గీతవాద్యాది సంతోషం నిత్యం కామాతురోభవేత్ ॥
సప్తాదశం దేవసభాం చతుస్సేనా సమన్వితం ।
అష్టాదశం కిరీటంచ బహు దేశాధిపత్యతాం ॥
ఏకోన వింశజ్జాతోహి రహస్యం పరమంశుభం ।
ఆలస్యం వింశతిశ్చైవ సదాలస్య సమన్వితః ॥
ఏకవింశతి నిద్రాత్వం సదా దారిద్రమాప్నుయాత్ ।
ద్వావింశ జ్జలపానంచ దాహతాప సమన్వితః ॥
త్రయోవింశ త్క్షీరపానం పుష్పచందన ధారణం ।
స్త్రీణాంమధ్యే సుభోగాప్తి స్త్రైష్టకశ్చ ధనత్రయం ॥
పంచవింశ త్కిరీటంచ చతుస్సేనా సమన్వితం ।
షడ్వింశత్యాతి నిద్రత్వం నేత్రోదక సమన్వితం ॥
సప్తవింశతి స్త్రీభోగం ధననాశం భవేధ్రువమిత్యేకోపక్షః ॥
ముఖ్యపక్షస్తు బహుగ్రంథాభిప్రాయః ॥

కేరళీయే.

ముఖప్రక్షాళనం స్నానం వస్త్రాభరణ మేవచ ।
విభూతి చందనాద్యైశ్చ అక్షతాం సమలంకృతాం ॥
సంధ్యావందన సత్కర్మ జపశీలం తథైవచ ।
ఆదిత్య మంబికాంవిష్ణుం పుణ్య శ్రవణకీర్తనం ॥
ఔపాసనంచ త్రేతాగ్నిం పూజా హోమార్చనాదికం ।
లక్ష్మీనారాయణం పూజా పురాణం శ్రవణంతథా ॥
నమస్కారంచ దీక్షాచ పర్వతాది ప్రదక్షిణం ॥
వైశ్వ దేవార్చనంచైవ అతిథీనాంచ పూజనం ।
భోజనం బహుభిశ్చైవ ప్రసంగం చ్యాపివిద్యయా ।
కోపాలస్యంచ మోహంచ తాంబూల చర్వణంభవేత్ ॥

రాజపూజ్యాది భోగంచ కిరీటస్య చ ధారణం ।
రథాశ్వ మధిరోహంచ వాద్యఘోషాది నిస్వనైః ॥
రాజాధికార భోగంచ నృత్తవాద్యాది సంయుతం ।
ఆలస్యం కుత్సితంచైవ శయనాది సుఖంతథా ॥
క్షీరాజ్యా మృతపానంచ పుష్పచందన ధారణం ।
స్త్రీణాం మధ్యేసువార్తాచ భోగసౌభాగ్య హాస్యవాక్ ॥
రాజపూజ్యాధి కారంచ రత్నాభరణ ధారణం ।
నిద్రావ్యామోహా నిద్రాస్యా న్నిత్యకర్మాది భిర్యుతః ॥
రత్నాశ్వేభ పరీక్షాచ విద్యావాద పరీక్షకం ।
కేరళీయ మిదంప్రోక్తం నవాంశక ఫలంవిదుః ॥

గ్రహసమయములు—వాటిఫలములు:

తా. 1. స్నానసమయము— విశేషభీతి, శత్రుబాధ, ధనక్షయం.

2. వస్త్రాలంకార భూషణ సమయము—సుఖము.

3. వాహనారూఢ సమయము—బహుసేనాధిపత్యము,

4. శౌర్యసమయము—యుద్ధమునందు జయము. యశస్సు, కీర్తి.

5. పంచాక్షర పరాయణ సమయము—బుద్ధి, సంపత్తు, దేవబ్రాహ్మణభక్తి, ధనము, గుణము.

6. శివపూజా సమయము—శత్రునాశము, బహు దేశాధిపత్యము, దేవబ్రాహ్మణభక్తి.

7. యజ్ఞసమయము— నృత్తవాద్యాది సంభవము, బహు భార్యాపుత్రులసంపత్తి, దేవేంద్రునితో సమానమగు ఐశ్వర్యము.



8. విష్ణుపూజాసమయము—అష్టాక్షరీ పారాయణము, అన్నదాన పరత్వము, ఎల్లపుడును విశేషవిభవము.

9. భోగసమయము— నృత్తవాద్య ఘోషములతో గూడిన రాజభోగము.

10. కీర్తిసమయము—కీర్తి, సంపత్తు, భేరీమృదంగాదివాద్యఘోషములు, అఖండరాజ్యసంపత్తి, రాజరాజాధిపత్యము.

11. రుద్రపూజాసమయము— గాంభీర్యము, ధనము, గీతపాఠము, శాస్త్రపాఠము, సభాపూజ్యత.

12. అతిథి సత్కార సమయము— దేవబ్రాహ్మణపూజ, స్నానహోమాదికృత్యములు, సదాధ్యానపరాయణము.

13. సుఖభోజనసమయము—గోవులు, గేదెలు మొదలగు పశ్వాదుల సంపత్తి, స్వర్ణమౌక్తికలాభము, క్రయవిక్రయ కుశలత్వము.

14. విద్యా శాస్త్ర ప్రసంగ సమయము— యశస్సు, విద్యాప్రసంగము, అగ్నిహోత్రాదికృత్యము, రాజు, అథవా రాజతుల్యుడు యగును.

15. ఆక్రోశసమయము— సదాకలహము, మిత్రద్రోహము, బంధుత్యాగి, దరిద్రము.

16. తాంబూల సమయము— సదా తాంబూలప్రీతి, గీతవాద్యాది సంతోషము, కామాతురము.

17. నృపాలాపసమయము— దేవసభలయందు చతుస్సేనాధిసమేత విభవము.

18. కిరీటధారణసమయము—బహుదేశాధిపత్యము.

19. రహస్యసమయము—విశేషశుభము.

20. ఆలస్యసమయము—ఎల్లపుడునుఆలస్యస్వభావము.

21. శయనసమయము—దారిద్ర్యము.
22. జలపానసమయము—దాహతాపము.
23. క్షీరపానసమయము—పుష్పచందన ధారణము.
24. భోగసమయము—ధనవ్రయము.
25. కిరీటసమయము—చతుస్సేనాసమేత విభవము
26. నిద్రాసమయము—దుఃఖసంభవము.
27 స్త్రీభోగసమయము—ధననాశము.

ఇది యొకమతము. ముఖ్యపక్షపు సమ్మతముగా బహు గ్రంథాభిప్రాయ మేమనగా:—

గ్రహసమయములు

1 ముఖప్రక్షాళనాది స్నానసమయము.
2 వస్త్రాభరణ సమయము.
3 విభూతి చందనా ద్యక్షతాలంకృత సమయము.
4 సంధ్యావందన సత్కర్మ జపశీల సమయము.
5 ఆదిత్యమంబికావిష్ణు పుణ్యశ్రవణకీర్తనాది సమయము.
6 ఔపాసనాది త్రేతాగ్ని పూజాహోమార్చనసమయము.
7 లక్ష్మీనారాయణ పూజా సమయము.
8 పురాణశ్రవణ సమయము.
9 నమస్కార సమయము.
10 గిరిప్రదక్షిణ సమయము.
11 వైశ్వదేవార్చన సమయము.
12 అతిథిసత్కార సమయము.
13 భోజనసమయము.
14 విద్యాప్రసంగ సమయము.
15 కోపాలస్య మోహ సమయము.



16 తాంబూలచరణ సమయము.
17 రాజపూజ్యాదిభోగ సమయము.
18 కిరీటధారణ సమయము.
19 వాద్యఘోషాది రథాశ్వమారోహణ సమయము.
20 నృత్తవ ద్యాది సంయుక్తరాజాధికార భోగసమయము.
21 ఆలస్యసమయము.
22 శయనసమయము.
23 క్షీరామృతపాన సమయము.
24 పుష్పచందన ధారణ సమయము
25 భోగసౌభాగ్య సమయము.
26 రత్నాభరణ సమయము.
27 రత్నపరీక్షా సమయము.

ఈప్రకారము కేరళీయ వచన నవాంశక ఫలమని పెద్దలచే చెప్పబడియున్నది.

గ్రహాణాం బాల్యాద్యవస్థా నిర్ణయః.

శ్లో॥ స్వక్షేత్రమిత్ర సంస్థానాం గ్రహాణాం నామబాలకః।
స్వత్రికోణ గతానాంచ కుమారో నామబాలకః।
గ్రహాస్స్వోచ్చ గతాస్సర్వే యువానోనామకీర్తితాః।
శత్రుక్షేత్ర గతానాంచ వృద్ధోనామ వివర్ధితః।
నీచక్షేత్ర గతానాంచ గ్రహాః మరణసంజ్ఞికాః॥ 14

తా॥ స్వక్షేత్రము నందును, మిత్రక్షేత్రము నందును యుండెడి గ్రహము బాలావస్థయనబడును. త్రికోణస్థానమందున్న గ్రహముకు కుమారావస్థయనబడును యుచ్చక్షేత్రమునందున్న గ్రహము యౌవనావస్థ యనబడును. శత్రుక్షేత్రమం

దున్న గ్రహము వృద్ధావస్థ యనబడును. నీచక్షేత్రమందున్న గ్రహము మరణావస్థ యనబడును.

జాతకాలంకారే.

శ్లో॥ బాల్యాద్యవస్థాః క్రమశో గ్రహాణాః।
ఓజేసమేత ద్విపరీత మాహుః॥
బాలః కుమారోథ యువాచవృద్ధో।
మృతోపి భాగర్తు సమైక్రమేణ॥
బాల్యా ద్యవస్థాను గుణందిశంతి।
తత్పాకకాలే దిననాథ ముఖ్యాః॥

వ్యా॥ గ్రహస్థితరాశిం త్రింశద్భాగం కృత్వా
పంచసంఖ్యాభి ర్విభజ్యమానే య్యల్లబ్ధ భాగస్థిత
గ్రహస్యోజే క్రమశః బాల్యకౌమార యౌవన
వృద్ధమృత ఇతి జ్ఞేయాని
యుగ్మరాశి స్థిత గ్రహస్య మృతవృద్ధ
యౌవన కౌమార బాల్యత్వ మితిజ్ఞేయం॥

తా. గాకను జాతకాలంకార గ్రంథమునందు ఈప్రకారము చెప్పబడియున్నది. ఓజరాశియందు గల గ్రహమునకు బాల్య, కౌమార, యౌవన, వార్ధిక్య, మరణావస్థలు వరుసగా చెప్పవలెననియు, సమరాశియందున్న గ్రహమునకు దీనికి విపరీతముగా మరణ, వార్ధిక్య, యౌవన, కౌమార, బాల్యావస్థలు క్రమముగా చెప్పవలెననియు తాత్పర్యము. ఇందుకు ప్రయోజనము. సూర్యాదిగ్రహములు తమతమ దశాకాలములయందు బాల్యాద్యవస్థల కనుగుణముగా ఫలము నొసంగెదరనుట.

వ్యా. గ్రహస్థితరాశిని ముప్పదిభాగములుచేసి, 5 చేత భాగించగా ఆరారు భాగములకు ఒక్కొక్క అవస్థ ఏర్పడును.



గ్రహస్థితరాశి ఓజరాశియైనచో బాల్య, కౌమార, యౌవన, వార్ధిక్య, మరణావస్థలనియు, సమరాశియైనచో ఇందుకు విపరీతమనియు నెఱుంగునది.

గ్రహాణాం దశావస్థానాం క్రమమాహ.

గోపాలరత్నాకరే.

శ్లో॥ దీప్తస్స్వస్థో ముదితశ్శాంత శ్శక్తోని పీడితోభీతః।
వికలశ్చ ఖలోకష్ట ఇత్యేవం గ్రహదశావస్థా॥ 15

తా. దీప్తుండు, స్వస్థుండు, ముదితుండు, శాంతుండు, శక్తుండు, పీడితుండు, భీతుండు, వికలుండు, చపలుండు, దుఃఖితుండు అని గ్రహముయొక్క అవస్థలు 10 విధములుగనుండును.

తల్లక్షణం.

శ్లో॥ స్వోచ్ఛేభవతి చ దీప్తస్స్వస్థ।
స్వగృహే సుహృద్గృహే ముదితః।
శాంతశ్శుభ వర్గస్థ శ్శక్తస్ఫుటీ కరణజాలశ్చ।
వికలోంవిలుప్తకరో గ్రహాభి భూతో నిపీడితోజ్ఞేయః।
పాపసమేతశ్చఖలో నీచేభి తోరిభిః కష్టః॥ 16

వ్యా॥ ఉచ్చస్థాన స్థితగ్రహః దీప్తః।
పరమోచ్చ భాగస్థిత గ్రహః ప్రదీప్తః।
స్వగృహస్థిత గ్రహస్స్వస్థః।
మిత్రక్షేత్ర స్థితగ్రహః ముదితః।
శుభవర్గస్థిత గ్రహశ్శాంతః।
వర్గశబ్దస్య షడ్వర్గ ఇత్యుచ్చతే।
మిత్రక్షేత్ర స్థిత మిత్ర సంబంధ గ్రహః శక్తః।
పాపక్షేత్ర స్థితపాప సంబంధ గ్రహః వికలః।
గ్రహాభిభూతస్థ గ్రహః నిపీడితః।

కేవలపాప సంబంధగ్రహః చపలః ।
నీచస్థాన స్థితగ్రహః భీతః ।
పరమనీచ భాగస్థ గ్రహః అతిభీతః ।
శత్రుక్షేత్ర స్థితగ్రహః కష్టః ।
ఇత్యవస్థాక్రమః । గ్రంథాంతరే । వృద్ధవాసిష్ఠే॥
స్వోచ్చస్వోచ్చాంశగే దీప్తః స్వక్షేత్ర స్వాంశగేబలం।
నీచేనీచాంశగేనష్టః పైత్ర్యో వక్రాతిచారగః ।
మిత్రేమిత్రాంశగేమోద శ్శుభశ్శుభాంశగే శుభః ।
శతృపాప యుతేదుఃఖః పాపమధ్య గతోభయః ।
శుభమధ్య గతోమోదః వృద్ధాస్తం గతయోమృతః।
ఏవంగ్రహాణాం సర్వత్ర దశావస్థాః ప్రకీర్తితాః॥

తా. ఉచ్చక్షేత్రమున దీప్తుడు. స్వక్షేత్రమందు స్వస్థుడు. మిత్రక్షేత్రమున ముదితుడు. శుభవర్గమునందు శాంతుడు. (ఇందు వర్గమనగా షడ్వర్గము.) మిత్రక్షేత్రమునందు మిత్రగ్రహముతో కూడియున్నయెడల శక్తుడు. పాపక్షేత్రమందు పాపగ్రహముతో కూడియున్నయెడల వికలుడు. ప్రబల గ్రహముచేత యుద్ధమందు జయింపబడినయెడల నిపీడితుండు. పాప సంబంధము మాత్రము గల గ్రహము చపలుండు. నీచస్థానమందున్న గ్రహము భీతుండు. శతృక్షేత్రమందు దుఃఖితుండు యని గోపాలరత్నాకరమతము. వృద్ధవాసిష్ఠమునందు:—

ఉచ్చక్షేత్ర ఉచ్చాంశయందు = దీప్తుడు.
స్వక్షేత్ర స్వాంశయందు = బలిష్ఠుడు.
నీచ రాశ్యంశలయందు = నష్టుడు.
వక్రాతిచారములయందు = పైత్ర్యుడు.
మిత్రరాశ్యంశలయందు = సంతుష్టుడు.



శుభరాశ్యంశలయందు = శుభుడు.
శతృగ్రహ పాపగ్రహములతో గూడిన = దుఃఖి.
పాపగ్రహ మధ్యగతుడు = భీతుడు.
శుభగ్రహ మధ్యగతుడు = సంతోషి.
వృద్ధాస్తంగత గ్రహమధ్యగతుడు = మృత్యుడు.
యని ఈప్రకారముగా దశావస్థలు జెప్పబడియున్నవి.

### 1. దీప్తావస్థాఫలము.

శ్లో॥ పాకేప్రదీప్తస్య ధరాధిపత్య ।
ముత్సాహశౌర్యం ధనవాహనంచ ।
స్త్రీమిత్రలాభం సుఖబంధుపూజాం ।
క్షితీశ్వరాన్మాన నమేతి మిద్యాత్॥ 17

తా. దీప్తగ్రహదశ సంప్రాప్తించిన కాలమునందు, భూమ్యాధికారము, ఉత్సాహము, శౌర్యము, ధనవాహనసంపత్తులు, స్త్రీలాభము, మిత్రలాభము, సుఖము, బంధుపూజ్యత, రాజసన్మానము మొదలగునవి కలుగును. అయితే జాతక రాజీయమునందు:—"ధరేశత్వం ప్రదీప్తస్య పాకే ఉద్వాహసాహసః । స్త్రీపుత్ర బంధుసౌఖ్యం స్యాద్రాజ్యే రాజావలంబనం॥" యని చెప్పబడియున్నది. అనగా దీప్తావస్థగ్రహ దశాకాలమందు రాజ్యాధిపత్యము, అతిశయసాహసము, స్త్రీపుత్రసౌఖ్యము, బంధుసుఖము, రాజాశ్రయము మొదలగునవి కలుగుననుట.

### 2. స్వస్థావస్థాఫలము.

శ్లో॥ స్వస్థాన్థ ఖేటస్య దశావిపాకే ।
వస్త్రాదిభూగంధ సుఖార్థమేతి ।
విద్యాం యశః ప్రీతిమహత్వతాంచ ।
ధ్యాన్యార్థ భూమ్యాత్మజ దారశిద్ధిం॥ 18

తా. స్వస్థావస్థయందున్న గ్రహదశాకాలమందు భూలాభము, వస్త్రప్రాప్తి, గంధపరిమళ సుఖభోగము, విద్యాప్రాప్తి, కీర్తి, ప్రీతి, గౌరవము, ధనధాన్యసంపత్తి, భార్యాపుత్రలాభము కలుగును. ఇదేవిషయమై జాతకరాజీయమునందు:—"నృపలబ్ధ ధనోవిద్యా యశఃప్రీతి సుఖాన్వితః । వారభూమి సుతైర్ధర్మీ స్వస్థః పాకవిపాకయోః॥ యని చెప్పబడియున్నది. అనగా రాజమూలకముగా ధనలాభము, విద్య, యశస్సు, ప్రీతి, సుఖము, భార్యాపుత్ర సంప్రాప్తి, ధర్మకార్యముల నాచరించు స్వభావము మొదలగునవి స్వస్థావస్థయందున్న గ్రహముయొక్క దశయందును అంతర్దశలయందును కలుగుననుట.

3. ముదితావస్థాఫలము.

శ్లో॥ ముదాన్వితస్యాపి దశావిపాకే ।
వస్త్రాదిభూగంధ సుతార్థధైర్యం ।
పురాణధర్మ శ్రవణాదిగానం ।
దాసాదియానాం బరభూషణాప్తిం ॥ 19

జాతకరాజీయే.

వస్త్రభూగంధ సద్బుద్ధిధనయానానుభూషణం ।
ధీరః పురాణశ్రవణో ముదితస్య దశాయది॥

తా. ముదితావస్థను పొందిన గ్రహ దశాకాలమందు వస్త్రప్రాప్తి, భూలాభము, పరిమళగంధములు, పుత్రసంపద, ధైర్యము, పురాణాది ధర్మశ్రవణము, సంగీతము, దాసదాసీజనలాభము, వాహనప్రాప్తి, భూషణలాభము కలుగును. అయితే జాతకరాజీయమునందు సద్బుద్ధియుని విశేషార్థము చెప్పబడియున్నది.



4. శాంతవస్థాఫలము.

శ్లో॥ దశావిపాకే సుఖధైర్యమేతి ।
శాంతస్యభూపుత్ర కళత్రయానం ।
విద్యావినోదా న్వితధర్మశాస్త్రం ।
బహ్వర్థదేశాధిపపూజ్యతాంచ ॥

గ్రహదర్పణే.

శాంతప్రశాంత చిత్తస్సుఖ ధనభోగీసుహీపతేస్సచివః।
విద్యాసపరోపకారీ ధర్మసరోజాయతేశుభః॥ 20

తా. శాంతావస్థను పొందియున్న గ్రహదశాకాలమందు సుఖము, ధైర్యము భూలాభము, పుత్రవృద్ధి, కళత్రప్రాప్తి వాహనలాభము, విద్యా వినోదముతోగూడిన ధర్మశాస్త్రజ్ఞానము, విశేషధనము, రాజపూజ్యత, మొదలగునవి కలుగును. అయితే గ్రహదర్పణమునందు, శాంతము, సమాధానము, సుఖము, ధనము, భోగము, రాజస్నేహము, విద్య, పరోపకారము, ధర్మకార్యములు చేయుటయందు దానశక్తి,శుభము మొదలగునవి కలుగునని చెప్పబడియున్నది.

5. శక్తావస్థాఫలము.

శ్లో॥ హోరాదక్షే స్త్రీవస్త్ర మాల్యగంధైః ।
ర్విలసిత పురుషస్సదా విదితకీర్తిః ।
దయితస్సర్వ జనస్యచ శక్తాఖ్యే భవతి విఖ్యాతః॥ 21

ఫలరత్నాకరే.

శుక్తఃపూర్ణశుభంనరేంద్ర వినుతిందేశాధిపత్యంనృణాం।
ధైర్యంకీర్తిధనాగమం గుణయుతం గీతప్రమోదంసదా ।
దారాపత్యసుఖాన్వితంబహువిధం నిత్యోత్సవైర్మందిరం।
దద్యాత్ఖేచరనాయకస్స్వ సమయేజాతస్య యోగ్యఫలం॥

తా. శక్తావస్థను పొందియున్న గ్రహదశాకాలమున స్త్రీప్రాప్తి, వస్త్రలాభము, పుష్పగంధమాల్యాది వస్తుప్రీతి, విశేషకీర్తి, సర్వజనులయందును ప్రీతికలుగును. గాకను ఫల రత్నాకర గ్రంథమునందు విశేషశుభము, రాజసన్మానము, దేశాధిపత్యము, ధైర్యము, కీర్తి, ధనాగమము, గుణము, సంగీతశ్రవణాది మనోవిలాసము, కుటుంబసౌఖ్యము, బహువిధ సుఖభోగములు, ఎల్లపుడును గృహమునందు విశేషవిభవములు కలుగునని చెప్పబడియున్నది.

### 6. వికలావస్థాఫలము.

శ్లో॥ వైకల్యఖేటస్య దశావిపాకే।
వైకల్యతాంయాతి మనోవికారం।
పిత్రాదినాశం మరణం విశేషాత్ ।
స్త్రీపుత్రయానాం బరచోరపీడాం॥ 22

దర్పణే.

మనోవికారంవైకల్యం యాతిపిత్రాది నాశనం ।
వాహనాద్భూషణాత్పీడా వికలస్యదశాయది॥

తా. వికలావస్థయందున్న గ్రహదశాకాలము సంప్రాప్తించినచో బుద్ధివికల్పము, మనోవికారము, పితృవర్గపువారికి నాశము, మరణము, విశేషముగా భార్యాపుత్రపీడ, వాహనక్షయము, వస్త్రనాశము, చోరబాధ కలుగును.

### 7. పీడితావస్థాఫలము.

శ్లో॥ పీడస్సర్వ జనైర్విరోధనిరతం స్త్రీపుత్రరోగాన్వితం ।
భాతృద్వేషనృపాలశత్రుభయదం స్థానచ్యుతింవాబుధైః॥



ఫలరాజీయే.

విదేశగమనం నిత్యం దుఃఖబంధు విహీనతా ।
చోరాగ్ని నృపపీడాస్యా త్పీడితస్య దశాగమే॥ 23

తా. పీడిత గ్రహదశా కాలమందు సర్వజనులతోడను విరోధము, భార్యాపుత్రులకు రోగభయము, అన్నదమ్ములతో ద్వేషము, రాజపీడ, శత్రుభయము, స్థానభ్రంశము కలుగును.

### 8. చపలావస్థాఫలము.

శ్లో॥ చాపల్యయుక్తస్య దశావిపాకే।
పాపంసమయాతి బహుప్రకారైః।
విద్యాయశః స్త్రీధన భూమినాశం।

శారదీయే. రాజ్ఞాచవిత్తం హరతేసరోగీ॥ 24

కోపాన్వితస్యాపి దశావిపాకే।
పాపంసమాయాతి బహుప్రకారైః।
గోవాజియానాం బరభాగ్యనాశం।
విద్యాధనం స్త్రీజన భూమినాశం॥

తా. చపలగ్రహ దశాకాలమందు బహుప్రకారము లయిన పాపకృత్యములు సలుపుట, విద్య. యశస్సు, స్త్రీ, ధనము, భూమి మొదలగునవి నాశముకలుగును. రాజుమూలకముగా ధనహాని సంభవించును.

### 9. భీతావస్థాఫలము.

శ్లో॥ మిత్రేచామిత్ర తాయాంతి కలహేన భయంభవేత్ ।
ద్రవ్యభూమీవినాశశ్చ భీతిఃపాక విపాకయోః॥ 25

నారదీయే.

స్థానచ్యుతి బంధునిరోధతాంచ ।
హీనస్య ఖేటస్య దశావిపాకే।

జీవత్యసౌకుస్సిత హీనవృత్త్యాం ।
త్యక్తోజనైః రోగ నిపీడితస్స్యాత్ ॥

తా. భీతగ్రహ దశాకాలమందు మిత్రులు శత్రువుల గుట, కలహము, ద్రవ్యనష్టము, భూనాశము, భీతికలుగును. గాకను నారదీయ గ్రంథమునందు స్థాననాశము, బంధువిరోధము, హీనవృత్తి, బహిష్కారము, రోగపీడ, మొదలగునవి కలుగునని చెప్పబడియున్నది.

10 ఖలావస్థాఫలము.

శ్లో॥ దశావిపాకే కలహైర్వియోగం ।
ఖలస్యఖేటస్య పితుర్వియోగం ।
శతుర్జనైర్భూసు దనాదినాశ ।
ముపైతినిత్యం స్వజనైశ్చనింద్య॥ 26

జాతకరాజీయే.

కలహోరిజనైస్స్వియ్యోః పితృనాశశ్చశత్రుభిః ।
ధనభూహరణంచ సాత్కలస్యచ దశాయది॥

తా. ఖలావస్థనుపొందిన గ్రహదశాకాలము సంప్రాప్తించినచో కలహమూలకముగా వియోగము, పితృనాశము, శత్రుజనులవల్ల భూనాశము, పుత్రనాశము, స్వజననింద కలుగును.

గ్రహాణాందిఙ్నిర్ణయః.

జ్ఞానప్రదీపికాయాం.

శ్లో॥ అర్కశుక్రారరాహ్వార్కి చంద్రజ్ఞ గురవః క్రమాత్ ।
పూర్వాదీనాందిశామీశాః ప్రవదంతిబుధోత్తమాః॥

బృహజ్జాతకే.

ప్రాగాద్యాః రవిశుక్రలోహిత ।
తమసౌరీందు విట్సూరయః ।



క్షీణేంద్వర్క మహీసుతార్క ।
తనయాఃపాప బుధస్తైర్యుతః ॥

తా. తూర్పుదిక్కునకు సూర్యుడు, ఆగ్నేయమునకు శుక్రుడు, దక్షిణదిక్కునకు కుజుడు, నైరుత్యమునకురాహువు, పశ్చిమదిక్కునకు శని, వాయవ్యదిశకు చంద్రుడు, ఉత్తరదిక్కునకు బుధుడు, దేవమూలకు అనగా ఈశాన్యమునకు గురువు అధిపతులు.

గ్రహాణాం దిగ్బలనిర్ణయః.

శ్లో॥ జీవేందుజౌపూర్వవిలగ్న ।
సంస్థౌకర్మస్థ లగ్నాచ దివాకరారౌ ।
సౌరోస్తగశ్శుక్ర నిశాకరాతుజలే ।
శనిస్సప్తమగోభవేతాం ॥ 28

గ్రంథాంతరే.

లగ్నేబుధేజ్యౌ బలినౌతు ।
పూర్వవీర్యౌ యమేతద్దశమేర్కభౌమౌ ।
అస్తేరసూను ర్బలవాంజలేశే ।
ద్యూనౌనిశానాథ కవీకుభేరే ।
తత్సప్తమదిగ్బల శూన్యమాహు ।
స్తదంతరేచే త్వనుపాతయేవ ॥

తా. లగ్నము నందును, తూర్పుదిక్కునందును బుధగురువులు బలవంతులు. దశమస్థానమందును దక్షిణదిక్కునందును రవికుజులు బలిష్ఠులు. సప్తమస్థానమునందును, పశ్చిమదిక్కునందును శని ప్రబలుడు. చతుర్థ స్థానమునందును ఉత్తరదిక్కునందును చంద్రశుక్రులు బలముగలవారు. ఏగ్రహము ఏరాశియందు బలవంతము అని చెప్పబడియున్నదో ఆరాశికి

ఏడవ రాశియందు ఆగ్రహమునకు బలహీనము కలుగును. మధ్యరాసుల యందున్నచో త్రైరాశిక ప్రకారముగా బలాబలములను నిర్ణయింప దగినది.

గ్రహాణాందివారాత్రిబలాని.

శ్లో॥ రాత్రౌబలాఢ్యా శ్శనిచంద్రభౌమా స్త్రయో ।
గ్రహాహ్యహ్ని రవీజ్యశుక్రాః ।
సదాబలీజ్ఞః సితకృష్ణపక్షే ।
సౌమ్యా స్తథాన్యేచ బలాఃక్రమేణ ॥ 29

తా. చంద్ర కుజ శనులు, రాత్రియందు బలవంతులు. రవి గురు శుక్రులు పగటియందు బలవంతులు. బుధుడు ఎల్ల కాలమునందును బలిష్ఠుడు. శుభగ్రహములు శుక్లపక్షమునందును, క్రూరగ్రహములు కృష్ణపక్షమునందును బలవంతులు.

గ్రహాణాంకాలబలం నైసర్గికబలంబాహ.

**బృహజ్జాతకే.**

శ్లో॥ అయనదివసహోరామా సపైఃకాలవీర్యం ।
శ, కు, బు, గు, శు, చరాద్యావృద్ధితో వీర్యవంతః॥ 30

**శ్రీపతిపద్ధతౌ.**

మందావనీసూనుః శశాంకపుత్రనాగీశ ।
శుక్రేందు దివాకరాణాం ।
ఏకోత్తరంరూపమగై ర్విభక్తం నైసర్గికం ।
వీర్యముదాహరంతీ ॥

తా. సంవత్సరాధిపతియు, వారాధిపతియు, హోరాధిపతియు, మాసాధిపతియు, కాలబలముకల వారగుదురు. అయితే శని, కుజ, బుధ, గురు, శుక్ర, చంద్ర, రవులు, ఉత్తరవృద్ధి క్రమంబున బలవంతులగుచున్నారు. అనగా శనికన్నను కుజుడు,



కుజునికన్నను బుధుడు, బుధునికన్నను గురువు, గురువుకన్నను శుక్రుడు, శుక్రునికన్నను చంద్రుడు, చంద్రునికంటెను సూర్యుడు, ఈప్రకారముగా బలవంతులని యెఱుంగదగినది. ఇది నైసర్గికబలము. శ్రీపతిపద్ధతి ప్రకారముగా రవికి 1 రూపబలము. చంద్రునకు 0-51-25 శుక్రునకు 0-42-51 గురువునకు 0-34-17 బుధునకు 0-25-42 కుజునకు 0-17-8 శనికి 0-8-34. (1 రూపమునకు 60 విరూపములు.)

గ్రహాణాం మిత్ర శత్రుత్వాది నిర్ణయః.

**కాలామృతే.**

శ్లో॥ శత్రూమందసితౌ సమశ్శశిసుతో ।
మిత్రాణి శేషా రవేస్త్రీక్ష్ణాం ।
శుర్హిమరశ్మిజశ్చ సుహృద ।
శ్శేషాస్సమా స్సీతగోః ॥
జీవేందూష్ణకరాః కుజస్య ।
సుహృదః జ్ఞోరిసితార్కీ ।
సమామిత్రే సూర్యస్థితౌ ।
బుధస్య హిమగుశ్శత్రు స్సమాశ్చాపరే॥ 31

శ్లో॥ సూరేస్సౌమ్యసితావరీ రవిసుతో మధ్యః పరేత్వన్యథా ।
సౌమ్యార్కీసుహృదౌ సమౌ కుజగురూ శుక్రస్య శేషావరీ।
శుక్రజ్ఞౌసుహృదౌ సమస్సురగురుః సౌరస్య చాన్యేరయః ।
ఏప్రోక్తాస్సుహృదస్త్రికోణభవనాత్తేమీమయాకీర్తితాః॥

తా. సూర్యునకు శుక్ర శనులు శత్రువులు. బుధుడు మిత్రుడు, ఇతరులుసములు. చంద్రునకు రవిబుధులు మిత్రులు. ఇతరులు సములు శత్రువులులేరు. కుజునకు సూర్యచంద్రగురు

లు మిత్రులు, బుధుడు శత్రువు. శుక్రశనులు సములు. బుధునకు రవిశుక్రులు మిత్రులు. చంద్రుడు శత్రువు. ఇతరులు సములు. గురువునకు బుధ శుక్రులు శత్రువులు, శనిసముడు. తక్కినగ్రహములు మిత్రులు. శుక్రునకు బుధశనులు మిత్రులు. కుజగురులుసములు. ఇతరులుశత్రువులు, శనికి బుధశుక్రులు మిత్రులు. గురువుసముడు. ఇతరులు శత్రువులు. ఈప్రకారముగా గ్రహములయొక్క నైసర్గిక శత్రుమిత్ర సమభావములు చెప్పబడియున్నవి. ఇదేవిషయమై:— "మూలత్రికోణాద్ధనధర్మబంధు పుత్రవ్యయస్థాన గతాగ్రహేంద్రాః। తాత్కాలికాస్తే సుహృదో భవంతి। స్వోచ్ఛేచయే యస్యది కృష్ణవీర్యః॥" యని యవనాచార్య వచనము.

గ్రహాణాం తాత్కాలిక మిత్రశత్రుత్వాదినిర్ణయః.

బృహజ్జాతకే.

శ్లో॥ అన్యోన్యస్య ధనవ్యయాయసహజ।
వ్యాపారబంధుస్థితా।
స్తత్కాలే సుహృదస్స్వతుంగభవనే।
ప్యేకేరయస్త్వన్యథా।
ద్వైకానుక్తభవాన్ సుహృత్సమరిపూన్।
సంచింత్య నైసర్గికాన్।
తత్కాలేచ పునస్తుతానధి సుహృన్మిత్రా।
దిభిః కల్పయేత్॥ 32

తా. ఏగ్రహమునకైనను తానున్న రాశినుండి 2-12-11-3-10-4. ఈ రాసులయందున్న గ్రహములును, తనతన ఉచ్ఛరాశియందున్న గ్రహములును తాత్కాలిక మిత్రులగుచున్నారు. ఇతరస్థానములయందున్న గ్రహములు శత్రువులు.



నైసర్గిక శత్రుగ్రహము తాత్కాలిక శత్రువుకూడ నయ్యెనేని అధి శత్రువగును. నైసర్గిక మిత్రగ్రహము తాత్కాలిక మిత్రగ్రహముకూడ నయ్యెనేని అధిమిత్రుడగును. ఒకవిధమున శత్రువై, మఱియొకవిధమున మిత్రుడయ్యెనేని సముడగును. ఒకవిధంబున శత్రువై, మఱియొకవిధమున సముడయ్యెనేని శత్రువేయగును. ఈవిషయమై లఘుజాతకమునందు.— "శత్రుమిత్ర స్సమః ప్రోక్తః సమశ్శత్రూరిపుర్భవేత్। మిత్రమిత్రోధి మిత్రంస్యా చ్ఛత్రవ్వరే రధిశత్రుతా" యని చెప్పబడి యున్నది.

గ్రహశీలాని.

బాదరాయణః.

శ్లో॥ శుష్కారవికుజ సౌరార్ద్రభృగుచంద్ర।
మసౌజడాత్మకౌజ్ఞేయా।
ఆశ్రయతో గురుసౌమ్యౌ।
భావాశ్చైవం వినిర్దిష్టాః॥ 33

సారావల్యాం.

సూర్యాత్మజేందు పుత్రౌపక్షి।
సమానౌసరీ సృపశ్చంద్రః।
భృగుదేవ గురూద్విపదౌ।
చతుష్పదౌ భూమిపుత్రార్కౌ॥
భార్గవేందూజలచరాజ్ఞ జీవౌగ్రామచారిణౌ।
రాహుక్షితిజమందార్కాన్ బృవంత్యారణ్యచారిణః॥

తా. రవి కుజులు శుష్కులు, శుక్ర చంద్రులు జడత్వముగలవారు. బుధగురులు ఆర్ద్రులు. వీరితోకూడిన రాసులకును ఇదేసంజ్ఞలు, బుధశనులు పక్షులు, చంద్రుడు ప్రాకెడుజంతు

వు, గురు శుక్రులు రెండుకాళ్లుగల ప్రాణులు, రవి కుజులు నాలుగుకాళ్లుగల జంతువులు. చంద్రశుక్రులు జలచరులు. బుధ శుక్రులు గ్రామసంచారులు. రవి, కుజ, శని, రాహువులు వనచరులు ఈ గ్రహాశీల ఫలములు ప్రశ్నాదులయందు ఉపయోగించును.

గ్రహాణాంవయోమ్మానాని.

సత్యాచార్యః.

శ్లో॥ బాలాంకారో భౌమోకుమార వేషోబుధో గురు స్త్రింశత్ ।
శుక్రష్షోడశవర్షోరవిస్తు పంచాశదబ్దవేషస్తు ।
శనేస్సప్తతిభర్షం కేతో రాహోస్తు వర్షశతం॥ 34

తా. కుజుడు బాలుడు, బుధుడు 12 ఏండ్ల వయస్సుగలవాడు. శుక్రుడు 16 సంవత్సరముల ప్రాయముగలవాడు. గురువు 30 సంవత్సరముల వయస్సుగలవాడు, రవి 50 సంవత్సరముల వయస్సుగలవాడు, శని 70 సంవత్సరముల వయస్సుగలవాడు. రాహుకేతువులు 100 సంవత్సరముల వయస్సుగలవారు. ఆయాగ్రహ కాలపరిమితి జ్ఞానము చోరాది ప్రశ్నలయందు ఉపయోగమగును.

గ్రహాణాం పుంస్త్రీపుంసకసంజ్ఞాః.

సత్యాచార్యః.

శ్లో॥ రవిగురుభౌమాః పురుషాః ।
స్త్రియస్తథా రాహు భార్గవశశాంకాః ।
కేతుస్తురవిజ సౌమ్యాన్యపుంసకా శ్చేతివిజ్ఞేయాః॥ 35

తా. రవి, కుజ, గురులు పురుషగ్రహములు. చంద్ర, శుక్ర, రాహువులు స్త్రీగ్రహములు. బుధ, శని, కేతువులు నపుంసక గ్రహములు.



గ్రహాణాం రాజసాదిగుణాః.

దైవజ్ఞవిలాసే.

శ్లో॥ సాత్వికారవిచంద్రాచ జ్ఞసితౌ రాజసాగ్రహా ।
తామసావర్కపుత్రారా గురుశ్చగుణవాన్భవేత్॥ 36

సాత్విక ఫలం.

బాదరాయణః.

యస్సాత్వికస్తే స్వదయాస్థిరత్వం ।
సత్యార్జితం బ్రాహ్మణ దేవభక్తి॥

రాజసఫలం.

రాజాధికః కార్యకళాశ్రమాదిషావ ।
సక్తచిత్తః పురుషోతిసారః ॥

తామసఫలం.

తమోధికోవంచ యితాపరేషాం ।
మూర్ఖోలసః క్రోధపరోతినిద్రః॥

తా. రవిచంద్రులు సాత్వికులు ఇందుకు ఫలము దయ, స్థిరత్వము, సత్యార్జితము, దేవబ్రాహ్మణభక్తి. మొదలగునవి, బుధశుక్రులు రాజసగుణముగలవారు ఇందుకుఫలము. రాజాధికారము, కావ్యాది విద్యాభిలాష, బలము. కుజశనులు తామసులు ఇందుకుఫలము, వంచన, మూర్ఖత్వము, ఆలస్యము, కోపము, నిద్ర మొదలగునవి. గురువు గుణాధికుడు.

దేవమనుష్యాద్యధిపాః.

సారావళ్యాం.

శ్లో॥ సురపూజ్యశ్చశశుక్రౌ దినకరభౌమౌ బుధార్కజానాథాః।
విబుధమనుష్య పిత్రూణాం తిర్యజ్నరకాసురేశ్వానాం॥

తా. దేవతలకు గురువు, మనుష్యులకు చంద్రశుక్రులు, పితృదేవతలకు రవికుజులు, తిర్యగ్జంతువులకు బుధుడు నరకాదివాసులకు శని అధిపతులు.

## గ్రహాణాం స్థానాని.

గార్గిః.

శ్లో॥ దేవాగారంచలస్థానం వహ్నినాట్య ధనాలయః ।
శయ్యాక్షి త్యుత్కరస్థానం స్థానాన్యేతాని భాస్కరాత్ ॥

తా. దేవస్థానము లేక దేవపూజాగృహము, జల సమీపము లేక స్థానగృహము, పాకశాల, నాట్యశాల, బొక్కసపుగృహము, శయ్యాగృహము, భూపరాగరాశి, ఈప్రకారముగా సూర్యాది సప్తగ్రహములకును స్థానంబుల నెఱుంగునది.

## గ్రహాణాం కాలనిర్ణయః.

దైవజ్ఞవిలాసే.

శ్లో॥ అయనక్షణ దినఋతవో మాసః పక్ష స్తథా చాబ్దః ।
సూర్యాదీనాం కాలో గమనా గమనాది చింతాయాం॥

తా. రవికి 6 నెలలు, చంద్రునకు ఒకక్షణము, కుజునకు 1 దినము, బుధునకు 2 నెలలు, గురువునకు 1 మాసము, శుక్రునకు 15 దినములు, శనికి 1 సంవత్సరము. ఈప్రకారముగా కాలనిర్ణయము. ఇది గమనాగమనాది ప్రశ్నఫలములకు ఉపయోగించును.

## ఋతునామాధిపాః.

దేవకీర్తిః.

శనిశుక్రోఽర్కభూపుత్ర శ్చంద్రసౌమ్యౌ గురుఃక్రమాత్ ।
శిశిరాద్యధిపాస్యుస్తే ద్రేక్కాణేవా గ్రహోదయే ॥ 40



తా. శని, శుక్ర, కుజ, చంద్ర, బుధ, గురువులు లగ్నగతులగుచుండగా శిశిరాది షడృతువులు తెలియవలయును. అట్లే శన్యాది ద్రేక్కాణములచేతనైనను శిశిరాది షడృతువులు నిర్దేశింపతగును. లగ్నమున గ్రహమున్నయెడల లగ్నగత గ్రహమువలనను, గ్రహము లేకున్నయెడల ద్రేక్కాణాధిపతి వలనను ఋతునిర్ణయము చేయవలయును, లగ్నమందు బహు గ్రహములున్నయెడల బలవద్గ్రహమువలన ఋతునిర్ణయము చేయవలయును. కొందఱు లగ్నమందు బహుగ్రహము లున్నయెడల ద్రేక్కాణాధిపతిచే ఋతునిర్ణయము చేయవలయునని చెప్పుదురు. అనగా లగ్నగత గ్రహముగాని, లగ్నమందు గ్రహము లేనియెడల ద్రేక్కాణాధిపతిగాని శనియయ్యేనేని శిశిర ఋతువు, శుక్రుడయ్యేనేని వసంతఋతువు, కుజుడయ్యేనేని గ్రీష్మఋతువు, చంద్రుడయ్యేనేని వర్ష ఋతువు, బుధుడయ్యేనేని శరదృతువు, గురుడయ్యేనేని హేమంతఋతువు. ఈరీతిగా నిర్ణయింపవలయును. ఇదియునుంగాక— శ్లో॥ "గ్రీష్మమథ ప్రవదంతి కుజార్కౌ" అనెడు బాదరాయణ వచనప్రకారము రవి లగ్నగతుడైనను, లేక ద్రేక్కాణాధిపతియైనను, గ్రీష్మఋతువే యని చెప్పదగినది. ఇందుకు ప్రయోజనము. నష్టజాతకమునందు ఋతునిర్దేశము, ప్రశ్నయందు లాభాలాభ జయాపజయ కాల పరిజ్ఞానము కలుగుట.

## గ్రహాణాంధాతవః.

శ్లో॥ అస్థ్యసృ జ్మజ్జ చర్మా ణ్యవసా
శుక్లమినాదయః ।
స్నాయుశ్చైషాం చ ధాతూనాం సప్తానా
మధిపాః క్రమాత్ ॥ 41

తా. సూర్యునకు యెముకయు, చంద్రునకు నెత్తురును, కుజునకుమజ్జా అనగా ఎముకలోనుండు ధాతువిశేషమున్ను, బుధునకు చర్మమును, గురువుకు మెదడును, శుక్రునకు వీర్యము, అనగా రేతస్సును, శనికి నరమున్నూ సారవంతమై యుండును.

తత్వాధిపాః.

దైవజ్ఞవిలాసే.

తేజోధికో భవేద్భాను రిందురంబు బుధవః స్మృతః ।
వహ్నిభూఖాంబు మరుతా మధిపాస్స్యుః కుజాదయః ॥ 42

తా. సూర్యునకు వేడిమి, చంద్రునకు శీతళము, అంగారకునకు అగ్ని, బుధునకు భూమి, గురువునకు ఆకాశము, శుక్రునకు నీరు, శనికి గాలియని గ్రహముల తత్వముల నెఱుంగునది.

గ్రహాణాం స్వరూప విచారః.

సారావళ్యాం.

అల్పాకుంచిత మూర్ధజఃపటుమతి ర్మూర్ఖస్సురూపత్వనో।
నాత్యుచ్చో మధుపింగళోర్ధ్వనయన శ్శూరః ప్రచండస్థిరః॥
రక్తశ్యామ తనుర్నిగూఢచరణః పిత్తాస్థిసారోమహాన్।
గంభీరశ్చ తురశ్రకో పృథుకరః కౌసుంభవాసారవిః ॥ 43

తా. సూర్యుడు కుఱుచైన వంకరవెంట్రుకలు, తీక్ష్ణబుద్ధి, మూర్ఖత్వము, మంచిరూపము, ధనము, సమోచ్ఛ్రాయమైన శరీరము, తేనెవలె పింగళవర్ణముగలకన్నులు, శౌర్యము, క్రౌర్యము, స్థిరత్వము, రక్తశ్యామల వర్ణముగల దేహము, అణిగిపకాలు, పిత్తాధికస్వభావము, యెముకలయందు బలము, మహత్వము, గాంభీర్యము, చతుష్కోణమైనఆకారము, ప్రసారిత భుజద్వయప్రమాణము, ఎఱుపు పసుపు చేరిన మిశ్రవర్ణముగల వస్త్రము మొదలగునవి గలవాడని తాత్పర్యము.



చంద్రః.

సారావళ్యాం.

సౌమ్యోకాంతి విలోచనోమధురవాక్
గౌరో కృశాంగోయువా ।
ప్రాంశుః సూక్ష్మనికుంచితా సితకచః
ప్రాజ్ఞోమృదు స్సాత్వికః ।
చారుర్వాతకఫాత్మకః ప్రియసఖో
రక్తాతి సారోఘృణిః ।
వృద్ధస్త్రీషు రతశ్చలో ఉతసుభగ
శ్శుక్లాంబ దశ్చంద్రమాః ॥ 44

తా. చంద్రుడు, సౌమ్యత, కాంతిగలనేత్రములు, మధురవాక్కు, గౌరవర్ణము, కృశించిన అంగములు, అనగా కృశమై వర్తులమైన దేహము, ప్రాయము, ఉన్నతుడు, వంకరమై నల్లని అల్పవెంట్రుకలు, ప్రాజ్ఞుడు, మృదుస్వభావము, సాత్వికత్వము, సౌందర్యము, వాతశ్లేష్మము, ప్రియస్నేహితులు, రక్తాతిసారరోగము, దయ, వృద్ధస్త్రీసంభోగము, చపలత్వము, అతి సులభగుణము, తెల్లనివస్త్రములు మొదలగునవి గలవాడని తాత్పర్యము.

కుజః.

సారావళ్యాం

హ్రస్వః పింగళలోచనో ధృఢవపు ర్దీప్తాగ్ని కాంతిశ్చలో ।
మజ్జావాన రుణాంబరః పటుతర శ్శూరశ్శుచి స్స్పష్టవాక్ ।
హింస్రః కుంచిత కేశదీప్త తరుణః పిత్తాత్మకస్తామస ।
శ్చండసాహసికో విఘాతకుశలస్సంరక్త గౌరః కుజః ॥ 45

తా. అంగారకుడు, పొట్టివాడును, పచ్చని నేత్రములు గలవాడును, దృఢశరీరము గలవాడును, ప్రజ్వలాగ్ని, తుల్యమైన కాంతిగలవాడును, చపలుడును, బలిసిన దేహముగలవాడును, ఎఱ్ఱనివస్త్రములు ధరించినవాడును, చురుకుతనము గలవాడును, శూరుడును, శుచిగలవాడును, స్పష్టమైన వాక్కుగల్గవాడును, హింసించువాడును, వంకరలుగల వెంద్రుకలచే ప్రకాశించు ప్రాయముగలవాడును, పైత్యాధికస్వభావము గలవాడును, తామసగుణముగలవాడును, క్రూరుడును, సాహసవంతుడును, విఘ్నములు కలిగించుటయందు నిపుణుడును, రక్తముతో గూడిన గౌరవర్ణముగలవాడును యగును.

బుధః.

ఆరక్తాయతలోచనో మధురవాగ్దూర్వాదళశ్యామలః ।
త్వక్సారోతి రజోధికః స్ఫుటవచాః పీనస్త్రిదోషాత్మకః।
హృష్టోమధ్యమరూపవాక్సునిపుణోవృత్తశ్శిరశ్శాంతవాన్।
సర్వస్యానుకరోతి వేషరచనః పాలాశ నాసీబుధః॥ 46

తా. ఎఱ్ఱనై విశాలమైన నేత్రములు, మధురవాక్కులు, ఆకుపచ్చవర్ణము, వర్తులమైననరములు, రాజసగుణము, స్ఫుటవచనము, స్థూలకాయము, వాతపిత్త శ్లేష్మములనెడు మూడు దోషములతో గూడిన స్వభావము, సంతోషచిత్తము, సామాన్యరూపము, మంచి నిపుణత్వము, వర్తులాకారము, హృదయము, శాంతస్వభావము, తన వేషములచేతను, నడవడికెల చేతను, సర్వులయందును, హితస్వభావము, మోదుగచెట్టుయందు వాసము మొదలగునవి గలవాడగును.



గురుః.

ఈషత్పింగళలోచనశ్శ్రుతిధర స్సింహాసనాదిప్రదః ।
సత్త్వాఢ్యశ్చ విశుద్ధకాంచనతనుః పీనోన్నతోరస్థలః ।
ప్రాస్సోర్ధర్మపరోతినీతినిపుణో బద్ధోర్ధ్వ జూటఃక్షమీ।
స్యాత్పీతాంబర భృత్కఫాధికతనుర్మేదః ప్రదానోగురుః॥ 47

తా. బృహస్పతి, కొంచెము పచ్చనినేత్రములు గలవాడును. వేదముల సారము తెలిసినవాడును, సింహాసనాధిపత్యము మొదలగువాటిని యిచ్చువాడును, పూర్ణబలము గలవాడును, పరిశుద్ధమగు బంగారువంటి దేహముగలవాడును, బలిసినటువంటి విశాలమైన వక్షస్థలము గలవాడును, పొట్టివాడును, ధర్మాసక్తుడును, నీతిశాస్త్ర నిపుణుడును, కట్టబడిన జటాకలాపము గలవాడును, క్షమించువాడును, పీతాంబరధరుడును, శ్లేష్మాధిక స్వభావుడును, బుద్ధి నిచ్చువాడును యగును.

శుక్రః.

చారుర్దీర్ఘభుజః పృథూరువదనశ్శుక్లాధికః కాంతిమాన్ ।
కృష్ణాకుంచిత సూక్ష్మలంబిచికురో దూర్వాదళశ్యామలః।
కామీవాత కఫాత్మకోతిసుభగ శ్చిత్రాంబరోరాజసో ।
లీలావాన్ మతిమాన్విశాలనయన స్థూలారసదేశస్సితః॥48

తా. శుక్రుడు, సుందరము, దీర్ఘభుజములు, గొప్పతొడలు, విశాలముఖము, తెల్లనికాంతి, వ్రేలాడు నల్లనివక్రములైన కుఱుచముంగురులు, నల్లనివెండ్రుకలు, కామము, వాతశ్లేష్మ ప్రకృతి, సౌందర్యభాగ్యము, చిత్రవస్త్రములు, రాజసగుణము, లీలావినోదము, విశేషబుద్ధి, విశాలనేత్రములు, బలిసినభుజములు మొదలగునవి కలవాడని తాత్పర్యము.

శనిః.

పింగోనిమ్నవిలోచనః కృతతనుర్దీర్ఘ శ్శిరాలసః ।
కృష్ణాంగః పవనాత్మకోతిపిశు నస్స్నాయ్వాత్మకో నిర్ఘృణః ।
మూర్ఖస్థూలనఖః ద్విజాతిమలినో రూక్షోశుచి స్తామసో ।
రౌద్రః క్రోధ పరోజరాపరిణతః కృష్ణాంబరోభాస్కరిః ॥ 49

తా. శని కపిలవర్ణమైన కన్నులుగలవాడును, కృశించి పొడవైన శరీరముగలవాడును, పనులయందు త్వరలేనివాడును, నలుపుఛాయగలవాడును, వాతరోగముగలవాడును, అతిలోభియు, చాడిమాటలు చెప్పువాడును, నిర్దయగలవాడును, మూర్ఖుండును, దప్పమైన గోరులుగలవాడును, మలినదంతుడును, క్రూరత్వముగలవాడును, అశుచివంతుడును, తామసగుణముగలవాడును, కోపముగలవాడును, క్రోధపరుడును, ముండ్లవలె తీక్షమైన రోమములును తలవెండ్రుకలును గలవాడును, నల్లనివస్త్రము గలవాడును, యగును.

ప్రకాశా ప్రకాశగ్రహాణాం లక్షణం.

బాదరాయణః.

ప్రకాశకాద్వౌ ప్రథమౌ గ్రహాణాం
తారాగ్రహాః పంచపరేతతో ద్వౌ ।
తమోగ్రహౌ తేషు శుభేషు మధ్యేత్రయో
బలీందుశ్చ పగేతుపాపాః ॥ 50

తా. చంద్రసూర్యులు ప్రకాశగ్రహములు. యితర గ్రహములు అనగా కుజ, బుధ, గురు, శుక్ర, శనులు వీ రిరువురిచే ప్రకాశింపదగినవారు. రాహు కేతువులు నీడ చీకటిగలవారు (అనగా ఛాయాగ్రహములనుట). గ్రహము లన్నిటి



యందును పూర్ణచంద్రుడు బలిష్ఠుడు, బుధ గురు శుక్రులు శుభులు. ఇతరులు పాపులు. (అనగా సూర్యుడు క్షీణచంద్రుడు, కుజుడు, శని యనుట. బుధుడుకూడ శుభగ్రహ సంబంధము లేనియెడల పాపియేయగును.)

శుభ పాప క్రూర సౌమ్య గ్రహాః.

సర్వార్థచింతామణౌ.

రాహుశ్శనికేతుభౌమాః పాపాః క్రూరోరవిశ్శశీకృష్ణే ।
బుధగురుశుక్రాః సౌమ్యాశ్శుక్లే సౌమ్యశ్శశీజ్ఞేయః ॥ 51

తా. కుజ, శని, రాహు కేతువులు పాపులు. క్షీణచంద్రుడు, సూర్యుడు క్రూరులు. బుధ, గురు, శుక్రులు సౌమ్యులు. పూర్ణచంద్రుడు శుభుడు. ఈ విషయమై. "క్రూరగ్రహార్కః కుజసూరజౌచ పాపాశ్శుభాశ్శుక్ర శశాంకజీవాః । సౌమ్యైశ్చసౌమ్యోర్కాదిమిశ్రితో వై ర్యద్వర్గస్యతుల్యం ప్రకృతిత్వమేతి" యని శ్రుతకీర్తియు, "శుభగ్రహాస్సితజ్ఞేజ్యాః పాపామందారభాస్కరాః । బుధపాపయుతః పాపః క్షీణచంద్రోనథాశుభః ॥" యని గార్గియు చెప్పియుండుటచే పాపగ్రహయుత బుధుడు పాపియనియు, శుభగ్రహయుత బుధుడు శుభుడనియు గ్రహింపదగినది.

గ్రహాణాం రాశినిర్ణయః.

దైవజ్ఞవిలాసే.

మేష వృశ్చిక పతిర్మహీ సుతో
భార్గవో వృష తులా ధరేశ్వరః ।
బోధనస్తు మిథునాంగనా పతి
ర్భాస్కరిర్మకర కుంభ నాయకః ।

సింహా కర్కట యోరినోడుపౌ
మీన ధన్వపతి రింద్రపూజితః ॥ 52

తా. మేష వృశ్చికములకు కుజుడు, వృషభ తులలకు శుక్రుడు, మిథున కన్యలకు బుధుడు, ధనుర్మీనములకు గురువు, మకరకుంభములకు శని, కర్కాటకమునకు చంద్రుడు, సింహమునకు సూర్యుడు, అధిపతులు.

గ్రహాణా ముచ్చనీచాః.

యవనః.

ఆదిత్యాద్యజగోమృగాస్యవనితా కర్కీమీనస్తులా ।
స్వోచ్చర్క్షాణ్యథ తేషు దిక్షు ౧౦ తవహో ౩ నష్టోత్తర
వింశతిః ౨౮ । తిథ్యః ౧౫ శాశ్వర ౫ స ప్తవింశతి
౨౭ కృతీ ౨౦ నత్యుచ్చకాంశా న్విదుస్తేభ్య స్స
ప్తమ రాశయోం శకయుతా నీచాగ్రహాణాం
క్రమాత్. 53

తా. మేషము, వృషభము, మకరము, కన్య, కర్కటము, మీనము, తులా ఈరాసులు వరుసగా సూర్యాది గ్రహములకు ఉచ్చస్థానము లనబడును. అందు ఆయాగ్రహములకు పదియవ భాగమును, మూడవభాగమును, ౨౮-వ భాగమును, ౧౫-వ భాగమును, ఐదవభాగమును, ౨౭-వ భాగమును, ౨౦-వ భాగము పరమోచ్చము లనబడును. ఈరాసులకు సప్తమరాసులు ఆయా గ్రహములకు నీచరాసులగును. అందులో ఆయాభాగములు పరమ నీచాంచములగును.



గ్రహములయొక్క ఉచ్చనీచ పరమోచ్చ పరమనీచలను
తెలిపెడు చక్రము.

| గ్రహములు. | ఉచ్చము. | పరమోచ్చాంశ. | నీచము. | పరమనీచాంశము. |
|---|---|---|---|---|
| రవి | మేషము | 10-వ భాగము | తుల | 10-వ భాగము |
| చంద్రుడు | వృషభము | 3-వ ,, | వృశ్చికము | 3-వ ,, |
| కుజుడు | మకరము | 28-వ ,, | కర్కాటము | 28-వ ,, |
| బుధుడు | కన్య | 15-వ ,, | మీనము | 15-వ ,, |
| గురువు | కర్కాటకం | 5-వ ,, | మకరము | 5-వ ,, |
| శుక్రుడు | మీనము | 27-వ ,, | కన్య | 27-వ ,, |
| శని | తుల | 20-వ ,, | మేషము | 20-వ ,, |

రవ్యాదీనాం మూలత్రికోణాని.

గార్గిః.

సింహోక్షమేషకన్యాశ్చా పస్త్రీలర్ఘటః క్రమశః।
ఏతేత్రికోణభవధా న్యర్కాదీనాం భవంత్యేనం॥ 54

తా. సింహము, వృషభము, మేషము, కన్య, ధనుస్సు, తులా ఈరాసులు క్రమముగా రవ్యాదిగ్రహములకు మూల త్రికోణ స్థానములగును, ఈవిషయమై సారావళియందు. "వింశతిరంశా స్సింహేత్రికోణమపరే స్వభవనమర్కస్య। ఉచ్చం భాగ త్రితయం వృష ఇందోస్త్రికోణ మపరేంశాః । ద్వాతశ భాగా మేషే త్రికోణేమపరే స్వభవనంతు స్త్రికోణభావం పంచభిరంశై స్స్వరాశిజంపరతః। జీవస్యదశభిరంశై స్త్రికోణ మపరేస్వభవనంచాపే। శుక్రస్యాం శా స్తిథయస్త్రికోణ మపరే ధటేశ్వరాశిఫలం॥ కుంభేత్రికోణనిజబే రవిజస్యరవే ర్యదా సింహే॥ అని చెప్పంబడియున్నది. గనుక రవి సింహరాశి యందు మొదటి ౨౦ భాగములు మూలత్రికోణము, మిగిలిన

౧౦ అంశములు స్వక్షేత్రము. చంద్రునకు వృషభమందు మొదటి ౩ భాగములు ఉచ్చము. తర్వాత ౨౭ భాగములు మూలత్రికోణము. కుజునికి మేషమందు ౧౨ భాగములు మూలత్రికోణము మిగిలిన ౧౮ భాగములు స్వక్షేత్రము. బుధునకు కన్యయందు ౧౫ భాగములు ఉచ్చము. ౫ భాగములు మూలత్రికోణము మిగిలిన ౧౦ భాగములుస్వక్షేత్రము. గురునకు ధనుస్సునందు ౧౦ భాగములు మూలత్రికోణము తక్కిన ౨౦ భాగములు స్వక్షేత్రము. శుక్రునకు తులయందు మొదటి ౧౫ భాగములు మూలత్రికోణము, తక్కిన ౧౫ భాగములు స్వక్షేత్రము. శనికి కుంభ రాశియందు ౨౦ అంశములు మూలత్రికోణము. తక్కిన ౧౦ అంశములు స్వక్షేత్రము. యని యెఱుంగునది. అయితే లఘుజాతకప్రకారము కుజునికి మేషమందు ౧౮ భాగములు త్రికోణము, మిగిలిన ౧౨ భాగములు స్వక్షేత్రమనియు, గురునకు ధనుస్సునందు ౧౩ భాగములు త్రికోణము తక్కిన ౧౭ భాగములు స్వక్షేత్రమనియు, శుక్రునికి తులయందు ౧౦ భాగములు త్రికోణము తక్కిన ౨౦ భాగములు స్వక్షేత్రమనియును చెప్పబడియున్నది. మాధవ వచనమందు శుక్రునికి తులయందు ౫ భాగములు త్రికోణము తక్కిన ౨౫ భాగములు స్వక్షేత్రమనియు చెప్పబడియున్నది.

### రాహుకేత్వో రుచ్చనీచ మూలత్రికోణ శత్రుమిత్రత్వాది నిర్ణయః.

గోపాలరత్నాకరే.

ఉచ్చంతుయుగ్మం హరిభంత్రికోణం
కన్యాగృహం శుక్ర శనాచమిత్రౌ ।
అర్కశ్శశాంకో ధరణీసుతశ్చ
రాహోస్తుశత్రూః ప్రవదంతి తద్జ్ఞాః ।
ఉచ్చంతుచాపం ఘటభంత్రికోణం
మీనంగృహం శుక్ర శనౌచశత్రూ ।
అర్కశ్శశాంకో ధరణీసుతశ్చ
కేతోశ్చమిత్రాణి వదంతిచాన్యే ॥ 55

తా. రాహువునకు మిధునరాశి ఉచ్చము, సింహము త్రికోణము. కన్య స్వక్షేత్రము, శుక్ర శనులు మిత్రులు, సూర్య చంద్ర కుజులు శత్రువులు, కేతువునకు ధనుస్సు ఉచ్చము. కుంభము త్రికోణము, మీనము స్వక్షేత్రము, శుక్ర శనులు శత్రువులు, రవి చంద్ర కుజులు మిత్రులు.

### గ్రహాణాం స్వభావగుణాః.

శ్లో॥ రవిస్థిరశ్శీత తరశ్చమహీజ ఉగ్రశ్శశిజశ్చమిశ్రః ।
లఘుస్సురేజ్యో భృగుజోమృదుశ్చ శనిశ్చతీక్ష్ణః
కథితోమునీంద్రైః ॥ 56

తా. రవికిస్థిరము, చంద్రునకు చరము, కుజునకు ఉగ్రము, బుధునకుమిశ్రము, గురునకు లఘువు, శుక్రునకు మృధువు, శనికి తీక్ష్ణము, ఈప్రకారముగా గ్రహస్వభావ గుణములు తెలియునది.

### గ్రహాణాం స్థానబలం.

శ్లో॥ స్వోచ్చేసుహృద్భే స్వనవాంశకేశస్వక్షే
దృగాణే ద్వాదశాంశకోపి ।
కళాంశకాత్రింశ యుతేపిచైవ ముపైతి
తత్స్థానబలం గ్రహేంద్రః ॥ 57

తా. స్వోచ్చము. మిత్రక్షేత్రము, స్వనవాంశము, స్వక్షేత్రము, స్వద్రేక్కాణము, స్వద్వాదశాంశము, చంద్రహోర స్వత్రింశాంశములతోఁగూడిన సూర్యాది గ్రహములు స్థానబలము గలవారగుదురు.

దివా బలరాశయః.

శ్లో॥ దివాబలా మానుషరా శయస్యుః ।
రాత్రౌ బలాన్యుః ప్రబలాశ్చకీటాః ।
సంధ్యాద్వయోర్భాత్రితృ భవాస్పదానాం।
సమష్టభానాంతు చయత్రసంజ్ఞా॥ 58

తా. నరరాసులు పగటియందు బలముగలవి. కీటరాసులు రాత్రియందు బలముగలవి. ఉభయ సంధ్యలయందును. మిథున కన్యా రాసులు బలముగలవి యగును.

మేషాది రాశీనాంనామాని.

శ్లో॥ మేషోగౌర్మిథునంకర్కీ హరిః కన్యా వణిగ్వరః ।
కార్పిచాపో నక్రకుంభౌ మీనో మేషాదితో భవేత్ ॥

తా. మేషం, గౌః, మిథునం, కర్కీ, హరిః కన్యా, వణిక్, కార్పి, చాపం, నక్రః, కుంభః, మీనః, ఈ ౧౨ న్ను మేషాది రాసులకు పేర్లు.

రాశ్యధిపతులు.

శ్లో॥ సింహస్యాధిపతిస్సూర్యః కర్కటస్య నిశాకరః ।
మేషవృశ్చికయోర్భౌమః కన్యా మిథునయోర్బుధః ।
కోదండ మీనయోర్మంత్రీ తులా వృషభయోర్భృగుః।
నక్రస్య కుంభభాశ్చ నాయక స్సూర్యనందనః॥ 60

తా. సింహమునకు సూర్యుడు, కర్కటమునకు చంద్రుడు, మేషవృశ్చికములకు అంగారకుడు, కన్యా మిథునరాసులకు



బుధుడు, ధనుర్మీనములకు బృహస్పతి. తులా వృషభములకు శుక్రుడు, మకర కుంభములకు శని అధిపతులు.

రాశీనాం చతురస్థిర ద్విస్వభావగుణాః.

సారవీయే.

శ్లో॥ వృషసింహాళి కుంభాశ్చ త్విమం స్థిరరాశయః ।
కర్కినక్రస్తులామేషా శ్చరంతి చరరాశయః ।
యుగ్మకన్యా ధనుర్మీనా భవం త్యుభయ రాశయః ॥ 61

తా. వృషభము, సింహము, వృశ్చికము, కుంభము. ఈ రాసులు స్థిరములు. కర్కటకము, మకరము, తులా, మేషము, చరరాసులు. మిథునము, కన్య, ధనుస్సు, మీనము, ద్విస్వభావ రాసులు.

అంధక బధిరపంగురాశయః.

సారవీయే.

శ్లో॥ మేషాది చాంధకంషట్కం చత్వారో బధిరా స్తథా ।
ద్వౌచపం గూతువిజ్ఞేయౌ తద్భేదాః పరికీర్తితాః ।
అజోవృషో మృగేంద్రశ్చ అర్ధరాత్రౌ మహాంధకాః ।
యుగ్మాంగనాకులీరాశ్చ మధ్యాం హ్నేచాంధకాస్మృతాః।
ఇత్యేవం కాలభేదేన శుభదాశ్చ ప్రకీర్తితాః ।
తులాచ వృశ్చికశ్చైవ బధిరా చాపరాహ్ణకే ।
రాత్రౌచ బధిరాప్రోక్తా మకరశ్చ ధనుర్దివాం।
ఉభయోస్సంధ్యయోః పంగూ కుంభమీనౌ ప్రకీర్తితౌ ॥

తా. మేషాది కన్యాంతముగల ఆఱురాసులు గ్రుడ్డి రాసులు, తులాది మకరాంతముగల నాలుగు రాసులు చెవుడు. కుంభ మీనరాసులు కుంటిరాసులని యెఱుంగునది. మేష వృ

షభ సింహములు అర్ధరాత్రియందును, మిథున, కర్కాటక, కన్యారాసులు మధ్యాహ్నమునందును అంధకము లనబడును. ఈప్రకారముగా కాలభేదముల ననుసరించి శుభములను చెప్పదగినది. గాకను అపరాహ్ణమునందు తులా, వృశ్చికములు చెవిటిరాసు లనబడును. అదేప్రకారముగా ధనుర్మకరములు రాత్రియందు చెవిటిరాసు లనబడును. ఉభయ సంధ్యలయందును కుంభ మీనములు కుంటిరాసు లనబడును.

## రాశి స్వరూపాణి.

సారవళ్యాం.

శ్లో॥ మేషోమేషాకారో రమతే జలపంక వర్జితే దేశే।
కటుతిక్త విటపభూమౌ కంటకవిషమోన్న దేచ సదా॥ 63

తా. మేషము మేషాకారముగలది, నీరు, బురద లేని ప్రదేశము, చేదు వగరుగల వృక్షభూమి, ముండ్లు, మిట్టపల్లములు గల ప్రదేశములయందు రమించునది.

వృషభం.

శ్లో॥ వృషభోవృషభాకార స్తృణశాద్వలసస్యసంయుతే దేశే।
రమతే గోకులమధ్యే గోపాలతృణ గవాంమధ్యే॥ 64

తా. వృషభము, వృషభాకారముగలది. కసువు ప్రదేశము, పంటతోగూడిన భూమి, గోవులు నివసించు కొట్టములు కసువుసేకరించు స్థళములయందు రమించునది.

మిథునం.

శ్లో॥ పుంస్త్రీరాశి ర్మిథునోహార్మ్యే ద్యానే విచిత్రశయనేచ।
వాదిత్ర గీతనృత్తే గదాధరో వీణయాంచాన్యా॥ 65



తా. మిథునము గదనుధరించిన యొక పురుషుని. వీణను ధరించిన యొకస్త్రీని గలది, మేడతోగూడిన గృహము, ఉద్యానవనము, విచిత్రశయ్యలు, వాద్యసంపత్తు, గీతనృత్యాదులు గల చోట రమించునది.

కర్కాటకః.

శ్లో॥ కర్కీకర్కాటరూపో జలపంక సంకట వికూలేషు।
ప్రసవణ నదీతీరే కేదారే జలసమీపేచ॥ 66

తా. కర్కాటకము ఎండ్రకాయ రూపముగలది. నీరు బురదతోగూడిన బైలుప్రదేశము, ప్రవహించునట్టి నదీతీరము, వరిపొలములు, జలసమీప స్థళములయందు రమించునది.

సింహః.

శ్లో॥ సింహస్సింహాకారోవసతి గుహాయాంవనేసదాగహనే।
ఆమిషభూమౌ రమతే ధూమగ్రహో రవిభాగేచ॥ 67

తా. సింహము సింహాకారముగలది. గుహాలు, చొరగూడని వనములు, మాంసము దొరకునటువంటి ప్రదేశములయందు రమించునది.

కన్యాః.

శ్లో॥ స్త్రీప్రకృతి ర్మృదునత్వాకన్యారాశి స్సహోపగారమతే।
యానేస్త్రీణాం మధ్యేమహానసే సస్యదహనకరా॥ 68

తా. కన్య కన్యాకారముగలది, మృదుస్వభావముగలది, స్త్రీస్వభావము, దోనియందును, వాహనములయందును, స్త్రీలమధ్యయందును, పాకగృహమునందును, రమించునది. సస్యములను దహించునట్లు చేయునదియు నగును.

తులా.

శ్లో॥ వీథ్యంతరాపణగతః ప్రతిమానయుతస్తులాధరః పురుషః।
పంకేశుక్లాగారే క్రయవిక్రయభూమి దేశేచ॥ 69

తా. తుల త్రాసునుధరించిన పురుషుడుగలది. వీథుల యిరుపార్శ్వములయందుండు అంగళ్లు, విలువగల వస్తువులు, బురదప్రదేశము, తెల్లనిగృహము, క్రయవిక్రయములుచేయు స్థళములయందు రమించును.

వృశ్చికం.

శ్లో॥ బిలకుడ్య సమే దేశే జీర్ణవనే తృణదృషత్కారే।
అజగరకీట మహాబిలదేశే వ్వళిరమతి వృశ్చికాకారః॥ 70

తా. వృశ్చికము వృశ్చికా కారముగలది. గోడరంధ్రములయందును, తత్సమానప్రదేశములయందును, పాడుబావులయందును, కసువు, ఱాతిబండ, పుట్టలు మొదలగు ప్రదేశములయందును రమించును.

ధనుః.

శ్లో॥ ధన్వీనరోశ్వజఘ నృపనూతహయాశ్చ యజ్ఞభూదేశే।
ఆయుధమందురభూమౌ రమతేన్నృపసేవక గృహేషు॥ 71

తా. ధనుస్సు గుఱ్ఱముయొక్క పిరుదులబోలు పిరుదులు గలిగి విల్లునుధరించిన పురుషుడుగలది. రాజు, నూతుడు, గుఱ్ఱము, యజ్ఞభూమి, ఆయుధశాల, గుఱ్ఱపులాయము, రాజసేవకులయొక్క గృహము మొదలగుచోట్లయందు రమించును.

మకరః.

శ్లో॥ మకరోమృగాస్యపవరసు తేపనపశువద్ద్విజపుణ్యతీర్థదేశేషు।
హ్రిదినిపదికే సముద్రే ప్వ్లల భూమౌ జలేవాపి॥ 72



తా. మకరము మృగముఖముగల మొసలి యాకారముగలది. జలము, పశువులు, బ్రాహ్మణులు వుండుస్థళము. పుణ్యతీర్థప్రదేశము, మడుగులు, సముద్రము, ఊటప్రదేశముల రమించునది.

కుంభః.

శ్లో॥ స్కంధేతురిక్తః పురుషస్యకుంభో
జంఘేతమేకాదశ మాహురార్యాః।
తస్యోద కాధారకుసస్య పక్షిస్త్రీ
శౌండీక ద్యూతనివాస భూమిః॥ 73

తా॥ ఉత్తకడవను భుజమునందుదాల్చిన పురుషుడుగలది. మోకాళ్లు, ఏకాదశస్థానము, ఉదకపాత్రము, చెడుపంట, పక్షి, స్త్రీ, గర్విష్ఠుడు, జూదమాడుస్థళముల రమించును.

మీనః.

శ్లో॥ జలేతుమీన ద్వయమత్స్యరాశిః
కాలస్యపాదౌ విహితౌ వరిష్ఠౌ।
సపుణ్య దేవద్విజతీర్థ భూమి
ర్నదీసముద్రాం బుధరాధివాసః॥ 74

తా. మీనము అన్యోన్య ప్రచ్ఛాభిముఖములగు మీన ద్వయముగలది. ఇది కాలపురుషునియొక్క శ్రేష్ఠములైన పాదములు, దేవబ్రాహ్మణులతో గూడిన మంచి పుణ్యతీర్థ క్షేత్రములు, నదులు, సముద్రలు మొదలగుచోట్ల నివసించును.

శీర్షోదయాది రాశయః.

జ్ఞానప్రదీపికాయాం.

శ్లో॥ చాపోక్షకర్కినక్రాజాః పృష్టోదయ బలాన్వితాః।
తిర్యఙ్మీన స్తథాశేషాః రాశయోమస్తకోదయాః॥ 75

తా. మేష, వృషభ, కర్కాటక, ధనుర్మకరములు పృష్ఠోదయరాసులు, మీనము, తిర్యగుదయ రాశి (అనగా ఉదయోదమని తాత్పర్యము.) మిగిలిన మిథున, సింహ, కన్య, తులా, వృశ్చిక కుంభ రాసులు శీర్షోదయము లనబడును.

నరరాశయః.

గర్గః.

శ్లో॥ నృయుక్తులా ఘటః కన్యాపూర్వమర్ధంచ ధన్వినః।
లగ్నస్థా బలినో జ్ఞేయా ఏతేహి నరరాశయః॥ 76

తా. మిథునము, తులా, కుంభము, కన్య, ధనుస్సునందు పూర్వార్ధము. యివి నరరాసు లనబడును. ఈ నరరాసులలో నొకటి లగ్నమైనచో అధికబలము గలదగును.

జలరాశయః.

గర్గః.

శ్లో॥ చతుర్థే కర్కటోమీనః మకరార్ధంచ పశ్చిమం।
విజ్ఞేయా బలినోనిత్యమేతేహి జలరాశయః॥ 77

తా. కర్కాటకము, మీనము, మకరమునందు ఉత్తరార్ధము, జలరాసు లనబడును. ఈజలరాసులు, చతుర్థస్థానమైనచో బలముగలదగును.

కీట చతుష్పదాదయః.

గర్గః.

శ్లో॥ సప్తమే వృశ్చికః కీటో బలవాన్ పరికీర్తితః।
ధన్వ్యంత్యార్ధాజగో సింహః బలినః ఖేచతుష్పదాః॥

తా. వృశ్చికము కీటరాశి ఇది లగ్నాది సప్తమ భావమైనచో బలముగలది యగును. ధనుస్సు ఉత్తరార్ధము, మేషము,



వృషభము, సింహము, ఇవి చతుష్పాదరాసులు, ఈ రాసులు దశమభావమును పొందుచుండగా బలముగలవి యగును.

కాలపురుషస్య మేషాద్యంగ విభాగః.

సారావళ్యాం.

శ్లో॥ మేషశ్శిరోథ వదనం వృషభో విధాతుః
వక్షో భవేన్మిథునం హృదయం కుళీరః।
సింహస్తథో దరమథో యువతిః కటిశ్చ
వస్తిస్తులాభృదథ మేహనమష్టమస్స్యాత్।
ధన్వీచస్యా దూరుయుగం నక్రోజాను యుగంతథా।
జంగద్వయంచకుంభస్యాత్పాతద్వితయమంత్యభం॥ 79

తా. మేషాదిరాసులు కాలపురుషునియొక్క అవయవములు, కావున అట్టి రాసులలో మేషము కాలపురుషుని శిరస్సు, వృషభము ముఖము, మిథునము రొమ్ము, కర్కటకము హృదయము, సింహము కడుపు, కన్య కటిప్రదేశము, తుల నాభి లింగమధ్యప్రదేశము, వృశ్చికము పురుషచిహ్నమైన లింగము, ధనుస్సు రెండుతొడలు, మకరము మోకాళ్లు, కుంభము, రెండుపిక్కలు, మీనము రెండుపాదములు, ఇందునకు ప్రయోజనమేమనిన, జన్మకాలమునందు పాపగ్రహాంతమైన రాశి కాలపురుషునియొక్క యేయంగమందుండునో ఆయంగమందు ఉపఘాతమును, శుభగ్రహాక్రాంతమైన రాశి యేయంగమందుండునో ఆయంగమునకు పుష్టియు జాతకునికి కలుగునని చెప్పవలయును. ఈ విషయమై బృహజ్జాతకమునందు "కాలాంగాని వరాంగమానన మురోహృత్క్రోడవాసోభృతః। వస్తిర్వ్యంజనమూరుజానుయుగళం జంఘే తతోంఘ్రిద్వయం॥ మేషాశ్వి ప్రథమానవర్క్ష చరణాశ్చక్రస్థితా రాశయో। రాశి

క్షేత్ర గృహర్క్షభానిభవనం చైకార్థ సంప్రత్యయాః ॥" యని చెప్పబడియున్నది. రాశి, క్షేత్రము, గృహము, ఋక్షము, భం, భవనము, అని ఈ ఆఱుశబ్దములు రాసులయొక్క పర్యాయ నామములు.

అథరాశివర్ణాః.

లఘుజాతకే.

శ్లో॥ రక్తశ్శ్వేత శ్శుకతను ర్విభః పాటలో ధూమ్ర పాండు
శ్చిత్రః కృష్ణః కనక సదృశః పింగళః కర్బురశ్చ। బభ్రు
స్స్వచ్ఛః ప్రథమ భవనాద్యేషు వర్ణాప్లవత్వం స్వా
మ్యం సౌఖ్యం దినకరయుతా ద్భాద్వితీయంచవేశీ ॥౪౦

తా. మేషము రక్తవర్ణము, వృషభము శ్వేతవర్ణము, మిథునము ఆకుపచ్చనన్నె, కర్కాటకము శ్వేతరక్తవర్ణము, (పారిజాత పుష్పమువలె తెలుపు, ఎఱుపు కలిసిన మిశ్రవర్ణము). సింహము పొగవన్నెగూడిన తెలుపు, కన్య చిత్రవర్ణము, తుల నీలవర్ణము. వృశ్చికము బంగారువన్నె, ధనుస్సు కపిలవర్ణము. మకరము శుక్లకపిల మిశ్రవర్ణము, కుంభము నలుపుగూడిన తెలుపు, మీనము స్వచ్ఛవర్ణము, ఇందుకు ప్రయోజనము, ఏరాశికి ఏగ్రహము అధిపతియో ఆగ్రహమునకు దిక్కు ఏదో ఆదిక్కునందు ఆరాశి నీటిమీఁది తెప్పమువలె తేలుచుండును. గనుక ఆరాశి దిక్కుకూడ నదియే నగును. దీనికి ప్లవసంజ్ఞయనిపేరు. కుజునకు దిక్కు దక్షిణమైనందున మేషవృశ్చికములు ప్లవసంజ్ఞ గలదియగును. శుక్రునకుదిక్కు అగ్నిమూల, గనుక వృషభ తులలకు ప్లవసంజ్ఞ. బుధునిదిక్కు ఉత్తరము. అందు మిథున కన్యలకు ప్లవసంజ్ఞ. చంద్రునిదిక్కు వాయవ్యమూల అందు కర్కాటమునకు ప్లవసంజ్ఞ. సూర్యునిదిక్కు తూర్పు అందు సింహమునకు ప్లవసంజ్ఞ. గురువునకుదిక్కు ఈశాన్యము అందు ధనుర్మీనములకు ప్లవసంజ్ఞ. మకరకుంభములకు శని యధిపతి. గనుక ఆ శనిదిక్కగు పశ్చిమమునందు ఆ మకరకుంభములకు ప్లవసంజ్ఞయనియు తెలియదగినది. ఇందువలన ప్రయోజనము. చోరాది ప్రశ్నలయందు చోరాదులయొక్క దిగ్గమనము నెఱుంగదగును. సూర్యుడున్నరాశికి రెండవరాశి వేసిస్థాన మన బడును ఇందుకు ప్రయోజనము యాత్రాప్రకరణమునందు "వేశిద్విలగ్నోపగతోపియోసౌ వేశిస్థానేపి సద్గ్రహః" యని చెప్పబడియున్నది.



హ్రస్వ సమదీర్ఘ రాశయః.

సారావళ్యాం.

శ్లో॥ హ్రస్వాస్తేమీనా గోజఘటాః మిథునధనుః
కర్క్యమృగ ఝషపాశ్చ సమాః।
వృశ్చికకన్యా మృగపతివణిజో దీర్ఘాస్సమాఖ్యాతాః ॥

తా. మీన, మేష, వృషభ, కుంభములు పొట్టిరాసులు. మిథునము, ధనుస్సు, కర్కాటకము, మకరములు సమ రాసులు. వృశ్చిక, కన్యా, సింహ, తులారాసులు పొడుగురాసులు.

రాశీనాం ద్రవ్యనిర్ణయః.

వరాహః.

శ్లో॥ యఏషాం ద్రవ్యాణామధిపతయోరాశయ సముద్దిష్టాః।
మునిభిశ్శుభానుభార్థం తానహమతః ప్రవక్ష్యామి।
వస్త్రాదికకుతపానాం మసూరగోధూమరాలకయవానాం।
స్థలసంభవౌషధీనాం కనకస్యచ కీర్తితో మేషః॥
గవివస్త్రకుసుమ గోధూమశాలీ।
యవమహీషి సురభితనయాశ్చ।

మిథునేధాన్య శారదమల్లి శాలిక కందకార్పాసాః ।
కర్కిణికోద్రవ కదళిమార్వాఫల కందపత్రముక్తాని ।
సింహేతుష ధాన్యరసాః సింహాదీనాం త్వచస్సగుడాః ।
షష్ఠేతుసికతాయాః కుళుద్ధగోధూమ ముద్గనిష్పావాః ।
సప్తమరాశౌమాషాః యవగోధూమాస్సర్షపాశ్చైవ ।
అష్టమరాశౌ విక్షుస్సైన్యం లోహాన్యజావికంచాపే ।
నవమేతుతురగ లవణానివస్త్రం ధాన్యానిచైలాని ।
మకరేతరుగుల్మాద్యం సైక్యేక్షు సువర్ణకృష్ణలోహాని ।
కుంభేసలిలజఫల కుసుమరక్త చిత్రాణిరూపాణి ।
మీనేకపాల సంభవరత్నాన్యం బూగవాంచవస్త్రాణి ।
మధుళ్చసైకరూపా వ్యాఖ్యాతా మత్స్యజాతంచ ॥ ౬౨

యికను రాసులయొక్క ద్రవ్యాది నిర్ణయము చెప్పుచున్నాడు.—

తా. మేషమునకు కంబళి, రాగులు, గోధుమలు, బియ్యము, స్థలధాన్యములు, బంగారము మొదలగునవి. వృషభమునకు, వస్త్రము, పుష్పము, గోధుమలు,బియ్యము, గేదెలు మొదలగునవి. మిథునమునకు ధాన్యము, మల్లెపుష్పములు, శృంగారసామగ్రులు, పత్తి మొదలగునది కర్కాటకమునకు జలధాన్యములు, అరటిపండ్లు, ఫలములు, గడ్డదినుసులు మొదలగునవి. సింహామునకు చర్మము, గట్టిపదార్థములు, అడవిదినుసులు గోరుట మొదలగునవి, కన్యకు యిసుక, పులుసు, గోధుమలు, పెసలు, అనుములు మొదలగునది. తులకు ఆవాలు, బియ్యము, రత్నము మొదలగునవి. వృశ్చికమునకు చెఱుకు, లోహము, సైన్యమునకు కావలసినవస్తువులు మొదలగునవి. ధనుస్సునకు గుఱ్ఱము, ఉప్పు, వస్త్రము, ధాన్యము మొదలగునవి. మకరమునకు



తీగెలు, చెట్లు, త్రాడు, చర్మము, లోహము, ఇనుము యిత్యాదులు. కుంభమునకు నీటియందు దొరికెడువస్తువులు, పండ్లు, పుష్పములు, చిత్రవర్ణము మొదలగునవి. మీనమునకు రత్నము, శంఖము, గోవు, వస్త్రము, మధువు, మత్స్యము, నీరు మొదలగునవి.

శ్లో॥ రాశేర్యస్యక్రూరా పీడాస్థానేషు సంస్థితా బలినః ।
తత్రోక్తద్రవ్యాణామనర్ఘతా దుర్లభత్వంచ ॥
ఇష్టస్థానేసౌమ్యా బలినోయే శుభాభవంతిరాశీనాం ।
తద్ద్రవ్యాణాం శుద్ధిస్సమర్ఘతా సులభతాచైవం ॥
గోచరపీడాయా మపిరాశిగ్బలిభి శ్శుభగ్రహైర్దృష్టైః ।
పీడాంనకరోతి తదాక్రూరై రేవం విపర్యాసః ॥ ౬౩

తా. మేషాదిరాసులు క్రూరస్థానములయినను బలవంతములగు దుస్థానములయినను, పైన చెప్పబడిన ద్రవ్యములకు హానియు, శుభస్థానములైనను లేక బలముగలిగియున్నను, ద్రవ్యములకు శుభమును కలుగును. గోచార రీత్యాదుర్బలము కలిగియున్నను శుభగ్రహదృష్టి కలిగియున్నయెడల పీడ చేయజాలదు. అనగా శుభఫలమునే యిచ్చును. రాశ్యాధిపతులకు కూడ ఇదే ద్రవ్యములే గ్రహింపదగినది. శుభగ్రహము సుఖమును, క్రూరగ్రహము కష్టఫలమును యిచ్చును.

క్రూరశుభ స్త్రీపురుషచరాదిరాశయః.

సారావళ్యాం

శ్లో॥ అజాదితః క్రూరశుభౌపుమాంస్త్రీ
చరస్థితో మిశ్రతనుశ్చదృష్టః ।

కుళీర మీనాళీ గృహాంతసంధిం
వదంతి గండాంత మితిప్రశిద్ధం ॥ 84

తా. మేషాదిరాసులు వరుసగా క్రూరరాసులనియు, శుభరాసులనియు, పురుషరాసులనియు, స్త్రీరాసులనియు, చరస్థిరద్విస్వభావరాసులనియు, నెఱుంగదగినది. అనగా విషమరాసులగు మేషము, మిథునము, సింహము, తులా, ధనుస్సు, కుంభములు క్రూరరాసులనియు, పురుషరాసులనియు, సమరాసులగు వృషభము, కర్కాటకము, కన్య, వృశ్చికము, మకరము, మీనము, శుభరాసులనియు, స్త్రీరాసులనియు, తెలియదగినది. మేషము, కర్కాటకము, తులా మకరములు చరరాసులు. వృషభము, సింహము, వృశ్చికము, కుంభము స్థిరరాసులు. మిథునము, కన్య, ధనుస్సు, మీనము ద్విస్వభావరాసులు. కర్కాటకము, వృశ్చికము, మీనము ఈ రాసులయొక్క అంత్యసంధి గండాంతము లనబడును.

### వర్గోత్తమాంశాః.

సత్యాచార్యః.

శ్లో॥ చరభవనేష్వాద్యం శాస్థిస్సరేషు మధ్యాః
ద్విమూర్తిషు తథాంత్యాః ।
వర్గోత్తమాః ప్రదిష్టా స్తేష్విహజాతాః
కులేషు తేముఖ్యాః ॥ 85

తా. చరరాసులయందు ఆదినవాంశమును, స్థిరరాసులయందు మధ్యనవాంశమును, ద్విస్వభావరాసులయందు అంత్యనవాంశమును, వర్గోత్తమాంశలనబడును. అట్టి వర్గోత్తమాంశయందు జనించిన జాతకుడు శుభఫలమును పొందువాడగును



### దిగ్రాశయః.

సత్యాచార్యః.

శ్లో॥ దిగీశాశ్చాపసింహాజాశ్చోత్తుకన్యా మృగాః క్రమాత్ ।
నృయుక్తులాచకుంభశ్చ కర్కికీటాంత్యరాశయః ॥ 86

తా. మేష సింహ ధనుః రాసులు, పూర్వము వృషభ కన్యా మకరములు దక్షిణము. మిథున తులా కుంభములు పశ్చిమము. కర్కాటక వృశ్చిక మీనములు ఉత్తరములు.

### బ్రాహ్మణాదిరాశయః.

హోరాసారే.

శ్లో॥ చాపసింహ క్రియాభూపాః మీనాళి వృషభాద్విజాః ।
నృయుక్కుంభతులావైశ్యా శ్శూద్రా స్త్రీమృగకర్కటః॥

తా. ధనుస్సు, సింహము, మేషము, క్షత్రియరాసులు. మీనము, వృశ్చికము. వృషభము బ్రాహ్మణరాసులు. మిథునము, కుంభము, తులా వైశ్యరాసులు. కన్య, కుంభము, కర్కటము శూద్రరాసులు.

### ఉచ్చాదిషు గ్రహస్థితఫలం.

సారావళ్యాం.

శ్లో॥ స్వోచ్చేస్థితా శ్శ్రేష్ఠ ఫలాభవంతి ।
మూలత్రికోణే స్వగృహేషుమధ్యాః ।
ఇష్టేక్షితామిత్ర గృహాశ్రితానా ।
వీర్యైకనిష్ఠా స్సముదాహరంతి ॥ 88

తా. తన ఉచ్చరాశియందున్న గ్రహము శ్రేష్ఠఫలము నిచ్చును. మూలత్రికోణ రాశియందుగాని, స్వక్షేత్రమందుగాని యున్న గ్రహము మధ్యమఫలము నిచ్చును. మిత్రగ్రహ

హముచేత చూడబడినను లేక మిత్రక్షేత్రమందున్నను ఆగ్రహము అల్పఫలము నిచ్చును.

హోరాసారే.

శ్లో॥ స్వోచ్చేస్థిత శ్శుభ ఫలం ప్రకరోతిపూర్ణం।
నీచర్క్షగస్తు విఫలం రిపుమందిరేల్పం।
పాదఫలం స్వహితభేస్వగృహేత దర్ధం।
పాదత్రయం గగనగస్థితవాంస్త్రికోణే॥ 89

తా. తన ఉచ్చయందున్న గ్రహము సంపూర్ణ శుభఫలమునిచ్చును. నీచయందున్న గ్రహము శూన్యఫలమునిచ్చును. శతృక్షేత్రమందున్న గ్రహము అల్పఫలమునిచ్చును. మిత్రక్షేత్రమందున్న గ్రహము పాదఫలము నిచ్చును, స్వక్షేత్రమందున్న గ్రహము ఎనిమిదవపాలు ఫలమునిచ్చును, లాభమందును, త్రికోణములయందును యున్న గ్రహము ముప్పాతికె ఫలము నిచ్చును. ఈవిషయమై. "నీచర్క్షగస్సకల మేవ కరోతిపాపం। న్యూనంచకించి దరిభేవిఫలంకరోతి। పాదత్రయాహితగృహే విహగోశుభశ్చ। స్వక్షేదలంచ చరణాంస్థిత వాంస్త్రికోణే॥" యనియు, "ఔత్పాతికౌన వితృలుప్తకరావిహూపా। నీచంగతారిపుగృహాశ్చ నభశ్చరేంద్రాః। యుద్ధేజితాశ్శుభ ఫలాని వినాశయంతి। పాపానితాని సుతరాం పరివర్ధయంతి। రిపుభేరిపుభాగేవా రిపుత్రికోణాదాది భాగయోగేవా। నభవతి విహగః ఫలదః స్ఫురదిందు కలాకలాపోపి॥" యనియు చెప్పబడియుండుటవల్ల భిన్నాభిప్రాయములు గలవని తోచుచున్నది. గాకను, వక్రగతగ్రహము యుద్ధమునందు జయమునొందిన గ్రహమును పూర్ణఫలము నిచ్చును. అస్తయందున్న గ్రహమును, యుద్ధమునందు అపజయము నొందిన గ్రహమును అర్ధ



ఫలమునిచ్చును. శతృక్షేత్రమందును, శతృ భాగలయందును, శత్రు త్రికోణాది భాగములయందును గల చంద్రుడు పూర్ణకళలతో గూడియున్నను శుభము నివ్వజాలడు.

## అథ షడ్వర్గలక్షణం.

దైవజ్ఞవిలాసే.

శ్లో॥ క్షేత్రంచహోరాద్రేక్కాణ నవాంశద్వాదశాంశకాః।
త్రింశదం శశ్చషడపి రాశీనాం వర్గసంజ్ఞికాః॥ 90

తా. క్షేత్రము, హోర, ద్రేక్కాణము, నవాంశము, ద్వాదశాంశము, త్రింశాంశము యని రాశి షడ్వర్గములకుపేర్లు.

## రాశ్యధిపాః.

బాదరాయణః.

శ్లో॥ భౌమః కావ్యబుధేంద్వినజ్ఞశ విభూ
పుత్రార్య మందార్కజాః।
జీవశ్చ ప్రథమాదిరాశిపతయ
స్తేషాంగృహాస్తే క్రమాత్॥ 61

తా. కుజుడు, శుక్రుడు, బుధుడు, చంద్రుడు, సూర్యుడు, బుధుడు, అంగారకుడు, గురువు, శని, బృహస్పతి వీర్లు మేషరాశి మొదలు ద్వాదశ రాసులకును క్రమముగా అధిపతులు.

## షడ్వర్గ విభాగః.

హోరాసారే.

శ్లో॥ త్రింశద్భాగాత్మకంలగ్నం హోరాతస్యార్ధముచ్యతే।
రాశేస్త్రిభాగోద్రేక్కాణః నవాంశోనవ భాగకః॥
ద్వాదశాంశోద్వాదశాంశ స్త్రింశాంశ స్త్రింశదంశకః।
షడ్వర్గలక్షణంప్రోక్తం సర్వలగ్నేష్వయం క్రమః॥ 92

తా. ముప్పదిభాగలుకలది లగ్నము. లగ్నమును రెండు భాగములు చేయగా హోరలగును. లగ్నమును మూడు భాగములు చేయగా ద్రేక్కాణమగును. లగ్నమును తొమ్మిది భాగములు చేయగా నవాంశఏర్పడును. లగ్నమును పండ్రెండు భాగములు చేయగా ద్వాదశాంశయగును. లగ్నమును ముప్ప ది భాగములు చేయగా త్రింశాంశయగును ఇదియే షడ్వర్గ లక్షణము.

### హోరాద్రేక్కాణౌ.

హూపావశ్యాం.

శ్లో॥ హోరార్కచంద్రయోరోజే యుగ్మభేచంద్రసూర్యయోః।
లగ్నపంచ నవక్షేత్ర నాథాద్రేక్కాణపాః క్రమాత్॥ 93

తా. ఓజరాసులనగా మేషము, మిథునము, సింహము, తులా, ధనుస్సు, కుంభము, ఇవి ఓజరాసులు. యీరాసులను రెండు భాగలు సేయగా రెండు హోరలగును. అందు మొదటి హోరకు సూర్యుడధిపతి యగును. రెండవహోరకు చంద్రుడధిపతియగును. లగ్నమును. మూడు భాగములు చేయగా ద్రేక్కాణములగును. అందు మొదటి ద్రేక్కాణమునకు లగ్నాధిపతి రెండవ ద్రేక్కాణమునకు పంచమాధిపతియు మూడవద్రేక్కాణమునకు నవమాధిపతియు అధిపతు లగుదురు. అయితే గ్రంధాంతరమున ॥ హోరారాశ్యర్ధమిత్యుక్తా తయోః విషమరాశిషు। రవిచంద్రాపతీజ్ఞేయా సమేష్వేందుదివాకరా ॥ చరేస్వపుత్రతనవపాః స్థిరేధర్మ స్వపుత్రపాః॥ పుత్రధర్మ స్వపాద్విస్వేద్రేక్కాణస్య ప్రకీర్తితాః ॥ యనెడి గార్గివచన ప్రకారము, చరరాసులకు 1-5-9 స్థానాధిపతులు ద్రేక్కాణాధిపతులనియు, స్థిరరాసులకు 9-1-5 స్థానాధిపతులు



ద్రేక్కాణాధిపతులనియు, ద్విస్వభావరాసులకు 5-9-1 స్థానాధిపతులు ద్రేక్కాణాధిపతులనియు మతభేదము గలదు.

### నవాంశః.

దైవజ్ఞవిలాసే.

శ్లో॥ రాశేర్నవవిభాగాస్తే నవాంశాశ్చ ప్రకీర్తితాః ।
అజాన్మృగాచ్చధటజాత్కర్కటాచ్చ నవాంశపాః॥ 94

తా. లగ్నమును తొమ్మిదిభాగములు చేయుటయె నవాంశయనబడును. అందు మేషాదిరాసులకు క్రమముగా మేష, మకర, తులా, కర్కటకాదిగా నవాంశాధిపతులను నిర్ణయింపదగినది. ఇందుకు గార్గ్యేణ విశేషోక్తం॥ "మేషకే సరిధన్వినాం మేషాద్యా అంశకాస్మృతాః । వృషకన్యామృగాణా మకరాద్యా నవాంశకాః । తులామిథునకుంభానాం తులా నవకీర్తితాః । కర్కివృశ్చికమీనానాం కర్కటాద్యాశకాః॥" యని చెప్పబడియుండు ప్రకారము మేష, ను రాసులకు మేషాదిగాను. కన్య, మకర, వృషభ కరాదిగాను. తుల, కుంభ, మిథునరాసులకు మీన, కర్కాటక, వృశ్చికరాసులకు కర్కాటకా వలయును.

### ద్వాదశాంశః.

సత్యాచార్యః.

శ్లో॥ రాశేర్ద్వాదశభాగోయో ద్వాదశాంశః ప్రకీ
తత్త్రద్రాశ్యాదిరాశీశాః ద్వాదశాంశాధిపాఃక్రమ

తా. రాశిని ౧౨ భాగములుచేయుగా ద్వాదశాంశ ర్పడును. ఆయా రాశ్యాదులయొక్క అధిపతులు మొదలు క్రముగా ద్వాదశాంశాధిపతు లగుదురు. (అనగా మొదటి అంశ

మూనకు ఆ రాశ్యాధిపతియును, తక్కిన యంశములకు క్రమము
గా యితరరాశ్యధిపతులును ద్వాదశాంశాధిపతు లగుదురనుట).

త్రింశాంశః.

బృహజ్జాతకే.

శ్లో॥ కుజరవిజగురుజ్ఞ శుక్రభాగాః పవన ౫
సమీరణ ౫ కౌర్పి ౮ జూక ౭ లేయాః ౫
అయుజియుజితు తే విపర్యయస్థా
శ్శశిభవనాళిఝషాంత్యమృక్షసంధిః॥ 96

తా. మేషాది మీనాంతరాసులలో ౧-౩-౫-౭-౯-౧౧-
ఈ బేసిసంఖ్యగల మేష, మిథున, సింహ, తులా, ధనుః, కుంభ
సులు ఓజరాసు లనబడును. అందలి ముప్పదిభాగలలో
దటి ౫ భాగలకు అధిపతి కుజుడు. మీఁది ౫ భాగలకు శని,
౮ భాగల్లకు గురువు. తరువాత ౭ భాగలకు బుధుడు,
భాగలకు శుక్రుడు ఈప్రకారముగా త్రింశాంశాధి
. మేషాదిగా ౨-౪-౬-౮-౧౦-౧౨ ఈ సమసంఖ్య
కర్కాటక, కన్య, వృశ్చిక, మకర, మీనములు
బడును. అందలి త్రింశాంశాధిపతులను పై చెప్పి
ం వ్యతిరేకముగా గణింపదగినది. (అనగా మొదటి
౫ అధిపతి శుక్రుడు, పిమ్మట ౭ భాగలకు బుధుడు
భాగలకు గురువు, మీఁది ౫ భాగలకు శని, మిగిలిన ౫
కుజుడు త్రింశాంశాధిపతులనుట) కర్కాటక, వృ
మీనరాసుల అంత్యభాగము రాశిసంధియనియు, నక్ష
త్రసంధియనియు చెప్పబడును. ఈవిషయమై. "పంచాథపంచ
చాష్టౌ సప్తపంచైవ త్రింశదంవిద్ధి। ధరణీసుత శని గురు బుధ
శుక్రాణామోజజాః క్రమేణాంశాః। పంచైవ సప్తచాష్టౌ



పంచచ పంచాథయుగ్మ భవనేషు। భాగాభార్గవ శశిసుతసురే
జ్య శనిభూమి పుత్రాణాం॥" యని శ్రుతకీర్తి వచనము.

అథ విశేష వర్గః.

చతుర్థాంశః.

జ్యోతిషార్ణవే.

శ్లో॥ గార్గిః॥ ప్రథమే ప్రథమం కేంద్రం ద్వితీయాంశే తృతీయకం।
తృతీయాంశే తృతీయంచ చతుర్థాంశే చతుర్థకం॥
ఏతేచతుర్థకేంద్రాద్యాః భవేయుఃనష్య తేబుధైః॥

తా. లగ్నమును నాలుగు భాగములు చేయగా చతు
ర్థాంశ యేర్పడును. అందు మొదటి అంశకు లగ్నాధిపతియు,
రెండవ అంశకు చతుర్థ కేంద్రాధిపతియు, మూడవ అంశకు
సప్తమాధిపతియు, నాల్గవఅంశకు దశమాధిపతియు చతుర్థాంశ
వర్గాధిపతు లగుదురు.

పంచమాంశః.

శ్లో॥ రాశేః పంచమ భాగోయః పంచమాంశః ప్రకీర్తితః।
చరస్థిరద్విస్వభావాద్యాః స్వపుత్ర నవపాఃక్రమాత్॥ 98

తా. రాశిని ఐదు భాగములు చేయగా పంచమాంశ
యేర్పడును. చరస్థిరద్విస్వభావ రాసులకు వరుసగా ౧-౫-౯
రాసుల అధిపతులే పంచమాంశాధిపతు లగుదురు.

షష్ఠాంశః.

గార్గిః॥ రాశిం షడ్భాగకంకృత్వా ఓజమేషాదికం క్రమాత్।
యుగ్మేతులాదికం ప్రోక్తమిత్యే తన్మునిసమ్మతం॥ 99

తా. రాశిని ఆఱుభాగములుచేసి ఓజరాసులకు మేషాది
గను, సమరాసులకు తులాదిగను, ఆఱురాసుల అధిపతులను
వరుసగా షష్ఠాంశాధిపతులుగా నెఱుంగునది.

### సప్తమాంశః.

నారదీయే.

శ్లో॥ సప్తాంశకాస్త్వోజ గృహేతదీశాః ।
యుగ్మేగృహే సప్తమరాశి పస్స్యాత్ ॥ 100

తా. రాశిని యేడుభాగములుచేసి సప్తాంశముల నెఱుంగవలయును. బేసిరాశియందు తద్రాశ్యధిపతిని మొదలుకొనిన్ని, సమరాశియందు ఆరాశికి సప్తమరాశ్యధిపతిని మొదలుకొనిన్ని గణింపగా సప్తాంశాధిపతు లగుదురు.

### అష్టమాంశః.

శ్లో॥ మేషాద్యాః చరరాశీనాంచాపాద్యాః స్థిరరాశిషు ।
ద్విస్వభావేషు సింహాద్యాః జ్ఞేయాశ్చాష్టాంశ నాయకాః॥

తా. చరరాసులకు మేషాదిగను, స్థిరరాసులకు ధనుస్సునుండియు, ద్విస్వభావరాసులకు సింహరాశినుండియు, వరుసగా అష్టమాంశాధిపతులను గణింప దగినది.

### దశమాంశః.

శ్లో॥ దశాంశకానా మధిపాస్తదీశాః ।
ఓజేసమేత స్నవమేశ్వరాద్యాః॥ 102

తా. రాశిని పదిభాగములుచేయ దశాంశములగును. ఆదశాంశములకు ఓజరాశియందు ఆదాశ్యాధిపతినుండియు, సమరాశియందు ఆరాశికి నవమరాశ్యధిపతినుండియు గణింపగా దశాంశాధిపతు లగుదురు,

### ఏకాదశాంశః.

శ్లో॥ మేషాంత్య కుంభనక్రాళ్వి కార్పితౌల్య బలాహారిః ।
కర్క్యుయుగ్మవృషాధీశః రుద్రాంశాశ్చస్మృతాబుధైః॥ 103

తా. సర్వరాసులకును, మీనము, కుంభము, మకరము, ధనుస్సు, వృశ్చికము, తులా, కన్య, సింహము, కర్కాటకము, మిథునము, వృషభము, ఈ రాశియధిపతులు క్రమముగా ఏకాదశాంశాధిపతు లగుదురు.

### షోడశాంశః.

శ్లో॥ షోడశాంశ మితిజ్ఞేయం మేషాద్యాః ద్వాదశాఃపరే ।
బ్రహ్మావిష్ణు శివస్సూర్య రోజేక్రమ సమోభవేత్ ॥ 104

తా. ఓజరాశిని పదియాఱు భాగములుచేయగా క్రమముగా మేషాదిద్వాదశ రాశ్యాధిపతులును, బ్రహ్మ, విష్ణు, శివ, సూర్యులును, యుగ్మరాశియందు దీనికి వ్యతిరిక్తముగను, షోడశాంశాధిపతు లగుదురు.

### ఉత్తమాంశాదిభేదాః.

శ్లో॥ మూలత్రికోణగేస్వోచ్చ స్వక్షేకేంద్రోత్తమాంశకాః।
సప్తవర్గోద్భవస్వాంశ స్వాధిమిత్రాంశ కాన్వితాః॥
వర్గాస్త్రయోదశాః ప్రోక్తాః పూర్వాచార్యైర్మహర్షిభిః।
భవంతి వర్గసంయోగే పారిజాతాది సంజ్ఞకాః॥
దుస్థారినీచ మూఢస్థాః గ్రహాః బలవివర్జితాః ।
మరణావస్థగాశ్చేతి పారిజాతాది నాయకాః॥
అయంపక్షో ఽనాదరణీయః॥ ముఖ్యపక్షస్తు॥
స్వాంశేస్వనవాంశకే స్వభవనేతి గ్రాహ్యాః॥ 105

తా. మూలత్రికోణము, స్వోచ్చము, స్వక్షేత్రము, కేంద్రము, సప్తవర్గములు, (లగ్నము, హోర, ద్రేక్కాణము, సప్తాంశము, నవాంశము, ద్వాదశాంశము, త్రింశాంశము, యనునవి) స్వనవాంశ, అధిమిత్రాంశయని పూర్వీక మహర్షులచేత పదిమూఁడు ఉత్తమాంశభేదములు చెప్పబడియున్నవి. అందు వర్గసంయోగములచేత పారిజాతాదిసంజ్ఞలు యేర్పడును.

దుస్థానములయందును, శత్రుస్థానములయందును, నీచమూఢ స్థానములయందును, యున్న పారిజాతాద్యంశల కధిపతులు బల హీనులై మరణావస్థను కలుగచేయుదురు. ఈ మతము ఆదర ణీయముగాదు. ముఖ్యపక్ష సమ్మతముగా స్వాంశము, స్వనవాం శము, స్వక్షేత్రము అని మూడు భేదములు గ్రహింపతగినది.

గోపాలరత్నాకరే.

శ్లో॥ ఉత్తమంతు త్రివర్గైక్యం చాతుర్వర్గంతు గోపురం।
వర్గపంచక సంయోగం సింహాసన మహోచ్యతే॥
వర్గద్వయం పారిజాతం షణ్ణాం పారావతాంశకం।
సప్తమం దేవలోకస్స్యా దష్టమం కుంకుమంభవేత్॥
ఐరావతంచ నవమం ఫలం తేషాం పృథక్పృథక్॥ 106

తా. మూడువర్గములకు ఐక్యము కలిగెనేని యుత్తమాంశయనియును, నాలుగు వర్గములకు ఐక్యముకలిగెనేని గోపురాంశయనియును, ఐదువర్గములకు ఐక్యముకలిగెనేని సింహాసనాంశయనియు, రెండువర్గములకు ఐక్యముకలిగెనేని పారిజాతాంశమనియును, ఆఱువర్గములకు ఐక్యముకలిగెనేని పారావతాంశమనియును, ఏడువర్గములు దేవలోకాంశమనియును, ఎనిమిది వర్గములకు ఐక్యము కలిగినపుడు కూడ దేవలోకాంశ మనియును, తొమ్మిదివర్గములకు ఏకత్వముకలిగెనేని ఐరావతాంశమనియును. ఈయంశములు కన్నిటికిని ఫలము వేఱువేఱుగా కలదనియు తెలియునది.

ధూమాదిగ్రహ నిర్ణయః.

శ్లో॥ ధూమోర్కో విశ్వభాగశ్శ్రుతి ౪-౧౩ భవనయుతో।
మండలా ౧౨-౦-౦ చ్ఛోధితో సౌపాతస్సద్రాశి ౬-౦-౦
యుక్తః। పరిధిరథరవే ౧౧-౦-౦ శ్శోధితశ్చాపనామా।



సప్తైకో ౧౬-౦ భాగయుక్తో ధనుషిచ శిఖినః।
పంచతేష్వ ప్రకాశాః॥ 107

తా. సూర్యస్ఫుట రాశ్యాదులకు ౪ రాసులు ౧౩ భాగములు కూడినచో ధూమగ్రహస్ఫుట మేర్పడును. ఆధూమ గ్రహస్ఫుటమును ౧౨ రాసులలో శోధించినయెడల పాతగ్రహ స్ఫుటమగును. దానికి ఆరురాసులు కూడినయెడల పరివేష గ్రహమగును. ఆపరివేష గ్రహస్ఫుటరాశ్యాదులను సూర్య స్ఫుటములో తీసియగా ఇంద్రచాపగ్రహ మేర్పడును. దీనికి ౧౬ భాగలుచేర్చగా శిఖిగ్రహమగును. ఈ పంచగ్రహములును అప్రకాశ గ్రహము లనబడును.

గుళికాది చతుర్గ్రహ నిర్ణయః.

వరరుచివాక్యములు

దాయశ్రీర్యేకం ౮-౧-౨-౧౧
గోపాదిజ్ఞానం ౩-౧-౮-౦
వాగర్భేణనేత్రం ౩-౪-౫-౬
చంద్రేలోకేచ ౬-౨-౩-౧౬
రవిస్ఫుటేచ సంయోజ్యదాయ శ్రీర్వాక్యసంయుతః।
గుళికోకంటకోనామ అర్ధప్రహార కాలకః॥ 108

తా. స్ఫుట రవికి రాశ్యాదిగా ౮-౧-౨-౧౧ కూడిన యెడల గుళికస్ఫుటమేర్పడును. స్ఫుట రవికి ౩-౧-౮-౦ చేర్చిన యెడల యమకంటక గ్రహస్ఫుటమగును. సూర్యస్ఫుటమునకు ౩-౪-౫-౬ కూడినచో అర్ధప్రహార గ్రహస్ఫుటమగును. రవి స్ఫుటమునకు ౬-౨-౩-౧౬ కూడగా కాలస్ఫుటమువచ్చును. గ్రంథాంతరమున "శన్యంశం గుళికంజ్ఞేయం గుర్వంశం యమ కంటకం। అర్ధప్రహార సౌమ్యాంశే రవ్యంశే కాలచోదితః॥"

యని చెప్పబడి యుండుటవల్ల ఇష్టదిన అహఃపరిమాణ ఘడియలనుగాని రాత్రిజననమైనచో రాత్రిపరిమాణ ఘడియలనుగాని ౮ భాగములుచేయుగా మొదటి ఎనిమిదిభాగములకు అధిపతి వారాధిపతి గ్రహమనియు, మధ్యనుండు ౬ భాగములకు వారక్రమముగా తక్కిన వారాధిపగ్రహములే అధిపతులనియు, ఇందులో శనిగ్రహాంశరాశియందు గుళికగ్రహముండుననియు గుర్వంశమే యమకంటకమనియు, బుధాంశమే అర్ధప్రహారమనియు, సూర్యాంశమే కాలగ్రహారాశియనియు, నెఱుంగునది.

జన్మ నర చక్రం

శ్లో॥ యస్మింశ్చరతి యద్భానుస్తదాదా త్రీణి 3 మస్తకే ।
న్యసేచ్చైవం ముఖే త్రీణి 3 చైకై ౧ కం ౧ స్కంధ
యోర్ద్వయోః ॥
ఏకై ౧ కం ౧ బాహుయుగ్మేచ ఏకై ౧ కం ౧ హస్త
యోర్ద్వయోః ।
ఉదరేపంచ ౫ ఋక్షాణిచైకం ౧ నాభౌ వినిర్దిశేత్ ।
ఏకం ౧ గుహ్యేప్రదాతవ్యమేకై ౧ కం౧జానుజంఘయోః।
పాదయోష్షట్చ ౬ ధిష్ణ్యాని నరచక్రేతు విన్యసేత్ ॥ 109

తా. సూర్యుడున్న నక్షత్రము మొదలు మూడునక్షత్రములు శిరస్సు, పిమ్మట మూడు నక్షత్రములు ముఖము, రెండు నక్షత్రములు భుజములు, రెండునక్షత్రములు హస్తములు, ఐదునక్షత్రములు కడుపు, ఒకనక్షత్రము నాభి, ఒకనక్షత్రము గుహ్యము, రెండునక్షత్రములు మోకాళ్లు, రెండునక్షత్రములు జంఘాద్వయములు, ఆఱునక్షత్రములు పాదములు, ఈ ప్రకారము పంచిపెట్టగా నరచక్రమేర్పడును.

ఫలం.



శ్లో॥ పాదేస్వల్పఫలో జాతః స్థానభ్రంశంతుజానునీ ।
పరదారశ్చ గుహ్యేచ నాభౌస్వల్పసుఖీభవేత్ ॥
ఉదరేధనవృద్ధిస్స్యాత్పాణ్యోర్భవతితస్కరః।
శూరోభవతిబాహ్వోశ్చ శ్రీపతిస్కంధయోర్ద్వయోః।
ఆస్యేచ పండితోజ్ఞేయః రాజాభవతిమస్తకే॥ 110

తా. ఏ అంగము నందుండు నక్షత్రమున జననమో దానికి ఫలము చెప్పబడుతున్నది. పాదములయందు స్వల్పఫలము మోకాళ్లయందు స్థానభ్రంశము, గుహ్యమునందు వ్యభిచారము, నాభియందు అల్పసుఖము, ఉదరమునందు ధనవృద్ధి, హస్తములయందు దొంగతనము, బాహువులయందు శౌర్యము, భుజములయందు ఐశ్వర్యము, ముఖమునందు, పాండిత్యమును, శిరస్సునందు ప్రభుత్వమును కలుగును.

ఆయుర్దాయజ్ఞానే తాచక్రే.

శ్లో॥ శతవర్షాణిజీవంతి శిరోధిష్ణ్యే ర్భవశ్శిశుః ।
అశీతిమాస్యతో జాత స్స్కంధయో స్సప్తతిస్తథా॥
బాహ్వోశ్చషష్టివర్షాణి త్రింశద్వర్షాణి హస్తయోః ।
ఉదరేనవతి స్సంఖ్యానాభౌ పంచాశ దుచ్యతే॥
గుహ్యేచపంచచత్వారి వింశద్వర్షాణిజానునీ ।
పాదయోర్దశవర్షాణి దశమాసంతథాపివా ।
ఏతత్ఫలాత్ఫలంజ్ఞేయం దశాస్వంతర్దశాసుచ॥ 111

తా. జన్మనక్షత్రము నరచక్రముయొక్క శిరస్సునయందున్న యెడల నూరుసంవత్సరములు, ముఖమునందు ఎనుబది సంవత్సరములు, భుజములయందు డెబ్బదిసంవత్సరములు, బాహువులయందు అరువదిసంవత్సరములు, హస్తములయందు ముప్పదివర్షములు, కడుపున తొంబది సంవత్సరములు, నాభి

యందు యేబది సంవత్సరములు జానువులయందు యిరువది సంవత్సరములు, పాదములయందు పదివత్సరములు గాని లేక పది నెలలుగాని ఆయుస్సుకలిగి జాతకుడు జీవించియుండును. దశాంతర్దశలయందు ఈఫలము యోచించతగినది.

బృహజ్జాతకేసారద॥

శ్లో॥ కాలనరస్యావయవాః పురుషాణాం కల్పయేత్ప్రసవకాలే ।
సదసద్గ్రహసంయోగాత్పుష్టిం దుర్గ్రహాస్సోపద్రవాంశ్చాపి॥

తా. ప్రసవకాలమందు నరునకు కాలపురుషునియొక్క అవయవములు కల్పించతగినది. శుభగ్రహ సంయోగమువల్ల ఆ యవయవములకు పుష్టియు, క్రూరగ్రహ సంబంధమువల్ల హానియు చెప్పదగినది.

గ్రహాణాంపాచకబోధక-కారక వేదక సంజ్ఞామాహ.

సర్వార్థచింతామణౌ.

శ్లో॥ క్రమాద్గ్రహాః పాచకబోధకశ్చ సకారకో వేదకసంజ్ఞికశ్చ।
మందారజీవా మరశత్రుపూజ్యాః
శుక్రారసూర్యాత్మజవాసరేశాః ।
రవీందు సూర్యాత్మజ చంద్రపుత్రాః ।
శశాంకజీవాచ భృగుః కుజశ్చ ।
సూర్యాత్మజారేందు దినాది నాథాః ।
సౌమ్యార్క దేవేజ్య దినేశపుత్రాః ।
శుక్రేందు దేవేజ్య ధరాసుతాస్తు ।
భవంతి తత్పాక ముఖాగ్రహేంద్రాః ॥ 113

తా. శని, కుజ, గురు, శుక్రులును. శుక్ర, కుజ, శని, సూర్యులును. రవి, చంద్ర, శని, బుధులును. చంద్రగురుశుక్ర కుజులును. శనికుజచంద్ర సూర్యులును, బుధరవిగురుశనులును.



శుక్ర చంద్ర గురు కుజులును, క్రమముగా సూర్యాది గ్రహములకు పాచక, బోధక, కారక, వేదకు లగుదురు (అనగా సూర్యునకు, శనికుజగురు శుక్రులును, చంద్రునకు శుక్రకుజశని సూర్యులును, కుజునకు రవిచంద్రశని బుధులును, బుధునకు చంద్రగురుశుక్ర కుజులును, గురువునకు శనికుజచంద్ర సూర్యులును, శుక్రునకు బుధరవిగురు శనులును, శనికి శుక్రచంద్రగురు కుజులును పాచక బోధక, కారక, వేదకులనుట.)

గ్రంథాంతరే.

శ్లో॥ శనిస్సితోరవిశ్చైవ చంద్రమందబుధాస్సితః ।
అర్కమాది దశాయాంతు పాచకా ఇతినిశ్చయః ॥
భృగుర్భాను ర్బుధశ్చైవ వక్రోభాను శ్శనిః కుజః ।
వేధకాశ్చక్ర మాత్ప్రోక్తం రవ్యాదీనాందశాసుచ ॥
మంగళోభౌమ చంద్రౌచ గురుభౌమౌ గురుశ్శనిః ।
బోధకాఇతి విఖ్యాతః భాన్వాదీనాం దశాక్రమః ॥
గురుర్మందశ్చ మందశ్చ శుక్రశ్చంద్ర రవిర్గురుః ।
కారకాశ్చేతి తేప్రోక్తా రవ్యాదీనాం దశాక్రమః ॥
శనివద్రాహు విఖ్యాతః కుజవత్కేతు సంజ్ఞికః ।
పాచకో వేధకశ్చైవ బోధకః కారక స్తథా ॥
రవ్యాదీనాం దశాకాలే ఫలంభుక్తా విశేషతః ।
తత్తత్ఫలానుగుణ్యేన వదేత్కేరళచోదితం ॥ 114

తా. శని, శుక్ర, రవి, చంద్ర, శని, బుధ, శుక్రులు వరుసగా సూర్యాదిగ్రహములకు పాచకులగుదురు. శుక్ర, రవి, బుధ, కుజ, సూర్య, శని, కుజులు వరుసగా రవ్యాదిగ్రహములకు వేధకులగుదురు, కుజ, భౌమ, చంద్ర గురు, కుజ బోధకులగుదురు. గురు, శని, శని, శుక్ర, చంద్ర, రవి, గురులు కార

కులు, శనివలెనే రాహువును, కుజునివలెనే కేతువును గణింపదగినది, ఈ ప్రకారముగా పాచకాది ఫలములను ఊహించి దశాభుక్తి ఫలములతో చేర్చి దానికి అనుగుణముగా చెప్పవల యునని కేరళమతము

స్థానస్థితగుణాః.

శ్లో॥ స్థానానివక్ష్యే క్రమశో గ్రహాణాం షట్సప్త ధర్మాయ
గతాః। ౬-౭-౯-౧౧ క్రమేణ।
భానోశ్శశాంకస్యతు ధ్యూనభాగ్యలాభ స్తృతీయంచ
౫-౯-౧౧-3 ధరాసుతస్య ।
ధనారిలాభాంత్య ౨-౬-౧౧-౧౨- గతాబ్జసూనో॥
ర్ద్వితీయబంధ్వాత్మజ సోదరాశ్చ ౨-౪-౫-3॥
గురోశ్చషష్ఠాత్మజ కామరిష్ఫాః ౬-౮-౭-౧౨।
భృగోర్ధనారి వ్యయగాశ్చ వేశ్మ ౨-౬-౧౨-౪॥
శనేస్త్రిలాభారి కళత్రగాశ్చ 3-౧౧-౬-౭- తిత్త
ద్దశాసుప్రవదంతి యోజ్యం ॥ 115

తా. స్థానస్థితగుణములు అనగా ఆయాగ్రహమునకు పాచకాది సంజ్ఞల నేయేస్థానములయందుండి పొందునో ఆ స్థానములను గ్రహములకు క్రమంబుగ చెప్పబడుచున్నది. సూర్యునకు 6, 7, 9, 11. స్థానములం బొందియుండు పూర్వోక్త గ్రహంబులు పాచకాది సంజ్ఞం బొందుదురు. అనగా సూర్యునకు ఆరింట శని పాచకుడు, ఏడింట కుజుడు బోధకుడు, తొమ్మిదింట గురుడు కారకుడు, పదునొకండింట శుక్రుడు వేధకుడు యని యెఱుంగునది. ఇదేప్రకారముగా చంద్రుడున్నరాశికి 5, 9, 11, 3. ఈ స్థానములయందున్న శుక్ర కుజ శని సూర్యులును, కుజునకు 2, 11, 12. రాసులయందున్న సూర్య చంద్ర



శని బుధులును, బుధునకు 2, 4, 5, 3. స్థానములయందున్న చంద్ర గురు శుక్ర కుజులును, గురునకు 6, 8, 7, 12. రాసుల యందున్న శని కుజ చంద్ర సూర్యులును, శుక్రునకు 2, 6, 12, 4. స్థానములం బొందియుండు బుధ రవి గురు శనులును, శనికి 3, 11, 6, 7. స్థానములను పొందియుండు శుక్ర చంద్ర గురు కుజులును, క్రమముగా ఆయాగ్రహమునకు పాచక బోధక కారక వేధక సంజ్ఞలగుదురని యభిప్రాయము.

ఏతద్విషయే శతృమిత్రాణి.

శ్లో॥ దినేశసూనుః ప్రవదంతితజ్ఞాః। శత్రుర్దినేశస్యతుపాచకస్యాత్ ।
మిత్రాణిశేషా శ్శశినస్తువైరీ। తద్వైవభౌమస్యతు! వేధకశ్చ॥
శత్రుర్బుధస్యాపిచ పాచకస్తు। శేషాణిమిత్రాణివదంతితజ్ఞాః।
పాచకగ్రహో వేదకసంజ్ఞికశ్చ। శత్రుర్భవేత్సురగురో ర్భృగు
గునందనస్య॥
సకారకో వేదసంజ్ఞికశ్చ శనేస్తుతత్కారకఖేచరోరిః॥ 116

తా. సూర్యునకు పాచకగ్రహమైన శని శత్రువగును. ఇతరులు మిత్రులు. అదేప్రకారముగా చంద్రునకు పాచక గ్రహము శత్రువు. తక్కినగ్రహములు మిత్రములు. కుజునకు వేదక గ్రహము శత్రువు. యితరగ్రహములు మిత్రులు. బుధునకు పాచకగ్రహము శత్రువు. తక్కిన గ్రహములు మిత్రములు. గురునకు పాచక వేదకగ్రహములు శత్రువులు. యితరులు మిత్రులు. శుక్రునకు కారకగ్రహంబును, వేదక గ్రహంబును శత్రువులు. యితరులు మిత్రులు. శనికి కారకగ్రహము మాత్రము శత్రువు.

## తత్తత్ఫలాని.

పాచకయోగఫలం॥

శ్లో॥ మృష్టాన్నపానాంబర భూషణాప్తిం
రాజ్యార్థభూలాభమతీవసౌఖ్యం।
ధైర్యం మనోత్సాహమతీవసౌఖ్యం
కుర్యాద్గ్రహో పాచకసంజ్ఞికోయం।
మిత్రో యథాన్యాయ ఫలంతవన్యే
గ్రహేతదన్యాత్ఫలమాతనోతి॥ 117

తా. మృష్టాన్న భోజనపానములు, సువస్త్రప్రాప్తి, భూషణలాభము, రాజ్యలాభము, ధనాగమము, భూలాభము, సౌఖ్యాధికము, ధైర్యము, మనోత్సాహము మొదలగునవి పాచకగ్రహము జాతకునకు కలుగచేయును. మిత్రగ్రహములు యేప్రకారముగా శుభఫలముల నిచ్చునో అట్లే శత్రుగ్రహములు ఆప్రకారముగా అశుభఫలములనిచ్చును.

బోధకయోగఫలం॥

శ్లో॥ సమగ్రభాగ్యం బహురాజపూజ్యం
విద్యావినోదాంకిత రాజగోష్ఠిం।
స్వీయంతపః ప్రాప్తిమజీర్ణభాగ్యం
కుర్యాత్ఫలంబోధక సంజ్ఞికశ్చ।
గ్రహేతుతస్మిన్ సఫలంవదంతి
మిత్రేవిపర్యాసఫలంతదన్యే॥ 118

తా. ఫలసహితమగు రాజ్యలాభమును, రాజసన్మానమును, విద్యావినోదములకు తగిన గద్య పద్యాదికమును, కీర్తియును, తపోలాభమును, విశేషభాగ్యమును బోధక గ్రహము కలుగచేయును. బోధకగ్రహము ఆయాగ్రహమునకు మిత్ర



గ్రహమైనయెడల పూర్వోక్త ఫలంబుల నిచ్చునని ఋషులు చెప్పుదురు. శత్రువు లయినయెడల యీ చెప్పిన ఫలంబులకు విపరీతఫలంబుల నిచ్చును.

కారకయోగఫలం॥

శ్లో॥ భాగ్యంక్వచిత్క్షీణఫలంక్వచిచ్చ
దారార్థబంధ్వాత్మజ రోగపీడా।
చోరాగ్నిపీడా కలహం జనైస్తు
సకారకోమిత్ర సమోయదిస్యాత్॥
సకారకోవైరి సమానతస్తు
వదంతి వ్యత్యాసఫలం విశేషాత్॥ 119

తా. కారక సంజ్ఞను బొందిన గ్రహము జాతకునకు కొంతకాలము భాగ్యఫలంబును, కొంతకాలము క్షీణఫలంబును, భార్యా ధన బంధుపుత్రులకు పీడయు, కలుగచేయును. ఆ కారకగ్రహము మిత్రసమమైన యెడల చోరభయమును, అగ్నిభీతియు, ఇతరులతో కలహమును గలుగజేయును. శత్రుసమమైనయెడల యిందుకు వ్యత్యాసఫలముల నిచ్చును. అనగా శుభఫలములను విశేషముగా నిచ్చును.

వేదకయోగఫలం॥

శ్లో॥ చోరాగ్నిబంధుక్షితిపాలసంఘై రతీవదుఃఖంస్వపదచ్యుతించ।
విదేశయానంధననాశనంచ వేధహగ్రస్తత్ఫలమన్యథాస్యాత్॥

తా. వేధక యోగగ్రహము మిత్ర సమమైనయెడల చోరభయము, అగ్నిభీతి, బంధునాశము, శత్రు రాజగణములచే అధిక దుఃఖము, స్వస్థాననాశము, పరదేశగమనము, ధననాశంబును జాతకునకు కలుగచేయును. శత్రుసమమైనయెడల శుభఫలంబుల నిచ్చును.

### నిర్దిష్ట గ్రహాః.

శ్లో॥ అజమిథున కర్కిసింహకన్యాఘటకీటచాప మకరకుంభాఖ్యాః।
చంద్రకుజౌసోమసుతః కీటకరాశౌ నిశాకరశ్చ తీక్ష్ణకరః।
రవిజోభార్గవ భౌమా భూసుతమందా నిశాకరగురూచ।
రవిమందాభానుసుతః క్రమాన్నిర్దిష్టయోగఖేచరాప్రోక్తాః॥

తా. మేష, మిథున, కర్కాటక, సింహ, కన్య, తులా, వృశ్చిక, ధనుర్మకర కుంభములయందు క్రమముగా చంద్ర కుజులును, బుధుడును, కటక రాశియగు కర్కాటక మున చంద్రసూర్యులును, శనియును, శుక్రకుజులును, కుజశనులును, చంద్ర గురువులును, రవి శనులును శనియును నిర్దిష్టయోగ గ్రహము లనబడును.

### ఆరోహావరోహలక్షణం.

శ్లో॥ లగ్నాదిషష్ఠరాశ్యంత మారోహమితికథ్యతే
ద్యూనాదివ్యయరాశ్యంత మవరోహమితిస్మృతః॥ 122

తా॥ లగ్నాదిగా ఆఱురాసుల పర్యంతము ఆరోహణ మనబడును. సప్తమరాశినుండి వ్యయరాశివరకు అవరోహణ మనబడును. ఈ విషయమై గ్రంథాంతరమున "ఉచ్చాంతగ్రహ మారోహః నీచాంత మవరోహక ఇతి" యనియు మాచక గ్రంథమున "నీచాదుచ్చాంత మారోహో నీచాంత మకరో హణం" యనియు చెప్పబడియుండుటవల్ల గ్రహము తన నీచ రాశినుండి ఉచ్చరాశివరకు పోవునపుడు ఆరోహణమనియు, తనఉచ్చరాశినుండి నీచరాశికి వచ్చువరకు అవరోహణ మనియు అభిప్రాయము.

ఇతి జాతక ఫల చింతామణౌ ప్రథమ ప్రకరణం నామ
సంజ్ఞాధ్యాయం సమాప్తం.

శుభమస్తు.

# జాతక ఫల చింతామణి.

## దశాంతర్దశాఫలం - ద్వితీయ ప్రకరణం.

త్రిమూర్తిరూపిణం దేవం। త్రయీవేద్యం శుభావహం॥
త్రిగుణాతీత మవ్యక్తం। వందేసూర్యం సదావిభుమ్।
రవ్యాది గ్రహచారేణ। వచ్మ్యహంతు దశాఫలం॥

తా. బ్రహ్మ, విష్ణు మహేశ్వరుల నెడి త్రిమూర్తి స్వరూపి యును, వేదత్రయములచే తెలియబడువాడును, శుభకరుడును, సత్వ, రజోతమముల నెడి గుణములకు అతీతుడును; వ్యక్తము లేనివాడును, స్వప్రకాశుడును అగు సర్వేశ్వరుడగు సూర్య భగవంతుని ఎల్లప్పుడును నమస్కరించు చున్నాను—రవ్యాది గ్రహచారములచేత కలిగెడి దశాఫలములను చెప్పుతున్నాను.

### రవ్యాదిగ్రహాణాం దశావర్ష నిర్ణయః.

శ్లో॥ ఇన శశి కుజరాహు ర్జీవమందజ్ఞ కేతు।
ర్భృగుజఇతి నవానాం కృత్తికాది క్రమేణ।
తను 6 నయ 10 సిను 7 జాయా 18 తోయ 16 ధాయా 19 నటా 17 సా 7 నర 10 ఇతి విదురబ్దాః భాస్కరాది క్రమేణ.1

తా॥ కృత్తికానక్షత్రము మొదలుకొని వరుసగా సూర్య, చంద్ర, కుజ, రాహు, గురు, శని, బుధ, కేతు, శుక్రులు దశాధిపతులగుదురు. అనగా కృత్తికా నక్షత్రమునకు రవిదశ, రోహిణికి చంద్రదశ, మృగశిరా నక్షత్రమునకు కుజదశ, ఆర్ద్రకు రాహుదశ, పునర్వసునకు గురుదశ, పుష్యమికి శనిదశ, ఆశ్లేషకు బుధదశ, మఖకు కేతుదశ, పుబ్బకు శుక్రదశ, అటు పిమ్మట ఉత్తర మొదలుకొని పూర్వాషాఢవరకును ఉత్తరాషాఢ మొదలుకొని భరణివరకును, పై దశలే వరుసగా ఏర్పడును.

రవిదశ 6సంవత్సరములు, చంద్రదశ 10సంవత్సరములు, కుజదశ 7సంవత్సరములు, రాహుదశ 18సంవత్సరములు, గురుదశ 16సంవత్సరములు, శనిదశ 19సంవత్సరములు, బుధదశ 17 సంవత్సరములు, కేతుదశ 7సంవత్సరములు, శుక్రదశ 20సంవత్సరములు. ఇట్లు దశాసంవత్సరముల మొత్తము 120 యని జ్యోతిర్విశారదులచే నిష్కర్షింపఁబడినది. ఈ విషయమై గ్రంథాంతరమున "షట్సూర్యో దశమశ్చంద్ర స్సప్తసంఖ్యా ధరాసుతః। రాహురష్టా దశశ్చైవ గురుషోడశవత్సరః। ఏకోనవింశతి స్సౌరి ర్బుధస్సప్త దశాస్తథా। కేతోశ్చ సప్తవర్షాణి భృగుర్వింశతి చక్రమాత్॥" అని చెప్పబడియున్నది.

## గ్రహాణాం భుక్త్యానయనం.

శ్లో॥ స్వదశా త్రిగుణీకృత్య తద్దశాను హతంపునః।
ఖాగ్నినాపి భజేన్మాసం శేషస్తు దివసాదయః॥ 2

తా. ఏదశలో ఏగ్రహముయొక్క భుక్తిపరిమాణము తెలియవలయునో ఆ దశాసంవత్సరములను 3చేత గుణించగా వచ్చిన మొత్తమును భుక్తిగ్రహ దశా సంవత్సరములచేత మరల గుణించి 30చేత భాగించగా వచ్చిన లబ్ధమే భుక్తిమాసములు, శేషమే భుక్తిదినములు యగును. ఇట్లు ప్రతి దశయందును అన్ని భుక్తుల పరిమాణ సంఖ్యను కూడినచో ఆదశా సంవత్సరములకు సరియగును. ఈవిషయమై గ్రంథాంతరమున సులభోపాయ పద్ధతి చెప్పబడియున్నది. అది ఏదనిన,

తత్తత్ఖేట దశాదశావినిహతా। మాసాః పురోంకస్తత।
స్త్వంత్యాంకస్త్రిగుణో దినాని। సతతం త్వేవంహిచాంతర్దశాః.

ఇందుకు తాత్పర్యము. ఎవని మహాదశలో నెవ్వని యంతర్దశ కట్టవలసియుండునో అట్టి మహాదశా సంవత్సరముల నంతర్దశా సంవత్సరములచే గుణింపగా నయిన సంఖ్యయొక్క చివరియంకమును తీసివేయగా నిల్చిన మొదటి యంకమే మాసములగును. ఆ తీసివేసిన చివరి యంకమును 3చే గుణింపగా నదియే దినము లగును. ఉదాహరణము రవియొక్క మహాదశలో కుజుని యంతర్దశ కావలయును. గనుక రవి దశాసంవత్సరములు 6 ను కుజుని దశాసంవత్సరములు 7 చేత గుణింపగా 42 అయినది. దీనిలో చివరనుండు 2 అనుదానిని త్రోసివేయగా నిలిచిన మొదటిసంఖ్య 4 గనుక 4 మాసము లయినది. త్రోసివేసిన చివరసంఖ్య 2 ను 3 చే గుణింపగా దినములగును. అనగా రవిమహాదశలో కుజాంతరము 4 నెలలు 6 దినము లగును.

## గ్రహాణాం దశాఫల నిర్ణయః.

హోరాసారే॥ సంజ్ఞాధ్యాయే యస్య యద్ద్రవ్య ముక్తం
కర్మాజీవేయస్య యచ్చోపదిష్టం
భావస్థానా నాద్య యోగోద్భవంచ
తత్తత్సర్వం తస్య యోజ్యం దశాయాం॥ 3

తా. ఏగ్రహమునకు సంజ్ఞాధ్యాయమునందు చెప్పబడిన ద్రవ్యములు "తామ్రంస్యాన్మణి హేమ శుక్తి రజతాన్యర్కాత్తు ముక్తాయసీ" యను గ్రంథవచన ప్రకారము ఆయా పదార్థములు ఆగ్రహ శుభదశయందు ప్రాప్తియగునని ఫలము యోచించతగినది. అదేదశ అశుభకరమైన యెడల ఆయా ద్రవ్యములకు హాని గలుగునని దశాఫల మూహించదగినది. గాకను ఏగ్రహమునకు కర్మ జీవాధ్యాయమునందు "అర్థాప్తిః పితృజననీ సపత్ని పుత్ర భ్రాతృస్త్రీ భృతకజనా ద్దివాకరాద్యైః" అను గ్రంథవచన ప్రకారము ఆ గ్రహదశయందు ఆ ఫలమంతయు శుభదశయైన యెడల లాభము

గను, పాపదశయైన యెడల నష్టముగను పరిణమించును. ఇంకను భావఫలమును, రాశిఫలమును, దృష్టిఫలమును, యోగ ఫలమును; (అనగా "స్వీయవధిగతవిత్తః పార్థివస్థ త్సమోవా" అను సునఫాది యోగఫలములను); "కర్మలగ్నయుత పాక దశాయాం రాజ్యలబ్ధి రథవా ప్రబలస్య" అనెడి రాజయోగ ఫలములును, "ఇతి నిగదితా యోగా స్సార్థం ఫలైరిహ నాభసా నియత ఫలదా శ్చింత్యా హ్యేతే సమస్త దశాస్వపి" అని చెప్పబడి యుండుటవల్ల అన్ని దశలయందును నడుచునట్టి నాభసయోగ ఫలములను మాత్రము వినహాయించి మిగత చాంద్రయోగ, ద్విగ్రహయోగ, ప్రవ్రజ్యాయోగాది ఫలముల నంతయు ఆ యోగకారక గ్రహ దశయందు చేర్చి జాతకుని యోగ్యతాను సారమున కనుగుణముగను, గ్రహముయొక్క బలానుసారము ననుసరించియు, ఇష్ట, కష్ట, నిర్ణయ ప్రకారముగా ఆయా సంబంధమైన లాభాలాభములు యథోచితముగ దశాఫలమునకు చేర్చి చెప్పవలయునని భావము. ఈ విషయమై సర్వార్థ చింతామణియందు "ఉచ్చాది జన్యం ఫలమాహురార్యాః పశ్చాత్ఫలం ఖేచరదృష్టి జన్యం । మధ్యే ఫలం స్థానభవం తథైవం పాపగ్రహాణా మిహయోజయంతి" యని చెప్పబడియున్నది. అయితే జ్యోతిషార్ణవ గ్రంథమునందు "కాలచక్రఫలజ్ఞేయ మష్టవర్గ ఫలం తథా । గోచార ఫలమాకృష్య లత్తఘాతాదిజం ఫలం॥ సర్వమాలోడ్య నిశ్చిత్య దశాఫల ముదీరితం" అని చెప్పబడి యుండుటవల్ల కాలచక్ర శాస్త్రము నందు చెప్పబడెడి మండూకగతి, సర్పగతి, సింహావలోకన మనెడి 3 గతులును, గండకాలములును, క్రూరమైన రుద్ర, శూల, కాలఫలములను, అష్టకవర్గ బిందుఫలములను



గోచారఫల, అంగగ్రహచారఫల గ్రహలత్తా, ఫలగ్రహ ఘాతఫలములను, దశాఫలముతో చేర్చి ప్రబల ఫలమునుండి దుర్బల ఫలమును త్రోయగా నిలిచిన సంభావ్య ఫలమును కాల, దేశకుల శీలములకు తగినట్లు చెప్పదగినది.

రవిదశావత్సరాః 6—ఫలం.

సర్వార్థ చింతామణౌ॥ సూర్యేస్థాన బలాధికే కృషిధనం
గోభూమి యానాంబరం సౌఖ్యంరాజ సమాననం పరధనై
స్సంయుజ్యతే కాంతిమాన్ । తత్పాకే శయనాంబరాది ల
భతే సర్వోపకారం మహా । త్కీర్తిం భూషణమిష్ట బంధు
సహితం తీర్థాభిషేకం మహత్॥

తా. దశాధిపతియగు సూర్యుడు స్థానబలము గలిగి యున్నయెడల తన దశాకాలమందు జాతకునకు వ్యవసాయ మూలకముగా ధనలాభమును, పశులాభమును, భూలాభమును వాహన వస్త్రలాభములును, దేహసౌఖ్యమును, రాజసన్మానమును, పరధనమును యిచ్చువాడగును గాకను దేహకాంతియును, శయనవస్త్రాది ప్రాప్తియును, సర్వజనోపకార కర్తృత్వంబును విశేష కీర్తియు, ఆభరణ ప్రాప్తియు, ఇష్టబంధు సంతోషాధికమును, తీర్థయాత్రఫలమును గలుగజేయును.

శ్లో॥ రవౌ యథాస్థాన బలేన హీనో తత్పాకకాలే బలమర్థ
నాశం । స్థానచ్యుతి ర్బంధువిరోధతాంశ్చ దేశాద్విదేశం
సముపైతినిత్యం॥ 2

తా. దశానాథుడగు రవి స్థానబలములేని వాడయినచో ఆదశయందు బలహీనమును, అర్థనాశనమును, స్థానభ్రంశమును, బంధువిరోధంబును, విదేశగమనంబును, దుఃఖప్రాప్తియును జాతకునకు గలుగును.

శ్లో॥ దిగ్వీర్యయుక్తే దివసేశ్వరేతు దిగంత రాక్రాంత ధనాది సౌఖ్యం। తత్తద్దిశా త్వాప్త యశోర్థభూమిం నోచేత్తదాతా దృశమర్థమస్తి॥ 3

తా. రవి దిగ్బలము గలవాడైనచో తనదశయందు నానాదిక్కులనుండి సంపాదింపబడిన ధనమును, సౌఖ్యమును, ఆయాదిక్కులయందు పొందిన యశస్సును, అర్థలాభమును, భూలాభమును యిచ్చువాడగును. సూర్యుడు దిగ్బలవంతుడు కానియెడల పై చెప్పిన ఫలములకు విరోధఫలములనుయిచ్చును.

శ్లో॥ తత్కాలమాత్రం తనుతెబలిష్ఠే రవావిపాకె కృషిభూమి విత్తం। ఉద్యోగసిద్ధిం నృపమాననంచ హీనెరవౌ కాల బలేన నాశం॥ 4

తా. గాకను సూర్యుడు కాల బలవంతుడై యున్న యెడల అట్టిదశయందు, కృషి, భూమి, ధనము మొదలగు వాని లాభమును, ఉద్యోగసిద్ధియు, రాజసన్మానమును కలుగును. అట్టి సూర్యుడు కాల బలహీనుడాయెనేని పూర్వోక్త ఫల నాశనంబు కలుగును.

శ్లో॥ నిసర్గికస్సర్వ ముపైతికాలే రవౌతు నైసర్గిక వీర్యయుక్తే। యానార్థ భూషాంబర దేహసౌఖ్యం హీనేరవౌ చోర నృపాగ్నిభీతిః॥ 5

తా. సూర్యుడు నైసర్గికబలము కలవాడయ్యెనేని అట్టి దశాకాలము సంప్రాప్తించునపుడు జాతకుడు సకలసుఖ ఫలంబులును ప్రయత్నములేకనే అనుభవించును. గాకను వాహన లాభమును, ధనలాభమును, భూషణలాభమును,వస్త్రలాభమును, దేహసౌఖ్యమును పొందును. మరియు సూర్యుడు నైసర్గిక బలములేని వాడయ్యెనేని చోరరాజాగ్నిభయములు కలుగును.



శ్లో॥ రవౌతు చేష్టాధికవీర్య యుక్తే స్వచేష్టితార్థా గమమేతి సౌఖ్యం। నృపస్యమానం సుతదార సౌఖ్యం కృష్యాది యానాం బరమత్రహీనే॥ 6

తా. సూర్యుడు చేష్టా బలముగలవాడయ్యెనేని అట్టి దశయందు స్వకీయచేష్టలవలన అర్థలాభమును, దేహసౌఖ్యమును, రాజసన్మానమును, భార్యాబిడ్డలయొక్క క్షేమమును కృషిలాభమును, వాహన వస్త్రలాభములునుకలుగును. గాకను సూర్యుడు చేష్టాబలము లేనివాడయ్యెనేని పూర్వోక్త ఫలంబులు కలుగవు.

శ్లో॥ రవౌఖగానాం బలదృష్టియుక్తే త్వచింత యిత్వా సకలంచ సౌఖ్యం। తద్దాయతే తత్పరిపాకకాలే తేనైవ హీనే సకలం వినాశం॥ 7

తా. సూర్యుడు గ్రహములయొక్క దృష్టిబలము కలిగి యుండెనేని తనదశయందు, అచింత్యలాభమును, సకలసౌఖ్యంబులును యిచ్చును. దృష్టిబలము లేనియెడల సకలము వినాశమగును.

శ్లో॥ క్రూరాదిషష్ఠ్యంశ రవేర్దశాయాం స్థానాచ్యుతి ర్భూపతి చోరభీతిః। కోపాధికం నేత్రశిరోరుజంచ పిత్రాది నాశంత్వథ వాతదీయం॥ 8

తా. షష్ఠ్యంశములలో రవి క్రూరాంశయం దున్న యెడల అట్టి రవిదశాకాలమందు స్థానభ్రంశమును, రాజదండనయు, చోరభయమును, అధికకోపమును,నేత్రవ్యాధియు, శిరోరోగమును, పితృనాశమును లేక పితృవర్గమువారికిహానియు, కలుగును.

శ్లో॥ మృద్వంశ షష్ఠ్యంశరవే ర్దశాయాం మృదన్న పానాంబర

భూషణాప్తిం । నామద్వయం రాజసపూజితంచ వేదాంత
శాస్త్రాగమ ధర్మశాస్త్రం॥ 9

తా. షష్ఠ్యంశములలో మృద్వంశయందున్న రవిదశా
కాలమందు భూలాభమును, అన్నపానాదుల సౌఖ్యమును,
వస్త్రలాభమును, భూషణప్రాప్తియు, బిరుదులచే నామద్వయ
మును, రాజపూజ్యతయు, వేదాంత శాస్త్రాభ్యాసమును,
ధర్మశాస్త్ర పరిశీలనయు లభించును.

శ్లో॥ పారావతాద్యంశయుతస్య తస్యభానో ర్విపాకేమహా
తీంచకీర్తిం । బహ్వర్థదేశాధిపమాననాది పుత్రాధిసన్మిత్ర
కళత్రలాభం॥ 10

తా. పారావతాంశమును పొందియున్నరవిదశ సంప్రా
ప్తించినచో మంచిబుద్ధియు, కీర్తియు, బహుధనలాభమును,
రాజసన్మానమును, మంచిపుత్ర, మిత్ర, కళత్రాది లాభంబులు
ను కలుగును.

శ్లో॥ భుజంగమత్ర్యంశయు తస్యభానో
ర్దశావిపాకే హి భయంవిషాద్వా।
కూపాగ్నిపాతజత్యమనేకదుఃఖం
పాశాదిభిస్త్ర్యంశయుతస్యచైవం॥ 11

తా. సర్పాంశయందున్న రవిదశాకాలమందు సర్పభ
యమును, విషభయమును, బావి, అగ్ని మొదలగువాని యం
దు పడుటయు, మరియు ననేకదుఃఖంబులును కలుగును, పాశా
ద్యంశలయందున్నను పూర్వోక్తఫలమే చెప్పదగినది.

శ్లో॥ స్వోచ్చస్థోపి దినేశో నీచాంశశ్చేత్కళత్రహానిః ।
స్వకులేబంధువిరోధం పిత్రాదీనాం తదైవ మునివాక్యం ॥

తా. సూర్యుడు తన ఉచ్చయందున్నను నీచాంశను
పొందియున్నయెడల కళత్రహానియు, స్వకీయకులమునందు బు
ట్టిన బంధుజనులతోడ విరోధమును, పిత్రాదులకు విరోధంబు
ను కలుగును.

శ్లో॥ ఉచ్చాంశకయుతో భానుః నీచస్థోపి మహాత్సుఖం ।
కరోతిరాజ్య భారంచ దశాంతే విపదంకృశం ॥ 13

తా. సూర్యుడు నీచుడైనను, ఉచ్చాంశను పొందియు
న్నయెడల తనదశయందు అధికసుఖమును, రాజ్యభారప్రాప్తి
యు కలుగచేసి దశాంత్యమందు ఆపత్తును, కలుగచేయును,
దేహము కృశించును.

శ్లో॥ అత్యుచ్చసంస్థిత దినాధిపతే ర్దశాయాం
గోవాజిసంఘ గజబృంద విశేషలాభః ।
యానాంబరాభరణమౌక్తిక రత్నలాభః
భూపాలమిత్ర సుతబంధు కళత్రసౌఖ్యం॥ 14

తా. అత్యుచ్చయందు అనగా మేషరాశిలో పదియవ
భాగమందున్న రవిదశలో గోవులు, గుఱ్ఱములు, ఏనుగులు
మొదలగు పశ్వాదిలాభమును, వాహనములు, వస్త్రములు,
ఆభరణములు, ముత్యములు. రత్నములు మొదలగు వానియొ
క్క లాభమును, రాజస్నేహమును. పుత్రమిత్ర కళత్రసౌఖ్య
మును కలుగును.

శ్లో॥ ఉచ్చస్థితస్యాపి రవేర్దశాయాం నృపాలమిత్రం స్వజనా
నుమోదం । సురార్చనం భూసురపూజనంచ అపూర్వ
యాత్రాది శుభంకరోతి ॥ 15

తా. ఉచ్చస్థానగతుడైన రవి దశయందు రాజస్నేహ
మును. స్వజనులసంతోషమును. దేవబ్రాహ్మణపూజయు,అపూ
ర్వమైన యాత్రాదిశుభములును కలుగును

శ్లో॥ ఉచ్చాన్వితస్యాపి రవేర్దశాయాం మనోవిలాసం లభతే
సువృత్యా । తీర్థాభిషేకం హరికీర్తనంచ ప్రాకార రూ
పాది పురాణశాస్త్రం ॥ 16

తా. ఉచ్చరాశిస్థితుడగు సూర్యదశయందు మనోవిలా
సమును, మంచివుద్యోగ లాభమును, తీర్థాభిషేకమును, హరి
కీర్తనయు, ప్రాకారాది నిర్మాణమును, పురాణశాస్త్ర శ్రవణపఠ
నాదులును కలుగును.

శ్లో॥ అతినీచ గతస్యాస్య భానోర్దాయే విపద్యుతా ।
స్త్రీపుత్ర బంధు నాశంచ ధనహానిశ్చరోగతా॥ 17

తా. అతినీచయందు అనగా తులారాశిలో పదియవ
భాగమందున్న సూర్యదశలో ఆపదయు, భార్యాపుత్రుల
యొక్క నాశమును, బంధుహానియు, ధననాశమును, రోగ
బాధయు కలుగును.

శ్లో॥ నీచస్థితస్యాపి రవేర్విపాకే మానార్థనాశం క్షితిపాలకో
పాత్ । స్వబంధునాశం సుతదార మిత్ర పిత్రాది కానా
మపకీర్తి మేతి ॥ 18

తా. నీచస్థానగతుడగు సూర్యునిదశయందు రాజకోపము
వల్ల మానహానియు, అర్థనాశంబును స్వకీయ బంధునాశమును,
పుత్రభార్యామిత్ర పిత్రాదులకు అపకీర్తియు కలుగును.

శ్లో॥ నీచాన్వితస్యాపి దినాధిపస్య దశావిపాకే నృప భీతిమా
హుః। దేహార్తిదం స్థానవినాశనంచ స్త్రీపుత్ర హాని స్వ్వప
దస్యనాశం ॥ 19

తా. నీచస్థాన స్థితుడగు సూర్యుని దశయందు రాజ
భీతి, దేహాలస్యము, స్థానచలనము, భార్యాపుత్రులకు హాని,
ఉద్యోగహాని మొదలగునవి కలుగును.



శ్లో॥ అత్యంత మిత్రర్క్ష గతస్యభానోర్దశావిపాకే క్షితినాయ
కత్వం । యశః ప్రకాశం స్వజనానుమోదం స్వనామ
పద్యాంకిత కీర్తిజాలం ॥ 20

తా. అధికమిత్రక్షేత్ర గతుండైన సూర్యుడు తనదశా
కాలమందు భూపాలనాధికారమును, ప్రకాశముతో గూడిన
ట్టి యశస్సును, స్వజనసంతోషమును, తననామాంకితముగల
పద్యములచేత పొగడింపబడు కీర్తియును కలుగును.

శ్లో॥ మిత్రర్క్ష గస్యాపి దివాకరస్య దశావిపాకే సకలార్థ
మేతి। హేమాంబరం గోధనధాన్యలాభం స్వరాజ్య
వృద్ధిం వరభూషణాప్తిం ॥ 21

తా మిత్రక్షేత్ర గతుడైన సూర్యుని దశాకాలమందు
సకలవిధములయందును అర్థలాభమును, బంగారము, వస్త్రము
లు, గోవులు, ధనధాన్యములు మొదలగు వాని లాభమును,
స్వతంత్రమైన అధికారవృద్ధియు, శ్రేష్ఠమైన భూషణప్రాప్తి
యు, కలుగును.

శ్లో॥ సమరాశిస్థితస్యాస్య భానోర్దాయే సమన్వితా ।
స్వబంధుస్త్రీ సుతాదీనాం శుభదం సుఖవృద్ధిదం॥ 22

తా. సమరాశియందున్న రవిదశాకాలమందు జనుల
యందు సమత్వమును, స్వంతబంధువులకును, భార్యాపుత్రుల
కును సుఖమును, శుభవృద్ధియు కలుగును.

శ్లో॥ అత్యంతశత్రు ర్భవనస్థితస్య భానోర్దశాయా మతికష్టమేతి।
చోరాగ్నిబాధా నృపతిప్రకోప మత్యంతకష్టం స్వపదస్య
నాశం॥ 23

తా. అధిక శత్రురాశి స్థితుడైన సూర్యదశయందు
అధికకష్టము కలుగును. చోరభయమును, అగ్నిబాధయు, రాజ

కోపమును, అత్యంతకష్టమును, ఉద్యోగనాశమును కలుగును.

శ్లో॥ శత్రుర్క్షగస్యాపి దివాకరస్య దశావిపాకే కలహం ధన క్షయం । విదేశవాసం స్వజనై ర్విరోధం దుష్కీర్తి సంప్రాప్తి మనోవిచారం॥ 24

తా. శత్రురాశి స్థితుడగు సూర్యదశలో కలహమును, ధనక్షయమును విదేశవాసమును, స్వజనులతోడ విరోధమును, అపకీర్తియును, మనోవిచారమును కలుగును.

శ్లో॥ దినాధినాథస్య శుభాన్వితస్యపాకే సుఖం భూమి ధనాది వస్త్రం । ఇష్టైర్విలాసం స్వజనై స్సమానం కళ్యాణ వాగ్జాల వినోదగోష్ఠిం॥ 25

తా. శుభగ్రహముతో గూడిన సూర్యుని దశయందు ధనము, భూలాభము, ధనాదివస్త్రములు, తనమిత్రులతోడ విలాసము, స్వజనులతోడ సామ్యత్వము, కల్యాణసౌఖ్యములచే వినోదగోష్ఠి మొదలగునవి కలుగును.

శ్లో॥ శుభేక్షితస్యాపి రవేర్దశాయాం భూపాలమిత్రం శుభ కార్య మాహుః । కళత్రమిత్రాత్మజ పుత్రసౌఖ్యం స్వనామ పద్యాంకిత కీర్తిజాలం॥ 26

తా. శుభగ్రహముచేత జూడబడెడి సూర్యుని దశయందు రాజస్నేహమును, శుభకార్యములు జరుగుటయు, భార్యాపుత్రుల యొక్కయు, స్నేహితుల యొక్కయు, భ్రాతృవుల యొక్కయు సౌఖ్యమును, తనపేరు అంకితముగాగల పద్యములచే పొగడింపబడిన కీర్తియు కలుగును.

శ్లో॥ పాపాన్వితస్య ద్యుమణేర్విపాకే నిత్యం మనక్లేశ్యతి హేయబుధ్యా। కుభోజనం కుత్సిత వస్త్రపానం కుశీలవృత్యా గమనం కృశత్వం॥ 27



తా. పాపగ్రహముతో గూడిన సూర్యుని దశయందు ఎల్లపుడును, హీనబుద్ధిచేతను మనోక్లేశమును, కుత్సిత భోజనంబును, కుత్సిత వస్త్రపానములును, కుత్సిత స్వభావవృత్తిచేత జీవనమును, కృశించుటయు కలుగును.

శ్లో॥ పాపేక్షితస్యాపి సహస్రభానో ర్దశావిపాకే పరమంచ దుఃఖం । పిత్రోర్వినాశం సుతదారకష్టం చోరాగ్నిభూపాల కృశం కృశత్వం॥ 28

తా. పాపగ్రహ వీక్షణగల రవిదశాకాలమందు పరమ దుఃఖమును, తల్లితండ్రుల వినాశమును, భార్యాపుత్రుల యొక్క కష్టమును, చోరాగ్ని రాజులచే కలుగజేయబడిన కృశత్వంబును కలుగును.

శ్లో॥ మూలత్రికోణస్య రవే ర్విపాకే క్షేత్రాత్మ దారాత్మజ బంధుసౌఖ్యం । రాజాశ్రయం గోధనమిత్రలాభం స్వస్థాన యానాదికమేతి రాజ్యం॥ 29

తా. మూలత్రికోణమందున్న రవిదశలో క్షేత్రలాభమును, దేహసౌఖ్యమును, భార్యాపుత్ర సుఖమును, బంధుసౌఖ్యమును, రాజాశ్రయమును, గోలాభమును, ధనప్రాప్తియు, మిత్రవృద్ధియు, స్వస్థాన అభివృద్ధియు, వాహన లాభమును, రాజ్యప్రాప్తియు కలుగును.

శ్లో॥ స్వక్షేత్రగస్యాపి రవేర్దశాయాం స్వబంధుసౌఖ్యం కృషి విత్తలాభం । విద్యాయశః ప్రార్థిత రాజపూజ్యం స్వభూమి లాభం సముపైతివిద్వాం॥ 30

తా. స్వక్షేత్రస్థితుడైన సూర్యుని దశయందు స్వకీయ బంధుసౌఖ్యమును, కృషిలాభమును, ధనలాభమును, విద్యాయశస్సులవల్ల ప్రార్థింపబడిన రాజపూజ్యతయు, స్వంత భూ

లాభమును, విద్యాలాభమును కలుగును.

శ్లో॥ కేంద్రాస్థితస్యాపి దివాకరస్య దశావిపాకే కలహాంస్వ
దుఃఖం । స్థానచ్యుతిర్బంధు వియోగమేతిభంగః కృషి
శ్చైత్తు పరిభ్రమంచ॥ 31

తా॥ కేంద్రస్థానమందుండు సూర్యుడు తన దశాకాల మందు కలహ మూలకముగా దుఃఖమును, స్థానభ్రంశమును, బంధువియోగమును, కృషిభంగమును, చిత్తపరిభ్రమంబును కలుగచేయును.

శ్లో॥ త్రికోణసంయుక్త గవేర్విపాకే బుద్ధిభ్రమం రాజవిరోధ
తాంశ్చ । సౌఖ్యాద్విహీనం నిధనం పితుశ్చ కర్మాది
వైకల్య ముపైతి కాలే॥ 32

తా. త్రికోణములయందున్న రవిదశలో బుద్ధిభ్రంశంబును, రాజవిరోధమును, సౌఖ్యాదిహీనతయు, తండ్రిమరణంబును, పుణ్యకర్మాదులకు వైకల్యమును కలుగును.

శ్లో॥ ఉచ్చాంశకస్య దశావిధధాతివృద్ధిం నిత్యంప్రతాపజనితాం
మహతీం శ్రియంచ।నానావినోదలభితం తిమిరాధ్వతాష్టం
స్త్రీపుత్రలాభ మనిశం పితృవర్గ సౌఖ్యం ॥ 33

తా ఉచ్చాంశను పొందియున్న రవిదశా కాలమందు వృద్ధిన్ని, ఎల్లపుడును ప్రతాపమువల్ల కలిగిన అతిశయమగు సంపత్తును, నానావిధవినోదములచే లాలినతయు, రతికేళీసౌఖ్యమును, స్త్రీలాభమును, పుత్రలాభమును, సర్వదా పితృవర్గనాశనంబును కలుగును.

శ్లో॥ నీచాంశసంయుక్తరవే ర్దశాయాం భార్యార్థభూపుత్రవి
నాశనంచ । యుక్తైర్జనైర్బంధు భిరుత్ససర్గో మనోవికా
రం జ్వర మేహరోగం ॥ 34



తా. నీచాంశతో గూడిన రవిదశలో భార్యార్థభూపుత్ర వినాశంబును, జనులచే విడువబడి బంధువిరోధమును, మనోవికారమును, జ్వరరోగమును, మేహవ్యాధియుకలుగును.

తన్వాదిభావస్థిత రవిదశాఫలం.

కృష్టిర్యో॥

శ్లో॥ తనుగతదినపదశాయాం దేహోష్ణం కాంతిహీనత్వం ।
స్వస్థానస్థితినాశం పరగృహవాసంపరాన్నభుక్తించ॥ 35

తా. లగ్నభావమునందున్న సూర్యదశలో ఉష్ణాధిక్యముచేత దేహాలస్యమును, కాంతిహీనతయు, స్వస్థాననాశమును, పరగృహవాసమును, పరాన్నభోజనమును కలుగును.

శ్లో॥ ధనస్థితస్యాపి దివాకరస్య దశావిపాకేచ శరీరబాధా ।
పశ్వర్థ నాశంసుతదారనాశం వివాదయుక్తంకలహంకరోతి ॥

తా. ధనస్థానమగు లగ్నమునకు రెండవరాశియందున్న సూర్యదశాకాలమందు దేహబాధయును, పశు, ధననాశములును, భార్యాపుత్రులయొక్క నాశనమును. వివాదమూలకముగా కలహమును కలుగును.

శ్లో॥ భానోర్విక్రమయుక్తస్య దశాధైర్యం మహత్సుఖం ।
నృపసన్మానసంప్రాప్తిం భ్రాతృద్వేషం విపత్తథా ॥ 37

తా. లగ్నమునకు తృతీయమందున్న సూర్యుని దశలో ధైర్యమును, మేలైనసౌఖ్యమును, రాజసన్మాన సంప్రాప్తియు, భ్రాతృద్వేషమును, విపత్తును కలుగును.

శ్లో॥ సుఖస్థితస్యాపి దివాకరస్యదశా మహద్రాజ్య ఫలప్రదా
యినీ। విద్యావినోదం బహుతీర్థదర్శనం హేమాంబరం
క్షేత్రముపైతిసిద్ధిం ॥ 38

తా. సుఖస్థానమందున్నరవిదశ విశేషరాజయోగఫలము

నిచ్చును, గాకను విద్యావినోదమును, బహు తీర్థదర్శనమును, బంగారువస్త్రములును, క్షేత్రలాభమును కలుగును.

శ్లో॥ సుతగతభానుదశాయాం సుతనాశంబుద్ధివిభ్రంశమధ్యే!
పితృవర్గవినాశం అంతేసౌఖ్యం గృహేచకల్యాణం ॥ 39

తా. పుత్రస్థానగతుడైన రవిదశాకాలమందు పుత్రనాశము, బుద్ధిభ్రంశము, మధ్యకాలమందు పితృవర్గపువారికి నాశనము, అంత్యయందు సౌఖ్యము, యింటియందు కల్యాణము కలుగును.

శ్లో॥ దశావిపాకే ధనహానిమేతి షష్ఠస్య భానో రతి దుఃఖ
జాలం । గుల్మక్షయోభూత పవిత్రరోగం మూత్రావి
కృఛ్రం త్వథవాప్రమేహం ॥ 40

తా. లగ్నమునకు ఆఱవయింటియందున్న సూర్యదశలో ధనహానియు, అధికదుఃఖమును, గుల్మక్షయాది పవిత్రరోగభయమును, మూత్రకృఛ్రరోగమును, లేక ప్రమేహాజాడ్యమును సంభవించును.

శ్లో॥ సప్తమస్థస్య భానోస్తు దశా దేశాటనం భవేత్ ।
కళత్రబాధావిద్వేషం రాజద్వేషం భవిష్యతి ॥ 41

తా. సప్తమస్థానమందున్న సూర్యదశలో దేశాటనము సంభవించును, కళత్రబాధయు, ద్వేషమును, రాజద్వేషమును కలుగును.

శ్లో॥ రంధ్రస్థభానో రవివాదశాయాం స్వదేహకష్టం త్వథ
వాపవిత్రం । చాతుర్థికం నేత్ర వికారకాశం జ్వరాతి
సారం స్వపదచ్యుతించ ॥ 42

తా. అష్టమస్థానమందున్న రవిదశాకాలమందు స్వదేహకష్టమును, లేక పవిత్రరోగమును, చాతుర్థికజ్వరబాధయు,



నేత్రరోగమును, జ్వరాతిసారమును, స్వస్థాననాశమును కలుగును.

శ్లో॥ ధర్మస్థానగతస్య వాస రమణేః పాకేశుభం సంపదం।
సన్మానం పితృవర్గ మోద భరితం ధర్మోపకారంతథా ।
వాపీకూప తటాకనందనవనో ద్యానాని నిర్మాణకం ।
తీర్థస్నానపరం నృపప్రియకరం సర్వార్థసిద్ధిప్రదం ॥ 43

తా. నవమరాశియందున్న సూర్యదశలో శుభమును, సంపదయు, సన్మానమును, పితృవర్గపువారికి సంతోషభరితమును, ధర్మమును, ఉపకారత్వమును, చెఱువులు, భావులు, గుంటలు, నందనవనములు మొదలగువాని నిర్మాణమును, తీర్థ స్నాన ఫల ప్రాప్తియు, రాజప్రియమును, సర్వార్థసిద్ధియు కలుగును.

శ్లో॥ మానస్థితస్యాపి రవేర్దశాయాం రాజ్యార్థలాభం సము
పైతిసిద్ధం । ఉద్యోగసిద్ధిర్యశసా సమేతం జయంవివా
దే నృపమాననంచ ॥ 44

తా. దశమ స్థానమందున్న సూర్య దశా కాలమందు రాజ్యార్థలాభములు సిద్ధించును యశస్సుతోగూడిన ఉద్యోగలాభమును, వివాదమునందు జయమును, రాజసన్మానమును కలుగును.

శ్లో॥ లాభస్థితస్యాపి దివాకరస్య ఉద్యోగసిద్ధింనృపతుల్యమే
తి । క్షేత్రార్థ లాభంచ కళత్రసౌఖ్యం స్వమందిరే
ణోత్సవ మాహుకార్యాః ॥ 45

తా. ఏకాదశస్థాన గతుడైన రవిదశలో రాజ సమానమగు ఉద్యోగ ప్రాప్తియు, క్షేత్రార్థ లాభములును, కళత్రసౌఖ్యమును, తనగృహమునందు ఉత్సవ కార్యములు జరుగుటయు కలుగును.

శ్లో॥ భానోర్ద్వాదశ కస్యచ తదా క్లేశార్థహానిం కృతం । స్త్రీ
బంధ్వాత్మజ భూమినాశమథవా పిత్రోర్వినాశంయథా।
స్థానాస్థాన పరిభ్రమం విషకృతం రాజ్ఞాభయంపాద। రు
గ్విద్యావాద వినోదగోష్ఠికలహం గోవాజినాంపీడనం॥

తా. ద్వాదశస్థానమందున్న రవితనదశలో అర్థహాని మూలకముగా దుఃఖమును, స్త్రీనాశమును, బంధునాశమును, పుత్రనాశమును, భూనాశమును అథవా పితృనాశమును కలుగ చేయును. స్థానచలనమును, విషభీతియు, రాజభయమును, పాదములయందుబాధయు, విద్యావాదమును, వినోదగోష్ఠియు, కలహమును, ఏనుగులు, గుఱ్ఱములు మొదలగు వానియొక్క పీడయునహా కలుగును.

మేషాదిరాశిషుస్థిత రవిదశాఫలం.

శ్లో॥ మేషాన్వితస్యాపి రవేర్దశాయాం గోవాజిమత్తేభ సువ
ర్ణలాభం । పురాధిపత్యం వరభూషణాప్తిం స్త్రీపుత్ర
మిత్రాదిషు సౌఖ్యమేతి ॥ 41

తా. మేషరాశియందుండు సూర్యుడు తనదశాకాలమందు పశువులు, గుఱ్ఱములు, ఏనుగులు మొదలగు వానియొక్క లాభమును, బంగారులాభమును, పురాధిపత్యమును, శ్రేష్ఠమైన భూషణప్రాప్తియు, భార్యాపుత్రుల యొక్కయు మిత్రులయొక్కయు సౌఖ్యమునుకలుగచేయును.

శ్లో॥ వృషభగత రవిదశాయాం భూలాభం బంధు పూజ్య
తాంయాతి । ద్విజసజ్జనగోపూజాభవతి విశేషభూతిర
తులంచ ॥ 48

తా. వృషభ రాశి గతుండైన రవి దశా కాలమందు భూలాభమును, బంధుపూజ్యతయు, గో బ్రాహ్మణసజ్జనపూజయు



సమానము లేని విశేషసంపత్తును కలుగును.

శ్లో॥ యుగ్మస్థితస్యాపిరవేర్దశాయాం ధనాదివిద్యాన్విత వాగ్వి
లాసం । భూపాల మిత్రం బుధవర్యపూజ్యం సంగీత
వాద్య శ్రవణం వినోదం ॥ 49

తా. మిథునరాశియందున్న రవిదశలో ధనాదిలాభములును, విద్యతోగూడిన వాగ్విలాసమును, ప్రభుస్నేహమును, విద్వాంసులచే పొందబడిన పూజ్యతయు, సంగీతవాద్య శ్రవణాది వినోదములును కలుగును.

శ్లో॥ కుళీరస్థరవేః పాకేనృపప్రీతిం మనోత్సవం ।
అన్యస్థల ప్రవాసంచ క్షేత్రధాన్యార్థ వృద్ధిదం॥ 50

తా. కర్కాటక రాశియందుండు సూర్యునియొక్క దశలో రాజప్రీతియు, పరస్థళవాసమును, క్షేత్రవృద్ధియు, ధాన్యాభివృద్ధియు, మంచి వస్తుసంగ్రహమును కలుగును.

శ్లో॥ సింహస్థితస్యాపి రవేర్దశాయాం భూపాలపూజ్యం భువ
నాధిపత్యం । ఆరామవాపీ గృహకర్మవృద్ధిం సుతోత్సవ
బంధు జనానుకూలం॥ 51

తా. సింహరాశియందున్న రవిదశాకాలమందు రాజగౌరవమును, భూమ్యాధిపత్యమును, తోటలు, బావులు,తటాకములు, గృహములు మొదలగువాని నిర్మాణమును, సుతోత్సవమును, బంధుజనానుకూలమును కలుగును.

శ్లో॥ కన్యాయాం రవియుతపాకకాలే దేహార్తిస్స్వ వినా
శతాంయాతి । క్షేత్రార్థగో ధననాశం వాదంయాతి
స్వమిత్రజనేషు ॥ 52

తా. కన్యారాశియందు సూర్యుడుండగా ఆ దశాకాలము సంప్రాప్తించి నప్పుడు దేహాలస్యమును, వినాశమును,

క్షేత్రార్థ నాశమును, పశుహానియు, ధనక్షయమును, స్వంత మిత్రులతోడ కలహమును కలుగును.

శ్లో॥ తులాన్వితస్యాపి రవేర్దశాయాం ధనక్షయం శత్రు
మనోజయంచ। స్వభ్రాతృనాశం సుహృదాద్విషత్వం
సర్వేషుకార్యేషు వినాశమాహుః॥ 53

తా. తులారాశియందు సూర్యుడున్న కాలమందు ధనక్షయమును, శత్రు మనోజయమును, స్వంతభ్రాతృ నాశమును, మిత్రులు శత్రులగుటయు, సర్వ కార్యములయందును విఘ్నమును కలుగును.

శ్లో॥ కీటస్థస్య రవేఃపాకే భూమ్యర్థ గృహలాభకృత్।
ఇష్టవస్తుషు సంప్రాప్తి ర్గిరికానన సంచరః॥ 54

తా. వృశ్చికరాశియందున్న రవిదశాకాలమందు భూలాభమును, అర్థలాభమును, గృహలాభమును లభించును. గాకను ఇష్టవస్తు సంప్రాప్తియు, పర్వత వనములయందు సంచారమును కలుగును.

శ్లో॥ ధనుస్థితస్యాపి దినాధిపస్య దశామహత్సౌఖ్య శుభేచదా
యకీ। నీరోగతాం శత్రువినాశకత్వం భూపాలమిత్రం
కురుతేసమృద్ధిం॥ 55

తా. ధనుస్సునందు సూర్యుడుండగా తనదశలో విశేష సౌఖ్యమును, శుభమును, దేహారోగ్యమును, శత్రువినాశమును, రాజస్నేహమును కలుగచేయును.

శ్లో॥ మృగస్థిత భాను దశాయాం దుర్గారణ్యేతు సంచరః
కురుతే। గృహ గో భూ ధననాశం మిత్రజనేషు విరోధ
తా ముపయాతి॥ 56

తా. మకరరాశియందుండు సూర్యుడు తనదశలో దుర్గా



రణ్యముల సంచారమును, గృహనాశమును, పశుహానియు, భూనాశమును, ధననష్టమును, మిత్రజనులతోడ విరోధమును కలుగచేయును.

శ్లో॥ ఘటస్థస్య భానోర్దశా పాక కాలే వివాదం మనోదుఃఖ
మాప్నోతినిత్యం। కళత్రస్య నాశం వివాదం విచారం
ధన క్షేత్రగోసంఘ ముఖ్యంతునాశం॥ 57

తా. కుంభరాశియందున్న సూర్యుడు తన దశాకాలమందు వివాదమును, మనోదుఃఖమును, కళత్రనాశమును, వివాదవిచారమును, ధననష్టమును, క్షేత్రనాశమును, ముఖ్యముగా గోసమూహనాశమును కలుగచేయును.

శ్లో॥ మీనస్థితస్యాపి దినాధిపస్య దశా విపాకే ధనలాభమేతి॥
మహోత్సవం బంధుజనానురాగం స్త్రీపుత్ర మిత్రాది
జనస్య సౌఖ్యం॥ 58

తా మీనరాశియందున్న రవి దశాకాలమందు ధనలాభమును, మహోత్సవములును, బంధు జనానురాగమును, భార్యాపుత్రుల యొక్కయు, మిత్రుల యొక్కయు సౌఖ్యమును కలుగును.

ఆరోహ రవి దశాఫలం.

శ్లో॥ ఆరోహ రవిపాకేతు దేహసౌఖ్యం నృపప్రియం।
క్షేత్ర స్త్రీ పుత్రసౌఖ్యంచ అశ్వగో గజలాభకృత్॥ 59

తా. ఆరోహణయందున్న రవి తన దశలో దేహసౌఖ్యమును, రాజప్రీతియు, క్షేత్రలాభమును, భార్యాపుత్రుల యొక్క సౌఖ్యమును, గుఱ్ఱములు, గోవులు, ఏనుగులు మొదలగువాని లాభమును కలుగచేయును.

అవరోహ రవి దశాఫలం.

శ్లో॥ అవరోహ రవేఃపాకే ధనధాన్య వినాశనం।
బంధుస్త్రీ పుత్ర పీడాచ స్వపదచ్యుతి కారణం॥ 60

తా॥ అవరోహణయందున్న రవిదశలో ధనధాన్య నాశమును, బంధుహానియు, భార్యాపుత్రులయొక్క పీడయు, స్థాననాశమును కలుగును.



అథ రవిదశాయాం రవిభుక్తి మాసాః 3 దినాని 18.

శ్లో॥ లగ్నాత్కేంద్ర త్రికోణస్థే స్వోచ్చస్వక్షేత్రసంయుతే।
తద్భుక్తౌ తీర్థయాత్రాది స్నానం దైవత దర్శనం।
నృపప్రసాద మారోగ్యం క్షేత్రస్త్రీపుత్రసౌఖ్యదం।
వాహనాంబర పశ్వాది వృద్ధిదం సర్వసౌఖ్యదం।
ఇష్టసిద్ధి ప్రదంచైవ గృహే కళ్యాణ సంభవం।
గీతనృత్తాదిషుప్రీతిః గణికావృద్ధి సంగ్రహః।
స్వవారే రాజసన్మానం బంధుభిర్బహుసంకులం।
పితృబంధు జనోత్సాహం దుర్గారణ్య విచారణం।
యత్నకార్యార్థ సిద్ధిస్స్యా త్సర్వత్ర విజయీభవేత్।
మౌక్తికాభరణప్రాప్తిః అపూర్వ వస్తుదర్శనం।
శ్వేతాశ్వ గజయోగాది లబ్ధంరాజ ప్రసాదతః॥ 1

తా. సూర్యుడు లగ్నమునకు కేంద్ర త్రికోణములయందున్నను, తన ఉచ్చరాశియందున్నను లేక స్వక్షేత్రగతుండైనను ఆ భుక్తియందు తీర్థయాత్రాది స్నానమును, దేవతాదర్శనమును, రాజానుగ్రహమువల్ల ఆరోగ్యమును, క్షేత్రవృద్ధియు, భార్యాపుత్రులయొక్క సౌఖ్యమును, వాహన



లాభమును, వస్త్రప్రాప్తియు, పశ్వాదివృద్ధియు, సర్వ సౌఖ్యమును, ఇష్టసిద్ధియు, యింటియందు కళ్యాణ సంభవమును, గీతనృత్త్యములయందు ప్రీతియు, వేశ్యా స్త్రీగోష్టియు, తన వారమునందు రాజసన్మానమును, బంధువుల సంకులమును, పితృ బంధుజనులయొక్క ఉత్సాహమును, దుర్గారణ్య విచారణయు, యత్నకార్యార్థ సిద్ధియు, ఎల్లచోట్లను జయమును, మౌక్తికాభరణ ప్రాప్తియు, అపూర్వ వస్తుదర్శనమును, రాజానుగ్రహమువల్ల తెల్లని గుఱ్ఱములు, ఏనుగులు మొదలగు వాహన లాభములును, కలుగును.

శ్లో॥ షష్ఠాష్టమవ్యయేసంస్థే నీచస్థే శత్రురాశిగే।
తద్భుక్తౌ స్థాననాశంచ దాయాది కలహంతథా॥
స్వబంధు జనవిద్వేషం నృపక్రోధం తథైవచ।
క్షేత్రార్థ పశునాశంచ దారపుత్రాది విగ్రహం॥
శిరోబాధా కుక్షిబాధా దేహజాడ్యం మనోరుజం।
చోరాగ్నివ్రణభీతిశ్చ శత్రుభీతి ర్మహద్భయం॥ 2

తా. మరియు సూర్యుడు షష్ఠాష్ట మవ్యయ స్థానములయందున్నను, తన నీచరాశియందుగాని లేక శత్రుక్షేత్రమునందుగాని యున్నను ఆభుక్తియందు స్థాననాశమును, దాయాది కలహమును, స్వంత బంధుజనులతోడ విరోధమును, రాజక్రోధమును, క్షేత్రనాశమును, అర్థనష్టమును, పశుహానియు, భార్యాపుత్రాది నాశమును, శిరోబాధయు, కుక్షిరోగమును, దేహజాడ్యమును, మనోదుఃఖమును, చోరభయమును, అగ్నిభీతియు, వ్రణబాధయు, శత్రుహింసయు, అధిక భయమును కలుగును.

శ్లో॥ పాపయుక్తే భవాదృష్టే పాపచింతా మహద్భయం।

దేహపీడా మనస్తాపం కార్యనాశం ధనక్షయం॥
రాజకార్య కలాపేన బంధుద్వేషం మనోరుజం ।
యత్నకార్య విఘాతశ్చ విదేశ గమనంతథా॥ 3

తా. సూర్యుడు పాపగ్రహయుక్తుడైనను లేక పాపగ్రహ వీక్షణ కలిగియున్నను, పాపకార్యములు చేయుటయందు చింతయు, గొప్పభయమును, దేహపీడయు, మనస్తాపమును, కార్యనాశమును, ధనక్షయమును, రాజకార్య మూలకముగా బంధుద్వేషమును, మనోవ్యాకులమును, యత్నకార్యవిఘ్నమును, విదేశగమనంబును కలుగచేయును.

శ్లో॥ లగ్నాధిపేన సంయుక్తే ఆదౌసౌఖ్యం ధనాగమం ।
అయత్నాదర్థహానిస్స్యా ద్వివాహం రాజదర్శనం॥ 4

తా. సూర్యుడు లగ్నాధిపతితో గూడియున్న కాలమందు ఆదిభాగమందు సౌఖ్యమును, ధనాగమమును, కలుగును. పిమ్మట అర్థహానియు, వివాహమును, రాజదర్శనమును కలుగచేయును.

శ్లో॥ భాగ్యాధిపేన సంయుక్తే భాగ్యవృద్ధి కరంశుభం।
సత్కర్మజ్ఞానసిద్ధిస్స్యా త్పురాణ శ్రవణాదికం॥ 5

తా. నవమాధిపతితో కూడియున్న సూర్యదశ భాగ్యవృద్ధిని, శుభమును కలుగచేయును. సత్కర్మఫలమును, జ్ఞానసిద్ధియు, పురాణశ్రవణమును కలుగును.

శ్లో॥ వాహనాధిప సంయుక్తే వాహనం భవతిధ్రువం ।
గృహక్షేత్రాది లాభశ్చ చతుష్పాజ్జీవ లాభకృత్॥ 6

తా. చతుర్థాధిపతితో కూడియున్న యెడల నిశ్చయముగా వాహనయోగము సిద్ధించును. గృహక్షేత్రాదిలాభమును, పశ్వాది జీవరాసుల అభివృద్ధియు కలుగును.



శ్లో॥ శశినా సంయుతేదృష్టే వస్త్రాభరణ సంగ్రహః।
మాతృబంధు విరోధశ్చ శిరోబాధా భవిష్యతి॥ 7

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను వస్త్రాభరణ సంగ్రహమును, మాతృవిరోధమును, బంధుద్వేషమును, శిరోబాధయు కలుగును.

శ్లో॥ కుజేన సంయుతేదృష్టే దాయాది రిపువృద్ధిదం ।
స్వదేహోదర బాధాచ చింతార్థస్య నాశనం॥ 8

తా. కుజునితో కలసినను లేక చూడబడినను జ్ఞాతులయొక్కయు, శత్రువులయొక్కయు అభివృద్ధియు, ఉదరబాధయు చింతించిన కార్యనాశనమును కలుగును.

శ్లో॥ సౌమ్యదృష్టియుతేవాపి విష్ణుపూజాది చింతనం।
ఉద్యోగసిద్ధి లాభంచ క్రయ విక్రయ కౌశలం॥ 9

తా. బుధునితో కలసినను లేక చూడబడినను విష్ణుపూజాది చింతయు, ఉద్యోగప్రాప్తియు, క్రయవిక్రయ నిపుణతయు కలుగును.

శ్లో॥ గురుణా సంయుతేదృష్టే పుత్రోత్పత్తి ర్భవిష్యతి ।
స్వగృహేశుభ కార్యాణి ధనధాన్యాది సంగ్రహం॥ 10

తా. గురునితో కలసినను లేక చూడబడినను పుత్రోత్పత్తి కలుగును. స్వగృహమునందు శుభకార్యములు జరుగును, ధనధాన్యాది సంగ్రహము కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతే దృష్టే వివాహస్త్రీ ప్రసూతికృత్ ।
వాహనం వస్తుసంప్రాప్తి రిష్టసిద్ధి సుఖాదికం॥ 11

తా. సూర్యుడు శుక్రునితో కలసినను లేక చూడబడినను, వివాహమును, స్త్రీప్రసవమును, వాహనలాభమును, వస్తుసంప్రాప్తియు, ఇష్టసిద్ధియు, సుఖాదికమును కలుగచేయును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే క్షేత్రగో కృషినాశనం।
స్వభృత్యా కలహంచైవ స్థాననాశం నృపాద్భయం ॥ 12

తా. భుక్తినాథుడగు సూర్యుడు శనితో కలసినను లేక చూడబడినను, క్షేత్రనాశమును, పశుహానియు, కృషినష్టమును, స్వంతభృత్యులతోడ కలహమును, స్థాననాశమును, రాజభయమును కలుగచేయును.

శ్లో॥ ద్వితీయ ద్యూనరాశిస్థే అపమృత్యు ర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం సూర్యప్రార్థన మాచరేత్ ।
రుద్రాభిషేచనంచైవ పశ్చాచ్ఛాంతి మవాప్నుయాత్ ।
రక్తధేను ప్రదాతవ్యం భవేదాయుష్యవర్ధనం ॥ 13

తా. భుక్తినాథుడగు సూర్యుడు ద్వితీయ సప్తమముల యందున్నయెడల అపమృత్యువు కలుగును, ఆదోషపరిహారార్థమై సూర్యప్రార్ధన చేయవలయును, రుద్రాభిషేకము చేసిన పిమ్మట శాంతికలుగును, ఎఱ్ఱనిఆవును ధానమిచ్చిన ఆయుర్వృద్ధి కలుగును.

---

రవిదశాయాం చంద్రభుక్తి మాసాః. 6.

పారాశర్యే ॥

శ్లో॥ సూర్యస్యాంత ర్గతేచంద్రే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
వివాహం శుభకార్యంచ ధనధాన్య సమృద్ధికృత్ ।
గృహక్షేత్రాభి వృద్ధిశ్చ పశువాహన సంభ్రమం ॥ 1

తా. రవిమహర్దశలో భుక్తినాథుడగు చంద్రుడు లగ్నమునకు కేంద్ర త్రికోణములయందున్నచో వివాహాది శుభకార్యములు జరుగుటయు, ధనధాన్యసమృద్ధియు, గృహలాభమును, క్షేత్రాభివృద్ధియు, పశులాభమును, వాహనసంభ్రమమును కలుగును.



శ్లో॥ తుంగస్వక్షేత్రగేవాపి దారసౌఖ్యం ధనాగమం ।
పుత్రలాభం శుభంచైవ సన్మానం భవతి ధృవం ।
మహారాజ ప్రసాదేన ఇష్టసిద్ధి స్సుఖాధికం ॥ 2

తా. భుక్తినాథుడగు చంద్రుడు ఉచ్చయందున్నను లేక స్వక్షేత్ర గతుడైనను కళత్ర సౌఖ్యమును, ధనాగమమును, పుత్రలాభమును, శుభమును, సన్మానమును, మహారాజానుగ్రహము వలన ఇష్టసిద్ధియు, సుఖమును కలుగును.

శ్లో॥ క్షీణేవా పాప సంయుక్తే దారపుత్రాది నాశనం।
వైషమ్య జననంవాదం భృత్యవర్గ వినాశనం ।
విరోధం రాజకలహం ధనధాన్య పశుక్షయం ॥ 3

తా. చంద్రుడు క్షీణుడైనను లేక పాపయుక్తుడైనను భార్యాపుత్రాది నాశనమును, ద్వేషమువల్ల గలిగిన వాదమును, భృత్యవర్గ వినాశమును, విరోధమును, రాజకలహమును, ధనధాన్య నాశమును, పశుక్షయమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే స్థాననాశం నృపాద్భయం ।
కలహం ధననాశంచ సంతాపం భవతిధృవం ॥ 4

తా. భుక్తినాథుడగు చంద్రుడు సూర్యునితో కలసినను లేక చూడబడినను, స్థాననాశమును, రాజభయమును, కలహమును, ధననాశమును, సంతాపమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే వ్రణశస్త్రాది బంధనం।
సమాన జనహానిశ్చ క్షేత్రనాశం తథైవచ ॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను వ్రణబాధయు, శస్త్రాదిపీడయు, సమాన జనహానియు, క్షేత్రనాశమును కలుగును.

శ్లో॥ సౌమ్యేన సంయుతేదృష్టే క్రయవిక్రయ కౌశలం ।
స్వబంధు జనసమ్మోదం యత్నకార్యార్థ సిద్ధికృత్ ॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను క్రయవిక్రయ కుశలతయు, స్వంతబంధుజనులయొక్క అనురాగమును, యత్నకార్యార్థ సిద్ధియు కలుగును.

శ్లో॥ గురుణా సంయుతేదృష్టే పుత్రక్షేత్రవి వృద్ధిదం ।
గర్భిణీ సంగమంచైవ ఇష్టసిద్ధిర్భవిష్యతి ॥ 7

తా. గురునితో కలసినను లేక చూడబడినను, పుత్రవృద్ధియు, క్షేత్రలాభమును, గర్భిణీస్త్రీసంగమంబును, ఇష్టసిద్ధియు కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతేదృష్టే విద్యాగోష్ఠి ర్ధనాగమం ।
క్షేత్రార్థ దారసంప్రాప్తిః పుత్రలాభం మహోత్సవం॥

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను విద్యాగోష్ఠియు, ధనాగమంబును, క్షేత్రార్థ లాభములును, కళత్రప్రాప్తియు, పుత్రలాభమును, మహోత్సవమును కలుగును.

శ్లో॥ శనినాభృత్య కలహం గోహానిక్షేత్రనాశనం ।
విదేశగమనంచైవ సర్వత్ర కలహంతథా ॥ 9

తా. భుక్తినాథుడగు చంద్రుడు శనితో కలిసియున్న యెడల సేవకులతో కలహమును, పశుహానియు, క్షేత్రనాశమును, విదేశగమనమును, ఎల్లచోట్లను కలహమును కలుగును.

శ్లో॥ షష్ఠాష్టమవ్యయేచంద్రే జలభీతి మనోరుజం ।
బంధనంరోగపీడాచ స్థానవిచ్ఛిత్తికారణం ।
మూత్రకృచ్ఛ్రం మనస్తాపం దాయాది జనవిద్వరం॥ 10

తా. చంద్రుడు లగ్నమునుండి ౬-౮-౧౨ స్థానములయందున్న యెడల జలభీతియు, మనోదుఃఖమును, బంధనప్రాప్తియు, రోగపీడయు, స్థానభ్రంశమునకు కారణమును, మూత్రకృచ్ఛ్ర రోగమును, మనస్తాపమును, దాయాదిజనుల నిష్ఠూరమును కలుగచేయును.



శ్లో॥ దాయేశభాగ్యలాభస్థే సౌమ్యస్యాపహృతంసుఖం ।
భాగ్యోత్తరం నృపాత్ప్రీతిం దారపుత్రాది వర్ధనం॥
రాజ్యప్రాప్తిర్మహోత్సాహం స్థానప్రాప్తించశాశ్వతం॥
వివాహాయజ్ఞ దీక్షాంచ యోగాంతే లభతేనరః॥
వాహనంబంధుభాగ్యంచ దేవతాదర్శనంమహత్ ॥ 11

తా. చంద్రుడు, దశానాథునకు నవమ, ఏకాదశస్థానములయందున్న యెడల ఆభుక్తియందు సుఖనాశమును, ఉత్తరోత్తరభాగ్యము, రాజప్రీతియు, భార్యాపుత్రాదిసౌఖ్యమును రాజ్యప్రాప్తియు, మహోత్సాహము, శాశ్వతస్థానలాభమును, వివాహమును, యజ్ఞదీక్షయు యోగాంతమునందు నరునకు లభించును. గాకను వాహనప్రాప్తియు, బంధుభాగ్యమును, దేవతాదర్శనమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రపుత్రస్థే చంద్రస్యాపహృతంధనం ।
తటాకగోపురాదీనాం పుణ్యకర్మాదిసంగ్రహం॥
రాజ్యప్రాప్తిర్మహోత్సాహం సత్కీర్తిర్వివిధానిచ ।
నీచశత్రువిహీనశ్చ మృద్వన్నాంబర భూషణం॥ 12

తా. చంద్రుడు దశానాథునకు కేంద్రములయందున్నను లేక పంచమస్థానమందున్నను ఆభుక్తియందు ధనము అపహరింపబడును. చెఱువులు, గోపురములు మొదలగువాటినిర్మాణముల చేత కలిగెడు పుణ్యకర్మఫలమును, రాజ్యప్రాప్తియు, మహోత్సాహమును, అనేకవిధములగు సత్కీర్తియు, నీచశత్రువినాశమును, మృదుఅన్నమును, వస్త్రభూషణప్రాప్తియు కలుగును.

శ్లో॥ దాయేశాద్రిపురంధ్రస్థే వ్యయేవాపాపసంయుతే ।
నిధనంకుత్సితాన్నంచ చోరాగ్ని నృపపీడనం ।
స్థానభ్రంశంమనోదుఃఖం దేహపీడాభయంక్వచిత్ ॥ 13

తా. భుక్తినాథుడగు చంద్రుడు దశానాథునకు ౬-౮-౧౨, స్థానములయందున్నను లేక పాపగ్రహముతో కూడియున్నను, ఆభుక్తియందు మరణమును, కుత్సితాన్న భోజనమును, చోరబాధయు, అగ్నిభయమును, రాజపీడయుకలుగును, స్థానభ్రంశమును, మనోధుఃఖమును, కొంచెము దేహపీడయు సంభవించును.

శ్లో॥ ద్వితీయ ద్యూనరాశిస్థే అపమృత్యు భయంభవేత్ ।
తద్దోషపరిహారార్థం దుర్గాదేవీ జపంచరేత్ ।
శ్వేతాంగాంవృషభందద్యా ద్దానమారోగ్యమాదిశేత్ ॥

తా. చంద్రుడు ద్వితీయసప్తమములయందున్న యెడల అపమృత్యువు కలుగును. ఆదోషపరిహారార్థమై దుర్గాదేవి జపమాచరించ వలయును, తెల్లనివృషభ దానమిచ్చుటవల్ల దేహారోగ్యము కలుగును.

---

రవిదశాయాం కుజభుక్తిమాసాః 4 దినాని 6.

శ్లో॥ సూర్యస్యాంతర్గతేభౌమే లగ్నాత్కేంద్రత్రికోణగే ।
స్వోచ్చస్వక్షేత్ర సంయుక్తే శుభకర్మశుభాధికం ।
భూలాభం కృషివృద్ధించ ధనధాన్యాది వర్ధనం ।
గృహక్షేత్రాది లాభంచ రక్తవస్త్రాదిలాభకృత్ ।
దారపుత్రాది సౌఖ్యంచ యుద్ధేజయ మవాప్నుయాత్ ।
ప్రవాళరత్నలాభంచ సుతజన్మోత్సవంతథా ॥ 1



తా. రవిదశలో భుక్తినాథుడగు కుజుడు లగ్నమునకు కేంద్ర త్రికోణములయందుగాని, ఉచ్చ స్వక్షేత్రములయందుగాని యున్నయెడల శుభకర్మలు చేయుటచేత కలిగెడు అధిక శుభమును, భూలాభమును, వ్యవసాయాభివృద్ధియు, ధనధాన్యాది లాభములును, గృహలాభమును, క్షేత్రలాభమును, రక్తవస్త్రాదిలాభమును, భార్యాపుత్రాది సౌఖ్యమును, యుద్ధమందు జయమును, ప్రవాళము, రత్నము మొదలగు వాటిలాభమును, పుత్రజన్మోత్సవమును కలుగును.

శ్లో॥ షష్ఠాష్టమవ్యయస్థేవా నీచక్షేత్రగతేపివా ।
తద్భుక్తౌ జ్ఞాతికలహం సమాన జననాశనం ।
దారపుత్ర వియోగంచ పశువాహన నాశనం ।
జ్వరాది వ్రణబాధాచ చోరాగ్ని నృపపీడనం ।
యత్నకార్య వినాశంచ స్వస్త్రీకలహమేవచ ।
రాజద్వేషం మనోదుఃఖం శతృవృద్ధిర్మహద్భయం ॥ 2

తా. కుజుడు ౬-౮-౧౨ స్థానముల యందున్నను, లేక నీచక్షేత్రగతుడైనను ఆభుక్తియందు జ్ఞాతికలహమును, సమాన జననాశమును, భార్యాపుత్ర వియోగమును, పశుహానియు, వాహనక్షయమును, జ్వరాదివ్రణబాధయు, చోరభయమును, అగ్నిభీతియు, రాజపీడయు, యత్నకార్య వినాశమును, స్వంతస్త్రీకలహమును, రాజద్వేషమును, మనోదుఃఖమును, శతృవృద్ధియు, గొప్పభయమును కలుగును.

శ్లో॥ పంచమాధిపయుక్తేవా భాగ్యవృద్ధి కరంశుభం ।
భాగ్యలాభాది సంయుక్తే లాభంచైవ భవిష్యతి ॥ 3

తా. పంచమాధిపతితో కలసినయెడల భాగ్యవృద్ధియు, శుభమును, కలుగును. భాగ్యలాభాధి పతులతో కలిసినయెడ

ల లాభముకలుగును.

శ్లో॥ రవిణా సంయుతేదృష్టే సంతాపం పితృనాశనం।
ఉద్యోగహానింకురుతే శత్రుబాధాం ధనక్షయం॥ 4

తా. భుక్తినాథుడగు కుజుడు సూర్యునితో కలసినను లేక చూడబడినను సంతాపమును, పితృనాశనమును, ఉద్యోగహానియు, శత్రుబాధయు, ధనక్షయమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టే సువస్త్రాభరణంతథా।
గృహేకల్యాణ శుభదం యత్నకార్యార్థసిద్ధిదం॥ 5

తా. చంద్రునితోకలసినను లేక చూడబడినను మంచి వస్త్రాభరణ ప్రాప్తియు, యింటియందు కల్యాణమును, శుభమును, యత్నకార్యార్థసిద్ధియు కలుగును.

శ్లో॥ సౌమ్యేనసంయుతేదృష్టే స్త్రీసౌఖ్యం బంధుపూజ్యతా।
విద్యాగోష్ఠి వాక్పటుత్వం శత్రువృద్ధిర్భవిష్యతి॥ 6

తా. బుధునితో కలిసినను లేక చూడబడినను, స్త్రీసౌఖ్యమును, బంధుపూజ్యతయు, విద్యాగోష్ఠియు, వాక్పటుత్వమును, శత్రువృద్ధియు కలుగును.

శ్లో॥ గురుయుక్తే థవాదృష్టే పుత్రపీడా ధనక్షయం।
స్వదేహతాప మాలస్యం మిత్రాదిషు సమత్వతా॥ 7

తా. గురువుతోకూడినను లేక చూడబడినను పుత్రపీడయు, ధనక్షయమును, స్వదేహతాపమును, ఆలస్యమును, మిత్రులతోడ సమత్వమును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే స్త్రీసౌఖ్యం బంధుపూజ్యతా।
విచిత్రగృహలాభంచ వివాహం పుత్రసంభవం॥ 8

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను స్త్రీసౌఖ్యమును, బంధుపూజ్యతయు, విచిత్ర గృహలాభమును,



వివాహమును, పుత్రలాభమును కలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే గర్భస్రావే శిశుక్షయం।
ఘాతపాతాదికలహం సమానజననాశనం॥ 9

తా. శనితో కలసినను లేక చూడబడినను గర్భస్రావమును, శిశుక్షయమును, ఘాతపాతాది కలహమును, సమానజననాశమును కలుగును.

శ్లో॥ దాయేశాద్రిపురంధ్రస్థే స్థానపశ్వాది నాశకృత్।
నిధనం కుత్సితాన్నంచ చోరాగ్ని నృపపీడనం।
కర్మాధిపేన సంయుక్తే కుజేకర్మాది నాశనం॥ 10

తా. దశానాథుడగు సూర్యునకు భుక్తినాథుడైన కుజుడు షష్ఠాష్టమ స్థానములయందున్నయెడల స్థాననాశమును, పశ్వాదినాశమును, మరణమును, కుత్సితాన్న భోజనమును, చోరబాధయు, అగ్నిభయమును, రాజపీడయు కలుగును. కర్మాధిపతితోగూడిన కుజుడు కర్మాదికార్యములకు నాశనము కలుగ చేయును.

శ్లో దాయేశాత్కేంద్రకోణస్థే పాపశ్చాప హృతంధనం।
అశుభం లభతేకర్మ స్థానభ్రంశం మనోరుజం।
గురుపుత్రాది దారాణాం తపోదాన వినాశనం॥ 11

తా. దశానాథునకు కేంద్రకోణములయందు కుజుడున్నయెడల పాపకార్యములచేత సంపాదింపబడిన ధనమును, అశుభ కర్మయును, స్థానభ్రంశమును, మనోవ్యాకులమును, గురువియోగమును, భార్యాపుత్రనాశమును, తపోహానియు కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రరాశిస్థే పాపశ్చాప హృతస్తథా।
కర్మనాశ మవాప్నోతి దుష్కీర్తిర్వివిధానిచ।
పాపకర్మరతోనిత్యం బంధుద్వేషం మనోరుజం॥ 12

తా. దశానాథునకు కేంద్రస్థానములయందు కుజుడున్నయెడల పాపధనమును, కర్మనాశమును, విధ విధములగు దుష్కీర్తియు, ఎల్లపుడు పాపకార్యములయం దాసక్తియు, బంధుద్వేషమును, మనోదుఃఖమును కలుగును.

శ్లో॥ దాయేశా ద్భాగ్యరాశిస్థే పాపశ్చాప హృతంధనం।
లభతే పుత్రమిత్రాది స్థానప్రాప్తించ శాశ్వతం।
నీచేవా పాపసంయుక్తే రాజమూలా ద్ధనవ్యయం॥ 13

తా. కుజుడు దశానాథునకు నవమ మందుండగా పాప ధనమును, పుత్రలాభమును, మిత్రసుఖమును శాశ్వతస్థాన ప్రాప్తియు, కలుగును, నీచునితో కలసినను లేక పాపగ్రహ యుక్తమైనను రాజమూలకముగా ధనవ్యయము కలుగును.

గ్రంథాంతరే॥ కృష్ణీయే॥

శ్లో॥ దాయేశాత్షష్టరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
భుక్త్యాదౌకష్టమాప్నోతి పశ్చాత్సౌఖ్యం భవిష్యతి।
అపూర్వవస్తు సంప్రాప్తిః ప్రవాళమణిసంగ్రహం।
యుద్ధేషు విజయంచైవ బహుద్రవ్యార్జితంతథా॥ 14

తా. దశానాథునకు భుక్తినాథుడు ౬-౮-౧౨. స్థానములయందున్నను లేక పాపగ్రహ యుతుండైనను ఆభుక్తి ఆదియందు కష్టమును, పిమ్మట సౌఖ్యమును కలుగును. అపూర్వ వస్తుసంప్రాప్తియు, ప్రవాళ మణిసంగ్రహమును, యుద్ధమునందు జయమును, విశేషద్రవ్యార్జనయు కలుగును.

శ్లో॥ ద్వితీయద్యూననాథేతు దేహజాడ్యం మనోరుజం।
సుబ్రహ్మణ్య జపంచైవ అనడ్వాహం తథైవచ।
దానంకుర్వీతవిధివత్ శాంతిమాప్నోత్య సంశయః॥ 15

తా. భుక్తినాథుడగు కుజుడు ద్వితీయ సప్తమముల



యందున్నయెడల దేహజాడ్యమును, మనోదుఃఖమును కలుగును. అందుకై సుబ్రహ్మణ్య జప మాచరించవలయును కుఱ్ఱి దూడను యథావిధిగా దానముచేసిన పిమ్మట నిస్సంశయముగా శాంతికలుగును.



రవిదశాయాం రాహుభుక్తి మాసాః 10 దినాని 24.

పారాశర్యే॥

శ్లో॥ సూర్యస్యాంత ర్గతేరాహౌ లగ్నాత్కేంద్ర త్రికోణగే।
ఆదౌద్విమాస పర్యంతం ధననాశం మహద్భయం॥
చోరాగ్నినృపభీతిశ్చ దారపుత్రాది పీడనం।
తత్ఫలం సమవాప్నోతి శుభయుక్తే శుభాంశగే।
దేహారోగ్యం మహత్సౌఖ్యం రాజప్రీతి కరంశుభం॥ 1

తా. సూర్యదశలో భుక్తినాథుడగు రాహువు లగ్నమునకు కేంద్ర త్రికోణములయందున్నయెడల ఆదియందు రెండుమాసముల వరకు ధననాశమును, విశేష భయమును, చోరబాధయును, అగ్నిభయమును, రాజభీతియును, భార్యాపుత్రులయొక్క పీడయును కలుగచేయును. రాహువు శుభగ్రహములతోకూడియున్నను లేక శుభాంశను పొందియున్నను దేహారోగ్యమును, విశేషసౌఖ్యమును, రాజప్రీతియు శుభమును కలుగును.

శ్లో॥ లగ్నాదుపచయే రాహౌ శుభయుక్తేథ వీక్షితే।
భాగ్యవృద్ధి ర్యశోలాభం దారపుత్ర వివర్ధనం।
పుత్రోత్సవాదిసంతోషం గృహేకళ్యాణ సంభ్రమం॥

తా. లగ్నమునకు ఉపచయ స్థానములయందు రాహువు శుభగ్రహముతో కూడియున్నను లేక వీక్షణ కలిగి

యున్నను, భాగ్యవృద్ధియు, యశోలాభమును, భార్య పుత్రాభి వృద్ధియును, పుత్రోత్సవాది సంతోషమును, యింటియందు కళ్యాణాది సంభ్రమంబును కలుగును.

శ్లో॥ షష్ఠాష్ట మవ్యయోరాహౌ పాపయుక్తేథ వీక్షితే।
బంధనం స్థాననాశంచ కారాగృహ నివేశనం।
చోరాగ్ని వ్రణభీతిశ్చ దారపుత్రాది పీడనం।
చతుష్పాజ్జీవనాశశ్చ గృహక్షేత్రాది నాశనం।
ఉన్నతాత్పతనంచైవ శూద్రప్రభు వశాద్భయం॥ 3

తా. లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయందున్న రాహువు పాపగ్రహయుక్తుడైనను లేక వీక్షణకలిగియున్నను, బంధనప్రాప్తియు, స్థాననాశమును, కారాగృహ ప్రవేశమును, చోరభయమును, అగ్నిభీతియు, వ్రణబాధయు, భార్యాపుత్రాది పీడనయు, పశ్వాదులయొక్క నాశమును, గృహక్షేత్రాది నాశమును, ఉన్నతస్థలము నుండి పడుటయు, శూద్రప్రభు మూలకముగా భయమును కలుగును.

శ్లో॥ రవిణా సంయుతేదృష్టే కలహం స్థాననాశనం।
మతిభ్రంశం మానభంగ మధికారంచ నాశనం॥ 4

తా. రవితో కలసినను లేక చూడబడినను కలహమును, స్థాననాశమును, బుద్ధిభ్రంశమును, మానభంగమును, అధికార నాశమును కలుగును.

శ్లో॥ చంద్రేణ సంయుతేదృష్టే స్వస్త్రీ కలహమేవచ।
శిరోక్షి కుక్షిబాధాచ బంధునాశం తథైవచ॥ 5

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను స్వంత స్త్రీకలహమును, శిరోబాధయు, నేత్రరోగమును, కుక్షిబాధయు, బంధునాశమును కలుగును.



శ్లో॥ కుజేన సంయుతేదృష్టే జ్వరస్ఫోట వ్రణాదికం।
దాయాది కలహంచైవ సమరే ప్రాణహానిదం॥ 6

తా. కుజునితో కలిసినను లేక చూడబడినను, జ్వర బాధయు, స్ఫోటవ్రణాది పీడయు, దాయాది కలహమును, యుద్ధమందు ప్రాణహానియు కలుగును.

శ్లో॥ సౌమ్యేన సంయుతేదృష్టే భుక్త్యాదౌ కష్టమాప్నుయాత్।
రాజసన్మాన కీర్తిశ్చ గృహేకళ్యాణ వైభవం॥ 7

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, భుక్తి ఆదియందు కష్టమును, రాజసన్మానమును, కీర్తియు, యింటి యందు కళ్యాణవైభవమును కలుగును.

శ్లో॥ గురుణా సంయుతేదృష్టే సుహృత్కలహమేవచ।
ద్విజాతి కలహంచైవ పత్నీగర్భ వినాశనం॥ 8

తా. గురునితో కలసిన లేక చూడబడినను, మిత్రులతో కలహమును, బ్రాహ్మణులతో కలహమును, పత్నీగర్భవినాశమును కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతేదృష్టే వాహనాంబరసౌఖ్యదం।
స్త్రీపుత్రమిత్ర బంధూనాం సౌఖ్యం భవతిలాలనం॥ 9

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, వాహన లాభమును, వస్త్రప్రాప్తియు, సౌఖ్యమును, భార్యాపుత్రుల సుఖమును, స్నేహసౌఖ్యమును, బంధుసుఖమును కలుగును.

శ్లో॥ మందదృష్టి యుతేవాపి నీచస్త్రీ సంగమం తథా।
నీచసేవా మహత్కష్టం పశుక్షేత్ర వినాశనం॥ 10

తా. శనితో కలసినను లేక చూడబడినను నీచస్త్రీ సంగమంబును, నీచజన సేవయు, గొప్పకష్టమును, పశుక్షేత్రాది నాశనమును కలుగును.

శ్లో॥ దాయేశాద్రి పురంధ్రస్థే వ్యయేవా పాపసంయుతే।
నృపచోరాగ్ని భీతిశ్చ జ్వరాది భయమీదృశం।
గుల్మక్షయాది రోగశ్చ అతిసారాది పీడనం।
మరణం విషభీతిశ్చ స్థానచ్యుతి మనోవ్యథా॥ 11

తా. దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను లేక పాపగ్రహ యుక్తుడైనను, రాజబాధయు, చోరభయమును, అగ్నిభీతియు, జ్వరాది రోగభయమును, గుల్మక్షయాది రోగబాధయు, అతిసారాది పీడనయు, మరణమును, విషభీతియు, స్థాననాశమును, మనోవ్యథయును కలుగును.

కృష్ణిర్యే॥

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యే లాభగేపివా।
తద్భుక్తౌ రాజసన్మానం బంధుకళ్యాణ మేవచ।
ధనధాన్య వివృద్ధిశ్చ పశుక్షేత్రాది సంగ్రహం।
విజయంకీర్తి మారోగ్యం పుత్రికా జననంతథా॥ 12

తా. దశానాథునకు కేంద్రత్రికోణముల యందున్నను లేక తృతీయ లాభములయందున్నను, ఆభుక్తియందు రాజసన్మానమును, బంధు కళ్యాణమును, ధనధాన్యాభివృద్ధియు, పశుక్షేత్రాది సంగ్రహమును, జయమును, కీర్తియు, ఆరోగ్యమును, పుత్రికా జననమును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
చోరాది విషభీతిశ్చ స్థాననాశం మనోవ్యథా।
బంధుద్వేషం పుత్రహానిః ఆత్మబంధు వినాశనం।
యత్నకార్య వినాశశ్చ స్థానచ్యుతిర సంశయః॥ 13

తా. రాహువు దశానాథునకు, ౬-౮-౧౨. స్థానముల యందున్నను లేక పాపగ్రహ యుక్తుడైనను, ఆభుక్తియందు



చోరాది విషభీతియు, స్థాననాశమును, మనోవ్యథయును, బంధుద్వేషమును, పుత్రహానియు, స్వబంధు వినాశమును, యత్నకార్యభంగమును, ఉద్యోగనాశనమును కలిగించును.

శ్లో॥ ద్విసప్త మస్థితేరాహు రస్థానాధిప సంయుతే।
అపమృత్యు భయంచైవ సర్పభీతిశ్చ సంభవేత్।
దుర్గాజపంతు కుర్వీత ఛాగదానం సమాచరేత్।
కృష్ణాంగాంమహిషీందద్యా చ్ఛాంతిమాప్నోత్యసంశయం॥

తా. రాహువు ద్వితీయ సప్తమములయందున్నను, లేక ఆస్థానాధిపతులతో కలసినను అపమృత్యుభయము కలుగును. సర్పభీతియు సంభవించును. అందుకై దుర్గాజపమాచరించి ఛాగదానము చేయవలయును. గాకను నల్లని మహిష దాన మిచ్చినపిమ్మట నిస్సంశయముగా శాంతికలుగును.

---

రవిదశాయాం గురుభుక్తి మాసాః 9 దినాని 18.

శ్లో॥ సూర్యస్యాం తర్గతేజీవే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
ఉచ్చస్వక్షేత్ర లాభస్థే మిత్రక్షేత్ర గతేపివా।
దాయేశే బలసంయుక్తే వివాహం రాజదర్శనం।
ధనధాన్యాది లాభంచ పుత్రలాభం మహాత్సుఖం।
మహారాజ ప్రసాదేన ఇష్టకార్యార్థ లాభకృత్।
రాజసన్మాన కీర్తించ లోకానుగ్రహ వైభవం।
ధనలాభం మహత్సౌఖ్యం ధర్మసిద్ధి కరంశుభం।
స్వగృహే చోత్సవంచైవ విద్యాభ్యాసాది కౌశలం।
దేవతాగురుభక్తిశ్చ పుణ్యతీర్థావ గాహనం।
భాగ్యకర్మాధిపవశా ద్రాజ్యలాభం మహోత్సవం।
పుత్రలాభం ప్రకుర్వీత ఇష్టసిద్ధిం సుఖాధికం॥

తా. సూర్యదశలో భుక్తినాథుడగు గురు లగ్నమునకు కేంద్రత్రికోణములయం దున్నను, ఉచ్చక్షేత్ర గతుడైనను, స్వక్షేత్ర లాభములయందున్నను, మిత్రక్షేత్రమందున్నను, వివాహమును, రాజదర్శనమును, ధనధాన్యాది లాభమును, పుత్రలాభమును, విశేషసౌఖ్యమును, మహారాజానుగ్రహము వల్ల ఇష్టకార్యసిద్ధియు, రాజసన్మానమును, కీర్తియు, జనానురాగ వైభవమును, ధనలాభమును, మహాసౌఖ్యమును, ధర్మసిద్ధియు, శుభమును, యింటియందు ఉత్సవాదులును, విద్యాభ్యాసాది కుశలత్వమును, దేవతాపూజయు, గురుభక్తియు, పుణ్యతీర్థాది స్నానమును లభించును. భాగ్యకర్మాధి పతుతుల వల్ల రాజ్యలాభమును, మహోత్సవమును కలుగును. గాకను పుత్రలాభమును, ఇష్టసిద్ధియు, అధిక సుఖమును కలుగును.

శ్లో॥ పాపగ్రహ సమాయుక్తే పాపకర్మ రత స్తథా।
పాపమూలా ద్ధనంనాశం దేశభ్రష్టం మనోరుజం॥ 2

తా. భుక్తినాథుడు పాపగ్రహముతో కూడియున్న యెడల జాతకుడు పాపకర్మములు చేయువాడగును. పాపమూలకముగా ధననాశమును, దేశభ్రష్టత్వమును, మనోవ్యాకులమును కలుగును.

శ్లో॥ నీచేవా స్తం గతేవాపి ధననాశం మనోరుజం।
రాజకోపం ప్రకుర్వీత ఇష్టబంధు వినాశనం॥ 3

తా. భుక్తినాథుడగు గురువు నీచుడైనను లేక అస్తంగతుడైనను ఆభుక్తియందు ధననాశమును, మనోక్లేశమును, రాజకోపమును, ఇష్టబంధు వినాశమును కలుగును.

శ్లో॥ దాయేశ శుభయుక్తేన దేవతారాధన ప్రియః॥
గురుభక్తి ర్మంత్రసిద్ధిః వాహనం భవతిధ్రువం॥ 4



తా. భుక్తినాథుడు శుభయుక్తుడైనయెడల దేవతారాధనయు, గురుభక్తియు, మంత్రసిద్ధియు, వాహనలాభమును నిశ్చయముగా కలుగును.

శ్లో॥ దాయేశా ల్లాభయుక్తస్య సౌమ్యభుక్తే ర్మహద్భయం॥
శత్రునాశంమహోత్సాహం గృహక్షేత్రాదివృద్ధికృత్॥

తా. దశానాథునకు లాభస్థానమందు గురువున్నయెడల అధికభయమును, శత్రునాశమును, మహోత్సాహమును, గృహలాభమును, క్షేత్రవృద్ధియు కలుగును.

శ్లో॥ దాయేశాద్రిపు దుస్థస్థే పాపయుక్తేగ్ని జంభయం।
దారసౌఖ్యం మహద్భాగ్యం భోజనాంబర భూషణం।
భుక్త్యాదా శోభనంప్రోక్తం మహత్సౌఖ్యం వినిర్దిశేత్।
అంతేక్లేశ కరంచైవ దేహపీడా మథాపివా॥ 6

తా. గురువు దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను లేక పాపులతోగలసినను, ఆభుక్తియందు అగ్నిభయమును, భార్యాసౌఖ్యమును, విశేషభాగ్యమును, సుఖభోజనమును, వస్త్రప్రాప్తియు, భూషణలాభమును కలుగును. భుక్తి ఆదియందు శోభనమును, గొప్పసౌఖ్యమును, అంత్యయందు దుఃఖకరమును దేహపీడయు కలుగును.

కృష్ణిర్యో॥

శ్లో॥ లగ్నాత్షష్ఠే వ్యయేరంధ్రే నీచేవా పాపసంయుతే।
తద్భుక్తౌ రాజకలహం సుతదారాది నాశనం।
దేహబాధా మనస్తాపం పశువాహన నాశనం।
అర్థవ్యయం స్థాననాశం ఆప్తబంధు వినాశనం।
గర్భిణీ శిశునాశశ్చ సర్వత్ర కలహా స్తథా।
మాతామహా కులేనష్టం అతిమిత్రేతికష్టం॥ 7

తా. భుక్తినాథుడగు గురువు జాతకుని లగ్నమునకు షష్ఠాష్టమ వ్యయములయందున్నను లేక తన నీచరాశియం దున్నను అథవా పాపగ్రహసంబంధము కలిగి యున్నను, ఆ భుక్తియందు రాజకలహమును, భార్యాపుత్రాది నాశనమును, దేహబాధయు, మనస్తాపమును, పశుహానియు, వాహననాశ మును, ధనవ్యయమును, మనస్తాపమును, ఆప్తబంధు వినాశము ను, గర్భిణీ శిశునాశమును, సగ్వ్యలతోడను కలహమును, మా తామహ కులనష్టమును, అధిమిత్రులు శత్రులగుటయు సంభ వించును.

శ్లో॥ రవిణా సంయుతేదృష్టే నృపక్రోధం భవిష్యతి।
ఉద్యోగభంగమాలస్యం శిరోరోగం తథైవచ॥ 8

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను రాజ క్రోధమును, ఉద్యోగభంగమును, దేహాలస్యమును శిరోరోగ మును సంభవించును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టే భూషణాంబర సంగ్రహం।
మృష్టాన్నపాన కుసుమం శయ్యా సౌఖ్యాది రేవచ॥ 9

తా. చంద్రునితోకలసినను లేక చూడబడినను, భూష ణ సంగ్రహమును, వస్త్రప్రాప్తియు, మృష్టాన్న పానాదులును, పుష్పశయ్యాది సౌఖ్యములును కలుగును.

శ్లో॥ భౌమేన సంయుతేదృష్టే స్త్రీపుత్ర క్షేత్రనాశనం।
యత్నకార్య వినాశశ్చ సర్వత్ర కలహంతథా॥ 10

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, భార్యా పుత్రుల నాశమును, క్షేత్రహానియు, యత్నకార్య వినాశ మును, ఎల్లచోట్లను కలహమును కలుగును.

శ్లో॥ సౌమ్యదృష్టి యుతేవాపి వేదశాస్త్రాది పాఠకః।



దేవతారాధనం చైవ గర్భోత్పత్తిర్నసంశయః॥ 11

తా. బుధునితో కలసినను లేక చూడబడినను వేదశా స్త్రాది పాఠమును, దేవతారాధనయు, గర్భోత్పత్తియు నిశ్చ యముగా కలుగును.

శ్లో॥ భృగుదృష్టి యుతేవాపి విటగాయక సంకులం।
గానవిద్యాది కౌశల్యం సు వస్త్రాభరణాయుతం॥ 12

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, నట గాయకుల సంకలనమును, గాన విద్యాదికుశలత్వమును, మంచి వస్త్రాభరణ ప్రాప్తియు కలుగును.

శ్లో॥ శనినా సంయుతేదృష్టే కృషిక్షేత్ర వినాశనం।
భృత్యవర్గాది కలహం నీచసేవా భవిష్యతి॥ 13

తా. శనితో కలసినను లేక చూడబడినను వ్యవసాయ నష్టమును, క్షేత్రనాశనమును, తన సేవకులతోడ కలహమును నీచసేవయు సంభవించును.

శ్లో॥ దాయేశా త్కేంద్రకోణేవా దుశ్చిక్యే లాభగేపివా।
తద్భుక్తౌ ద్రవ్యలాభశ్చ రాజప్రీతి మహోత్సవం।
ధనధాన్య వివృద్ధిశ్చ పుత్రలాభం సుహత్సుఖం।
యత్నకార్యార్థ సిద్ధిశ్చ తీర్థయాత్రా ఫలంవదేత్॥ 14

తా. గురువు దశానాథునకు కేంద్ర కోణములయందు న్నను, తృతీయలాభముల యందున్నను, ఆభుక్తియందు ద్రవ్య లాభమును, రాజప్రీతియు, మహోత్సవమును, ధనధాన్యాభి వృద్ధియు, పుత్ర లాభమును, విశేష సౌఖ్యమును, యత్న కా ర్యార్థసిద్ధియు, తీర్థయాత్రాఫలమును కలుగును.

గ్రంథాంతరే॥

శ్లో॥ దాయేశా త్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।

తద్భుక్తౌ దేహబాధాచ పుత్రనాశం ధనక్షయం ।
బుద్ధిభ్రంశం మానభంగం అతికష్ట దరిద్రతా।
సర్వత్ర కలహంచైవ కృషిధాన్య వినాశనం ॥ 15

తా. దశానాథునకు ౬-౮-౧౨ స్థానములయందున్నను లేక పాపగ్రహయుతుడైనను, ఆభుక్తియందు దేహబాధయు, పుత్రనాశమును, ధనక్షయమును, బుద్ధిభ్రంశమును, మానభంగమును, అధికకష్టమును, దారిద్రమును, ఎల్లచోట్లను కలహమును, వ్యవసాయనష్టమును, ధాన్యవినాశమును కలుగును.

శ్లో॥ ద్వితీయద్యూన రాశిస్థే అపమృత్యు ర్భవిష్యతి ।
తద్దోషపరిహారార్థం రుద్రజపవ్రతంచరేత్ ।
స్వర్ణదానం ప్రకుర్వీత దానం విధ్యుక్తమాచరేత్ ।
పశ్చాత్సౌఖ్య మవాప్నోతి ఇష్టసిద్ధి ర్భవిష్యతి ॥ 16

తా. భుక్తినాథుడగు గురువు ద్వితీయసప్తమములయందున్నయెడల అపమృత్యువు సంభవించును, ఆదోషపరిహారార్థమై రుద్రజప మాచరించవలయును, సువర్ణదానము యథావిధిగానిచ్చిన పిమ్మట దేహసౌఖ్యమును, ఇష్టసిద్ధియు కలుగును.

---

రవిదశాయాం శనిభుక్తిమాసాః 11 దినాని 12.

శ్లో॥ రవే రంతర్గతేమందే లగ్నాత్కేంద్ర త్రికోణగే ।
తృతీయే లాభగేవాపి తుంగరాశి స్థితేపివా।
తద్భుక్తౌ కార్యసిద్ధిశ్చ వ్యవహారే ధనాగమం ।
గృహేకళ్యాణ సంపత్తిః బంధుసన్మాన మేవచ ।
సమాన జనమిత్రత్వం మిత్రవర్గ వివృద్ధిదం ।
నీలవస్తూని సంప్రాప్తిః గజమాహిష సంకులం ।
యత్నకార్య సు సిద్ధిశ్చ గృహారంభణం తథా ।
నానామూలాద్ధనప్రాప్తిః నృపమూలాన్మహత్సుఖం॥ 1



తా. సూర్యదశలో భుక్తినాథుడగు శని జాతకుని జన్మ లగ్నమునకు కేంద్రకోణములయందున్నను, తృతీయ లాభముల యందున్నను, లేక తనఉచ్చరాశియందున్నను ఆభుక్తియందు కార్య సిద్ధియును, వ్యవహార మూలకముగా ధనాగమమును, యింటియందు కళ్యాణమును, సంపదయు, బంధుసన్మానమును, సమానజనస్నేహమును, స్నేహితుల కభివృద్ధియు, నీలవస్తుసంప్రాప్తియు, ఏనుగులు, గేదెలు మొదలగువాని సంకులమును, యత్నకార్యసిద్ధియు, గృహనిర్మాణమును, నానామూలకముగా ధనప్రాప్తియు, రాజమూలకముగా గొప్పసుఖమును కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్ట రాశిస్థే వ్యయేవా నీచరాశిగే।
తద్భుక్తౌ దేహనాశశ్చ చింతావ్యాధి ర్భవిష్యతి ।
నీచసంసర్గ కలహం స్థాననాశం నృపాద్భయం ।
ఆప్తబంధు వినాశశ్చ సమాన జననాశనం ।
దాయాది కలహంచైవ పశుహాని ర్భవిష్యతి ।
యత్నకార్య వినాశశ్చ సర్వత్ర కలహంతథా ।
భుక్త్యాదౌ త్రీణిమాసాః అత్యంతం కష్టసంభవం ॥ 2

తా. శనిలగ్నమునకు ౬-౮-౧౨ రాసులయందున్నను, లేక తన నీచరాశియందున్నను ఆభుక్తియందు దేహనాశమును, మనోవ్యాకులమును, వ్యాధిబాధయు, నీచజనులతోడ కలహమును, స్థాననాశమును, రాజభయమును, ఆప్తబంధు వినాశమును, సమానజననాశనమును, దాయాదికలహమును, పశుహానియు, యత్నకార్య వినాశమును, సర్వులతోడను కలహమును, కలుగచేయును, ఈభుక్తి ఆదియందు మూడు మాసములు అత్యంతకష్టము సంభవించును.

శ్లో॥ పాపదృష్టి యుతేమందే రాజద్వారే విరోధకృత్ ।

బంధనం ప్రాణహానిశ్చ అకస్మాత్కలహంతథా ।
వాతశూల మహావ్యాధిః జ్వరాతీసార పీడనం ॥ 3

తా. శని పాపగ్రహములతో కూడియున్నను లేక వీక్షణ కలిగియున్నను రాజ మూలకముగా విరోధమును, బంధనప్రాప్తియు, ప్రాణ హానియు, నిష్కారణముగా కలహమును వాత శూల రోగములును, మహావ్యాధియు, జ్వరమును, అతిసారాది రోగపీడయు కలుగును.

శ్లో॥ రవిణా సంయుతేదృష్టే నృపక్రోధం భవిష్యతి ।
ఉద్యోగ భంగమాలస్యం పితృవర్గ వినాశనం॥ 4

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను రాజ క్రోధమును, ఉద్యోగ భంగమును, ఆలస్యమును, పితృవర్గపు వారికి నాశనమును కలుగును.

శ్లో॥ శనినా సంయుతే దృష్టే మనోవ్యాధి ర్భవిష్యతి ।
శిరోబాధా కుక్షిబాధా సర్వత్ర కలహంతథా ॥ 5

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను మనో వ్యాధియు, శిరోబాధయు, కుక్షిబాధయు, సర్వులతోడను కలహమును సంభవించును.

శ్లో॥ భౌమేనసంయుతే దృష్టేభ్రాతృభిః కలహంతథా ।
యుద్ధే ష్వపజయంచైవ మహావ్యాధి ర్భవిష్యతి ॥ 6

తా కుజునితో కలసినను లేక చూడబడినను భ్రాతృవులతోడ కలహమును, యుద్ధమునందు అపజయమును, గొప్ప వ్యాధియును సంభవించును.

శ్లో॥ సౌమ్యేన వేదశాస్త్రాదిశిక్షాజ్ఞానంచ సంగ్రహం।
బాంధవాది సమాయుక్తం స్వగృహేచోత్సవంతథా ॥

తా. బుధునితో కలసినను లేక చూడబడినను వేదశా



స్త్రాదిశిక్షయు, జ్ఞానవృద్ధియు, బంధు సమాగమంబును, యింటియందు ఉత్సవమును కలుగును.

శ్లో॥ గురుణా సంయుతే దృష్టే పుత్రనాశం ధనక్షయం ।
దేహతాపం బంధునాశం బుద్ధిభ్రంశం భవిష్యతి ॥ 8

తా. గురువుతో కలసినను లేక చూడబడినను పుత్ర నాశమును,ధనక్షయమును, దేహతాపమును, బంధునాశమును, బుద్ధిభ్రంశమును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టేస్త్రీసౌఖ్యం వస్త్రసంగ్రహం।
వాహనం భూషణప్రాప్తిః స్త్రీప్రభోస్తుసుసేవనం ॥ 9

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను స్త్రీసౌఖ్యమును, వస్త్రసంగ్రహమును, వాహనలాభమును, భూషణ ప్రాప్తియు, స్త్రీప్రభువుయొక్క సేవయు కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యే లాభగేపివా।
ధనధాన్యవివృద్ధిశ్చ కృషిక్షేత్రాది సంగ్రహం।
వాహనం బంధు సంప్రాప్తిః కళ్యాణాదిమహోత్సవం ॥

తా. దశానాథునకు కేంద్ర కోణముల యందుగాని తృతీయ లాభముల యందుగాని శనియున్నయెడల ధనధాన్య వృద్ధియు, కృషిలాభమును, క్షేత్రాదిసంగ్రహమును, వాహనలాభమును, బంధుసంప్రాప్తియు, కళ్యాణాదిమహోత్సవములును జరుగును.

గ్రంథాంతరే ॥

శ్లో॥ దాయేశాత్కేంద్ర కోణస్థే పాపయుక్తే మహద్భయం।
గజాశ్వనాశం పశుధాన్యనాశం స్వబంధు రత్నాంబర
భ్రాతృనాశం । జ్వరాతిసారం ఖలుమూత్ర :కృచ్ఛ్రం
కళత్రనాశంచ భవేన్నరాణాం ॥ 11

తా. భుక్తినాథుడగు శని దశానాథునకు కేంద్రకోణములయందున్నను లేక పాపయుక్తుండైనను ఆభుక్తియందు గొప్పభయమును, ఏనుగులు, గుఱ్ఱములు మొదలగువాని నాశమును, పశుహానియు, ధాన్యనాశమును, బంధుపీడయు, రత్నములు, వస్త్రములు మొదలగు వస్తునాశమును, భ్రాతృనాశమును, జ్వరబాధయు, అతిసారరోగమును, మూత్రకృచ్ఛ్రవ్యాధియు, కళత్రనాశమును, కలుగచేయును.

శ్లో॥ దాయేశాద్రి పురంధ్రస్థే వ్యయేవా పాప సంయుతే ।
నిధనంబంధనం భీతిః దారపుత్రాది నాశనం ॥ 12

తా. శని దశానాథునకు౬-౮-౧౨ స్థానములయందున్నను, లేక పాపులతో కలసియున్నను, మరణమును, బంధనప్రాప్తియు, భయమును, భార్యాపుత్రాది నాశనమును కలుగును.

శ్లో॥ దాయేశాద్రిపురంధ్రస్థే వ్యయేవా శుభ సంయుతే ।
భుక్త్యాదౌ శోభనం ప్రోక్తం అంతేక్లేశ కరంధ్రువం ॥

తా. దశానాథునకు ౬-౮-౧౨ స్థానములయం దున్నను లేక శుభగ్రహయుక్తుడైనను భుక్తిఆదియందు శుభమును అంత్యయందు దుఃఖమును సంభవించును.

శ్లో॥ దాయేశాల్లాభగేమందే పాప భుక్తిర్మహద్భయం ।
దారపుత్రసుఖప్రాప్తిః ధనధాన్యాంబరాప్తికృత్ ।
రాజమూలాద్ధననష్టం విదేశేచ ధనాగమం ॥ 14

తా. దశానాథునకు లాభస్థానమందు శనియుండగా గొప్పభయమును. భార్యాపుత్ర సుఖమును, ధనధాన్యలాభమును, వస్త్రప్రాప్తియు, రాజమూలకముగా ధననష్టమును, రదేశములనుండి ధనాగమంబును కలుగును.

॥ ద్వితీయద్యూననాథేతు అపమృత్యు భయావహం।



కృష్ణాంగాంమహిషీందద్యా ద్దానే నారోగ్య మావిశత్।
మృత్యుంజయ జపంచైవ శాంతింకుర్యాద్యథావిధి।
ఛాగదానమితిప్రోక్త మపమృత్యు నివారణం।
పశ్చాత్సౌఖ్యమవాప్నోతి ఇష్టసిద్ధిర్భవిష్యతి॥ 15

తా. ద్వితీయ సప్తమములయందు శనియున్నయెడల అపమృత్యుభయము కలుగును. నల్లని మహిషదానము చేయుటవల్ల ఆరోగ్యము కలుగును. మృత్యుంజయ జపమును యథావిధిగా శాంతియును, ఛాగదానమును చేయుటవల్ల అపమృత్యునివారణ యగును. అటుపిమ్మట సౌఖ్యమును, ఇష్టసిద్ధిని కలుగును.

---

రవిదశాయాం బుధభుక్తి మాసాః 10 దినాని 6

శ్లో॥ సూర్యస్యాంతర్గతే సౌమ్యే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయలాభగేవాపి ఉచ్ఛేవాశుభ సంయుతే।
తద్భుక్తౌరాజసన్మానం పుత్రదారాది సంగ్రహం।
సమానజనవిశ్వాసం బంధూనా ముపకారకం।
వాక్పటుత్వం మనోధైర్యం వస్త్రభూషణ సంగ్రహం।
దేవతాగురుభక్తిశ్చ పితృమాతృషు పూజనం।
మహారాజప్రసాదేన యిష్టసిద్ధిర్భవిష్యతి।
అపూర్వవస్తుసంప్రాప్తిః వజ్రమాణిక్య సంగ్రహం॥ 1

తా. సూర్యదశలో భుక్తినాథుడగు బుధుడు లగ్నమునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయలాభములయందున్నను, తన ఉచ్ఛరాశియందున్నను లేక శుభగ్రహయుక్తుడైనను ఆభుక్తియందు రాజసన్మానమును, భార్యాపుత్రాది సంగ్రహంబును, సమానజనప్రీతియు, బంధుయుపకారమును, వాక్పటుత్వమును, మనోధైర్యమును, వస్త్రలాభ

మును, భూషణసంగ్రహమును, దేవతాపూజయు, గురుభక్తియు మాతాపితృసేవయు, మహారాజానుగ్రహమువల్ల యిష్టసిద్ధియు అపూర్వ వస్తుసంప్రాప్తియు, వజ్రమాణిక్య సంగ్రహమును, కలుగును.

గ్రంథాంతరే॥

శ్లో॥ స్వక్షేత్ర స్వాంశగే సౌమ్యే తుంగే వా కేంద్రగేపివా ।
రాజ్యలాభం మహోత్సాహం దారపుత్రాదిసౌఖ్యతాం।
పుణ్యతీర్థ ఫలప్రాప్తిః గృహేగో ధనసంకులం । 2

తా. బుధుడు స్వక్షేత్రమందుగాని, స్వ నవాంశమునందుగాని లేక తనయుచ్ఛయందుగాని అథవా కేంద్రములయందుగాని యున్నయెడల రాజ్యలాభమును, మహోత్సాహమును, భార్యాపుత్రాది సౌఖ్యమును, పుణ్యతీర్థ ఫలప్రాప్తియు,యింటియందు పశ్వాభివృద్ధియు ధనసంకులమును కలుగచేయును.

శ్లో॥ భాగ్యలాభాదిపేయుక్తే లాభవృద్ధికరోభవేత్ ।
భూషణాంబరపశ్వాది వాహనం ఛత్రసంయుతం ॥ 3

తా. శని భాగ్యలాభాధిపతులతో కలసినయెడల లాభవృద్ధి కలుగును; గాకను భూషణప్రాప్తియు, వస్త్రలాభమును, ఛత్రసహితముగా పశ్వాదివాహనయోగమునుకలుగచేయును.

శ్లో॥ భాగ్యే పంచమరాశిస్థే సన్మానం భవతిధ్రువం ।
స్వకర్మధర్మవృద్ధిస్స్యాత్ గురుదేవతార్చనంసుఖం॥ 4

తా. నవమ పంచమ రాసులయందు శనియున్నయెడల సన్మానమును, తనకులాచార ధర్మాభివృద్ధియు, గురుభక్తియు, దేవతార్చనపుణ్యమును, సుఖమును కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాంత్యరాశిస్థే అష్టమేనీచగేపివా ।
కలహం దేహబాధాచ బంధుపుత్రవినాశనం ।



కారాగృహ ప్రవేశంచ నిగళం బంధనంతథా।
అన్యథాగ్రామవాసశ్చ నానారోగ భయంతథా।
ఆదౌదుఃఖ ఫలంచైవ మధ్యేసుఖ మవాప్నుయాత్।
అంత్యేక్లేశ కరంచైవ బలహీనం భవిష్యతి॥ 5

తా. లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయందైనను లేక తన నీచరాశియందైనను బుధుడున్నయెడల, కలహమును, దేహబాధయు, బంధుహానియు, పుత్రనాశమును, కారాగృహప్రాప్తియును, సంకెళ్లచేత బంధనమును, అన్యదేశవాసమును, నానారోగభయమును, ఆదియందు దుఃఖఫలమును, మధ్యభాగమందు సుఖమును, అంత్యభాగమందు వ్యసనమును, బలహీనమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే దేహతాపంవి నిర్దిశేత్।
శిరోభ్రమణరోగాది స్థాననాశం నృపాద్భయం॥ 6

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను దేహతాపమును, ఉన్మాదమును, రోగభయమును, స్థాననాశమును, రాజభయమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టే విద్యాసంగ్రహ తత్పరః।
సాంఖ్యయోగాది తత్వజ్ఞః నటగాయక లోలుపః॥ 7

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను విద్యాసంగ్రహణయం దాసక్తియు, సాంఖ్యయోగాది తత్వజ్ఞానాభివృద్ధియు, నటగాయకులయొక్క సంపర్కాది లీలావినోదమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే క్షేత్రపత్నీవినాశనం।
అన్నద్వేషం శిరోరోగం నేత్రవైకల్య మేవచ॥ 8

తా. కుజునితో కలసినను లేక చూడబడినను క్షేత్ర

నాశమును, భార్యావియోగమును, అన్నద్వేషమును, శిరోరోగమును, నేత్రవికల్పమును కలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే పుత్రవృద్ధి ర్భవిష్యతి।
అంబరాభరణప్రాప్తిః నృపమూలా ద్ధనాగమం॥ 9

తా. గురునితోకలసినను లేక చూడబడినను పుత్రవృద్ధియు, వస్త్రాభరణ ప్రాప్తియు, రాజమూలకముగా ధనలాభమును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే వాహనాని సులబ్ధవాన్।
కళత్రసౌఖ్యమాప్నోతి చింతార్థస్య సిద్ధిదం॥ 10

తా. శుక్రునితోకలసినను లేక చూడబడినను మంచి వాహనలాభమును, కళత్రసౌఖ్యమును, చింతించిన కార్య సిద్ధియు కలుగును.

శ్లో॥ శనినాక్షేత్రవృద్ధిశ్చ దాసీదాసాది సంగ్రహం।
గోమహిష్యాదిలాభశ్చ యత్నకార్యార్థ సిద్ధికృత్॥ 11

తా. శనితోకలసినను లేక చూడబడినను క్షేత్రవృద్ధియు, దాసదాసీజన సంగ్రహమును, గోమహిష్యాది లాభమును, యత్నకార్యార్థ సిద్ధియు కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యే లాభగేపివా।
శుభగ్రహయుతేవాపి ధనలాభ ముదీరయేత్।
బంధూపకారం కళ్యాణం విచిత్ర గృహలాభకృత్।
యుద్ధేషు జయమాప్నోతి మహోత్సాహం తథైవచ।
మణివస్త్రాది లాభశ్చ విద్యాసంగ్రహ తత్పరః।
తీర్థస్నాన ఫలప్రాప్తిః దర్శనంచ మహాత్మనాం॥ 12

తా. బుధుడు దశానాథునకు కేంద్రకోణములయందున్నను తృతీయ లాభములయందున్నను, శుభగ్రహముతో కూడియున్నను, ధనలాభమును, బంధుయుపకారమును, కళ్యాణమును, విచిత్ర గృహలాభమును, యుద్ధమునందు జయమును, మహోత్సాహమును, మణివస్త్రాది లాభమును, విద్యా సంగ్రహమును, తీర్థస్నాన ఫలప్రాప్తియు, మహాత్ములయొక్క దర్శనమును కలుగును.

శ్లో॥ దాయేశాత్సుతభాగ్యస్థే పుత్రవృద్ధి స్తదా భవేత్।
శుభగ్రహయుతేసౌఖ్యం బుద్ధిపుత్రార్థసంపదః॥ 13

తా. దశానాథునకు పంచమ నవమస్థానములయందు బుధుడున్నయెడల పుత్రవృద్ధి కలుగును. శుభగ్రహముతో కూడియున్నచో సౌఖ్యమును, బుద్ధియు, పుత్రలాభమును, అర్థప్రాప్తియు కలుగును.

శ్లో॥ దాయేశాల్లాభ యుక్తస్య సౌమ్యభుక్తే ర్మహద్భయం।
శత్రునాశం మహోత్సాహం గృహక్షేత్రాది వృద్ధిదం॥

తా. దశానాథునకు లాభస్థానమందున్న బుధభుక్తియందు విశేషభయమును, శత్రునాశమును, మహోత్సాహమును, గృహలాభమును, క్షేత్రాదివృద్ధియు కలుగును.

శ్లో॥ దాయేశాద్రిపురంధ్రస్థే పాపయుక్తేగ్నిజం భయం।
దారసౌఖ్యం మహద్భాగ్యం భోజనాంబర భూషణం।
భుక్త్యాదౌశోభనంప్రోక్తం మహాత్సౌఖ్యం వినిర్దిశేత్।
అంతేక్లేశకరంచైవ దేహపీడా మథాపివా॥ 15

తా. దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయందు భుక్తినాథుడగు బుధుడున్నను, లేక పాపగ్రహముతో కలసియున్నను, అగ్నిభయమును, కళత్రసౌఖ్యమును, విశేషభాగ్యమును, భోజనసౌఖ్యమును, వస్త్రలాభమును, భూషణప్రాప్తియు, భుక్తి ఆదిభాగమందు శుభమును, అధిక సౌఖ్యమును, అంత్యమందు

దుఃఖసంభవమును, దేహపీడయు కలుగును.

గ్రంథాంతరే॥

శ్లో॥ దాయేశాద్వ్యయగేహస్థే రంధ్రేవా పాపసంయుతే।
తద్భుక్తౌ కలహంచైవ స్థాననాశంతథైవచ।
చోరాది రిపుభీతిశ్చ సమానజననాశనం॥ 16

తా. దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను లేక పాపునితో కలసినను ఆభుక్తియందు కలహమును, స్థాననాశమును, చోరాది భీతియు, శత్రుభయమును, సమానజననాశమును కలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యు ర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం విష్ణుసాహస్రకం జపేత్।
రజతప్రతిమాదానం కుర్యాదారోగ్య మావిశేత్॥ 17

తా. భుక్తినాథుడగు బుధుడు లగ్నమునకు ద్వితీయ సప్తమ రాసులయందున్న యెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై విష్ణుసహస్రనామ జపమాచరించవలయును. బంగారుప్రతిమ దానము చేసినపిమ్మట ఆరోగ్యము కలుగును.

---

రవిదశాయాం కేతుభుక్తి మాసాః 4. దినాని 6.

శ్లో॥ రవేరంతర్గతే కేతౌ లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయే వా లాభగేవాపి శుభగ్రహ యుతేపివా।
తద్భుక్తౌ పుణ్యతీర్థాది స్నానం దైవత దర్శనం।
కీర్తిలాభం మహోత్సాహం సమరే విజయప్రదం।
నీలవస్తుఘుసంప్రాప్తిః గురుదైవత దర్శనం।
సప్తద్రవ్యార్థసిద్ధిస్స్యాత్ స్కందోపాసన తత్పరః॥ 1

తా. రవిదశలో కేతువు లగ్నమునకు కేంద్ర త్రికోణ



ములయందున్నను, తృతీయ లాభములయందున్నను లేక శుభగ్రహముతో కూడియున్నను ఆభుక్తియందు పుణ్యతీర్థాదిస్నానమును, దేవతాదర్శనమును, కీర్తిలాభమును, మహోత్సాహమును, యుద్ధమందు జయమును, నీల వస్తులాభమును, గురుభక్తియు, దేవతాదర్శనమును, సప్తద్రవ్యార్థ సిద్ధియు, స్కందోపాసన చేయుటయం దాసక్తియు కలుగును.

శ్లో॥ లగ్నాధిపేన సంయుక్తే ఆదౌసౌఖ్యం ధనాగమం।
మధ్యాంతక్లేశ మాప్నోతి మృతవార్తా గమంభవేత్॥ 2

తా. భుక్తినాథుడగు కేతువు లగ్నాధిపతి సంబంధము కలిగియున్నయెడల ఆదియందు సౌఖ్యమును, ధనాగమంబును, మధ్యభాగమందును, అంత్యభాగమందును, దుఃఖమును, మృతవార్తాగమనమును కలుగును.

శ్లో॥ షష్ఠాష్టమ గతే కేతౌ పాపగ్రహసమన్వితే।
కపాలదంతరోగాశ్చ మూత్రకృచ్ఛ్రాది సంభవః।
స్వస్థానచ్యుతి రర్థస్య మిత్రహానిః పితుర్మృతిః॥ 3

తా. కేతువు ౬-౮. రాసులయందున్నను లేక పాపగ్రహముతో కూడియున్నను, కపాల దంతరోగాది బాధలును, మూత్రకృచ్ఛ్రాది రోగసంభవమును, స్థానభ్రంశమును, అర్థనాశమును, మిత్రహానియు, పితృమరణమును కలుగును.

శ్లో॥ దశాధిపేన సంయుక్తే పితృరోగం మహద్భయం।
విదేశగమనంచైవ దారపుత్రాది నాశనం॥ 4

తా. కేతువు, దశాధిపతితో కలసియున్నయెడల పితృరోగమును, గొప్పభయమును, విదేశగమనమును, భార్యాపుత్రాది నాశమును కలుగును.

గ్రంథాంతరే॥

శ్లో॥ లగ్నాదుపచయే కేతౌ ధనలాభం మహత్సుఖం।
వివాహోత్సవకార్యాణి శుభకర్మ శుభాదికం॥ 5

తా. లగ్నమునకు ఉపచయరాసులయందు కేతువున్న యెడల ధనలాభమును అధిక సుఖమును, వివాహోత్సవ కార్యములు జరుగుటయు, శుభకర్మలు సలుపుటయు, విశేష శుభమును కలుగును.

శ్లో॥ శుభగ్రహసమాయుక్తే రాజానుగ్రహశాంతికం।
పుత్రోత్సవాది సంతోషం గజగోలాభ మేవచ॥ 6

తా. కేతువు శుభగ్రహముతో కూడియున్న యెడల రాజానుగ్రహమువల్ల మనోశాంతియు, పుత్రోత్సవాది సంతోషమును, ఏనుగులు, పశువులు మొదలగువాని లాభమును కలుగును.

శ్లో॥ రవిణా సంయుతే దృష్టే నృపబాధా భవిష్యతి।
జ్వరాతిసారరోగాది స్వస్థాన చలనం భవేత్॥ 7

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, రాజబాధయు, జ్వరము, అతిసారము మొదలగు రోగపీడయు, స్వస్థానచలనమును కలుగును.

శ్లో॥ శశినా సంయుతే దృష్టే సుఖశయ్యాదిభోజనం।
యత్నకార్యసుసిద్ధిస్స్యాత్ స్త్రీపుత్రధనవృద్ధిదం॥ 8

తా. కేతువు చంద్రునితో కలసినను లేక చూడబడినను శయ్యాసుఖమును, మృష్టాన్నభోజనమును, యత్నకార్యసిద్ధియు, భార్యాపుత్రులయొక్క సౌఖ్యమును, ధనవృద్ధియు కలుగును.

శ్లో॥ కుజేన సంయుతే దృష్టే శత్రుబాధా భవిష్యతి।
కలహం రాజకోపశ్చ స్థాననాశం తథైవచ॥ 9



తా. కుజునితో కలసినను లేక చూడబడినను, శత్రుబాధయు, కలహమును, రాజకోపమును, స్థాననాశమును కలుగును.

శ్లో॥ సౌమ్యేన సంయుతే దృష్టే బంధూనాముపకారకం।
క్షేత్రస్త్రీపుత్రవృద్ధిస్స్యాద్విద్యాభ్యాసాది సంగ్రహం॥

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, బంధుజనులకు ఉపకారత్వమును, క్షేత్రలాభమును, భార్యాపుత్రాభివృద్ధియు, విద్యాభ్యాసాది సంగ్రహమును కలుగును.

శ్లో॥ గురుణా సంయుతే దృష్టే దేహారోగ్యం తథైవచ।
పుత్రోత్సవాది సంతోషం సర్వకార్యానుసిద్ధిదం॥ 11

తా. గురువుతో కలసినను లేక చూడబడినను దేహారోగ్యమును, పుత్రోత్సవాది సంతోషమును, సర్వ కార్యసిదియు కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతే దృష్టే స్త్రీసౌఖ్యం బంధుపూజ్యతా।
విద్యావినోద సౌఖ్యంచ విటగాయక సంకులం॥ 12

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, స్త్రీసౌఖ్యమును బంధు పూజ్యతయు విద్యావినోదమును దేహసౌఖ్యమును, నటగాయకుల సంకులమును కలుగును.

శ్లో॥ శనినా దేహవాతాది కలహం రాజవిద్వరం।
సంతాప జ్వరపీడాచ గ్రహణీ రోగసంభవం॥ 13

తా. కేతువు శనితో కలసినను లేక చూడబడినను, వాతరోగమును, కలహమును, రాజనిష్ఠూరమును, సంతాపజ్వరమును, పీడయు గ్రహణీరోగ సంభవమును, కలుగును.

శ్లో॥ దాయేశా త్కేంద్రకోణే వా తృతీయే లాభగేపివా।
శుభగ్రహయుతే వాపి ధనలాభ ముదీరయేత్।
ప్రభుసన్మానమారోగ్యం వస్త్రాభరణసంగ్రహం।

పుత్రోత్సవాదిసంతోషం గృహలాభం విచిత్రకం।
నానామూలాద్ధనప్రాప్తిః అయత్నే కార్యసిద్ధిదం॥ 14

తా. భుక్తినాథుడగు కేతువు దశానాథునకు కేంద్రకోణములయందున్నను తృతీయ లాభములయందున్నను లేక శుభగ్రహముతో కూడియున్నను ధనలాభమును, ప్రభుసన్మానమును, ఆరోగ్యమును. వస్త్రాభరణ సంగ్రహమును, పుత్రోత్సవాది సంతోషమును, విచిత్ర గృహలాభమును, నానామూలకముగా ధనప్రాప్తియు, ప్రయత్నములేకనే కార్యసిద్ధియు కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
తద్భుక్తౌస్థాననాశాది నృపమూలాద్ధనవ్యయం।
పశుక్షేత్రాదినాశశ్చ విధవా కలహంతథా।
చోరాగ్ని విషబాధాచ సర్వత్ర కలహంతథా॥ 15

తా. కేతువు దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను పాపగ్రహముతో కూడియున్నను ఆ భుక్తియందు స్థాననాశమును, రాజమూలకముగా ధనవ్యయమును, పశుహానియు, క్షేత్రనాశమును,విధవాకలహమును,చోరబాధయు, అగ్నిభయమును, విషభీతియు, సర్వులతోడను కలహమునుకలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా మహావ్యాధి ర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం సూర్యప్రార్థనమాచరేత్॥ 16

తా. కేతువు లగ్నమునకు రెండవయింటగాని, ఏడవయింటగాని యున్నయెడల మహావ్యాధి సంభవించును. ఆ దోషపరిహారార్థమై సూర్యప్రార్థన చేయవలయును.

గ్రంథాంతరే॥

శ్లో॥ ద్వితీయద్యూననాథేవా తత్ స్థానాధిప సంయుతే।



అపమృత్యుభయంచైవ క్షుద్రశూన్యాది భిర్యుతః।
దుర్గాజపం ప్రకుర్వీత ఛాగదానం తథైవచ।
మహామృత్యుంజపంజప్యం కుర్యాచ్ఛాంతి మవాప్నుయాత్॥

తా. కేతువు లగ్నమునకు ద్వితీయ సప్తమములయందున్నను ఆ స్థానాధిపతులతో కూడినను శూన్యాది క్షుద్రవిద్యలతో గూడిన అపమృత్యు భయము కలుగును. అందుకై దుర్గాజపమాచరించి ఛాగదానము చేయవలయును. మహామృత్యుంజయ జపము జపించినపిమ్మట శాంతికలుగును.

---

రవిదశాయాం శుక్రభుక్తి మాసాః 12.

శ్లో॥ సూర్యస్యాంతర్గతే శుక్రే లగ్నాత్కేంద్రత్రికోణగే।
లాభేవాథ తృతీయస్థే ఉచ్చస్వక్షేత్రగే పివా॥
తద్భుక్తౌ వాహనప్రాప్తిః మహారాజప్రసాదతః।
కళ్యాణసుఖమారోగ్యం పుత్రజన్మోత్సవంతథా॥
ధనధాన్యాభివృద్ధిశ్చ క్షేత్రవృద్ధిశ్చజాయతే।
తీర్థస్నానాది సంప్రాప్తిః దేవతా గురుదర్శనం॥ 1

తా. సూర్యదశలో భుక్తినాథుడగు శుక్రుడు లగ్నమునకు కేంద్రకోణములయందున్నను, తృతీయలాభములయందున్నను, లేక తన ఉచ్చస్వక్షేత్రములయందున్నను ఆ భుక్తియందు వాహనప్రాప్తియు, మహారాజానుగ్రహమును, కళ్యాణ సంభవమును, సుఖమును, ఆరోగ్యమును, పుత్రజన్మోత్సవమును, ధనధాన్యాభివృద్ధియు, క్షేత్రవృద్ధియు తీర్థస్నానాది ఫలమును, దేవతాదర్శనమును, గురుపూజయు కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్ట రాశిస్థే వ్యయేనా పాపసంయుతే।
దేహబాధామనస్తాపం కార్యనాశం మహద్భయం॥
స్వబంధుకలహంచైవ యత్నకార్యవినాశనం।

మనరేషుభయంచైవ భూమిదార వినాశనం।
అశ్వగోగజనాశంచ స్వబంధూనాం క్షయంతథా।
వస్త్రభూషణ హానిశ్చ చోరబాధాభవిష్యతి॥ 2

తా. శుక్రుడు లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను పాపగ్రహముతో కూడియున్నను, దేహబాధయు, మనస్తాపమును, కార్యనాశమును, గోప్యభయమును, బంధుకలహమును, యత్నకార్యనాశమును, భూనాశమును, కళత్రనాశమును, గుఱ్ఱములు, గోవులు ఏనుగులు మొదలగు వాటినాశనమును, స్వంత బంధునాశమును, వస్త్రభూషణనాశమును, చోరబాధయు కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే వ్యాధిశస్త్రాదిపీడనం।
ఆచారహీనవిభ్రంశం స్థాననాశం భవిష్యతి॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను వ్యాధిపీడయు, శస్త్రాదిభయమును, ఆచారహీనమును, మతిభ్రంశమును, స్థాననాశమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతే దృష్టే దారపుత్రాదిసౌఖ్యదం।
దేహారోగ్య మనస్సౌఖ్యం ఇష్టసిద్ధిర్భవిష్యతి॥ 4

తా. చంద్రునితో కూడినను లేక చూడబడినను భార్యాపుత్రాది సౌఖ్యమును, దేహారోగ్యమును, మనస్సంతోషమును ఇష్టసిద్ధియు కలుగును.

శ్లో॥ కుజేన దేహతాపాది శస్త్రఘాతాదిపీడనం।
వివాదకలహంచైవ జ్ఞాతీనాం కలహంతథా॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను దేహతాపమును శస్త్రదెబ్బలచేత బాధయు, వ్రణబాధయు, వివాద కలహమును, జ్ఞాతులతోడ కలహమును కలుగును.



శ్లో॥ బుధేశాస్త్రాది విజ్ఞానం బాంధవాదిసమాగమం।
విశేషవిద్యా విజ్ఞానం గృహభూషణ సంగ్రహం॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను శాస్త్రాది జ్ఞానమును, బంధు సమాగమంబును, విశేష విద్యాపాండిత్యమును, గృహలాభమును, భూషణ సంగ్రహమును కలుగును.

శ్లో॥ గురుణా సుతలాభశ్చ శత్రువృద్ధి ర్భవిష్యతి।
వ్యాధిపీడా కార్యహానిః నృపమూలా ద్ధనవ్యయం॥ 7

తా. గురువుతో కలసినను లేకచూడబడినను సుతలాభమును, శత్రు వృద్ధియు, వ్యాధిపీడయు, కార్యహానియు, రాజమూలకముగా ధనవ్యయమును కలుగును.

శ్లో॥ శనినా నీచసేవాది నీచానాంచ సమాగమం।
భృత్యవర్గ విరోధశ్చ మనస్తాపం భవిష్యతి॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను, నీచజనసేవయు, నీచజన సమాగమంబును, దాసదాసీజన విరోధమును, మనస్తాపమును కలుగును.

శ్లో॥ దాయేశా త్కేంద్రకోణస్థే తృతీయే లాభగేపివా।
తద్భుక్తౌ రాజసన్మానం కళ్యాణాది మహోత్సవం।
దారపుత్రాదిసౌఖ్యంచ వస్త్రాభరణసంగ్రహం।
అపూర్వవస్తుసంప్రాప్తిః మౌక్తికానివిశేషతః।
పశువాహనలాభశ్చ ఇష్టసిద్ధిర్భవిష్యతి॥ 9

తా. శుక్రుడు దశానాథునకు కేంద్రకోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను, ఆ భుక్తియందు రాజసన్మానమును, కళ్యాణాది మహోత్సవమును, భార్యాపుత్రాదుల సౌఖ్యమును, వస్త్రాభరణ సంగ్రహమును, అపూర్వ వస్తుసంప్రాప్తియు, విశేషముగా మౌక్తికలాభమును,

పశ్వాభివృద్ధియు, వాహనలాభమును, ఇష్టసిద్ధియు కలుగును.

శ్లో॥ దాయేశాత్తష్టరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
నీచగ్రహయుతేవాపి ధనంనాశం వదేద్బుధః।
స్వదేహపీడనంచైవ దారపుత్ర వినాశనం।
సర్వత్రకలహంచైవ స్థాననాశం తథైవచ।
భుక్త్యాదౌ వాహనలాభం మధ్యే శుభకరంభవేత్।
అంతేధాన్యార్థనాశంచ స్థానభ్రంశం మథాపివా॥ 10

తా. దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను, పాపునితో కలసియున్నను లేక నీచగ్రహయుతుండైనను ఆ భుక్తియందు ధననాశమును, దేహపీడయు, భార్యాపుత్ర వినాశమును, సర్వులతోడను కలహమును, స్థాననాశమును సంభవించును. భుక్తి ఆదియందు వాహనలాభమును, మధ్యభాగమందు శుభమును, అంత్యభాగమందు ధాన్యార్థ నాశమును, స్థానభ్రంశమును కలుగును.

శ్లో॥ ద్వితీయ ద్యూనరాశిస్థే దేహపీడా భవిష్యతి।
రంధ్రాధిప సమాయోగే అపమృత్యుర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం మృత్యుంజయ జపంచరేత్।
శ్వేతాంగాం మహిషీందద్యాత్ రుద్రజప్యంచకారయేత్॥

తా. భుక్తినాథుడగు శుక్రుడు ద్వితీయ సప్తమములయందున్నయెడల దేహపీడ కలుగును. అష్టమాధిపతి సంబంధము కలిగియున్నయెడల అపమృత్యువు కలుగును. ఆదోష పరిహారార్థమై మృత్యుంజయ జప మాచరించవలయును, తెల్లని మహిష దానమును రుద్రజపమును, చేయువలయును.

ఇతి జాతకఫలచింతామణౌ రవిదశాంతర్దశాఫలం నామ
ద్వితీయ ప్రకరణం సమాప్తం.

---

శుభమస్తు.

# జాతకఫలచింతామణి.

## ఆంధ్ర తాత్పర్య సహితము.

## తృతీయ ప్రకరణము.

### చంద్రదశా సంవత్సరాః 10.

శ్లో॥ అదౌభావ ఫలంప్రోక్తం స్థానజన్యం తతఃపరం।
అంశోద్భవం ఫలంపశ్చా ద్బృహజ్జాతఫలం త్విదం॥ 1

తా. మొదట భావఫలమును, అటుపిమ్మట స్థానగతులవల్ల కలిగెడి ఫలమును, అంశవల్లకలిగెడి ఫలమును, తర్వాత జాతకఫలము విశేషముగను చెప్పబడుచున్నది.

సర్వార్థచింతామణౌ॥

శ్లో॥ చంద్రేస్థాన బలాధికే ధనసుఖం
కీర్తించ విద్యాగమం।
దేవబ్రాహ్మణపూజనం నృపజనా
త్ప్రాప్నోతి భూమింయశః॥
స్త్రీరత్నాంబర భూషణం కృషిధనం
గోవిక్రయం సేచనం।
మృష్టాన్నాది రసాయనం ఫలయుతం
దధ్యాజ్య మాల్యాదికం॥ 2

తా. చంద్రుడు స్థానబలముకలిగి యున్నయెడల, ఆదశయందు ధనలాభమును, సుఖమును కీర్తియు, విద్యాలాభమును, దేవబ్రాహ్మణపూజయు, రాజులమూలకముగా భూలాభమును, యశస్సును, స్త్రీప్రాప్తియు, రత్నాంబర భూషణలాభములును కృషిలాభమును, గోవిక్రయ నిపుణతయు, సంగ్రహమును, మాధుర్యాది రసభక్షణములతోగూడిన మృష్టా

స్నమును, పెరుగు, నెయ్యి, పుష్పమాల్యాదులు వీటి సుఖ
మును కలుగును.

శ్లో॥ నిశాకరే స్థానబలేన హీనే
స్థానార్థనాశం స్వపదచ్యుతించ।
స్వబంధునాశం త్వథవా వియోగం
కృషేర్వినాశం సముపైతి కాలే॥ 3

తా. ఆచంద్రుడు స్థానబలములేని వాడయ్యెనేని స్థాన
నాశమును, అర్థహానియు, స్థానభ్రంశమును, బంధువినాశమును
లేక వియోగమును, కృషినష్టమును కలుగును.

శ్లో॥ నిశాకరే దిగ్బలసంయుతే
చదిగంతరాదా గతవస్తుచిత్రం।
విద్యాగమంభూపతి మిత్రతాంశ్చ
స్వబంధుపూజ్యం గజవాజిభూమిం॥ 4

తా. చంద్రుడు దిగ్బలము గలవాడయ్యెనేని అట్టిదశా
కాలమందు అన్యదేశములనుండి వచ్చెడి చిత్రవస్తు సమూహా
లాభమును, విద్యాలాభమును, రాజస్నేహమును, స్వంత
బంధు జన పూజ్యతయు, గజాశ్వ భూలాభంబులును కలుగును.

శ్లో॥ చంద్రేతదాకాల బలాన్వితేస్మిన్
తురంగయానం కృషిగోధనంచ।
వాద్యాదిఘోషం నఖకేశదంతం
భూషాంబరాలం కృతవాహనంచ॥ 5

తా. చంద్రుడు కాలబలము గలవాడైనపుడు అశ్వవా
హన ప్రాప్తియు, కృషిలాభమును, పశ్వాభివృద్ధియు, ధనాగ
మంబును, వాద్యాది ఘోషణంబును, గోళ్లు, వెంట్రుకలుభూషణ
వస్త్రాదులచే నలంకరింపబడిన వాహన లాభమును కలుగును.



శ్లో॥ నిసర్గవీర్యాన్వితచంద్రదాయే
నిసర్గతస్యాపి కరోతిభాగ్యం।
అయత్నతో వాహన దేశలాభం
నృపాలపూజ్యం బహువాహనంచ॥ 6

తా. నైసర్గికబలముగల చంద్రుని దశయందు అప్ర
యత్నముగా భాగ్యలాభంబును, వాహన భూలాభంబులును,
రాజపూజ్యతయు బహు వాహన లాభంబును కలుగును.

శ్లో॥ క్రూరాదిషష్ట్యంశ సమన్వితస్యదాయే
శశాంకస్య బహుత్వదుఃఖం।
స్త్రీపుత్రనాశం క్షితిపాలకోపం
విద్యావివాదం కలహంజనైర్వా॥ 7

తా. క్రూరషష్ట్యంశలయందున్నను చంద్రదశలో అధిక
దుఃఖమును, స్త్రీ పుత్రనాశనంబును, రాజకోపమును, విద్యా
వివాదమును, జనులతోడ కలహంబును కలుగును.

శ్లో॥ మృద్వంశ షష్ట్యంశ సమన్వితస్య
చంద్రస్యదాయే బహుపుత్రలాభం।
భృత్యార్థలాభం విజయంసుఖంచ
కీర్తించవిద్యాం లభతేవిశేషాత్॥ 8

తా. షష్ట్యంశలలో మృద్వంశయందున్న చంద్రదశా
కాలమందు బహుపుత్రలాభమును, దాసదాసీజనసేవయు, అర్థ
లాభమును, జయమును, సుఖమును, కీర్తియు, విద్యయు విశేష
ముగా లభించును.

శ్లో॥ పారావతాద్వంశ సమన్వితస్య
చంద్రస్యదాయే మహతీంచకీర్తిం।
విద్యావినోదం లభతేచసౌఖ్యం

దేవార్చనం పుణ్యఫలాభిషేకం॥ 9

తా. పారావతాంశయందున్న చంద్రదశలో విశేష కీర్తియు, విద్యావినోదమును, దేహసౌఖ్యమును, దేవర్చనమును, పుణ్యతీర్థాభిషేక ఫలమును కలుగును.

శ్లో॥ క్రూరార ద్రేక్కాణసంయుక్తే చంద్రేదిశతి రోగతాం।
మహద్భయసర్పమాయుక్తే గోబ్రాహ్మణ నిపీడనం॥ 10

తా. క్రూర ద్రేక్కాణమునుపొందిన చంద్రదశలో రోగమును, గొప్పభయమును, గోబ్రాహ్మణ పీడయు కలుగును.

శ్రేష్ఠియ్యో॥

శ్లో॥ అత్యుచ్చసంస్థస్య నిశాకరస్య
దశావిపాకే మహదాధిపత్యం।
స్వనామపద్యాంకిత కీర్తిలాభం
మనోవిలాసం లభతే మనుష్యః॥ 11

తా. పరమోచ్చయునగా వృషభరాశియందు మూడవ భాగమందున్న చంద్రుడు తన దశాకాలమందు ఉత్కృష్టమైన అధిపత్యమును, తనపేరుఅంకితముగాగల పద్యములచే పొగడ్త నొందిన కీర్తిలాభమును, మనోవిలాసమును, మనుష్యునకు కలుగచేయును.

శ్లో॥ ఉచ్చస్థితస్యాపి నిశాకరస్య
దశావిపాకే ధనలాభమేతి।
అతీవసౌఖ్యం స్వజనానుమోదం
యుద్ధేజయం భూషణవస్త్రలాభం॥ 12

తా. తనఉచ్చరాశిని పొందియున్న చంద్రదశలో ధనలాభమును, అధికసౌఖ్యమును,స్వంత జనసంతోషమును,యుద్ధమునందు జయమును, వస్త్రాభరణాది లాభమును, కలుగును.



శ్లో॥ నీచంగతస్యాపి నిశాకరస్యప్రాప్తే
ర్దశాయాం వివిధార్థహానిం।
కుభోజనం కుత్సితరాజసేవాం
మనోవికారం సముపైతినిద్రాం॥ 13

తా. నీచరాశి పొందియున్న చంద్రదశ సంప్రాప్తించిన కాలమందు నానావిధములగు పదార్థహానియు, కుత్సిత భోజనమును, కుత్సిత గుణముగల రాజసేవయు, మనోవికారమును, నిద్రయు కలుగును.

శ్లో॥ నిశాకరస్యాస్యతినీచగస్య
దారార్థనాశం కురుతేచదుఃఖం।
శీతజ్వరం నేత్ర వినాశనంచ
జలాద్భయంవా బహుమూత్రరోగం॥ 14

తా. పరమనీచయందున్న చంద్రదశాకాలమందుభార్యనాశమును, అర్థహానియు, దుఃఖమును, శీతజ్వరమును నేత్రవినాశమును, జలగండభయమును, బహుమూత్రరోగమును కలుగును.

శ్లో॥ మూలత్రికోణాన్వితచంద్రదాయే
నృపాద్ధనం భూమి సుతార్థదారాన్।
ప్రాప్నోతి భూషాంబరయానలాభం
సుఖంజనన్యం రతికేళిలోలం॥ 15

తా. మూల త్రికోణములయందున్న చంద్రదశలో రాజమూలకముగా ధనమును, భూలాభమును, భార్యాపుత్రప్రాప్తియు, అర్థలాభమును, భూషణ వస్త్ర వాహన లాభములును, మాతృవలన సౌఖ్యంబును రతికేళి లోలత్వంబును కలుగును.

శ్లో॥ స్వక్షేత్రగస్యాపి నిశాకరస్య
నృపాద్ధనం ప్రాప్తి ముపైతి సౌఖ్యం।
ప్రచండ వేశ్యా గమనం క్షితీశా
త్సన్మానస్వస్త్రీ సుత బంధుసౌఖ్యం॥ 16

తా. స్వక్షేత్రమందున్న చంద్రదశలో రాజమూలక ముగా ధనలాభమును, సౌఖ్యమును, మంచి వేశ్యా స్త్రీ సౌఖ్యంబును, రాజసన్మానమును, భార్యా పుత్రులయొక్కయు, బంధువులయొక్కయు సౌఖ్యమును కలుగును.

శ్లో॥ నిశాకరస్యా స్యతి శత్రురాశౌ
గతస్యదాయే కలహోర్థనాశం।
కువస్త్రతాం కుత్సితభోజనంచ
క్షేత్రార్థ దారాత్మజతోయ యానం॥ 17

తా. అతిశత్రుక్షేత్రమందున్న చంద్రదశలో కలహమును, అర్థనాశమును, కుత్సిత వస్త్రమును, కుత్సిత భోజనమును, క్షేత్రార్థలాభములును, భార్యాపుత్ర లాభమును, జలసౌఖ్యమును, వాహనలాభమును కలుగును.

శ్లో॥ విత్తాంబరాలం కరణాదిహీనం
విదేశయానం పరిచారకత్వం।
దేశాంతరేయా స్యతిబంధుహీనో
దుఃఖైః పరిక్లిశ్యతి శత్రుదాయే॥ 18

తా. శత్రుక్షేత్రమందున్న చంద్రదశలో ధన వస్త్రాలంకారాది హీనమును, విదేశప్రయాణమును, సేవకావృత్తియు, దేశాంతరమందున్న బంధువియోగముచే దుఃఖములును, కలుగుటచేత జాతకుడు హింసనొందును.

శ్లో॥ మిత్రర్క్షగస్యాపి నిశాకరస్య



పాకేర్థలాభం క్షితిపాలమైత్రం।
ఉద్యోగసిద్ధిం బహువస్తులాభం
చిత్రాంబరా భూషణవాగ్విలాసం॥ 19

తా. మిత్రక్షేత్రగతుడైన చంద్రదశాకాలమందు అర్థలాభమును, రాజస్నేహమును, ఉద్యోగసిద్ధియు, బహువస్తులాభమును, విచిత్ర వస్త్రాభరణ ప్రాప్తియు, వాగ్విలాసమును కలుగును.

శ్లో॥ సుధాకరస్యా స్యతి మిత్రరాశే
ర్గతస్యదాయే త్వతిసౌఖ్యమేతి।
విద్యావినోదా న్వితరాజపూజ్యం
క్షేత్రార్థ దారాత్మజ కామలాభం।
దశావిపాకే సమరాశిగస్య
కళానిధేః కాంచన భూమిలాభం।
కించిత్సుఖం భాంధవ రోగపీడాం
విదేశయానం లభతేమనుష్యః॥ 20

తా. చంద్రుడు అతి మిత్రక్షేత్రమందుండగా ఆదశయందు అధిక సౌఖ్యంబును, విద్యా వినోదములవల్ల రాజపూజ్యతయు, క్షేత్ర ధన భార్యాపుత్రులవల్ల యిష్టసిద్ధి లాభంబును కలుగును. మరియు, సమక్షేత్రగతుడగు చంద్రుని దశయందు స్వర్ణ భూలాభంబులును, అల్పసుఖంబును, బంధుజన రోగపీడయు, అన్య దేశసంచారంబును జాతకుడు పొందును.

శ్లో॥ క్షీణేందుపాకే సకలంనిహీంసం
రాజ్యార్థ భూపుత్ర కళత్రమిత్రం।
ఉన్మాదచిత్తం స్వజనైర్విరోధం
ఋణత్వమాయాతి కుశీలత్వం॥ 21

తా. క్షీణచంద్రుని దశాకాలమందు రాజ్యార్థ భూపుత్రకళత్ర మిత్రాది సకల విహీనతయు, ఉన్మాదచిత్తమును, స్వజనులతోడ విరోధమును, కుత్సిత వృత్తిచే ఋణమును, కలుగును.

శ్లో॥ పూర్ణేందుపాకే పరిపూర్ణ మేతి
విద్యావినోదాంకిత రాజమానం।
స్త్రీపుత్రభృత్యార్థ మనోవిలాసం
విశేషత శ్శోభ కర్మవృద్ధిం॥ 22

తా. పూర్ణచంద్రుని దశాకాలమందు పరిపూర్ణ శుభ ఫలంబును, విద్యా వినోద అంకితములచే రాజపూజయు, స్త్రీ పుత్రలాభమును, దాసదాసీజన సేవయు, అర్థప్రాప్తియు, మనోవిలాసమును, అధికముగా శుభకర్మ సిద్ధియు కలుగును.

శ్లో॥ కేనాపి స్వోచ్చస్థవియచ్చరేణ
యుక్తస్యచంద్రస్య దశావిపాకే।
మనఃప్రమోదం మదనాభిరామం
స్త్రీపుత్ర భృత్యార్థ వినోదగోష్టిం॥ 23

తా. ఉచ్చయందున్న గ్రహసంబంధముగల చంద్రదశ యందు మనోసంతోషమును, కామ క్రియాసంతోషంబును, స్త్రీపుత్రభృతార్థ లాభంబులును,వినోదగోష్ఠియును కలుగును.

శ్లో॥ పాపాన్వితస్యాపి నిశాకరస్య
పాకేగ్నిచోర క్షితిపాలకోపైః।
దుఃఖంసుతస్త్రీ రతిబంధుహానిం
విదేశయానంత్వ శుభాదికర్మ॥ 24

తా. పాపగ్రహముతో గూడిన చంద్రదశాకాలమందు అగ్నిభీతియు, చోరబాధయు, రాజకోపమును, దుఃఖమును,



పుత్రస్త్రీసుఖ బంధుహానియు, విదేశప్రయాణమును, అశుభకర సిద్ధియు కలుగును.

శ్లో॥ చంద్రస్య సౌమ్యగ్రహ సంయుతస్య
ప్రాప్తౌదశాయాం శుభకర్మలాభం।
గోభూహిరణ్యాంబర భూషణాని
తీర్థాభిషేకం పరదారసౌఖ్యం॥ 25

తా. శుభగ్రహముతోగూడిన చంద్రదశ సంప్రాప్తించిన కాలమందు శుభకర్మ లాభమును,గోవులు, భూమి, బంగారము, వస్త్ర భూషణములు, మొదలగు వాటి లాభమును, తీర్థాభిషేకమును, అన్యస్త్రీ సౌఖ్యమును కలుగును.

శ్లో॥ పాపేక్షితస్యాపి నిశాకరస్య
దశావిపాకే విఫలంతుకర్మ।
కోపాధికం కుత్సితభోజనంచ
మాతుర్వియోగం త్వథవాతదీయం॥ 26

తా. పాపగ్రహముచేత చూడబడెడి చంద్రునిదశ యందు నిష్ఫలమగు కార్యసిద్ధియు, అధికకోపమును, కుత్సిత భోజనమును, మాతృవినాశమును, లేక మాతృవర్గపువారికి హానియు కలుగును.

శ్లో॥ నిశాకరస్యాపి శుభేక్షితస్య
పరోపకారం మహతీంచకీర్తిం।
ఇష్టార్థబంధ్వాగమ భూపమాన్యం
జలక్రియావస్తు మనోవిలాసం॥ 27

తా. శుభగ్రహ వీక్షణగల చంద్రదశా కాలమందు పరోపకారమును, విశేషకీర్తియు, ఇష్టార్థసిద్ధియు, బంధు జనాగమంబును, రాజసన్మానమును, జలకార్యవస్తువులవల్ల మనో

ల్లాసమును కలుగును.

శ్లో॥ నీచాంశగస్యాపి దశావిపాకే
శోకంప్రయాణంచ మనోవికారం।
సౌఖ్యార్థహానిం బహునేత్రరోగం
యుద్ధేపరాజయభయం సుతదారనాశం॥ 28

తా. నీచాంశగతుడైన చంద్రదశాకాలమందు శోకమును, ప్రయాణమును, మనోవికారమును, సౌఖ్యనాశమును, అర్థహానియు, నేత్రరోగమును, యుద్ధమునం దపజయమును, భార్యాపుత్రనాశమును కలుగును.

శ్లో॥ ఉచ్చాంశగస్యాపి దశాతిసౌఖ్యం
మహత్తరం పుత్రసమృద్ధిలాభం।
నానావిశేషణ సుఖాదిలాభం
రాజాదిసన్మాన సుదేహపుష్టిం॥ 29

తా. తన ఉచ్చరాశిని పొందియున్న చంద్రదశలో అధికసౌఖ్యమును, పుత్రసమృద్ధియు, లాభమును, నానావిధ సుఖభోగాదులును, రాజగౌరవమును, దేహపుష్టియు కలుగును.

శ్లో॥ దినేశచంద్రాన్విత రమ్యదాయే
ప్రాప్నోతిదుఃఖం స్వజనైర్విరోధం॥
భాగ్యక్షయాభూప నృపాగ్నిచోరై
ర్మాతుర్వియోగం కృషిధాన్యనాశం॥ 30

తా. చంద్రుడు సూర్యునితో కలసి యున్నయెడల (అనగా అస్తంగతుడైన యెడల) దుఃఖమును, స్వజన విరోధమును, భాగ్యనాశమును, రాజాగ్నులచేత భీతియు, చోరబాధయు, మాతృవియోగమును, వ్యవసాయనష్టమును, ధాన్యనాశమును కలుగును.



శ్లో॥ కేంద్రాన్వితస్య చంద్రస్య దశాపాకే శుభప్రదం।
రాజప్రసాదంచోత్సాహం ధనవాహన లబ్ధవాన్॥ 31

తా. కేంద్రస్థానగతుడైన చంద్రదశ శుభఫలము నిచ్చును. రాజానుగ్రహమువల్ల మనోత్సాహమును, ధన ప్రాప్తియు, వాహనలాభమును కలుగును.

శ్లో॥ త్రికోణస్థస్య చంద్రస్య దశాపాకే శుభంవదేత్।
అధికారాదిలాభశ్చ మహారాజ ప్రసాదతః॥ 32

తా. త్రికోణ స్థానములయందున్న చంద్రదశాకాలమున శుభమును, మహారాజానుగ్రహమువల్ల అధికారాది లాభమును కలుగును.



మేషాదిరాశిస్థిత చంద్రదశాఫలం.

శ్లో॥ మేషస్థితస్యాపి నిశాకరస్య
దశావిపాకే ధనలాభమేతి।
క్షితీశమిత్రం వరవస్త్రయానం
జనస్యసౌఖ్యం శుభదంకరోతి॥ 33

తా. మేషరాశియందున్న చంద్రుడు తనదశలో ధనలాభమును, రాజస్నేహమును, శ్రేష్ఠమైన వస్త్ర వాహన ప్రాప్తియు, మాతృసౌఖ్యమును, శుభమును కలుగును.

శ్లో॥ వృషస్థితస్యాపి నిశాకరస్య
సుకీర్తిలబ్ధం బహువస్తులాభం।
క్షేత్రాభివృద్ధిం కృషివృద్ధిదంచ
గోవాజిలాభం లభతే॥ 34

తా. వృషభరాశియందున్న చంద్రదశలో మంచికీర్తి లాభమును, బహువస్తు లాభమును, క్షేత్రాభివృద్ధియు, వ్యవ

సాయవృద్ధియు, గోవులు గుఱ్ఱములు మొదలగు వాటి లాభ
మును కలుగును.

శ్లో॥ యుగ్మస్థితస్య చంద్రస్య దశావిద్యాఫలప్రదా।
జ్ఞానాధిక్యం తపస్సిద్ధిః గణితాభ్యాస తత్పరః॥ 35

తా. మిథునరాశియందున్న చంద్రదశయందు విద్యా ఫలప్రాప్తియు, జ్ఞానాభివృద్ధియు- తపస్సిద్ధియు, గణితాభ్యాసమునం దాసక్తియు కలుగును.

శ్లో॥ కుళీరసంస్థస్య నిశాకరస్య
దశావిపాకే ధనలాభమేతి।
ఉద్యోగలాభం క్షితిపాలమిత్రం
క్షేత్రార్థవృద్ధిం లభతేమనుష్యః॥ 36

తా. కర్కాటరాశియందున్న చంద్రదశలో ధనలాభమును, ఉద్యోగలాభమును, రాజస్నేహమును, క్షేత్రలాభమును, అర్థవృద్ధియు కలుగును.

శ్లో॥ సింహగతచంద్రదాయే విద్యాభ్యాసాది శాస్త్రతత్వజ్ఞః।
భూదేవ సంఘ పూజాం వరమణిలాభం సదాలభతే॥ 37

తా. సింహరాశియందున్న చంద్రదశా కాలమందు విద్యాభ్యాసాది శాస్త్రతత్వ పరిశీలన జ్ఞానమును, బ్రాహ్మణ సంఘ పూజాఫలమును, శ్రేష్ఠమైన మణిలాభమును ఎల్లప్పుడును కలుగును.

శ్లో॥ కన్యాస్థితస్య చంద్రస్య దశాపాకేరి పీడనం।
మాతుర్వియోగం లభతే అభవ త్కలహంసదా॥ 38

తా. చంద్రుడు కన్యారాశియందుండగా ఆ దశయందు శత్రుపీడయు, మాతృ వియోగమును, కలహమును కలుగును.

శ్లో॥ తౌళిస్థితస్యాపి నిశాకరస్య



అర్థాప్తవిద్వేష దినాశదాదశా।
సుతీర్థయాత్రా ఫలకర్మసిద్ధిః
రిపుర్వినాశం లభతేసునుష్యః॥ 39

తా. తులారాశియందు చంద్రుడున్న దశాకాలమందు అర్థనాశము, మిత్రద్వేషమును, మంచి తీర్థయాత్రాఫల కర్మసిద్ధియు, శత్రునాశమును మనుష్యునకు కలుగును.

శ్లో॥ కీటగతశశిదశాయాం భూపవిరోధం బంధునాశంచ।
చింతితకార్యవినాశం ధననాశం మానభంగంచ॥ 40

తా వృశ్చికరాశియందున్న చంద్రదశలో రాజవిరోధమును, బంధునాశమును, చింతించిన కార్యవినాశమును, ధననాశమును, మానభంగమును కలుగును.

శ్లో॥ చాపగత చంద్రదాయే
స్త్రీసుతసౌఖ్యం. స్వబంధుకళ్యాణం ।
వరమణి భూషణలాభం
గోధాన్య క్షేత్రవృద్ధిశ్చ ॥ 41

తా. ధనుస్సునందున్న చంద్రదశలో భార్యాపుత్రుల సుఖమును, స్వకీయబంధుకళ్యాణమును, శ్రేష్ఠమైన మణిభూషణ లాభమును, పశుధాన్య క్షేత్రాభివృద్ధియు కలుగును.

శ్లో॥ మృగస్థితస్యాపి నిశాకరస్య
క్షేత్రార్థవృద్ధిం కుశలత్వమేతి।
సుతీర్థయాత్రాది ఫలప్రదస్య
దుకూలవస్త్రాప్తి ముపైతిసిద్ధిం ॥ 42

తా. మకరరాశియందున్న చంద్రదశలో క్షేత్రార్థవృద్ధియు, కుశలత్వమును, పుణ్యతీర్థయాత్రాది ఫలప్రాప్తియు.

శ్లో॥ ఘటకగత చంద్రదశాయాంభూమివినాశంన్నృపాలభీతిశ్చ।

రిపుగతపీడాకలహం స్థానవినాశం మనస్తాపంచ ॥ 43

తా. కుంభ రాశియందున్న చంద్రదశాకాలమందుభూనాశమును, రాజభయమును, శత్రుపీడయు, కలహమును, స్థాననాశమును, మనస్తాపమును కలుగును.

శ్లో॥ మీనస్థితస్యాపి నిశాకరస్య
దశాక్షితీశ త్వముపైతిసిద్ధిం।
సురార్చనం భూసుర తర్పణంచ
ఇష్టార్థసిద్ధిం లభతేమనుష్యః॥ 44

తా. మీనరాశియందున్న చంద్రదశలో రాజ్యాధిపత్యమును, సురార్చనమును, బ్రాహ్మణపూజయు, ఇష్టార్థసిద్ధియు కలుగును.

---

తన్వాదిస్థితచంద్రదశాఫలం.

శ్లో॥తనుగతచంద్రదశాయాం దేహారోగ్యంసుఖాన్నశయ్యాది।
వరభూషణవస్త్రాప్తిం నృపమిత్రతం కీర్తివృద్ధించ ॥ 45

తా. లగ్నస్థానగతుడైన చంద్రదశాకాలమందు దేహారోగ్యమును, సుఖభోజనమును, శయ్యాసుఖ్యమును, శ్రేష్ఠమైన భూషణలాభమును, వస్త్రప్రాప్తియు, రాజస్నేహమును, విశేషకీర్తియు కలుగును.

శ్లో॥ ధనస్థితస్యాపి నిశాకరస్య
దశాధనాప్తిం బహుసౌఖ్యమేతి।
కుటుంబసంరక్షణ వాగ్విలాసం
సుకీర్తివిద్యా ధనలాభమేతి॥ 46

తా. ద్వితీయ స్థానమందున్న చంద్రదశలో ధనాగమంబును, విశేషసౌఖ్యమును, కుటుంబ సంరక్షణయు, వాగ్విలాసమును, మంచికీర్తియు, విద్యా ధనలాభములును కలుగును.



శ్లో॥ విక్రమస్థ శశిదాయే శౌర్యగాంభీర్య మేవచ।
సహోదరాదివృద్ధిశ్చ కర్ణభూషణ లబ్ధవాన్॥ 47

తా. తృతీయస్థానమందున్న చంద్రదశలో శౌర్యమును, గాంభీర్యమును, సహోదరాభి వృద్ధియు, కర్ణభూషణ లాభమును కలుగును.

శ్లో॥ సుఖస్థగస్యాపి నిశాకరస్య
క్షేత్రార్థవృద్ధిం ధనలాభమేతి।
బంధూపకారం బహువాహనాప్తిం
విద్యావివాదం సమరేజయంచ॥ 48

తా. లగ్నమునకు నాల్గవ యింటియందున్న చంద్రదశలో క్షేత్రవృద్ధియు, అర్థప్రాప్తియు, ధనలాభమును, బంధుజన ఉపకారమును, బహు వాహనాదుల లాభమును, విద్యావివాదమును, యుద్ధమునందు జయమును కలుగును.

శ్లో॥ సుతస్థస్య చంద్రస్యదాయే శుభత్వం
సుతోత్పత్తితోషం సువిద్యాధనాప్తిం।
స్వసాప్తిం కళత్రస్య దేహస్యసౌఖ్యం
భూదేవపూజాం మణిమంత్రసిద్ధిం॥ 49

తా. పంచమస్థానమును పొందిన చంద్రదశలో శుభమును, పుత్రోత్పత్తి మూలకముగా మనస్సంతోషమును, మంచి విద్యావినోదమును, ధనప్రాప్తియు, సుఖమును, భార్యాపుత్రుల సౌఖ్యమును, బ్రాహ్మణపూజయు, మణిమంత్రసిద్ధియు గలుగును.

శ్లో॥ శత్రుగతచంద్రదశాయాం క్షయరోగంవాతగుల్మాది।
మాతుఃకలహంభేదం బంధువియోగం బుద్ధివినాశనం॥

తా. లగ్నమునకు ఆఱవయింటియందున్న చంద్రదశలో

క్షయరోగమును, వాతశూల్యాది రోగములును, మాతృకలహమును, దుఃఖమును, బంధు వియోగము, బుద్ధి నాశమును కలుగును.

శ్లో॥ కళత్రసంస్థస్య నిశాకరస్య
కళత్రమిత్రాత్మజ బంధుసౌఖ్యం।
మనోవిలాసం సుమహాదిసత్వం
సుతీర్థయాత్రాది ఫలప్రదంచ॥ 51

తా. సప్తమస్థానమందున్న చంద్రదశలో భార్యాపుత్రులయొక్కయు, బంధుమిత్రులయొక్కయు సౌఖ్యమును, మనోవిలాసమును, ఉత్కృష్టమైన పదవిని, పుణ్యతీర్థయాత్రాది ఫలము కలుగును.

శ్లో॥ మృత్యుస్థితస్య చంద్రస్య దశామృతి ఫలప్రదా।
క్షయరోగగ్రహాణ్యాది దారపుత్ర వినాశనం॥ 52

తా. అష్టమస్థానమందున్న చంద్రదశ మృతిఫలము నిచ్చును గ్రహణ్యాది క్షయరోగమును, భార్యాపుత్ర వినాశము కలుగచేయును.

శ్లో॥ ధర్మస్థితస్యాపి నిశాకరస్య
దశావిపాకే బహుధర్మవృద్ధిం।
తటాకకూపాది వనప్రతిష్ఠా
దేవార్చనం భూసురపూజనంచ॥ 53

తా. నవమస్థానమందున్నచంద్రదశాకాలమందు అనేక ధర్మకార్యములు జరుగును గాకను, చెఱువులు, బావులు, గుంటలు మొదలగు వాటి నిర్మాణమును, వనప్రతిష్ఠయు, దేవపూజయు బ్రాహ్మణపూజయు కలుగును.

శ్లో॥ కర్మస్థితస్యాపి నిశాకరస్య
దశావిపాకే బహుకర్మవృద్ధిః
యజ్ఞక్రియా కీర్తి వివృద్ధిరంచ
స్వదేహసౌఖ్యం సుఖలాభ మేతి॥ 54



తా. దశమస్థానమందున్న చంద్రదశాకాలమందు బహుకర్మవృద్ధియు, యజ్ఞకార్యాదులు చేయుటచే విశేషకీర్తియు, స్వకీయ దేహసౌఖ్యమును, సుఖలాభమును కలుగును.

శ్లో॥ లాభస్థితస్యాపి నిశాకరస్య
దశావిపాకే ధనలాభ మేతి।
సుతోత్సవం బంధు జనానుమోదం
ధనాంబరప్రాప్తి ముపైతిసిద్ధిం॥ 55

తా. ఏకాదశ స్థానమందున్న చంద్రదశా కాలమందు ధనలాభమును, పుత్రోత్సవమును, బంధుజన సంతోషమును, ధనలాభమును, వస్త్రప్రాప్తియు కలుగును.

శ్లో॥ వ్యయగత చంద్రదశాయాం తనుతాపం కార్యహానించ।
స్త్రీసుతనాశం కురుతే గోనాశం క్షేత్రనాశంచ॥ 56

తా. ద్వాదశరాశియందున్న చంద్రదశలో దేహతాపమును, కార్యహానియు, భార్యాపుత్ర నాశనమును, పశునష్టమును క్షేత్రహానియు కలుగును.

---

ఆరోహ చంద్రదశాఫలం.

శ్లో॥ ఆరోహస్థస్య శశినః దశాశుభ ఫలప్రదా।
కీర్తిభూషణ వస్త్రాప్తిః గృహేకళ్యాణ వృద్ధిదం॥ 57

తా. ఆరోహస్థితియందున్న చంద్రదశ శుభఫలము నిచ్చును. గాకను కీర్తిలాభమును, భూషణ సంగ్రహమును, వస్త్ర ప్రాప్తియు, యింటియందు కళ్యాణవృద్ధియు కలుగచేయును

అవరోహ చంద్రదశాఫలం.

శ్లో॥ అవరోహవిధోర్దాయే యత్నకార్య వినాశనం।
శిరోభ్రమణ రోగాది మూత్రకృచ్ఛ్రాది పీడనం॥ 58
చంద్రదశాయమాదౌ నరపతిసన్మానం కీర్తిసౌఖ్యంచ।
మధ్యే స్త్రీసుతనాశం గృహధనసౌఖ్యాంబరంచాంతే॥ 59

తా. అవరోహస్థితియందున్న చంద్రుడు తన దశాకాలమందు యత్నకార్య వినాశమును, శిరోభ్రమణయు, రోగబాధయు, మూత్రకృచ్ఛ్రాది పీడనయు, కలుగును. చంద్రదశ ఆదిభాగమందు రాజసన్మానమును, కీర్తిసౌఖ్యమును, మధ్యభాగమందు భార్యాపుత్ర వినాశమును, అంత్యభాగమందు గృహలాభమును, ధనసౌఖ్యమును, వస్త్రలాభమును కలుగును.

చంద్రదశాయాం చంద్రభుక్తిమాసాః 10.

పారాశర్యే॥

శ్లో॥ చంద్రస్యాంతర్గతేచంద్రే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
రాజసన్మానకీర్తిశ్చ వివాహః పుత్రసంపదః॥
మహారాజప్రసాదేన గ్రామభూమ్యాది లాభకృత్।
వాహనం రాజ్యలాభశ్చ స్వోచ్చస్వక్షేత్రసంయుతే॥ 1

తా. చంద్రుడు తనదశలో స్వభుక్తియందు లగ్నమునకు కేంద్రకోణములయందున్న యెడల, రాజసన్మానమును, కీర్తియు, వివాహమును పుత్రసంపదయు, మహారాజానుగ్రహమునలన గ్రామాధిపత్యమును, భూలాభమును, వాహనయోగమును, రాజ్య లాభమును కలుగచేయును. స్వోచ్చ స్వక్షేత్రములయందున్న యెడల వాహనయోగమును రాజ్య లాభమును కలుగును.

శ్లో॥ త్రికోణలాభగేచంద్రే గురుయుక్తేథవీక్షితే।



రాజ్యలాభం మహత్సౌఖ్యం యశోవృద్ధిం శుభాధికం।
పూర్ణచంద్రే పూర్ణఫలం సేనాధిక్యం మహత్సుఖం।
భాగ్యకర్మాధిపేయుక్తే గజాస్వాంబర సంకులం।
దేవతాగురుభక్తించ పుణ్యశ్లోకాదికీర్తనం॥ 2

తా. చంద్రుడు త్రికోణలాభములయందున్నను లేక గురువీక్షణ కలిగియున్నను రాజ్యలాభమును విశేషసౌఖ్యము, యశోవృద్ధియు, అధికశుభమును, పూర్ణచంద్రుడైన యెడల పూర్ణఫలమును, సేనాధిక్యమును, అధికసుఖమును కలుగును. నవమ దశమాధిపతులతో కలసియున్న యెడల ఏనుగులు, గుఱ్ఱములు, వస్త్రములు, మొదలగు వాటిలాభమును, దేవతాపూజయు, గురుభక్తియు, పుణ్యశ్లోకాది కీర్తనయు కలుగును.

శ్లో॥ పాపయుక్తేథవాచంద్రే నీచేషష్ఠాష్టరిఃఫగే।
తత్కాలేధననాశస్స్యాత్ స్థానచ్యుతి మనోవ్యథా॥
దేహాయాసం మనస్తాపం రాజమంత్రివిరోధకృత్।
గ్రహోక్తరాశిదిగ్భాగే ప్రయాణంచభవిష్యతి॥
కృత్వాసమరమత్యుగ్రం హతాశ్వోహతసంకులః॥
అయుధేనక్షతాదీని జిత్వాశత్రురణేపిచ॥
మిత్రాత్మబంధునాశస్స్యాత్ స్వప్రభోశ్చాపమృత్యుకృత్।
యదిజీవతపుణ్యంస్యాదాయుష్యంస్యాత్ప్రవృద్ధయే॥ 8

తా. చంద్రుడు పాపయుక్తుడైనను లేక నీచ షష్ఠాష్ట వ్యయములయందున్నను, ఆకాలమందు ధననాశమును, స్థాననాశమును, మనోవ్యథయును, దేహాయాసమును, మనస్తాపమును, రాజ మంత్రివిరోధమును, యుక్తగ్రహరాశి కేర్పడిన దిక్కునకు ప్రయాణమును, యుద్ధమునందు అధికఉగ్రమును, చంపబడిన గుఱ్ఱములయొక్క సంకులమును, ఆయుధదెబ్బలవల్ల

కలిగిన గాయములును, రణమందు శత్రువులకు జయమును మిత్రనాశమును, బంధునాశమును, స్వకీయ ప్రభువుమూలకముగా అపమృత్యువు కలుగును.

శ్లో॥ ద్వితీయద్యూననాథేతు రంధ్రాధిప సమన్వితే।
దేహజాడ్యంమానభంగ మపమృత్యు భయంభవేత్॥
శ్వేతాంగాంమహిషీందద్యా న్మృత్యుంజయజపంచరేత్।
పశ్చాత్సౌఖ్యమవాప్నోతి యిష్టసిద్ధిర్భవిష్యతి॥ 4

తా. ద్వితీయ సప్తమాధిపతులతోగాని అష్టమాధిపతితోగాని కూడియున్నయెడల దేహజాడ్యమును మానభంగమును, అపమృత్యుభయమును, కలుగును. తెల్లని మహిషదానము చేసి మృత్యుంజయ జప మాచరించిన పిమ్మట సౌఖ్యమును, ఇష్టసిద్ధిని కలుగును.

---

చంద్ర దశాయాం కుజభుక్తిమాసాః 7.

పారాశర్యే॥

శ్లో॥ చంద్రస్యాంతర్గతే భౌమే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
సౌభాగ్యం రాజసన్మానం వస్త్రాభరణ భూషితః॥
యత్నకార్యార్థసిద్ధిస్స్యా ద్భవిష్యతి నసంశయః।
గృహక్షేత్రాదివృద్ధిశ్చ వ్యవహార స్తథైవచ॥
కార్యలాభం మహత్సౌఖ్యం స్వోచ్చస్వక్షేత్ర జంఫలం॥

తా. చంద్రదశలో భుక్తినాథుడగు కుజుడు లగ్నమునకు కేంద్ర త్రికోణములయందున్న యెడల సౌభాగ్యమును, రాజసన్మానమును వస్త్రాభరణ ప్రాప్తియు, యత్నకార్యార్థసిద్ధియు, నిస్సంశయముగా కలుగును. గృహక్షేత్రాదివృద్ధియు, వ్యవహారమునందు జయమును, కార్యలాభమును, అధిక సౌఖ్యమును, స్వోచ్చ, స్వక్షేత్రములయందున్న కుజభుక్తియందు కలుగును.



శ్లో॥ భ్రాతృవర్గాభివృద్ధిశ్చ కీర్తిలాభం ధనాగమం।
షష్ఠాష్టమవ్యయేభౌమే పాపయుక్తేథవాయది॥ 2

తా. కుజుడు షష్ఠాష్టమ వ్యయములయందున్నను, లేక పాపగ్రహముతో కూడియున్నను, సోదరుల అభివృద్ధియు కీర్తిలాభమును. ధనాగమంబును కలుగును.

యవనజాతకే॥

శ్లో॥ నీచేకర్మవినాశనం నృపభయం దేహార్తిం చిత్తభ్రమం।
నిష్ఠూరం స్వజనాదిభృత్యకలహం భూమీశవైరోద్భవం।
దుఃఖంస్యాత్ పరదేశకార్యకలహం దేహోష్ణచింతాజ్వరం।
ఏవంనీచ ఫలంవదంతి యవనాచార్యేణ ప్రోక్తంమతం॥ 3

తా. కుజుడు నీచక్షేత్రము పొందియుండగా కర్మవినాశమును, రాజభయమును, దేహాలస్యమును, చిత్త భ్రమణయు, నిష్ఠూరమును, స్వజనులతోడ కలహమును, సేవకులతో కలహమును, రాజవిరోధమును, దుఃఖమును, పరదేశ కార్యముల యందు కలహమును, దేహమందు ఉష్ణాధిక్యమును, చింతాజ్వరమును, కలుగునని యవనాచార్యమతము.

శ్లో॥ శుభయుక్తే శుభక్షేత్రే శుభదృష్టి యుతేయది।
చతుష్పాజ్జీవలాభస్స్యా ద్ధనధాన్య సమృద్ధయః।
వాహనంపుత్రలాభశ్చ కృషిగోధన సంపదః॥ 4

తా. కుజుడు శుభగ్రహముతో కూడియున్నను, లేక చూడబడినను, శుభక్షేత్రమందున్నను చతుష్పాజ్జీవలాభమును, ధనధాన్య సమృద్ధియు, వాహనలాభమును, పుత్రలాభమును, కృషిలాభమును, గోధనసంపదయు కలుగును.

కృష్ణీయే॥

శ్లో॥ రవిణా సంయుతేవృష్టే స్వాధికార పదస్థితిం।

నృపాప్తిం భూషణప్రాప్తిం చింతితార్థస్యసిద్ధిదం॥ 5

తా. కుజుడు సూర్యునితో కలసినను లేక చూడబడినను అధికార అభివృద్ధియు, రాజప్రీతియు, భూషణలాభమును, చింతించిన కార్యసిద్ధియు కలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే మనోత్సాహం మహత్సుఖం।
బంధుకల్యాణసంతోషం క్షేత్రలాభం తథైవచ॥ 6

తా. చంద్రునితోకూడినను లేక చూడబడినను మనోత్సాహమును, అధికసుఖమును, బంధువివాహ సంతోషమును, క్షేత్రలాభమును కలుగును.

శ్లో॥ సౌమ్యేనసంయుతేదృష్టే వేదశాస్త్రాదిసంగ్రహం।
బంధూనాముపకారత్వం వాక్పాండిత్యమనోజయం॥ 7

తా. బుధునితోకలసినను లేక చూడబడినను, వేదశాస్త్రాది సంగ్రహంబును, బంధుజనోపకారంబును, వాక్పాండిత్యమును, మనోజయంబును కలుగును.

శ్లో॥ గురుణాంసంయుతేదృష్టే దేహారోగ్యంతథైవచ।
సురభూసురపూజాంచ ద్రవ్యలాభంభవిష్యతి॥ 8

తా. గురువుతోకలసినను లేక చూడబడినను దేహారోగ్యమును, దేవబ్రాహ్మణ పూజయు, ద్రవ్య లాభంబును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే దారపుత్రసమాగమం।
స్థానప్రాప్తిర్హేమలాభం అశ్వాద్యారోహణం తథా॥ 9

తా. శుక్రునితోకలసినను లేకచూడబడినను, భార్యాపుత్ర సమాగమంబును, స్థానప్రాప్తియు, హేమలాభమును, గుఱ్ఱము మొదలగు వాహనారోహణమును, సిద్ధించును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే సంతాపం దేహపీడనం।



జ్వరాతిసారరోగాది సమానజననాశనం॥ 10

తా. శనితోకలసినను లేక చూడబడినను, సంతాపమును, దేహపీడయు, జ్వరము, అతిసారము, మొదలగు రోగభయమును, సమానజననాశనమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణస్థే దుశ్చిక్యే లాభగేపివా।
తద్భుక్తౌవాహనప్రాప్తిః మహారాజప్రసాదతః॥
పశుధాన్యాభివృద్ధిశ్చ భ్రాతృవర్గ శుభోదయం।
పుత్రదారాదిసౌఖ్యంచ యుద్ధేషుజయమాప్నుయాత్॥

తా. కుజుడు దశానాథునకు కేంద్రకోణములయందున్నను, లేక తృతీయ లాభములయందున్నను, ఆభుక్తియందు వాహనప్రాప్తియు, మహారాజానుగ్రహమును కలుగును. గాకను పశువృద్ధియు, ధాన్యలాభమును, భ్రాతృవర్గమునకు శుభము, భార్యాపుత్ర సుఖమును, యుద్ధమునందు జయమును కలుగును

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
తద్భుక్తౌబంధునాశశ్చ విదేశగమనంతథా॥
జ్ఞాతిశత్రువివృద్ధిశ్చ క్షేత్రనాశం తథైవచ।
ఇష్టమిత్రవిరోధశ్చ సమానజననాశనం॥ 12

తా. దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను లేక పాపులతో కలసియున్నను, ఆభుక్తియందు బంధునాశమును, విదేశగమనమును, జ్ఞాతివిస్తృద్ధియు, శత్రుబాధయు, క్షేత్రనాశము, ప్రియ స్నేహితులయొక్క విరోధమును, సమాన జననాశమును కలుగును.

శ్లో॥ షష్ఠాష్టమవ్యయాధీశే ద్వితీయాధిపభుక్తిషు।
సప్తమాధిపయుక్తేన అపమృత్యుర్భవిష్యతి।

తద్దోషపరిహారార్థం స్కందపంచాక్షరం జపేత్।
భాస్కరప్రార్థనంకుర్యాన్నాగదానంచ శామ్యతి॥ 13

తా. ద్వితీయాధిపతి భుక్తియందు షష్ఠాష్టమవ్యయాధిపతులు సప్తమాధిపతితో కూడియున్న యెడల అపమృత్యువు కలుగును. ఆదోషపరిహారార్థమై స్కందపంచాక్షరజపమును, సూర్యప్రార్థనయు చేసి, నాగదానము యిచ్చినపిమ్మట శాంతి కలుగును.

---

చంద్రదశాయాం రాహుభుక్తిమాసాః 18

పారాశర్యే॥

శ్లో॥ చంద్రస్యాంతర్గతేరాహౌ లగ్నాత్కేంద్రత్రికోణగే।
ఆదౌసౌఖ్యం ఫలంజ్ఞేయం శత్రునాశంమహద్భయం॥
చోరాగ్నినృపభీతిశ్చ చతుష్పాజ్జీవనాశనం।
బంధునాశం మిత్రహానిః కలహేన మనోవ్యథా॥ 1

తా. చంద్రదశలో భుక్తినాథుడగు రాహువు లగ్నమునకు కేంద్ర త్రికోణములయందున్న యెడల, ఆభుక్తి ఆదిభాగమందు సౌఖ్యఫలము వచింపతగినది. శత్రునాశమును, అధిక భయమును, చోరబాధయు, అగ్నిభయమును, రాజభీతియు, చతుష్పాజ్జీవనాశనమును, బంధువినాశమును, మిత్రహానియు, కలహ మూలకముగా మనోవ్యథయు సంభవించును.

శ్లో॥ శుభయుక్తే శుభేదృష్టే ధనధాన్య సమృద్ధిమాన్।
యవనప్రభుసన్మానం జాతకస్య శుభాశుభం॥ 2

తా. శుభగ్రహముతో కూడియున్నను లేక చూడబడినను, ధనధాన్య సమృద్ధియు, మ్లేచ్ఛప్రభు సన్మానమును శుభాశుభ ఫలములును, జాతకునకు కలుగును.

శ్లో॥ రంధ్రస్థానాధిపేయుక్తే దృష్టేవా దేహపీడనం।



తప్వరోగ విషాద్భీతిః శుభయుక్తేన దోషభాక్॥ 3

తా. రాహువు అష్టమస్థానాధిపతితో కూడియున్నను లేక చూడబడినను, దేహపీడయు, తప్వరోగమును, విషభీతియు, కలుగును. శుభగ్రహముతో గూడియున్న యెడల ఆ దోషములు నశించును.

శ్లో॥ తృతీయేలాభగేవాపి శుభగ్రహయుతేపివా।
ఉచ్చరాశిగతేవాపి తద్భుక్తౌ వ్యాధినాశనం॥
రాజసన్మానమైశ్వర్యం స్వపుత్రాణాంశుభప్రదం।
స్వనామాంకితఉద్యోగం యత్నకార్యార్థసిద్ధిదం॥
తీర్థస్నానంచలభతే దేవతోత్సవదర్శనం।
చతుష్పాజ్జీవలాభశ్చ వస్త్రభూషణమాయతిం।
సమరేవిజయంచైవ జ్ఞాతిశత్రువినాశనం॥ 4

తా. భుక్తినాథుడగు రాహువు తృతీయలాభములయందున్నను, శుభగ్రహముతో కూడియున్నను, లేక తన ఉచ్చరాశిని పొందియున్నను ఆ భుక్తియందు వ్యాధినాశనమును, రాజసన్మానమును ఐశ్వర్యమును, స్వకీయ పుత్రులకు శుభప్రదమును, తన పేరు అంకితముగాగల ఉద్యోగలాభమును, యత్నకార్యార్థసిద్ధియు, తీర్థస్నాన ఫలమును, దేవతాదర్శనమును, ఉత్సవమును, చతుష్పాజ్జీవలాభమును, వస్త్ర భూషణప్రాప్తియు, యుద్ధమునందు జయమును, జ్ఞాతిక్షయమును, శత్రునాశమును కలుగును.

శ్లో॥ షష్ఠాష్టమవ్యయేరాహౌ నీచస్థే పాపసంయుతే।
[illegible] ద్వైలీరోగతస్తథా॥
తత్కాలేపుత్రమరణం భూమౌనిర్వీర్యచేతసః।
స్థానచ్యుతి మవాప్నోతి కలహం శత్రువృద్ధిదం॥

తద్దోషయోగసంప్రాప్తే సర్పవృశ్చికపీడనం॥
రక్తస్రావం మూత్రరోగం వాహనాదిక్షయంభవేత్॥

తా. భుక్తినాథుడగు రాహువు ౬-౮-౧౨. స్థానముల యందున్నను లేక తన నీచరాశిని పొందియున్నను అథవాపాప గ్రహముతో కలసియున్నను ఆభుక్తియందు రోగద్వయముల చేతనైనను, లేక శత్రుద్వయముచేతనైనను మరణము కలుగును. ఆకాలమందు పుత్రమరణమును, భూములయందు పంటలు లేకపోవుటయు,స్థాననాశమును, కలహమును, శత్రువృద్ధియు, కలుగును. ఆదోషయోగము సంప్రాప్తించిన కాలమందు సర్పబాధయు, వృశ్చికపీడయు రక్తస్రావమును, మూత్రరోగమును, వాహనాదిక్షయమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే సన్నిపాత జ్వరంభయం।
అతికష్టంమానభంగం స్వస్థాన చలనంతథా॥ 6

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, సన్నిపాత జ్వరమును, అతికష్టమును, మానభంగమును, స్వస్థాన చలనమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టే మాతృకష్టంవినిర్దిశేత్।
మనఃకష్టంచఖేదంచ కలహంచభవిష్యతి॥ 7

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను మాతృకష్టమును, మనోచింతయు, వ్యసనమును,కలహమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే రక్తస్రావాది పీడనం।
పశుక్షేత్రవినాశశ్చ మహావ్యాధిర్భవిష్యతి॥ 8

తా. కుజునితో కలసినను లేక చూడబడినను రక్తస్రావాది రోగపీడయు, పశుహానియు, క్షేత్రనాశమును, మహావ్యాధియు కలుగును.



శ్లో॥ సౌమ్యేనసంయుతేదృష్టే బాంధవానాం సమాగమం।
విష్ణుగాథాప్రసంగంచ వస్త్రభూషణసంగ్రహః॥ 9

తా. బుధునితో కలసినను లేక చూడబడినను బంధుజనుల సమాగమంబును, విష్ణుకథాప్రసంగమును, వస్త్రభూషణ సంగ్రహమును కలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే అర్థసిద్ధిర్భవిష్యతి।
దేవార్చనం విష్ణుపూజా పుత్రదారాదిసౌఖ్యదం॥ 10

తా. గురువుతో కలసినను లేక చూడబడినను అర్థసిద్ధియు, దేవార్చనమును, విష్ణుపూజయు, భార్యాపుత్రాది సౌఖ్యమును కలుగును.

శ్లో॥ శుక్రేణవస్త్రహేమాది మణిమాణిక్యసంగ్రహం,
అశ్వాద్యారోహణంచైవ విచిత్రగృహలాభకృత్॥ 11

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, వస్త్రప్రాప్తియు,బంగారులాభమును, మణిమాణిక్య సంగ్రహమును, అశ్వాదుల ఆరోహణ యోగమును, విచిత్రములైన గృహలాభమును కలుగును.

శ్లో॥ శనినాపుత్రపీడాచ విదేశగమనంతథా।
బంధుద్వేషంమనస్తాపం నృపమూలా ద్ధనవ్యయం॥ 12

తా. శనితో కలసినను లేక చూడబడినను పుత్రపీడయు, విదేశగమనమును, బంధుద్వేషమును, మనస్తాపమును, రాజమూలకముగా ధనవ్యయమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా।
శుభగ్రహయుతేవాపి ధనలాభం తదైవచ॥
క్షేత్రపశ్వాదివృద్ధిశ్చ వస్త్రభూషణమాయతిం।
తీర్థస్నానఫలప్రాప్తి ర్దేవతాగురుదర్శనం॥ 13

తా. రాహువు దశానాథునకు కేంద్రకోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను లేక శుభగ్రహముతో కూడియున్నను ఆభుక్తియందు ధనలాభమును, క్షేత్రాభివృద్ధియు, పశులాభమును, వస్త్ర భూషణప్రాప్తియు, తీర్థస్నానఫలప్రాప్తియు, దేవతాపూజయు, గురుదర్శనమును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
భుక్త్యాదౌ రుతుమాసేచ దేహకష్టం మహద్భయం॥
దారపుత్రవినాశశ్చ సమానజననాశనం।
బంధుక్రోధం స్త్రీవివాదం స్థాననాశం ధనక్షయం॥ 14

తా. రాహువు దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను లేక పాపగ్రహముతో కూడియున్నను, ఆభుక్తి ఆదియందు ఆఱు మాసములు దేహకష్టమును, విశేష భయమును, భార్యాపుత్ర వినాశమును, సమాన జన నాశమును, బంధుద్వేషమును, స్త్రీకలహమును, స్థాననాశమును, ధనక్షయమును కలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం మృత్యుంజయజపంచరేత్।
ఛాగాదిపంచకంచైవ దేహారోగ్యం మహత్సుఖం॥ 15

తా. భుక్తినాథుడగు రాహువు ద్వితీయసప్తమ స్థానములయందున్నయెడల అపమృత్యువు సంభవించును. ఆ దోష పరిహారార్థమై మృత్యుంజయ జపమును, ఐదు మేకలను దానము చేసినపిమ్మట దేహారోగ్యమును, అధిక సుఖమును కలుగును.

---

చంద్రదశాయాం గురుభుక్తిమాసాః 16
కృష్టిర్యే॥

శ్లో॥ చంద్రస్యాంతర్గతేజీవే లగ్నాత్కేంద్రత్రికోణగే।



తృతీయలాభగేవాపి ఉచ్చక్షేత్రే శుభసంయుతే।
తద్భుక్తౌ ద్రవ్యలాభశ్చ నృపప్రీతిర్మహోత్సవః।
మహారాజాశ్రయప్రాప్తిః ఇష్టసిద్ధిర్భవిష్యతి॥
పుత్రలాభం దేహసౌఖ్యం విద్యాప్రాప్తిస్సుకీర్తిదా।
శివకేశవభక్తిశ్చ యజ్ఞయాగాది చింతనం।
వస్త్రాలంకారభూషాప్తిః చతుష్పాజ్జీవలాభకృత్।

తా. చంద్రదశా గురుభుక్తియందు, గురువు లగ్నమునకు కేంద్రత్రికోణములయందున్నను, తృతీయ లాభములయందును, లేక తన ఉచ్చక్షేత్రమందున్నను, అథవా శుభగ్రహ సంబంధము కలిగియున్నను ఆభుక్తియందు ద్రవ్యలాభమును, రాజప్రీతియు, మహోత్సవమును, మహారాజాశ్రయప్రాప్తియు, ఇష్టసిద్ధియు, పుత్రలాభమును, దేహసౌఖ్యమును, విద్యాప్రాప్తియు, మంచికీర్తియు, శివభక్తియు, విష్ణుపూజయు, యజ్ఞయాగాది చింతనయు, వస్త్రాలంకార భూషణప్రాప్తియు, చతుష్పాజ్జీవలాభమును కలుగును.

శ్లో॥ షష్ఠాష్టమవ్యయేజీవే నీచేవాస్తంగతేయది।
పాపకర్మ సమాయుక్తో గురుపుత్రాదినాశనం॥
స్థానభ్రష్టం మనోదుఃఖం అకస్మాత్కలహంతథా।
గృహక్షేత్రాదినాశశ్చ వాహనాంబరనాశనం।
దాయాదికలహంచైవ గర్భస్రావో భవిష్యతి॥ 2

తా. గురువు ౬-౮-౧౨. స్థానములయందున్నను, నీచరాశియందున్నను లేక అస్తంగతుడైనను, పాపకర్మములు చేయుటయందు ఆసక్తియు, గురుహానియు పుత్రాది నాశనమును, స్థానభ్రష్టమును, మనోదుఃఖమును, నిష్కారణముగా కలహమును, గృహక్షేత్రాది నాశనమును, వాహనక్షయమును,

వస్త్రనాశనమును, దాయాది కలహమును, గర్భస్రావమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే సన్నిపాతజ్వరోద్భవం।
వివాదయుద్ధకలహం సమరే శత్రువృద్ధిదం॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, సన్నిపాత జ్వరభయమును, వివాద యుద్ధమును, కలహమును, శత్రువృద్ధియు కలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టే కీర్తిలాభంమనోత్సవం।
అర్థలాభం వస్త్రలాభం స్త్రీపుత్రాణాం శుభప్రదం॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను కీర్తిలాభమును, మనోత్సాహమును, అర్థప్రాప్తియు, వస్త్రసంగ్రహమును, భార్యాపుత్రులకును శుభమును కలుగును.

శ్లో॥ భౌమేనసంయుతేదృష్టే సమరేశత్రువృద్ధిదః।
దాయాదికలహంచైవ క్షేత్రధాన్య వినాశనం॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను యుద్ధమునందు శత్రువృద్ధియు, దాయాదికలహమును, క్షేత్రక్షయమును, ధాన్యవినాశమును కలుగును.

శ్లో॥ సౌమ్యేనసంయుతేదృష్టే వేదశాస్త్రాదిసంగ్రహః।
విచిత్రగృహలాభశ్చ విష్ణుపూజాదితత్పరః॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను వేద శాస్త్రాది సంగ్రహమును, విచిత్రగృహలాభమును, విష్ణుపూజచే కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే స్త్రీసౌఖ్యం బంధువృద్ధిదం।
వాహనాంబరసంప్రాప్తి హేమభూషణలబ్ధవాన్॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను స్త్రీసౌఖ్యమును, బంధువృద్ధియు, వాహనలాభమును, వస్త్రప్రాప్తియు, బంగారు భూషణాదుల లాభమును కలుగును.



శ్లో॥ శనినాసంయుతేదృష్టే పుత్రనాశంధనక్షయం।
స్థాననాశం నృపాద్భీతిః భృత్యవర్గ విరోధకృత్॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను పుత్రనాశమును, ధనక్షయమును, స్థాననాశమును, రాజభీతియు, సేవకాజన విరోధమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యేలాభగేపివా॥
కళత్రసుఖసౌఖ్యంచ తీర్థయాత్రాది చింతనం।
శివదీక్షాప్రసంగంచ సర్వకార్యసుసిద్ధిదం।
దూరాల్లేఖనసంప్రాప్తిః సమానప్రభుదర్శనం।
స్వవారేరాజసన్మానం ధనలాభంభవిష్యతి॥ 9

తా. భుక్తినాథుడగు గురువు దశానాథునకు కేంద్రకోణములయందును, లేక తృతీయ లాభములయందున్నను ఆ భుక్తియందు కళత్రసుఖమును, దేహసౌఖ్యమును, తీర్థయాత్రాది చింతనయు, శివదీక్షా ప్రసంగమును, సర్వకార్యసిద్ధియు, దూరదేశమునుండి లేఖాగమనమును, సమాన ప్రభుదర్శనమును, తనవారమునందు రాజసన్మానమును, ధనలాభమును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవాపాపసంయుతే।
తద్భుక్తౌ ధననాశశ్చ దేహబాధా భవిష్యతి।
పుత్రదారవియోగశ్చ నీచస్త్రీకలహంతథా। 10

తా. గురువు దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను లేక పాపసంబంధము కలిగియున్నను ఆభుక్తియందు ధననాశమును, దేహబాధయు, భార్యాపుత్ర వియోగమును, నీచస్త్రీ కలహమును కలుగును

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం దుర్గాలక్ష్మీ జపంచరేత్॥ 11

తా. భుక్తినాథుడగు గురువు ద్వితీయ సప్తమరాసులయందున్నయెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై దుర్గా లక్ష్మీజపమాచరించవలయును.

---

చంద్రదశాయాం శనిభుక్తిమాసాః 19.

శ్లో॥ చంద్రస్యాంతర్గతేమందే లగ్నాత్కేంద్రత్రికోణగే।
తృతీయేవా భగేవాపి ఉచ్చక్షేత్రస్థితేపివా॥
తద్భుక్తౌ ప్రభుసన్మానం బాంధవాది సమాగమం।
ధనవాహనసంప్రాప్తి ర్యత్నకార్యార్థ సిద్ధిదం॥
దేహారోగ్యం మహత్కీర్తి తీర్థయాత్రాదిచింతనం।
పశ్చిమాందిశిమాశ్రిత్య ప్రయాణంరాజదర్శనం॥
స్వప్రభోస్తు మహత్సౌఖ్యం శూద్రప్రభువశాత్సుఖం।
గోమహిష్యాది వృద్ధిశ్చ భృత్యవర్గవి వృద్ధిదం॥ 1

తా. చంద్రమహాదశలో భుక్తినాథుడగు శని లగ్నమునకు కేంద్రకోణములయందున్నను, తృతీయలాభములయందున్నను, లేక తన ఉచ్చక్షేత్రమందున్నను ఆభుక్తియందు ప్రభుసన్మానమును, బాంధవాది సమాగమంబును, ధనలాభమును, వాహనప్రాప్తియు, యత్నకార్యార్థసిద్ధియు, దేహారోగ్యమును,విశేషకీర్తియు, తీర్థయాత్రాది చింతనయు, పశ్చిమదిశకు ప్రయాణమును, రాజదర్శనమును, స్వంతప్రభువు మూలకముగా అధిక సౌఖ్యమును, శూద్రప్రభు మూలకముగా సుఖమును, గోవులు, మహిషములు మొదలగు చతుష్పాజ్జీవరాసుల వృద్ధియు, దాసదాసీజన అభివృద్ధియు కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టరాశిస్థే వ్యయేవానీచరాశిగే॥



భుక్త్యాదౌ శరమాసేషు దేహపీడాభవిష్యతి॥
సమానజననాశశ్చ చతుష్పాజ్జీవనాశనం।
కలహంరాజనిష్ఠూరం బంధునాశంతథైవచ॥
భృత్యవర్గవిరోధశ్చ నీచానాంకలహంతథా।
స్వస్థానచలనంచైవ చింతితార్థస్యనాశనం॥ 2

తా. శని లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయందున్నను లేక తన నీచరాశిని పొందియున్నను, భుక్తి ఆదిభాగమందు ఆఱుమాసములు దేహపీడయు, సమానజననాశమును, చతుష్పాజ్జీవనాశనమును, కలహమును, రాజనిష్ఠూరమును, బంధునాశమును, దాసదాసీజనవిరోధమును, నీచులతోడకలహమును, స్వస్థానచలనమును, చింతించిన కార్యనాశనమును కలుగును.

పారాశర్యే॥

శ్లో॥ చంద్రస్యాంతర్గతేమందే లగ్నాత్కేంద్రత్రికోణగే।
అల్పసౌఖ్యంఅల్పలాభం కార్యద్వేషం మహద్భయం॥
బంధుద్వేషకరందుఃఖం చతుష్పాజ్జీవనాశనం।
స్వక్షేత్రస్వాంశగేమందే తుంగక్షేత్రేథవాయది॥
భూలాభంపుత్రలాభంచ గృహక్షేత్రాదివర్ధనం।
గృహేకళ్యాణసంపత్తిః రాజానుగ్రహశాంతికం॥
శుభదృష్టియుతేమందే పుత్రమిత్రాదిసంపదః।
మహారాజప్రసాదేన గంధవస్త్రార్థసంపదః।
వ్యవసాయాత్ఫలాధిక్యం పుత్రదారాదివర్ధనం॥ 3

తా. చంద్రదశలో భుక్తినాథుడగు శని లగ్నమునకు కేంద్రత్రికోణములయందున్న యెడల అల్పసౌఖ్యమును,అల్పలాభమును, కార్యభంగమును, అధికభయమును, బంధుద్వేషమును, దుఃఖమును, చతుష్పాజ్జీవనాశనమును కలుగును. స్వక్షే

త్రమునగాని స్వనవాంశయందుగాని లేక తన ఉచ్చరాశియందుగాని శనియున్న కాలమందు భూలాభమును, పుత్రలాభమును, గృహలాభమును, క్షేత్రాదివృద్ధియు, యింటియందు కళ్యాణసంపత్తియు, రాజానుగ్రహమువల్ల మనోల్లాసమును కలుగును. శుభగ్రహయుక్తుడైనయెడల పుత్రమిత్రాది సంపదయు, మహారాజానుగ్రహమువల్ల గంధవస్త్రార్థసంపదయు, వ్యవసాయమూలకముగా నధిక ఫలమును, భార్యాపుత్రుల సౌఖ్యమును కలుగును.

శ్లో॥ సూర్యేణసంయుతేదృష్టే పితృబంధువినాశనం।
భూపక్రోధం ద్రవ్యనాశం ఉద్యోగంచవినాశనం॥ 4

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, పితృవియోగమును, బంధునాశమును, రాజకోపమును, ద్రవ్యనాశమును, ఉద్యోగహానియు కలుగును.

శ్లో॥ చంద్రేణసంయుతేదృష్టే నృపాశ్రయ మహత్సుఖం।
దుకూలవస్త్రసంప్రాప్తిః అపూర్వప్రియదర్శనం॥ 5

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, రాజాశ్రయమును, అధికసుఖమును, వస్త్రసంప్రాప్తియు, అపూర్వస్నేహితుల దర్శనమును కలుగును.

శ్లో॥ భౌమేనఘాతపాతాది ఉన్నతాత్పతనంతథా।
దాయాదివ్యవహారేణ కలహంనృపపీడనం॥ 6

తా. భుక్తినాథుడగు శని కుజునితో కలసినను లేక చూడ బడినను ఆకాలమందు దెబ్బలవలన కఠిన గాయములచే బాధయు, ఉన్నతస్థళమునుండి పడుటయు, దాయాదివ్యవహార మూలకముగా కలహమును, రాజపీడనయు కలుగును.

శ్లో॥ సౌమ్యేనవేదశాస్త్రాణి లిపివిద్యాదిసంగ్రహం।
మాతులాదివివృద్ధిశ్చ వస్త్రభూషణసంగ్రహం॥ 7



తా. బుధునితో కలసినను లేక చూడబడినను, వేదశాస్త్రాది జ్ఞానమును, కవిత్వమును, విద్యాదిసంగ్రహమును, మాతృవర్గపువారి కభివృద్ధియు, వస్త్ర భూషణప్రాప్తియు కలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే పుత్రనాశం తథైవచ।
బుద్ధిభ్రంశం దేహబాధా స్వస్థానచలనంతథా॥ 8

తా. గురువుతో కలసినను లేక చూడబడినను పుత్రనాశమును, బుద్ధిభ్రంశమును, దేహబాధయు, స్వస్థానచలనమును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే స్త్రీసౌఖ్యం బంధుదర్శనం।
వాహనంభూషణప్రాప్తి స్స్వాధికారపదస్థితిః॥ 9

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, స్త్రీసౌఖ్యమును, బంధుదర్శనమును, వాహనలాభమును, భూషణప్రాప్తియు, స్వకీయ అధికార అభివృద్ధియు కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా।
తద్భుక్తౌధనలాభశ్చ పశుసంగ్రహణంతథా॥
నీలవస్త్రాదిలాభశ్చ దాసదాసీ వివృద్ధిదం।
శూద్రప్రభువశాత్సౌఖ్యం నీచసేవాభవిష్యతి॥ 10

తా. శని దశానాథునకు కేంద్రకోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను ఆభుక్తియందు ధనలాభమును, పశుసంగ్రహణమును,నీలవస్త్రాదిలాభమును,దాసదాసీజన అభివృద్ధియు, శూద్రప్రభుమూలకముగా సౌఖ్యమును, నీచజనసేవయు కలుగును.

శ్లో॥ దాయేశాద్వ్యయగేరంధ్రే షష్ఠేవాపాపసంయుతే।

తద్భుక్తౌ జ్ఞాతికలహం పశుధాన్యక్షయంభవేత్।
సమానజనకష్టంచ నృపక్రోధంభవిష్యతి॥ 11

తా. శని దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను లేక పాపగ్రహముతో కూడియున్నను ఆభుక్తియందు జ్ఞాతికలహమును, పశునాశమును, ధాన్యక్షయమును, సమాన జనకష్టమును, రాజక్రోధమును కలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం మహిషీదానమేవచ।
ఛాగదానంప్రకుర్వీత విష్ణుసాహస్రకంజపేత్॥ 12

తా. భుక్తినాథునకు శని ద్వితీయ సప్తమస్థానముల యందున్నచో అపమృత్యువు సంభవించును. ఆ దోషపరిహారార్థమై మహిషీదానమును, ఛాగదానమును, చేయవలయును. విష్ణుసాహస్రక జపముకూడా చేయవలయును.

---

చంద్రదశాయాం బుధభుక్తిమాసాః 17.

పారాశర్యే॥

శ్లో॥ చంద్రస్యాంతర్గతేసౌమ్యే లగ్నాత్కేంద్రత్రికోణగే॥
స్వక్షేత్రస్వాంశగేసౌమ్యే తుంగేవాబలసంయుతే॥
క్షీరాన్నంరాజసన్మానం ప్రియవస్త్రాశ్వలాభకృత్।
విద్యావినోదసద్గోష్ఠీ ర్వాణిజ్యధనలాభకృత్॥
సంతానప్రాప్తిసంతోషం శౌర్యేణధననాశనం।
జ్ఞానవృద్ధిశ్చసౌఖ్యంచ పాండిత్యం శాస్త్రవేదినాం।
సాహిత్యంఛత్రసంయుక్తం నానాలంకారభూషితం॥ 1

తా. చంద్రదశలో భుక్తినాథుడగు బుధుడు లగ్నమునకు కేంద్రత్రికోణములయందున్నను, స్వక్షేత్రమందున్నను, స్వనాంశమందున్నను, లేక తనఉచ్చరాశియందు బలయుక్తుడై



యున్నను ఆభుక్తియందు క్షీరాన్నభోజనమును, రాజసన్మానమును, తనకు యిష్టమైన, వస్త్రలాభమును, అశ్వలాభమును, విద్యావినోదసద్గోష్ఠియు, వ్యాపార ధనలాభమును, సంతానప్రాప్తియు, సంతోషమును, శౌర్యపరాక్రమములచేత, ధననాశమును, జ్ఞానవృద్ధియు, సుఖమును, పాండిత్యమును, వేదశాస్త్ర ప్రసంగమును, పరోపకారత్వమును, ఛత్రచామరములతో గూడిన నానాలంకార భూషణమును కలుగును.

కృష్ణీయే॥

శ్లో॥ తృతీయేలాభగేవాపి హేమవస్త్రాదిలాభకృత్।
స్వగృహేధాన్యవృద్ధిశ్చ ప్రియవస్తుఫలంతథా॥ 2

తా. తృతీయ లాభములయందున్న యెడల హేమలాభమును, వస్త్రప్రాప్తియు, యింటియందు, ధాన్యవృద్ధియు, ప్రియవస్తు లాభమును కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టరాశిస్థే వ్యయేవానీచరాశిగే।
తద్భుక్తౌబంధునాశశ్చ మిత్రవర్గవిరోధకృత్॥
గృహభూమివినాశశ్చ జ్ఞాతీనాం కలహంతథా।
స్వవారేరాజకోపశ్చ దారపుత్రాదిపీడనం।
దేశాంతరాదిగమనం పశునాశంభవిష్యతి॥ 3

తా. బుధుడు లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయం దున్నను లేక తన నీచరాశిని పొందియున్నను ఆభుక్తియందు బంధునాశమును, మిత్రుజనులతోడ, విరోధమును, గృహనాశమును, భూనాశనమును, జ్ఞాతులతోడ కలహమును, తనవారమునందు రాజకోపమును, భార్యాపుత్రాది పీడయు విదేశగమనమును, పశునాశమును కలుగును.

గ్రంథాంతరే ॥

శ్లో॥ లగ్నాధిపేనసంయుక్తే ఆదౌసౌఖ్యంధనాగమం।
దారప్రీతికరంచైవ శుభాశుభ ఫలంలభేత్॥ 4

తా. బుధుడు లగ్నాధిపతితో కూడియున్నయెడల ఆది భాగమందు సౌఖ్యమును, ధనాగమంబును, భార్యప్రీతియును, శుభాశుభ ఫలంబులును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే రాజప్రీతిర్భవిష్యతి।
ఉద్యోగంధనలాభశ్చ పితృవర్గవివృద్ధిదం॥ 5

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను రాజప్రీతియు ఉద్యోగమును, ధనలాభమును, పితృవర్గపువారికి అభివృద్ధియు కలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టే సువస్త్రాభరణంతథా।
ఇష్టసిద్ధిస్సుఖావాప్తిః గృహేకళ్యాణవృద్ధిదః॥ 6

తా. భుక్తినాథుడగు బుధుడు చంద్రునితో కలసినను లేక చూడబడినను మంచి వస్త్రాభరణ ప్రాప్తియు, ఇష్టసిద్ధియు, సుఖమును, యింటియందు కళ్యాణ సంపదయు కలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే కలహంస్థాననాశనం।
జ్ఞాతిశత్రువివృద్ధిశ్చ సంతాపం గుల్మపీడనం॥ 7

తా. కుజునితో కలసినను లేక చూడబడినను కలహమును, స్థాననాశమును, జ్ఞాతివృద్ధియు, శత్రువృద్ధియు, సంతాపమును, గుల్మపీడనయు కలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే గురుదేవద్విజార్చనం।
ధనలాభంబంధువృద్ధిః నృపప్రీతిసమాగమం॥ 8

తా. గురునితో కలసినను లేక చూడబడినను గురు



పూజయు, దేవార్చనమును, బ్రాహ్మణభక్తియు, ధనలాభమును, బంధువృద్ధియు, రాజప్రీతియు కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే వాహనాంబరలబ్ధకృత్।
గీతగానవినోదశ్చ విచిత్రగృహలాభకృత్॥ 9

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను వాహనలాభమును, వస్త్రప్రాప్తియు, గీతగానవినోదమును, విచిత్రగృహలాభమును కలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే మాతులస్యవినాశనం।
బంధోర్విరోధం స్వస్థాన చలనం భృత్యనాశనం॥ 10

తా. శనితో కలసినను లేక చూడబడినను, మేనమామలకు నాశమును, బంధువిరోధమును, స్వస్థానచలనమును భృత్యనాశనమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యేలాభగేపివా।
శుభగ్రహాయుతేవాపి ధనలాభముదీరయేత్॥
తీర్థయాత్రా ప్రసంగశ్చ కళ్యాణాదిమహోత్సవం।
విష్ణుగాథాప్రసంగశ్చ శాస్త్రాభ్యాస ప్రసంగకృత్॥ 11

తా. దశానాథునకు కేంద్ర కోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను, లేక శుభగ్రహముతో కూడియున్నను, ధనలాభమును, తీర్థయాత్రాప్రసంగమును, కళ్యాణాది మహోత్సవమును, విష్ణుకథాప్రసంగమును, శాస్త్రాభ్యాస సంగ్రహమును కలుగును.

శ్లో॥ దాయేశాద్వ్యయగేరంధ్రే షష్ఠేవా పాపసంయుతే।
మనస్తాపం బంధునాశం అతికష్టఫలంతథా।
స్త్రీపుత్రజ్ఞాతికలహం మాతృవర్గవినాశనం॥ 12

తా. భుక్తినాథుడగు బుధుడు దశానాథునకు ౬-౮-౧౨.

స్థానములయందున్నను లేక పాపగ్రహయుక్తుడైనను మన స్తాపమును, బంధునాశమును, అతికష్టమును, భార్యాపుత్ర విరోధమును, జ్ఞాతి కలహమును, మాతృవర్గపువారి వినాశ మును కలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం లక్ష్మీనారాయణంజపేత్॥ 13

తా. బుధుడు ద్వితీయ సప్తమ రాసులయం దున్న యెడల అపమృత్యువు కలుగును. ఆదోష పరిహారార్థమై లక్ష్మీ నారాయణ జప మాచరించ వలయును.

---

చంద్రదశాయాం కేతుభుక్తిమాసాః 7.

శ్లో॥ చంద్రస్యాంతర్గతే కేతౌ లగ్నాత్కేంద్రత్రికోణగే।
తృతీయే లాభగేవాపి ఉచ్చరాశిస్థితేపివా॥
శుభగ్రహయుతేదృష్టే వాహనంభవతిధ్రువం।
గృహక్షేత్రాభివృద్ధిశ్చ వ్యవసాయత్ఫలాధికం॥
మహారాజప్రసాదేన గ్రామభూమ్యాదిలాభకృత్।
యత్నకార్యార్థసిద్ధిస్స్యా చ్ఛోరాణాంచసమాగమం॥
దారాత్మజాది సౌఖ్యంచ క్షేత్రధాన్యాదిసంభవం।
వస్త్రాభరణసంప్రాప్తిః సత్కర్మాది సు చింతనం॥ 11

తా. చంద్రదశలో భుక్తినాథుడగు కేతువు లగ్నము నకు కేంద్రత్రికోణములయందున్నను, తృతీయ లాభములయం దున్నను, తన ఉచ్చరాశిని పొందియున్నను, లేక శుభగ్రహ ముతో కూడినను అథవా చూడబడినను, నిశ్చయముగా వా హన యోగమును కలుగును. గాకను గృహలాభమును, క్షే త్రాభివృద్ధియు, వ్యవసాయమూలకముగా విశేష ఫలమును, మహారాజానుగ్రహమువల్ల గ్రామాధిపత్యమును, భూలాభ



మును, యత్నకార్యార్థసిద్ధియు, భార్యాపుత్ర సౌఖ్యమును, క్షేత్రధాన్యాది సంభవమును, వస్త్రాభరణ సంప్రాప్తియు, సత్కర్మాది చింతనయు కలుగును.

శ్లో॥ లగ్నాద్వ్యయాష్టషష్ఠస్థే నీచక్షేత్రస్థితేపివా।
పాపయుక్తేథవాదృష్టే ధననాశకరోభవేత్॥
హితశత్రుత్వకార్యాణి అకస్మాత్కలహంధ్రువం।
కారాగృహప్రవేశశ్చ చోరాగ్నినృపపీడనం॥
దారపుత్రవిరోధశ్చ వైషమ్యం శత్రువర్ధనం।
యత్నకార్యవినాశశ్చ విధవాకలహంతథా॥
స్వప్రభోస్తుమహత్కష్టం సమానజననాశనం॥ 2

తా. కేతువు లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నదు, నీచక్షేత్రమందున్నను, పాపగ్రహముతో కూడి యున్నను లేక చూడబడినను ధననాశమును, హితశత్రుత్వ మును,కార్యములయందు నిష్కారణముగా కలహమును,కారా గృహ ప్రవేశమును, చోరభయమును, అగ్నిభీతియు, రాజ పీడయు,భార్యాపుత్ర విరోధమును, ద్వేషమును, శత్రువృద్ధియు, యత్నకార్యవినాశమును, విధవా కలహమును, స్వంతప్రభు మూలకముగా అధిక కష్టమును, సమాన జననాశమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే విషశస్త్రాదిజంఫలం।
స్వాధికారవినాశశ్చ నృపక్రోధంభవిష్యతి॥ 3

తా. కేతువు రవితో కలసినను లేక చూడబడినను, విషశస్త్రాది పీడయు, స్వకీయ అధికారనాశమును రాజక్రోధ మును కలుగును.

శ్లో॥ చంద్రేణసంయుతేదృష్టే మాతృవంశవినాశనం।

కుక్షిబాధామనఃఖేదం వ్యవసాయేషునిష్ఫలం॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను మాతృవంశ వినాశమును, కుక్షిబాధయు, మనోవ్యసనమును, వ్యవసాయమునందు నిష్ఫలమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే విషశస్త్రాగ్నిజం భయం।
ఉష్ణజ్వరేణ సంతాపః గృహక్షేత్రాదినాశనం॥ 5

తా. కుజునితో కలసినను లేకచూడబడినను, విషభయమును, శస్త్రపీడయు, అగ్నిభీతియు, ఉష్ణజ్వరమువల్ల సంతాపమును, గృహనాశనమును, క్షేత్రాదినాశనమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే బాంధవానాంసమాగమం।
క్రయవిక్రయకౌశల్యం భిషగ్జన సమాగమం॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను బంధుసమాగమంబును, క్రయవిక్రయ కౌశల్యమును, క్షుద్రజన సహవాసమును కలుగును.

శ్లో॥ గురుణాంసంయుతేదృష్టే వేదాభ్యాసాది తత్పరః।
సమానజనమిత్రత్వం మందిరేచోత్సవంతథా॥ 7

తా. గురునితో కలసినను లేక చూడబడినను, వేదాభ్యాసాది జ్ఞానమును, సమానజన స్నేహితమును, గృహమునందు ఉత్సవాదులను కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే దారనాశంభవిష్యతి।
వాహనక్షేత్రనాశశ్చ ధాన్యనాశంతథైవచ॥ 8

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను భార్యవినాశమును. వాహనక్షయమును, క్షేత్రనాశమును, ధాన్యనాశమును కలుగును.

శ్లో॥ శనిదృష్టేయుతేవాపి అతిసారాజ్జ్వరాద్భయం।



స్వభృత్యకలహంచైవ నీచస్త్రీ సంగమంతథా॥ 9

తా. శనితో కూడినను లేక చూడబడినను అతిసారజ్వరభయమును, స్వంత సేవకులతోడ కలహమును, నీచస్త్రీ సంగమమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యేలాభగేపివా।
శుభగ్రహయుతేవాపి తత్పాకేచ మహోత్సవం॥
ప్రయాణేకార్యసిద్ధిస్స్యాన్మహారాజాశ్రయస్తథా।
సర్వకార్యనుసిద్ధిస్స్యాశ్శివపూజాఫలంభవేత్।
రాజసన్మానకీర్తిశ్చ వస్త్రాణ్యాభరణానిచ॥ 10

తా. కేతువు దశానాథునకు కేంద్రకోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను, లేక శుభగ్రహయుక్తుడైనను ఆభుక్తియందు మహోత్సవమును, ప్రయాణమునందు కార్యసిద్ధియు, మహారాజాశ్రయమును, సర్వకార్యసిద్ధియు, శివపూజాఫలమును, రాజసన్మానమును, కీర్తియు, వస్త్రాభరణ ప్రాప్తియు కలుగును.

గ్రంథాంతరే॥

శ్లో॥ కించిత్ఫలం తదాదౌతు అల్పసౌఖ్యంతు జాయతే।
స్వగృహేపశువృద్ధిశ్చ భుక్త్యంతేర్థవినాశనం॥ 11

తా. భుక్తి ఆదియందు అల్పఫలమును, అల్పసౌఖ్యమును, యింటియందు పశువృద్ధియు, భుక్తి అంత్యమందు అర్థనాశమును కలుగును.

శ్లో॥ దాయేశాద్రిష్ఫరంధ్రస్థే వ్యయేవాబలవర్జితే।
భూతోపద్రవరోగశ్చ క్షుద్రభీతిస్తథైవచ॥
అకస్మాచ్ఛత్రుభీతిశ్చ నానారోగాదిజంభయం।
మూత్రకృచ్ఛ్రాదిభీతిశ్చ వ్యవహారాద్భయంభవేత్॥ 12

తా. కేతువు దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయందు బలహీనుడై యుండెనేని భూతబాధవల్ల కలిగెడి రోగపీడయు, క్షుద్రభీతియు, అకస్మాత్తుగా శత్రుభయమును, నానా రోగాది పీడయు, మూత్రకృచ్ఛ్రాది రోగభయమును, వ్యసనహాం మూలకముగా భయమును కలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే తద్భుక్తౌమరణంధ్రువం।
ఛాగదానంప్రకుర్వీత సర్వసంపత్ప్రదాయకం॥ 13

తా. ద్వితీయ సప్తమరాసులయందున్న కేతుభుక్తియందు నిశ్చయముగా మరణము కలుగును. అందుకై ఛాగదానము చేయవలయును, తర్వాత సర్వసంపదయు లభించును.

---

చంద్రదశాయాం శుక్రభుక్తిమాసాః 20.

శ్లో॥ చంద్రస్యాంతర్గతేశుక్రే లగ్నాత్కేంద్రత్రికోణగే।
తృతీయేలాభగేవాపి శుభగ్రహాయుతేపివా।
కళ్యాణాది శుభప్రాప్తిః యానవాహనభోగకృత్।
రత్నాభరణసంప్రాప్తిః బహుద్రవ్యాయతంతథా।
పుత్రోత్సవాదిసంతోషం మహారాజాశ్రయంతథా।
ఇష్టకార్యార్థలాభశ్చ స్వవారే రాజదర్శనం।
సుగంధపుష్పశయ్యాది రమ్యస్త్రీసౌఖ్యసంపదం॥ 1

తా. చంద్రదశలో భుక్తినాథుడగు శుక్రుడు లగ్నమునకు కేంద్రకోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను లేక శుభగ్రహముతో కూడియున్నను, ఆభుక్తియందు కళ్యాణాది శుభప్రాప్తియు, యానవాహన భోగమును, రత్నాభరణ సంప్రాప్తియు, బహుద్రవ్యలాభమును, పుత్రోత్సవాది సంతోషమును, మహారాజాశ్రయమును, ఇష్టకార్యార్థసిద్ధియు, తన వారమునందు రాజదర్శనమును, సుగం



ధ పుష్పశయ్యాది రమ్యస్త్రీ సౌఖ్యసంపదయు కలుగును.

శ్లో॥ దశాధిపేనసంయుక్తే రాజ్యలాభంమహత్సుఖం।
కళ్యాణంరాజపూజ్యంచ పుత్రపౌత్రవివర్ధనం॥ 2

తా. శుక్రుడు దశానాథునితో కూడియున్నయెడల రాజ్య లాభమును, విశేషసుఖమును, కళ్యాణమును, రాజపూజ్యతయు, పుత్రపౌత్రాభివృద్ధియు, కలుగును.

శ్లో॥ నీచేవాస్తంగతేశుక్రే పాపయుక్తేథవీక్షితే।
భూమ్యాత్మజేనసంయుక్తే భూనాశంభవతిధ్రువం॥
శిరోవేదనసంతాపః దేహాలస్యం నృపాద్భయం।
చతుష్పాజ్జీవహానిస్స్యాజ్జ్వరంస్యాద్రాజ్యవిడ్వరం॥ 3

తా. శుక్రుడు నీచుడైనను, అస్తంగతుడైనను, పాపగ్రహముతో గూడినను లేక చూడబడినను, లేక కుజునితో కలసినను ఆభుక్తియందు నిశ్చయముగా భూనాశమును, శిరోబాధయు, సంతాపమును, దేహాలస్యమును, రాజభయమును, చతుష్పాజ్జీవహానియు, జ్వరభయమును, రాజనిష్ఠూరమును కలుగును.

శ్లో॥ స్వోచ్చేవాస్వర్క్షగేశుక్రే భాగ్యాధిప సమన్వితే।
తపోభాగ్యాదివృద్ధిశ్చ ధనధర్మాదిసంగ్రహః॥
గ్రామభూమ్యాదిలాభశ్చ పుత్రపౌత్రప్రవర్ధనం॥ 4

తా. శుక్రుడు తన ఉచ్చయందున్నను, స్వక్షేత్రమందున్నను లేక నవమాధిపతితో కలసినను ఆ భుక్తియందు తపోభాగ్యమును, సత్కర్మాభివృద్ధియు, ధనలాభమును, ధర్మకార్య ఫలమును, గ్రామాధిపత్యమును. భూలాభమును పుత్రపౌత్రాభి వృద్ధియు కలుగును.

శ్లో॥ లగ్నాత్షష్ఠవ్యయేరంధ్రే నీచరాశిసమన్వితే।

తద్భుక్తౌ దేహతాపశ్చ దారపుత్రాదినాశనం।
బాంధవానాంవిరోధశ్చ స్వస్థానచలనంతథా।
బంధుమిత్రవిరోధత్వం నీచస్త్రీకలహాంతథా।
గోనాశంభృత్యకలహం శత్రుబాధాభవిష్యతి॥ 5

తా. లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయందుగాని లేక తన నీచరాశియందుగానియున్న శుక్రభుక్తియందు దేహతాపమును, భార్యాపుత్రాది నాశమును, బంధువిరోధమును, స్వస్థాన చలనమును, మిత్రవిరోదమును, నీచస్త్రీ కలహమును, పశుహానియు, సేవకులతో కలహమును, శత్రుబాధయుకలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే భూపాలకలహంతథా।
ఉద్యోగభంగమాలస్యం కలహంసర్వనాశకృత్॥ 6

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, రాజులతో కలహముసు ఉద్యోగభంగమును, ఆలస్యమును, కలహమును సర్వనాశమును కలుగును.

శ్లో॥ చంద్రేణసంయుతేదృష్టే శ్వేతాశ్వాదివిశేషకృత్।
హేమాభరణవస్త్రాప్తిః ఇష్టసిద్ధిర్భవిష్యతి॥ 7

తా చంద్రునితోకలసినను లేక చూడబడినను తెల్లని గుఱ్ఱములును, బంగారు ఆభరణములును, వస్త్రప్రాప్తియు, ఇష్టసిద్ధియు కలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే కలహంధననాశనం।
దాయాదికలహంచైన వ్యవహారాదిజంభయం॥

తా. కుజునితో కలసినను లేక చూడబడినను కలహమును, ధననాశమును, దాయాదికలహమును, వ్యవహారమూలకముగా భయమును కలుగును.

శ్లో॥ సౌమ్యేనసంయుతేదృష్టే ఇష్టబంధుసమాగమం।



స్వదారపుత్రసౌఖ్యంచ వాహనప్రాప్తిరుచ్యతే॥ 9

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, ఇష్ట బంధు సమాగమంబును, భార్యాపుత్ర సౌఖ్యమును, వాహన ప్రాప్తియు కలుగును

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే దేహారోగ్యంమహాత్సుఖం।
పుత్రోత్పత్తిసుఖంచైవ యత్నకార్యసుసిద్ధిదం॥ 10

తా. గురువుతో కలసినను లేక చూడబడినను దేహారోగ్యమును, విశేషసౌఖ్యమును, పుత్రోత్పత్తియు, సుఖమును, యత్నకార్యసిద్ధియు కలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే స్వభృత్యకలహంతథా।
గోమహిష్యాదినాశశ్చ ధననాశంభవిష్యతి॥ 11

తా. శనితో కలసినను లేక చూడబడినను, స్వంతసేవకులతో కలహమును, గోవులు, గేదెలు మొదలగువాని నాశనమును, ధననాశమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యేలాభగేపివా।
శుభగ్రహయుతేవాపి తద్భుక్తౌద్రవ్యలాభకృత్॥
వాహనాందోళికప్రాప్తిః మహారాజప్రసాదతః।
స్వగృహేశోభనప్రాప్తిః స్త్రీసౌఖ్యం పుత్రసంపదః॥ 12

తా. శుక్రుడు దశానాథునకు కేంద్రకోణములయందైనను, తృతీయ లాభములయందున్నను లేక శుభగ్రహముతో కూడియున్నను ఆభుక్తియందు ద్రవ్యలాభమును, మహారాజానుగ్రహమువల్ల వాహనాందోళిక ప్రాప్తియు, యింటియందు శుభకార్యములు జరుగుటయు స్త్రీ సౌఖ్యమును, పుత్రసంపదయు కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవాపాపసంయుతే।

కళత్రదేహబాధాచ పుత్రనాశంతథైవచ॥
స్త్రీవివాదంచకలహం గమనేకార్యనాశనం।
కృషిధాన్యవినాశశ్చ అకస్మాత్కలహంతథా॥ 13

తా. దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను లేక పాపునితో కలసినను ఆభుక్తియందు కళత్రపీడయు, పుత్ర నాశమును. స్త్రీవివాదమును, కలహమును, యత్నించిన కార్య నాశమును, కృషినష్టమును, ధాన్యనాశమును, అకస్మాత్తుగా కలహమును కలుగును.

గ్రంథాంతరే ॥

శ్లో॥ పాపభుక్తిర్మహత్కష్టం సర్వశత్రుసుహద్భయం।
భోగభాగ్యాదినాశశ్చ దారపుత్రాదినాశనం।
బంధుద్వేషం మనోదుఃఖం క్షయాపస్మారసంభవం॥ 14

తా. పాపభుక్తియందు విశేషకష్టమును, తన శత్రు మూలకముగా గొప్పభయమును, సుఖనాశమును, భాగ్యాది నాశమును, భార్యాపుత్రాది నాశనమును, బంధుద్వేషమును, మనోదుఃఖమును, అకస్మాత్తుగా కలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే అపమృత్యుభయంభవేత్।
తద్దోషపరిహారార్థం రుద్రజప్యంతు కారయేత్।
శ్వేతాంగాం మహిషీందద్యా।
చ్ఛాంతిమాప్నోత్యసంశయః॥ 15

తా. భుక్తినాథుడగు శుక్రుడు ద్వితీయ సప్తమముల యందున్నయెడల అపమృత్యువు సంభవించును. ఆదోషపరిహారార్థమై రుద్రజపము చేయవలయును. తెల్లని మహిషదానము చేసినపిమ్మట నిశ్చయగా శాంతికలుగును.

---



చంద్రదశాయాం రవిభుక్తిమాసాః 6.

పారాశర్యే॥

శ్లో॥ చంద్రస్యాంతర్గతేసూర్యే స్వోచ్చస్వక్షేత్రసంయుతే।
కేంద్రత్రికోణలాభేవా తృతీయేస్వాంశగేతథా।
నష్టరాజ్యధనప్రాప్తిః గృహేకళ్యాణసంభ్రమః।
మిత్రరాజప్రసాదేన గ్రామభూమ్యర్థలాభకృత్।
గర్భాధానఫలప్రాప్తిః గృహేలక్ష్మీకటాక్షకృత్।
భుక్త్యంతేదేహమాలస్యం జ్వరపీడాభవిష్యతి।
స్త్రీసౌఖ్యంపుత్రవృద్ధిశ్చ పితృబంధువివృద్ధిదం॥ 1

తా. చంద్రదశలో భుక్తినాథుడగు సూర్యుడు స్వోచ్చ యందున్నను, స్వక్షేత్రమందున్నను, కేంద్రకోణములయం దున్నను, తృతీయమం దున్నను లేక స్వనవాంశయందున్నను, ఆభుక్తియందు నష్టరాజ్యప్రాప్తియు, ధనలాభమును, ఇంటి యందు కళ్యాణ సంభ్రమంబును, మిత్రరాజానుగ్రహమువల్ల గ్రామాధిపత్యమును, భూలాభమును, అర్థప్రాప్తియు, గర్భా దాన ఫలప్రాప్తియు, యింటియందు లక్ష్మీకటాక్షమును, భుక్తి అంత్యమందు దేహాలస్యమును, జ్వరపీడయు, స్త్రీసౌఖ్యమును, పుత్రవృద్ధియు, పితృవృద్ధియు, బంధువుల అభివృద్ధియు, కలుగును.

శ్లో॥ లగ్నాషష్ఠాష్టమేవాపి వ్యయేవానీచరాశిగే।
రాజక్రోధంస్థాననాశం పితృబంధువినాశనం।
ఆత్మపుత్రవిరోధశ్చ అధికారాదినాశనం।
సమరేశత్రుబాధాచ సంతాపజ్వరమేవచ।
దుష్టరోగంమూత్రకృచ్ఛ్రం గుల్మరోగస్తథాపివా।
వాతపిత్తాధికంచైవ గోమహిష్యాదినాశనం।
అంతేక్లేశకరంచైవ మాతృపిత్రాదినాశనం॥ 2

తా. సూర్యుడు లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను, లేక తన నీచరాశియందున్నను, రాజక్రోధమును, స్థాననాశమును, పితృబంధువినాశమును, పుత్రవిరోధమును, అధికారనాశమును, యుద్ధమునందు శత్రుబాధయు, సంతాపజ్వరమును, దుష్టరోగమును, మూత్రకృచ్ఛ్రరోగమును, గుల్మరోగమును, వాతపిత్తరోగమును, గోమహిష్యాది పశునాశనమును, అంత్యమునందు దుఃఖమును, మాతాపితృ వియోగమును కలుగును.

శ్లో॥ చంద్రేణసంయుతేదృష్టే మాతృవంశవినాశనం।
శిరోక్షికుక్షిబాధాచ బంధూనాంకలహంతథా॥ 3

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, మాతృవర్గమునకు నాశమును, శిరోబాధయు, నేత్రరోగమును, కుక్షిబాధయు, బంధువులతోడ కలహమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే జ్ఞాతీనాంకలహంతథా।
క్షేత్రధాన్యవినాశశ్చ సమానజననాశనం॥ 4

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, జ్ఞాతులతో కలహమును, క్షేత్రనాశమును, ధాన్యనాశమును, సమానజననాశమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే బాంధవాదివివృద్ధిదం।
విచిత్రగృహలాభశ్చ వేదాంత శ్రవణంతథా॥ 5

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, బంధు అభివృద్ధియు, విచిత్రగృహలాభమును, వేదాంతశ్రవణమును కలుగును.

శ్లో॥ గురుణాసుత సౌభాగ్యం సంపదం ద్రవ్యలాభకృత్।
దేహారోగ్యంచ కీర్తిశ్చ విజయంచ భవిష్యతి॥ 6



తా. సూర్యుడు గురునితో కలసినను లేక చూడబడినను, పుత్రలాభమును, భాగ్యసంపదయు, ద్రవ్యలాభమును, దేహారోగ్యమును, కీర్తియు, జయమును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే స్త్రీసౌఖ్యం పుత్రసంపదః।
అశ్వాదివాహన ప్రాప్తిః ద్రవ్యలాభంచ విందతి॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, స్త్రీసౌఖ్యమును, పుత్రసంపదయు, అశ్వాది వాహనప్రాప్తియు, ద్రవ్యలాభమును కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే మహత్కష్టం రిపోర్భయం।
నృపక్రోధం స్థాననాశం జనానాంకలహం తథా॥ 8

తా. భుక్తినాథుడగు రవి శనితో కలసినను లేక చూడబడినను ఆభుక్తియందు అధిక కష్టమును, శత్రుభయమును, రాజక్రోధమును, స్థాననాశమును, జనులతోడ కలహమును కలుగును.

శ్లో॥ దాయేశుత్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా।
దారసౌఖ్యం మహోత్సాహం వాహనాం బరభూషణం॥
పుత్రోత్సవాది సంతోషం గృహే గోధనసంకులం।
వేదశాస్త్రార్థ పాండిత్యం రాజసన్మానసంభ్రమః॥ 9

తా. సూర్యుడు దశానాథునకు కేంద్రకోణముల యందున్నను, తృతీయలాభములయం దున్నను, ఆభుక్తియందు కళత్రసౌఖ్యమును, మహోత్సాహమును, వాహనలాభమును, వస్త్రభూషణ ప్రాప్తియు, పుత్రోత్సవాది సంతోషమును, యింటియందు పశ్వాభివృద్ధియు, ధనలాభమును, వేదశాస్త్రార్థ పాండిత్యమును, రాజసన్మానమును కలుగును.

శ్లో॥ వాహనాధిప సంయుక్తే గృహక్షేత్రాదివర్ధనం।

నూతనగృహనిర్మాణం మాతృసౌఖ్యం మహత్సుఖం॥

తా. సూర్యుడు చతుర్థాధిపతితో కూడియున్నచో గృహక్షేత్రాది వర్ధనమును, నూతన గృహనిర్మాణమును, మాతృసౌఖ్యమును, విశేషసుఖమును కలుగును.

శ్లో॥ దాయేశాద్రి పురంధ్రస్థే లాభేవాపాపసంయుతే।
నృపచోరాగ్ని భీతిశ్చ జ్వరరోగాది సంభవః।
గుల్మక్షయాదిరోగైశ్చ అతిసారాది పీడనం।
విదేశయానం దుఃఖార్తింలభతేచ పరిభ్రమం॥ 11

తా. సూర్యుడు దశానాథునకు 6, 8, 12 స్థానముల యందున్నను లేక పాపగ్రహముతో కలసియున్నను, రాజబాధయు, చోరభయమును, అగ్నిభీతియు, జ్వరరోగాదిపీడయు, గుల్మక్షయాది రోగసంభవమును, అతిసారాది రోగబాధయు, విదేశప్రయాణమును.

శ్లో॥ ద్వితీయద్యూననాథేవా జ్వరపీడా భవిష్యతి।
తద్దోషపరిహారార్థం దుర్గాదానంచ కారయేత్।
దుర్గాదేవీ జపంకుర్యాత్ గోదానంచ సమాచరేత్॥ 12

తా. భుక్తినాథుడగు సూర్యుడు ద్వితీయసప్తముల యందున్నయెడల జ్వరపీడ కలుగును. ఆదోషపరిహారార్థమై దుర్గాదానము చేయవలయును. దుర్గాదేవీ జపముచేసి గోదానముచేసిన పిమ్మట శాంతికలుగును.

ఇతి జాతకఫలచింతామణౌ చంద్రదశాంతర్దశాఫలం నామ
తృతీయ ప్రకరణం సమాప్తం

శుభమస్తు.

---

శుభమస్తు.

# జాతకఫలచింతామణి.

## ఆంధ్ర తాత్పర్య సహితము.

## చతుర్థ ప్రకరణము.

కుజదశావత్సరాః. 7

శ్లో॥ భౌమదశాయామాదౌ లభతే వివిధార్థమానహానించ।
మధ్యేగ్నిభూపచోరైర్భీతింశత్రోశ్చ నిర్దిశేన్మతిమాన్॥ 1
అంతే భ్రాతృవియోగసుత
ధన దారాగ్ని గుల్మమూత్రార్తిం।
భౌమేప్యేవంచలభేద్గోచర
సంయుక్త విశేషతఃకథయేత్॥ 2

తా. కుజదశలో ఆది భాగమందు వివిధవిధములయిన మానహానియు, అర్థనాశనమును కలుగును. మధ్యభాగమందు అగ్నిభయమును, రాజకోపమును, చోరబాధయు, శత్రుపీడయు కలుగును. అంత్యమందు భ్రాతృవియోగమును, భార్యాపుత్రులయొక్క పీడయు, ధననాశమును, గుల్మరోగమును, మూత్రకృచ్ఛ్రమును సంభవించును.

శ్లో॥ అత్యుచ్చభూనందనదాయకాలే
క్షేత్రాదిలాభం సమరేజయంచ।
అధిజ్యమాన్యేతి నరేశమానం
సహోదరస్త్రీ సుతవాగ్విలాసం॥ 3

తా. పరమోచ్ఛ యందున్న కుజదశా కాలమందు క్షేత్రాదిలాభంబును, యుద్ధమునందు జయమును, గౌరవంబును, రాజసన్మానమును, సహోదర స్త్రీపుత్ర వాగ్విలాసంబును కలుగును.

శ్లో॥ ఉచ్చంగతస్యహిదశా ధరణీ సుతస్య
ప్రాప్నోతి రాజ్యమథవా క్షితి పాలమిత్రం।
ధాన్యార్థభూమి బహుబంధు సమాగమంచ
యానాదిరోహణ విశేషవిదేశయానం॥ 4

తా. తన ఉచ్చస్థానమును పొందియున్న కుజదశ, రాజ్యము లేక రాజస్నేహము, ధాన్యము, ధనము, భూమి, బహుబంధుసమాగమము, వాహనాది సౌఖ్యము, విశేషముగా అన్య దేశ ప్రయాణము కలుగచేయును.

శ్లో॥ నీచస్థితస్యాపి ధరాసుతస్యదాయే
స్వభృత్యైస్స్వజనైర్విరోధం।
కుభోజనం గోగజవాజినాశం
స్వబంధునాశం నృపవహ్నిచోరైః॥ 5

తా. నీచస్థానమందున్న కుజదశాకాలమందు తన సేవకులతోడను, స్వజనులతోడను విరోధమును, కుత్సితభోజనమును, గోవులు, ఏనుగులు, అశ్వములు వీనినాశమును, స్వంత బంధుజనుల నాశమును, రాజబాధయు, అగ్నిభీతియు, చోరభయమును కలుగును.

శ్లో॥ మూలత్రికోణా న్వితభౌమదాయే
మృష్టాన్నపానాంబర భూషణాప్తిం।
పురాణ ధర్మశ్రవణం మనోజ్ఞం
భ్రాత్రాది సౌఖ్యం కృషిలాభమేతి॥ 6

తా. మూలత్రికోణమందున్న కుజదశలో మృష్టాన్నపాన వస్త్ర భూషణ ప్రాప్తియు, పురాణధర్మ శ్రవణంబును, మనోజ్ఞతయు, భ్రాత్రాదులకు సౌఖ్యమును, వ్యవసాయమునందు లాభమును కలుగును.



శ్లో॥ స్వక్షేత్రగస్యాపి ధరాసుతస్య
దశావిపాకే లభతేర్థభూమిం।
స్థానాదిపత్యం సుఖవాహనంచ
నామద్వయం భ్రాతృ సుఖంసుతాప్తం॥ 7

తా. స్వక్షేత్రగతుడైన కుజదశాకాలమందు అర్థలాభమును, భూలాభమును, స్థానాధిపత్యమును, సుఖవాహనంబును, రెండు నామంబులుదు, భ్రాతృసౌఖ్యమును, పుత్రప్రాప్తియు కలుగును.

శ్లో॥ ధరాసుతస్యాప్యధిశత్రురాశే
ర్గతస్యదాయే కలహాతిదుఃఖం।
నరేంద్రకోపం స్వజనైర్విరోధం
భూమ్యర్థదారాత్మజ మిత్రనాశం॥ 8

తా. అధిశత్రురాశిగతుండగు కుజదశలో కలహమును, అధిక దుఃఖమును, రాజకోపము, స్వజనవిరోధమును, భూనాశమును, అర్థహానియు, భార్యాపుత్ర వియోగమును, స్నేహజన నాశమును కలుగును.

శ్లో॥ భూనందనస్యాప్యరిరాశిగస్య
దశావిపాకే సముపేతిపీడా।
చోరాగ్నిభూపాల విరోధతాంశ్చ
విణ్మూత్ర కృచ్ఛ్రాది గుదాక్షిరోగం॥ 9

తా. శత్రుక్షేత్రమందున్న కుజదశాకాలమందు కళ్హామునందు అధికపీడయు, చోరాగ్నిబాధయు, రాజవిరోధమును, విణ్మూత్రకృచ్ఛ్రాది రోగభయమును, గుదరోగమును, నేత్రపీడయు కలుగును.

శ్లో॥ మిత్రర్క్షగస్యాపి కుజస్యదాయే

మిత్రత్వమాయాతి సపత్నసంఘైః।
చోరాగ్నిమాంద్యాది వివాదభూమి
కృషిర్వినాశం కలికోపదుఃఖం॥ 10

తా. మిత్రక్షేత్రమందున్నను కుజదశాకాలమందు శత్రు సంఘములతోడ స్నేహమును, చోరాగ్నిభయమును, మద్యపానులతోటిన్ని, జూదరులతోటిన్ని వివాదంబును, భూనాశమును, వ్యవసాయ నష్టమును, పాపకోప దుఃఖంబులును కలుగును.

శ్లో॥ కుజస్యదాయే త్వతిమిత్రరాశే
గ్గతస్యభూపాల కృతార్థభూమిం।
వస్త్రాన్నయజ్ఞాది వివాహదీక్షా
ముపైతి దేశాంతర లబ్ధభాగ్యం॥ 11

తా. అధి మిత్రరాశియందున్న కుజదశలో రాజుచే యివ్వబడిన ధనలాభమును, భూలాభమును, వస్త్రాన్నములును, యజ్ఞాదికమును, వివాహదీక్షయు, దేశాంతరముల యందు పొందబడిన భాగ్యమును కలుగును.

శ్లో॥ ధరాసుతస్యాపిచ మధ్యగస్య
గృహోపకారంచ ధనంప్రమోదం।
స్త్రీపుత్రభృత్యాత్మ సహోదరాణాం
శత్రుత్వమాప్నోతి నృపాగ్నిపీడా॥ 12

తా. సమక్షేత్రమందున్న కుజదశలో గృహోపకారంబును, విశేషధనమును, స్త్రీపుత్రభృత్య భ్రాతృశత్రుత్వంబును, రాజబాధయు, అగ్నిపీడయు కలుగును.

శ్లో॥ నీచగ్రహైశ్చాపి సమన్వితస్య
ధరాసుతస్యాపి మనోవికారం।



ప్రేష్యత్వవృత్తిం పరకీయమన్నం
స్త్రీపుత్రనాశం నృపవహ్నిచోరైః॥ 13

తా. నీచగ్రహముతో కూడియున్న కుజదశాకాలమందు మనోవికారమును పరిచారికవృత్తియు, పరాన్నభోజనమును, భార్యాపుత్ర వినాశమును, రాజాగ్ని చోరబాధలును కలుగును.

శ్లో॥ కించిత్సుఖం భోజనవస్త్రలాభం
కృచ్ఛ్రేణవృత్తిం నృపపూజనంచ।
ఉచ్చాన్వితేనాపి సమన్వితస్య
భౌమస్యదాయే సుతదారపీడా॥ 14

తా. ఉచ్చగ్రహముతోకూడిన కుజదశలో స్వల్పసుఖమును, భోజన వస్త్రలాభంబును, కష్టజీవనమును, రాజపూజ్యతయు, భార్యాపుత్ర పీడయు కలుగును.

శ్లో॥ పాపాన్వితస్యాపి కుజస్యదాయే
పాపాణికర్మాణి కరోతినిత్యం।
ద్రోహంద్విజానాం పశుదేవతానాం
సహోదరాణాంచ కుమార్గవృత్త్యా॥ 15

తా. పాపగ్రహతోకూడిన కుజదశాకాలమందు సర్వదా పాపకర్మములు చేయుటయు, కుత్సిత మార్గవృత్తిచేత బ్రాహ్మణులకును, పశుదేతలకును, సహోదరులకును ద్రోహమును కలుగును.

శ్లో॥ శుభాన్వితస్యాపి కుజస్యదాయే
కించిత్సుఖం దేహకృశాంగరోగం।
భూమేర్వివాదం సమరేజయంచ
విద్యావివాదం పరదేశవాసం॥ 16

తా. శుభగ్రహముతో కూడిన కుజదశాకాలమందు అల్పసుఖమును, దేహకృశత్వ అవయవవ్యాధులను, భూమి యొక్క వివాదమును, యుద్ధమునందు జయమును, విద్యా వివాదమును, పరదేశవాసమును కలుగును.

శ్లో॥ శుభేక్షితధరాసూనుదాయే భూమ్యర్థకాంచనం।
తస్మిన్ గోచరసంయుక్తే త్వత్యంతం శోభనంవదేత్॥

తా. శుభగ్రహవీక్షణగల కుజదశాకాలమందు భూలాభమును, అర్థప్రాప్తియు, హేమలాభమును కలుగును. అట్టి కుజుడు ఉచ్చాది స్థానములయందున్న గ్రహముతో కూడియున్నయెడల అత్యంతశుభఫలము నిచ్చును.

శ్లో॥ ఆరస్య పాపగ్రహవీక్షితస్య
ప్రాప్తాదశాయాం బహుదుఃఖకష్టం।
జనైఃపరిత్యక్త కళత్రపుత్ర
దేశాంతరస్థః క్షితిపాలకోపాత్॥ 18

తా. పాపగ్రహ వీక్షణగల కుజదశప్రాప్తించిన కాలమందు బహుదుఃఖ కష్టంబులును, రాజకోపమువల్ల కళత్ర పుత్రాది జనులను విడిచి దేశాంతరవాసము చేయుటయు కలుగును.

శ్లో॥ కేంద్రగతభౌమదాయే చోరవిషాదికా న్యుపైతిదుఃఖాని।
కలహాయాసవిరోధం లభతే దేశాంతరేయాతి॥ 19

తా. కేంద్రస్థానములయందున్న కుజదశలో చోరవిషయములచేత కలిగిన దుఃఖములును, కలహాయాస విరోధంబులును, దేశాంతరవాసమును కలుగును.

శ్లో॥ ఉచ్చాంశసంయుక్త ధరాత్మకాలే
మనోభిలాషం విజయంసుఖంచ।



ప్రచండదాసీ గమనంనృపస్య
ప్రధానతాంయాతి సుగద్యపద్యాం॥ 20

తా. ఉచ్చనవాంశ యుక్తుడగు కుజదశాకాలమందు మనోభిలాషయును, విజయమును, సుఖమును, రాజుయొక్క దాసీస్త్రీ గమనంబును, గద్య పద్యాంకితంబును జాతకుడు పొందును.

శ్లో॥ నీచాంశకభౌమదాయే నీచముపైత్యత్రకర్మవైకల్యం।
ధనహానిరాజభీతి ర్దండాచ్ఛిశ్నోదర పరాయణశీలాః॥ 21

తా. నీచనవాంశను పొందియున్న కుజదశాకాలమందు కర్మవైకల్యముచే నీచస్థితియు, ధనహానియు, రాజభీతియు, దండనయు, శిశ్నోదర పరాయణుండును యగును.

శ్లో॥ భౌమస్యస్వస్థాన బలాన్వితస్య
దశావిపాకేతు కళత్రసౌఖ్యం।
స్థానాదిలాభం సుతకీర్తిసౌఖ్యం
ఉద్యోగసిద్ధిం తదుపైతిసౌఖ్యం॥ 22

తా. కుజుడు స్థానబలము కలవాడైనపుడు అట్టి దశాకాలమందు కళత్ర సౌఖ్యమును, స్థానాది లాభప్రాప్తియు, సుతకీర్తి సౌఖ్యంబులును, ఉద్యోగప్రాప్తియు, సుఖమును కలుగును.

శ్లో॥ స్థానవీర్యవిహీనస్తు కురుతే స్వపదచ్యుతిం।
కుజఃకుశీలవృత్త్యాచ జీవనం భవతిధ్రువం॥ 23

తా. కుజుడు స్థానబలము లేనివాడైనచో స్వస్థానచలనంబును, కుత్సితవృత్తిచేత జీవనమును నిశ్చయముగా కలుగును.

శ్లో॥ దిగ్వీర్యయుక్తస్య కుజస్యకాలే

నృపాత్ప్రిలబ్ధార్థ రణప్రతాపం।
గోభూమికృష్యం బరయానలాభం
దిగంతరాక్రాంత యశః ప్రతాపం॥ 24

తా. దిగ్బలసంపన్నుడగు కుజదశలో రాజుమూలకముగా లభించిన అర్థప్రాప్తియు, యుద్ధప్రతాపంబును, గోవులు, భూమి, కృషి, వస్త్రములు, వాహనములు వీని లాభంబును, దిగంతరములయందు వ్యాపింపబడిన యశస్సును, ప్రతాపమును కలుగును.

శ్లో॥ కాలవీర్యయుతేభౌమ దశాయాం
కామ్యలబ్ధమతి సౌఖ్యముపైతి।
పట్టవస్త్ర మణిమౌక్తికలాభం
చిత్రవస్త్ర కృషిగో గజలాభం॥ 25

తా. కాలబలముతో కూడియున్న కుజదశలో కోరిన కోరికెలు సిద్ధించుటయు అధికసౌఖ్యమును, పట్టవస్త్రమణి మౌక్తిక లాభంబులును, చిత్రవస్త్రప్రాప్తియు, కృషిలాభము, గోవులు ఏనుగులు వీనిలాభమును కలుగును.

శ్లో॥ నిసర్గ వీర్యా న్వితభౌమదాయే।
నిసర్గత స్థాన ధనాదిలాభం।
పిత్తాదికం కుత్సితభోజనంచ।
కుమార్గవృత్త్యా కునఖః పితృఘ్నః॥ 26

తా. నైసర్గికబలముతో గూడిన కుజదశలో ధనాదిలాభములు కలుగును. బలహీనమైనచో పిత్తాదికమును, కుత్సితాన్నభోజనమును, కుత్సితవృత్తియు, కుత్సితగోళ్లును; పితృఘాతకమును కలుగును.

శ్లో॥ వక్రాన్వితస్య భౌమస్య దశకాలే మహద్భయం।



చోరాగ్ని రిపుపీడాచ వనవాసం పదచ్యుతిం॥ 27

తా. వక్రత్వము నొందిన కుజదశాకాలమందు విశేషభయమును, చోరాగ్నిశత్రుపీడయు, వనవాసమును, స్థాననాశమును కలుగును.

శ్లో॥ దృగ్వీర్యయుక్తా న్విత భౌమదాయే
కృపాకటాక్షేణ మహీపతీనాం।
సమస్త భాగ్యాత్మజ మిత్రబంధు గో
భూమి భూషాంబర దేహ సౌఖ్యం॥ 28

తా. దృగ్బల సంయుక్తుడగు కుజునిదశలో రాజుల యొక్క కృపాకటాక్షముచేత పొందబడిన సమస్తభాగ్యమును, పుత్రులు, మిత్రులు, బంధువులు, గోవులు, భూములు, భూషణములు, వస్త్రములు వీని అభివృద్ధియు, దేహసౌఖ్యమును కలుగును.

శ్లో॥ క్రూరషష్ట్యంశకయుతే భౌమదాయేతి పీడనం।
కారాగృహ ప్రవేశంచ సమస్తవిభవక్షయం॥ 29

తా. క్రూరషష్ట్యంశయుక్తుడగు కుజునిదశలో అధిక పీడనయు, కారాగృహప్రవేశమును, సకలైశ్వర్యక్షయమును కలుగును.

శ్లో॥ సౌమ్యషష్ట్యంశకయుతే భౌమదాయేశుభం భవేత్।
వివాహదీక్షాయజ్ఞంచ సర్వేషా ముపకారకం॥ 30

తా. శుభషష్ట్యంశ యుక్తుడగు కుజదశలో శుభము కలుగును. గాకను వివాహదీక్షయు, యజ్ఞకార్యమును, సర్వజనులకు ఉపకారమును కలుగచేయును.

శ్లో॥ పారావతాది సంయుక్త భౌమదాయే మహత్సుఖం।
భూమ్యర్థదార సంపత్తిః ధనవాహనభోజనం॥ 3

తా. పారావతాది షష్ఠ్యంశలతో గూడిన కుజదశా కాలమందు విశేషసుఖమును, భూలాభమును, అర్థప్రాప్తియు, కళత్రప్రాప్తియు, సంపదయు, ధనవాహనభోజన సౌఖ్యంబులును కలుగును.

శ్లో॥ క్రూరద్రేక్కాణ సంయుక్త కుజదాయే మనోవ్యథా।
నిగళం విషభీతిశ్చ పాశబంధనమేవచ॥ 32

తా. క్రూరగ్రహ ద్రేక్కాణమందున్న కుజదశలో మనోవ్యథయు, బంధనప్రాప్తియు, విషభీతియు, పాశమువల్ల బంధనము కలుగును.

శ్లో॥ ఉచ్చస్థోఽపిధరానూనుః నీచాంశకసమన్వితః।
తత్పాకే భ్రాతృమరణం నృపవహ్ని విషాద్భయం॥ 33

తా. దశానాథుడగు కుజుడు ఉచ్చస్థానస్థితుడైనను, నీచ నవాంశయుక్తుడాయెనేని అట్టి దశాకాలమందు భ్రాతృమరణమును, రాజాగ్ని విషభయమును కలుగును.

శ్లో॥ భూమిపుత్రోఽపి నీచస్థః స్వోచ్చభాగ సమన్వితః।
తత్పాకే భూమిదారార్థ పుత్రమిత్రవివర్ధనం॥ 34

తా. అంగారకుడు నీచస్థానమును పొందియున్నను, ఉచ్చ నవాంశయుక్తుడాయెనేని ఆదశాకాలమందు భూలాభమును, అర్థప్రాప్తియు, పుత్రకళత్రాభివృద్ధియు, స్నేహజన అభివృద్ధియు కలుగును.

---

మేషాదిరాశిస్థిత కుజదశాఫలం.

కృష్ణీయే॥

శ్లో॥ మేషస్థితస్యాపి ధరాసుతస్య
దశావిపాకే ధనలాభమేతి।
క్షేత్రాభివృద్ధిం బహుధాన్యలాభం



రిపోర్వినాశం బహుకీర్తిలాభం॥ 35

తా. మేషరాశియందున్న కుజదశాకాలమందు ధనలాభమును, క్షేత్రాభివృద్ధియు, బహుధాన్య లాభమును, శత్రువినాశమును, విశేషకీర్తిలాభమును కలుగును.

శ్లో॥ వృషస్థితస్యాపి ధరాసుతస్యదాయే
రిపోర్నాశ కరంచ సౌఖ్యం।
క్షేత్రాభి వృద్ధిం సమరేజయంచ
నృపాల సన్మానముపైతి సిద్ధిం॥ 36

తా. వృషభరాశి యందున్న అంగారక దశాకాలమందు శత్రునాశమువల్ల సౌఖ్యమును, క్షేత్రాభివృద్ధియును, యుద్ధమునందు జయమును, రాజసన్మానమును సిద్ధించును.

శ్లో॥ యుగ్మస్థిత కుజదాయే మణివస్త్రాప్తి నృపాల సన్మానం।
బాంధవసంఘ సమృద్ధిం కృషిగోవృద్ధిం సమస్తలాభంచ॥

తా. మిథునరాశియందున్న కుజదశలో మణిలాభమును, వస్త్రప్రాప్తియు, రాజసన్మానమును, బంధుసంఘ సమృద్ధియు, కృషిలాభమును, పశ్వాభివృద్ధియు, సకలవిధ లాభములును కలుగును.

శ్లో॥ కుళీరసంస్థస్య ధరాసుతస్యదాయే
రిపోర్భీతి గృహాదినాశం।
సహోదరాణాం కలహం సుతక్షయం
సమానకష్టం సుఖహానిశ్చ॥ 38

తా. కర్కాటకరాశియందున్న అంగారకుని దశలో శత్రుభీతియు, గృహక్షేత్రాది నాశనమును, సహోదరులతో కలహమును, పుత్రనాశమును, సమాన జనకష్టమును, సుఖహానియు కలుగును.

శ్లో॥ సింహస్థితస్య భౌమస్య దశాసౌఖ్యఫలప్రదా।
నృపప్రీతి ర్మహోత్సాహం క్షేత్రధాన్యాభివృద్ధిదం॥ 39

తా. సింహరాశియందున్న కుజదశ సౌఖ్యఫలము నిచ్చును. రాజప్రీతియు మహోత్సాహమును, క్షేత్రవృద్ధిని, ధాన్యాభివృద్ధియు కలుగును.

శ్లో॥ కన్యాసంస్థస్య భౌమస్య దశాబహుఫలప్రదా।
విద్యాప్తిర్వాక్పటుత్వంచ బంధుసంగమ లాలనం॥ 40

తా. కన్యారాశియందున్న అంగారకుడు తనదశలో విశేషఫలము నిచ్చును. విద్యాప్రాప్తియు, వాక్పటుత్వమును, బంధుజన సమాగమంబును, లాలనయు కలుగచేయును.

శ్లో॥ తౌళిగభూసుతదాయే కరోతి కష్టం స్వమానభంగంచ।
స్త్రీసుతనాశం కురుతే ధాన్యాదిక్షేత్రనాశంచ॥ 41

తా. తులారాశి యందున్న కుజుడు అధిక కష్ట ఫలము నిచ్చును. మానభంగమును, భార్యాపుత్రాది నాశనమును, ధాన్యాది క్షేత్రనాశమును కలుగచేయును.

శ్లో॥ అళిస్థితస్యాపి ధరాసుతస్య
దశావిపాకే ధనలాభమేతి।
క్షితీశమిత్రం స్వజనానుకూలం
బంధూపకారం కురుతే సుఖంచ॥ 42

తా. వృశ్చికరాశియందున్న కుజదశాకాలమందు ధన లాభమును, రాజస్నేహమును, స్వజనానుకూలమును, బంధు యుపకారమును, సుఖమును కలుగును.

శ్లో॥ చాపస్థితస్య క్షితిజస్యదాయే
నృపాద్ధనంయాతి క్షితీశమిత్రం।
సహోదరాణా మభివృద్ధి మేతిశత్రో



ర్వినాశం సకలార్థ సిద్ధిం॥ 43

తా. ధనుస్సునందున్న కుజదశలో రాజమూలకముగా ధనలాభమును, రాజస్నేహమును, సహోదరాభివృద్ధియు, శత్రువినాశమును, సకలార్థసిద్ధియు కలుగును.

శ్లో॥ నక్రేణసంస్థిత మహీసుత దాయకాలే
భూమ్యాధిపశ్చ నృపతీ జనపూజనంచ।
యుద్ధేజయం సకలచింతిత కార్యసిద్ధిం
యానాంబరా భరణ ధాన్యవిశేషలాభం॥ 44

తా. మకరరాశియందున్న అంగారకదశలో భూమ్యాధిపత్యమును, రాజపూజ్యతయు, యుద్ధమునందు జయమును, చింతించిన సకలకార్యసిద్ధియు, వాహనలాభమును, వస్త్రాభరణప్రాప్తియు, ధాన్యాభివృద్ధియు కలుగును.

శ్లో॥ ఘటగత భూమిజదాయే కరోతికష్టంచ మానభంగంచ।
క్షితిపతిక్రోధం కురుతే సేవకజననీచ కలహంచ॥ 45

తా. కుంభరాశియందున్న అంగారకుడు తనదశలో కష్టమును, మానభంగమును. రాజక్రోధమును, సేవకులతోడను, నీచజనులతోడను కలహమును కలుగును.

శ్లో॥ మీనస్థితస్యాపి ధరాసుతస్య
దశావిపాకే మణి వస్త్రలాభం।
క్షేత్రాభివృద్ధిం కృషిధాన్యవృద్ధిం
విద్యాప్తి పాండిత్య సభాసుపూజ్యం॥ 46

తా. మీనరాశియందున్న అంగారకుడు తనదశలో మణివస్త్రాదిలాభమును, క్షేత్రాభివృద్ధియు, కృషిలాభమును, ధాన్యవృద్ధియు, విద్యాప్రాప్తియు, పాండిత్యమును, సభాపూజ్యతయు కలుగచేయును.

తన్వాదిభావస్థిత కుజదశాఫలం.

కృష్ణీయే॥

శ్లో॥ తనుగతభౌమ దశాయాం ఉష్ణత్వం కాంతిహీనత్వం।
స్ఫోటశ్రవణాధి బాధారివృద్ధిం ధాన్యనాశంచ॥ 47

తా. తనుస్థానమందున్న కుజదశలో అధికఉష్ణమును, కాంతిహీనత్వమును, స్ఫోటకశ్రవణాది పీడయు, శత్రువృద్ధియు, ధాన్యనాశమును కలుగును.

శ్లో॥ ధనస్థితస్యాపి ధరాసుతస్య దాయే
మహాసౌఖ్య ధనాదిలాభం।
కుటుంబసంరక్షణ వాగ్విభూతిం
భూపాల సన్మానసు కీర్తిలబ్ధం॥ 48

తా. ధనస్థానమందున్న అంగారకుని దశలో విశేష సౌఖ్యమును, ధనాదిలాభమును, కుటుంబ సంరక్షణయు, వాగ్విలాసమును, రాజసన్మానమును, మంచికీర్తియులభించును.

శ్లో॥ తృతీయగస్యాస్య కుజస్యదాయే
రిపుక్షయం ధాన్యవివృద్ధిదంచ।
సుకీర్తిలాభం సురనాథ భోగ
మిష్టార్థసిద్ధిం లభతే మనుష్యః॥ 49

తా. తృతీయస్థానమందున్న కుజదశలో శత్రుక్షయము ను, ధాన్యవృద్ధియు, మంచికీర్తియును, దేవేంద్రునితో సమానమైన భోగమును, ఇష్టార్థసిద్ధియు మనుష్యునకు కలుగును.

శ్లో॥ బంధుస్థితస్య భౌమస్యదశారాజ్య ఫలప్రదా।
మహారాజాశ్రయఃప్రాప్తిః భూక్షేత్రకృషివృద్ధిదం॥ 50

తా. చతుర్థస్థానమందున్న కుజదశ రాజ్యఫలము నిచ్చు ను. మహారాజానుగ్రహము వలన భూలాభమును, క్షేత్ర



ప్రాప్తియు, కృషివృద్ధియు కలుగును.

శ్లో॥ సుతస్థితస్యాపి ధరాసుతస్య దాయే
సుతార్థ కృషినాశనంచ।
అతీవకష్టం త్ववనీశకోపం
స్వస్థాననాశం పరదేశవాసం॥ 51

తా. పంచమస్థానమందున్న కుజదశాకాలమందు పుత్రనాశమును, అర్థక్షయమును, కృషినష్టమును, అధికకష్టమును, రాజకోపమును, స్థాననాశమును, పరదేశవాసమును కలుగును.

శ్లో॥ రిపుగత భౌమదశాయాం రిపునాశం దేహకాంతిశ్చ।
క్షితిపసమత్వం లభతే ధారాత్మజ బంధుసౌఖ్యంచ॥ 52

తా. లగ్నమునకు ఆఱవయింటియందున్న కుజదశలో శత్రునాశమును, దేహకాంతియు, రాజసమానమైన గౌరవము ను, భార్యాపుత్రుల యొక్కయు, బంధుజనుల యొక్కయు సుఖమును కలుగును.

శ్లో॥ కళత్రస్థ భౌమస్య దాయే కళత్రంవినాశం
సుతక్షేత్రనాశం స్వదేహే।
జ్వరస్ఫోట బాధాది కష్టంచ నష్టం
కృషిక్షేత్రనాశం పరగ్రామవాసం॥ 53

తా. సప్తమ స్థానమందున్న అంగారకుని దశాకాల మందు కళత్రనాశమును, సుతనాశమును, క్షేత్రనాశమును, దేహమునందు జ్వరస్ఫోటకాది రోగబాధయు, కష్టమును, నష్ట మును, కృషినాశమును, క్షేత్రనాశమును, పరగ్రామ వాస మును కలుగును.

శ్లో॥ రంధ్రస్థితస్యభౌమస్య దశామృత్యు ఫలప్రదా।
జ్వరకాసాది రోగంచ హృద్రోగం గుల్మసంభవం॥ 54

తా. లగ్నమునకు అష్టమస్థానమందున్న కుజదశమృత్యు ఫలము నిచ్చును. జ్వరాతిసారాది రోగభయమును, హృదయ సంబంధమగు రోగభీతియు, గుల్మవ్యాధియును కలుగచేయును.

శ్లో॥ ధర్మస్థితస్యాపి కుజస్యదాయే
ధర్మార్థలాభం బహుధాన్యవృద్ధిం।
తటాకవాపీ గృహధర్మవృద్ధిం
సహోదరాణాంచ శుభత్వమేతి॥ 55

తా. లగ్నమునకు నవమ స్థానమందున్న కుజదశలో ధర్మార్థలాభమును, బహుధాన్యవృద్ధియు, చెఱువులు, భావులు, గృహములు మొదలగునవి కట్టించుటయును, ధర్మకార్యాభివృద్ధియు, సహోదరులకు శుభమును కలుగును.

శ్లో॥ కర్మస్థస్య ధరాసుతస్యచదశా ఇష్టార్థసిద్ధిప్రదం।
జ్ఞానంసజ్జన పూజనం వరమణిప్రాప్తింనృపాలాత్సుఖం॥
అశ్వాందోళన వాహనాది విభవం యజ్ఞాదికర్మప్రదం।
క్షేత్రార్థాది సువృద్ధిదం సుతసుహృద్దారాది సౌఖ్యప్రదం॥

తా. దశమస్థానమందున్న అంగారకదశ ఇష్టార్థసిద్ధిని యిచ్చును. గాకను, జ్ఞానమును, సజ్జనపూజయు, శ్రేష్ఠమైన మణిప్రాప్తియు, రాజమూలకముగా సుఖమును, అశ్వాందోళన వాహనాదివిభవమును, యజ్ఞాదికర్మసిద్ధియు, క్షేత్రార్థాద్యభివృద్ధియు, స్నేహితులయొక్కయు, భార్యపుత్రులయొక్కయు సౌఖ్యమును కలుగును.

శ్లో॥ లాభస్థితస్యాపి ధరాసుతస్య
దశావిపాకే ధనధాన్యవృద్ధిం।
నృపాలమిత్రం వరభూషణాప్తిం
క్షేత్రాభివృద్ధిం లభతేమనుష్యః॥ 57



తా. ఏకాదశస్థానమందున్న కుజదశలో ధనధాన్యవృద్ధియు, రాజస్నేహమును, శ్రేష్ఠమైన భూషణప్రాప్తియు, క్షేత్రాభివృద్ధియు మనుష్యునకు లభించును.

శ్లో॥ వ్యయస్థితస్య భౌమస్య దశామృత్యుఫలప్రదా।
సమానజనశోకశ్చ స్థాననాశం నృపాద్భయం॥ 58

తా. లగ్నమునకు పండ్రెండవ యింటియందున్న కుజదశ మృత్యుఫలము నిచ్చును. సమాన జనశోకమును, స్థాననాశమును, రాజభయమును సహా కలుగును.

శ్లో॥ త్రికోణగతభౌమస్య దశారాజ్యఫలప్రదా।
క్షితీశగ్రామనేతాచ మంత్రాలోచనతత్పరః॥ 59

తా. త్రికోణస్థానములను పొందిన అంగారకుడు తన దశలో రాజ్యఫలము నిచ్చువాడగును. రాజ్యాధిపత్యమును లేక గ్రామాధిపత్యమును, మంత్రాలోచన నిపుణతయు కలుగచేయును.

శ్లో॥ షష్ఠాష్టమ వ్యయస్థస్య భౌమస్యచ దశాఫలం।
స్వస్థాన నాశసంకష్టం క్షేత్రస్త్రీ పశునాశనం॥ 60

తా. లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయందున్న కుజదశలో స్థాననాశనమును, కష్టప్రాప్తియు, క్షేత్రనాశనమును, స్త్రీవియోగమును, పశుహానియు కలుగును.

---

### ఆరోహ కుజదశాఫలం.

శ్లో॥ ఆరోహస్థస్యభౌమస్య దశాసౌఖ్యంఫలప్రదా।
క్షేత్రధాన్యార్థవృద్ధిశ్చ ప్రవాళమణిలబ్ధివాన్॥ 61

తా. ఆరోహస్థితియందున్న కుజదశ సౌఖ్యఫలము నిచ్చును. క్షేత్రలాభమును, ధాన్యార్థవృద్ధియు, ప్రవాళమణి లాభములును కలుగును.

---

అవరోహ కుజదశాఫలం.

శ్లో॥ అవరోహకుజస్యాస్య దశాపాకే మహద్భయం।
శత్రుబాధామనస్తాపం స్థాననాశం భవిష్యతి॥ 62

తా. అవరోహస్థితియందున్న కుజదశలో విశేషభయమును, శత్రుబాధయు, మనస్తాపమును, స్థాననాశమును కలుగును.

కుజదశాయాం కుజభుక్తిమాసాః 4 దినాని 27.

పారాశర్యే॥

శ్లో॥ భౌమదాయేస్వభుక్తౌతు భౌమే కేంద్రత్రికోణగే।
గ్నాధిపేనసంయుక్తే కించిత్సౌఖ్యం ధనాగమం॥
దేహేతుకించిదాలస్యం భుక్త్యంతే సౌఖ్యదోభవేత్।
దాయాదివ్యవహారశ్చ భ్రాతృవర్గ విరోధకృత్॥
పుత్రోత్సాహాదిసంతోషం గృహేగోధనసంకులం।
మహారాజప్రసాదేన ధనధాన్యాభివృద్ధికృత్॥ 1

తా. కుజుడు తనదశలో స్వభుక్తియందు కేంద్రత్రికోణములయందున్నను లేక లగ్నాధిపతితో కూడియున్నను, స్వల్ప సౌఖ్యమును, ధనాగమంబును, దేహమునందు కొంత ఆలస్యమును, భుక్తి అంత్యమందు సౌఖ్యమును కలుగును. గాకను దాయాది వ్యవహారమును, భ్రాతృవర్గ విరోధమును, పుత్రోత్సవాది సంతోషమును, యింటియందు పశ్వాభివృద్ధియు, ధన సమృద్ధియు, మహారాజానుగ్రహమువల్ల ధనధాన్యాభివృద్ధియు కలుగును.

కృష్ణీయే॥

శ్లో॥ కుజస్యాంతర్గతేభౌమే లగ్నాత్కేంద్రత్రికోణగే।
తృతీయేలాభగేవాపి ఉచ్చస్వక్షేత్రసంయుతే॥
ఇష్టప్రభువశాత్సౌఖ్యం మహారాజాశ్రయస్తథా।



ప్రవాళమణిలాభశ్చ రక్తవస్త్రాదిసంగ్రహం॥
అపూర్వవస్తుసంప్రాప్తి స్సమరేశత్రునాశనం।
సహోదరాదివృద్ధిశ్చ యత్నకార్యార్థసిద్ధిదం॥ 2

తా. భుక్తినాథుడగు కుజుడు, లగ్నమునకు కేంద్ర త్రికోణములయం దున్నను, లేక తృతీయ లాభములయం దున్నను, లేక తన ఉచ్చస్వక్షేత్రములయం దున్నను, ఇష్ట ప్రభుమూలకముగా సౌఖ్యమును, మహారాజాశ్రయమును, ప్రవాళమణిలాభమును, రక్తవస్త్రాది సంగ్రహమును, అపూర్వ వస్తుసంప్రాప్తియు, యుద్ధమునందు శత్రునాశనమును, సహోదరాభి వృద్ధియు, యత్నకార్యసిద్ధియు కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టరాశిస్థే వ్యయేవాపాపరాశిగే।
నీచరాశిగతోవాపి మహావ్యాధిభయంతథా॥
జ్ఞాతిశత్రువివృద్ధిశ్చ క్షేత్రధాన్యవినాశనం।
చోరాగ్నినృపబాధాచ సమానజననాశనం।
ఇష్టబంధువియోగశ్చ దారపుత్రాదినాశనం॥ 3

తా. లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయందున్నను, లేక పాపరాశినిగాని తన నీచరాశినిగాని పొందియున్నను, ఆ భుక్తియందు మహావ్యాధి భయమును, జ్ఞాతివృద్ధియు, శత్రు వృద్ధియు, క్షేత్రహానియు, ధాన్యనాశమును, చోరబాధయు, అగ్నిభీతియు, రాజపీడయు, సమాన జననాశమును, ఇష్టబంధు వియోగమును, భార్యాపుత్రాది నాశనమును కలుగును.

గ్రంథాంతరే॥

శ్లో॥ తుంగాంశేస్వాంశగేభౌమే శుభయుక్తేశుభేక్షితే।
గృహక్షేత్రాదివృద్ధిస్స్యాద్గోమహిష్యాదిలాభకృత్।
మహారాజప్రసాదేన ఇష్టసిద్ధిసుఖాదికం॥ 4

తా. కుజుడు తన ఉచ్చాంశనుగాని, స్వనవాంశనుగాని పొందియున్నను, లేక శుభగ్రహ సంబంధముగాని లేక వీక్షణ గాని కలిగియున్నను, గృహక్షేత్రాది వృద్ధియు, గోమహిష్యాది లాభమును, మహారాజానుగ్రహమువల్ల ఇష్టసిద్ధియు, అధిక సుఖమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే సంతాపజ్వరమేవచ।
నృపక్రోధంమనస్తాపం స్వస్థానచలనంతథా॥ 5

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, సంతాపజ్వరమును, రాజక్రోధమును, మనస్తాపమును, స్వస్థాన చలనమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టే మహోత్సాహం మహత్సుఖం।
యత్నకార్యార్థసిద్ధిశ్చ దారపుత్ర సమాగమం॥ 6

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను మహోత్సాహమును, విశేషసుఖమును, యత్నకార్యార్థసిద్ధియు, భార్యాపుత్ర సమాగమంబును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే వేదశాస్త్రాదిపాఠకృత్।
ఆలేఖ్యగృహలాభశ్చ గణికాదిసమాగమం॥ 7

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, వేద శాస్త్రాది పాఠమును, లెక్క లేని గృహలాభమును, గణికోత్త ములయొక్క సమాగమంబును కలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే దేహారోగ్యంధనాప్తికృత్।
శివదీక్షాప్రసంగశ్చ యజ్ఞకర్మాదిసిద్ధిదం॥ 8

తా. గురువుతో కలసినను లేక చూడబడినను దేహారోగ్యమును, ధనప్రాప్తియు, శివదీక్షాప్రసంగమును, యజ్ఞకర్మాది సిద్ధియు కలుగును.



శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే వాహనక్షేత్రవృద్ధిదం।
సమానజనసన్మానం మణివస్త్రాదిసంగ్రహం॥ 9

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను వాహన లాభమును, క్షేత్రవృద్ధియు, సమానజన సన్మానమును, మణి వస్త్రాది సంగ్రహమును కలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే వాతరోగాదిపీడనం।
అకస్మాత్కలహంచైవ సమానజననాశనం॥ 10

తా. శనితో కలసినను లేక చూడబడినను వాతరోగాది పీడయు, అకస్మాత్తుగా కలహమును, సమాన జననాశనమును కలుగును.

శ్లో॥ ద్వితీయద్యూననాథేవా దేహజాడ్యం మనోరుజం।
తద్దోషపరిహారార్థం సుబ్రహ్మణ్య జపంచరేత్।
అనడ్వాహం ప్రకుర్వీత దానమారోగ్యమాదిశేత్॥ 11

తా. ద్వితీయ సప్తమాధిపతులతో కూడియున్న యెడల దేహజాడ్యము, మనోవ్యాకులమును, కలుగును, ఆదోషపరి హారార్థమై సుబ్రహ్మణ్య జపమాచరించి కుజ్జుదూడను దాన మిచ్చినపిమ్మట ఆరోగ్యము కలుగును.

---

కుజదశాయాం రాహుభుక్తిమాసాః. 12 దినాని 18.

కృష్ణీయే॥

శ్లో॥ భౌమస్యాంతర్గతే రాహౌ లగ్నాత్కేంద్రత్రికోణగే।
లాభేవా బలసంయుక్తే తృతీయే శుభసంయుతే॥
విధవాసంగమం చైవ దుర్గారాధన తత్పరః।
సత్కర్మసిద్ధి యాగాది పుణ్యతీర్థ నిషేవణం॥
స్వప్రభోస్తు మహాత్సౌఖ్యం దారాసౌఖ్యం తథైవచ।
జ్ఞాతిశత్రువినాశంచ దేహారోగ్యం తథైవచ॥

భుక్త్యాదౌ మధ్యమం ప్రోక్తం పశ్చాత్సౌఖ్యం భవిష్యతి॥

తా. కుజదశలో రాహుభుక్తియందు, భుక్తినాథుడు, లగ్నమునకు కేంద్రత్రికోణములయం దున్నను, బలవద్గ్రహముతో గూడి లాభమందున్నను లేక శుభగ్రహ సంబంధము కలిగి తృతీయమం దున్నను, విధవాసంగమంబును, దుర్గారాధనయు, సత్కర్మసిద్ధియు, యోగాది పుణ్యతీర్థ స్నానఫలమును, తన ప్రభువుమూలకముగా గొప్పసౌఖ్యమును, భార్యాసుఖమును, జ్ఞాతిభంగమును, శత్రునాశమును, దేహారోగ్యమును కలుగును. భుక్తి ఆదియందు మధ్యమఫలమును, అటుపిమ్మట సౌఖ్యమును కలుగును.

గ్రంథాంతరే॥

శ్లో॥ సేతుస్నానఫలం పుణ్యం విదేశగమనం తథా।
దారావంశ జనక్లేశం మార్గేచోరభయంతథా।
పశ్చాదిష్ట ఫలప్రాప్తిః రాజానుగ్రహశాంతికం॥ 2

తా. సేతుస్నాన ఫలమును, పుణ్యక్షేత్ర దర్శనమును విదేశగమనమును, కళత్రవర్గ జనదుఃఖమును, ప్రయాణ కాలమందు చోరభయమును తటస్థించును. అటుపిమ్మట ఇష్టఫల ప్రాప్తియు, రాజానుగ్రహము వల్ల శాంతియు కలుగును.

శ్లో॥ షష్ఠాష్టమవ్యయే రాహౌ పాపయుక్తే శుభేక్షితే।
చోరాగ్నివ్రణభీతిశ్చ చతుష్పాజ్జీవనాశనం।
వాతపిత్త క్షయంచైవ కారాగృహ నివేశనం॥ 3

తా. భుక్తినాథుడగు రాహువు, లగ్నమునకు 6, 8, 12. స్థానములయం దున్నను లేక పాపయుక్తుడై శుభగ్రహ వీక్షణ కలిగియున్నను, చోరాగ్నిభయమును, వ్రణబాధయు, చతుష్పాజ్జీవనాశనమును, వాతపిత్తక్షయరోగాది బాధయు, కారా



గృహప్రవేశమును కలుగును.

గ్రంథాంతరే॥

శ్లో॥ లగ్నషష్ఠాష్టమేవాపి వ్యయేవా నీచరాశిగే।
విదేశ గమనంచైవ గర్భస్రావం భవిష్యతి॥
బంధుపుత్ర వినాశశ్చ వ్యవహారే ధనక్షయం।
భూతాపస్మారపీడాచ దేహబాధా భవిష్యతి।
భుక్త్యాదౌతు మహత్సౌఖ్యం అంతేక్లేశం భవిష్యతి॥ 4

తా. లగ్నమునకు షష్ఠాష్టమముల యందుగాని, వ్యయస్థానమందుగాని లేక తన నీచరాశియందుగాని రాహువున్న యెడల, విదేశగమనమును, గర్భస్రావమును, బంధుపుత్ర వినాశమును, వ్యవహార మూలకముగా ధనక్షయమును. దేహబాధయు కలుగును. భుక్తి ఆదియందు అధికసుఖమును, అంత్యమందు క్లేశమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే సంతాపం కలహంతథా।
శిరోబాధా కుక్షిబాధా సన్నిపాత జ్వరంతథా॥ 5

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను సంతాపమును, కలహమును, శిరోబాధయు, కుక్షిబాధయు, సన్నిపాత జ్వరభయమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతే దృష్టే మాతృవంశ వినాశనం।
మనఃఖేదం మానభంగం కృషిక్షేత్ర వినాశనం॥ 6

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను మాతృవర్గపు వారికి నాశనమును, మనోదుఃఖమును, మానభంగమును, కృషినష్టమును, క్షేత్రనాశమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే వ్రణరోగాదిపీడనం।
కార్యనాశం మనస్తాపం కలహం దుఃఖమేవచ॥ 7

తా. కుజునితో కలసినను లేక చూడబడినను వ్రణరోగాది పీడయు, కార్యనాశమును, మనస్తాపమును, కలహమును, దుఃఖమును సంభవించును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే పరస్త్రీషు సమాగమం।
బంధూనా ముపకారంచ సర్వకార్యార్థ సిద్ధికృత్॥ 8

తా. బుధునితో కలసినను లేక చూడబడినను పరస్త్రీ సమాగమంబును, బంధు జనోపకారంబును, సర్వకార్యార్థ సిద్ధియు కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే విద్యాభ్యాసాది సంగ్రహం।
అశ్వలాభంచ గోలాభం గర్భిణీ సంగమంతథా॥ 9

తా. గురువుతోకలసినను, లేక చూడబడినను, విద్యాభ్యాసాది సంగ్రహంబును, అశ్వలాభమును, పశులాభమును, గర్భిణీస్త్రీ సంగమంబును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే వాహనాంబర లాభకృత్।
తద్దశాయాం మహత్సౌఖ్యం కల్యాణాది మహోత్సవం॥

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, వాహనలాభమును, వస్త్రప్రాప్తియు, ఆదశయందు అధికసౌఖ్యమును, కల్యాణాది మహోత్సవమును కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే సోదరాణాం వినాశనం।
బంధునాశం దేహకష్టం స్థాననాశం నృపాద్భయం॥ 11

తా. శనితోకలసినను లేక చూడబడినను భ్రాతృనాశమును, బంధునాశమును, దేహకష్టమును, స్థాననాశమును, రాజభయమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్ర సంస్థస్య త్రికోణేలాభగేపివా।
తృతీయస్థానగేవాపి రాహోరపకృతం భయం॥



ఆదౌకష్టం రిపుర్మాసే నృపాలాద్భూమినాశనం।
అతఃపరం మహత్సౌఖ్యం నృపప్రీతిర్ధనాగమం।
ప్రాచ్యాంప్రయాణం కురుతే యత్నకార్యార్థసిద్ధిదం॥

తా. దశానాథునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయలాభములయం దున్నను, ఆభుక్తియందు రాహువు. యితరులవల్ల అపకారమును, ఆదిభాగమందు ఆరుమాసములు కష్టమును, రాజమూలకముగా భూనాశమును, అటుపిమ్మట విశేషసౌఖ్యమును, రాజప్రీతియు, ధనాగమంబును, పశ్చిమ దిక్కునకు ప్రయాణంబును, యత్నకార్యార్థ సిద్ధియు కలుగ చేయును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రే వావ్యయేచా పాపసంయుతే।
తద్భుక్తౌకార్యనాశశ్చ మాతృబంధు వినాశనం॥ 13

తా. రాహువు దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను, లేక పాపునితో కలసినను, ఆభుక్తియందు కార్యనాశమును, మాతృవియోగమును, బంధువినాశమును కలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం మృత్యుంజయ జపంచరేత్।
కృష్ణాంగాంమహిషీం దద్యా
త్పశ్చాత్సౌఖ్య మవాప్నుయాత్॥ 14

తా. ద్వితీయ సప్తమములయం దున్నయెడల అపమృత్యువు సంభవించును. ఆదోషపరిహారార్థమై మృత్యుంజయ జపమాచరించి నల్లని మహిషదానము చేసినపిమ్మట సౌఖ్యము కలుగును.



కుజదశాయాం గురుభుక్తిమాసాః 11 దినాని 6.

పారాశర్యే॥

శ్లో॥ కుజస్యాంతర్గతే జీవే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయేలాభగేవాపి మిత్రగ్రహసమన్వితే।
స్వోచ్చస్వక్షేత్ర సంయుక్తే జీవేస్వాంశగతోపివా।
శుభలగ్నగతే జీవే రాజమంత్రి ప్రసాదతః।
మహారాజ ప్రసాదేన వాహనం బంధుభూషణం॥ 1

తా. కుజదశలో భుక్తినాథుడగు గురువు, లగ్నమునకు కేంద్రత్రికోణములయం దున్నను, తృతీయలాభములయం దున్నను, ఉచ్చ, స్వక్షేత్రములయం దున్నను అథవా స్వనవాంశయందుగాని, శుభలగ్నమునందుగాని యున్నను ఆభుక్తియందు రాజమంత్రిత్వమును, మహారాజానుగ్రహమువలన వాహనప్రాప్తియు, బంధుభూషణమును కలుగును.

గ్రంథాంతరే॥

శ్లో॥ తత్పాకే ధనలాభశ్చ పుత్రోత్పత్తి ర్నసంశయః।
వ్యవహారస్య విజయం వస్త్ర భూషణలబ్ధవాన్॥
యత్నకార్యార్థసిద్ధిశ్చ కళ్యాణాది మహోత్సవం।
దశాధిపేన సంయుక్తే కృషిగోధాన్య సంపదః।
రాజసల్లాపకార్యాణి నూతనప్రభుదర్శనం॥ 2

తా. ఆభుక్తియందు ధనలాభమును, పుత్రోత్పత్తియు నిస్సంశయముగా కలుగును. గాకను వ్యవహారమునందు జయమును, వస్త్రప్రాప్తియు, భూషణలాభమును, యత్నకార్యార్థసిద్ధియు, కళ్యాణాది మహోత్సవములును, కలుగును. దశాధిపతియుక్తుడైన యెడల కృషిలాభమును, గోలాభమును, ధాన్యలాభమును, రాజస్నేహితమువల్ల కార్యానుకూలమును,



నూతన ప్రభుదర్శనమును కలుగును.

శ్లో॥ షష్ఠాష్టమ గతేజీవే పాపగ్రహయుతేక్షితే।
నీచస్థేబలహీనేవా చోరాగ్నినృపపీడనం।
విషప్రమాదరోగశ్చ మూత్రకృచ్ఛ్రాది రోగకృత్।
కుభోజనం కుత్సిత వస్త్రధాన్యం
స్వబంధునాశం నృపవహ్నిచోరైః।
స్థానచ్యుతి ర్భ్రాతృవియోగదుఃఖం
భౌమస్యదాయేచ గురోశ్చభుక్తౌ॥ 3

తా. గురువు షష్ఠాష్టమ స్థానములయందున్నను, పాపగ్రహముతో కూడియున్నను, లేక తన నీచస్థానమందు బలహీనుడై యున్నను, ఆభుక్తియందు చోరబాధయు, అగ్నిభయమును, రాజపీడయు, విషప్రమాద రోగమును, మూత్రకృచ్ఛ్రాది రోగములును సంభవించును. గాకను, కుత్సితాన్న భోజనమును, కుత్సితవస్త్రమును, ధాన్యనష్టమును, స్వకీయ బంధునాశమును, రాజాగ్ని చోరబాధలును, స్థానచలనమును, భ్రాతృవియోగ దుఃఖమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే అర్థలాభంతథైవచ।
ఉద్యోగంరాజసన్మానం సుతజన్మోత్సవంతథా॥ 4

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, అర్థలాభమును, ఉద్యోగప్రాప్తియు, రాజసన్మానమును, పుత్రజన్మోత్సవమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టే దేహారోగ్యంమహత్సుఖం।
కీర్తిలాభంమనోత్సాహం బాంధవానాం వివృద్ధిదం॥ 5

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, దేహారోగ్యమును, అధికసుఖమును, కీర్తిలాభమును, మనో

త్సాహమును, బంధుజనాభి వృద్ధియు కలుగును.

శ్లో॥ భౌమేనసంయుతేదృష్టే క్షేత్రధాన్యవినాశనం।
రక్తపైత్త్యాదిరోగశ్చ స్వగృహేకలహంతథా॥ 6

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, క్షేత్ర క్షయమును, ధాన్యనాశమును, రక్తపైత్త్యాది రోగమును, యింటియందు కలహమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే మాతులాదివి వృద్ధిదం।
నృపసన్మానమారోగ్యం అర్థసంగ్రహణంతథా॥ 7

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, మేనమామలకు అభివృద్ధియు, రాజసన్మానమును, ఆరోగ్యమును, అర్థసంగ్రహణమును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే పాకేభూషణసంగ్రహః।
మణివస్త్రాదిలాభశ్చ వాహనాదివివృద్ధిదం॥ 8

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, భూషణ సంగ్రహమును, మణి వస్త్రాదిలాభమును, వాహనాది అభివృద్ధియు, కలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే మహిష్యాదివినాశనం।
వివాదం కలహంచైవ గురుపుత్ర వినాశనం॥ 9

తా. శనితో కలసినను లేక చూడబడినను గేదెలు మొదలగు చతుష్పాజ్జీవరాసుల నాశమును, వివాదమును, కలహమును, గురునాశమును, పుత్రనాశమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యేలాభగేపివా।
పుత్రోత్సవాదిసంతోషం ప్రభుసన్మానమేవచ।
అపూర్వవస్తుసంప్రాప్తిః కళ్యాణాది మహోత్సవం।
గర్భిణీసంగమంచైవ మిత్రాదీనాం సమాగమం॥ 10



తా. దశానాథునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయ లాభములయందున్నను, పుత్రోత్సవాది సంతోషమును, ప్రభుసన్మానమును, అపూర్వ వస్తుసంప్రాప్తియు, కళ్యాణాది మహోత్సవమును, గర్భిణీస్త్రీ సంగమంబును, స్నేహజనుల సమాగమంబును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరాశిస్థే రంధ్రగేవ్యయగేపివా।
పాపయుక్తేథవాదృష్టే పాపచింతామహద్భయం॥
క్రూరక్రూరంచ శత్రుత్వం మనశ్చాంచల్య మేవచ।
భుక్త్యాదౌశోభనంప్రోక్తం ధనధాన్యసమృద్ధయః॥
మధ్యాంతేక్లేశమాప్నోతి మృతవార్తాగమంభవేత్।
చతుష్పాజ్జీవహానిస్స్యా ద్దేహబాధాభవిష్యతి।
రాహుయుక్తోపిచోరాగ్ని సర్పభీతివిషాద్భయం॥ 11

తా. దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను, లేక పాపగ్రహములతో కూడియున్నను, లేక వీక్షణ కలిగియున్నను ఆ భుక్తియందు పాపకార్య చింతయు, గొప్ప భయమును, క్రూరజనులతోడ శత్రుత్వమును, మనోవికారమును, ఆదియందు శుభమును, ధనధాన్య సమృద్ధియు, మధ్యభాగమందును, అంత్యభాగమందును దుఃఖమును, మృతివార్తా శ్రవణమును, చతుష్పాజ్జీవనాశనమును, దేహబాధయు కలుగును. భుక్తినాథుడగు గురువు రాహుసంబంధము కలిగియున్నయెడల, చోరభయమును, అగ్నిభీతియు, సర్పభీతియు, విషభయమును కలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనాథేవా అపమృత్యుర్జ్వరాధికం।
తద్దోషపరిహారార్థం శివసాహస్రకంజపేత్।
స్వర్ణదానం ప్రకుర్వీత సర్వసంపత్ప్రదాయకం॥ 12

తా. ద్వితీయ సప్తమరాసులయందున్న యెడల అపమృత్యువును, జ్వరాధికమును సంభవించును. ఆదోష పరిహారార్థమై శివసహస్రనామ జపము చేయుటయేగాక స్వర్ణదానముకూడా చేసినపిమ్మట సర్వవిధ సంపత్తును లభించును.

కుజదశాయాం శనిభుక్తిమాసాః 13 దినాని 9.

కృష్ణీయే॥

శ్లో॥ భౌమస్యాంతర్గతేమందే లగ్నాత్కేంద్రత్రికోణగే।
తృతీయేలాభగేవాపి ఉచ్చక్షేస్వక్షరాశిగే॥
తత్కాలేధనలాభశ్చ కృషివృద్ధిస్తథైవచ।
పుత్రదారాదిసౌఖ్యంచ నీచస్త్రీసంగమంతథా॥
నీచకృత్యంనీచసేవా యాత్రాయాం కార్యనాశనం।
వివాదేవిజయంచైవ సమరేశత్రునాశనం।
నీలవస్త్రాదిసంప్రాప్తిః దాసీదాసాదివృద్ధిదం।
కన్యకాజననంవిద్యాత్ స్వస్యసౌఖ్యం వినిర్దిశేత్॥ 1

తా. కుజదశలో భుక్తినాథుడగు శనిలగ్నమునకు కేంద్రత్రికోణములయందున్నను, తృతీయలాభములయందున్నను లేక ఉచ్చ, స్వక్షేత్రములయందున్నను, ఆభుక్తియందు ధనలాభమును, కృషివృద్ధియు, భార్యాపుత్రులయొక్క సౌఖ్యమును, నీచస్త్రీసంగమంబును, నీచకృత్యమును, నీచజనుల సేవయు, యాత్రకార్యభంగమును, వివాదమునందు జయమును, యుద్ధమునందు శత్రునాశనమును, నీలవస్త్రాది సంప్రాప్తియు, దాసదాసీజనులయొక్క అభివృద్ధియు, పుత్రికా జననమును, దేహసౌఖ్యమును కలుగును.

గ్రంథాంతరే॥

శ్లో॥ మూలత్రికోణేతుంగే వా స్వాంశేతుంగాంశసంయుతే।



లగ్నాదుపచయేవాపి శుభదృష్టియుతేబలీ।
రాజ్యంసుఖంయశోవృద్ధిం స్వగ్రామే ధాన్యవృద్ధిదం॥ 2

తా. శని మూలత్రికోణములయందున్నను, తన ఉచ్చయందున్నను, స్వనవాంశయందుగాని లేక తన ఉచ్చాంశయందుగాని యున్నను, లేక లగ్నమునకు ఉపచయ రాసులయందున్నను లేక శుభగ్రహ దృష్టిబలము కలిగియున్నను, ఆ భుక్తియందు రాజ్యప్రాప్తియు, సుఖమును, విశేషకీర్తియు, స్వగ్రామమునందు ధాన్యవృద్ధియు లభించును

శ్లో॥ నీచారిక్షేత్రగేమందే షష్ఠాష్టవ్యయరాశిగే।
ద్వితీయ్యేనవమేసంస్థే పాపయుక్తే మహద్భయం।
మ్లేచ్ఛవర్గ ప్రభుభయం ధనధాన్యాదినాశనం।
చోరాగ్నినృపపీడాచ సహోదర వినాశనం।
బంధుద్వేష కరంచైవ జీవహానిశ్చజాయతే।
అకస్మాచ్ఛత్రుభీతిశ్చ రాజదండే ధనవ్యయం।
పితృమాతృ వియోగశ్చ ఆత్మబంధువినాశనం॥ 3

తా. శని తన నీచరాశియందున్నను, ౬-౮-౧౨. స్థానములయందున్నను, ద్వితీయ నవమస్థానములయందున్నను, లేక పాపగ్రహములతో కూడియున్నను ఆభుక్తియందు విశేష భయమును, మ్లేచ్ఛవర్గ ప్రభుభయమును, ధనధాన్యాది నాశమును, చోరాగ్నిబాధయు, రాజపీడయు, సహోదర వినాశమును, బంధుద్వేషమును, జీవహానియు, అకస్మాత్తుగా శత్రుభయమును, రాజదండనవల్ల ధనవ్యయమును, మాతాపితృవియోగమును ఆత్మబంధు వినాశమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే దేహతాపంతథైవచ।
శిరోరోగంచకలహం చింతావ్యాధి భయంతథా॥ 4

తా. సూర్యునితో కలసినను, లేక చూడబడినను దేహతాపమును, శిరోబాధయు, కలహమును, మనోవ్యాకులమును, వ్యాధి భయమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టే వస్త్రభూషణసంగ్రహం।
మాతృబంధువివృద్ధిశ్చ సుఖదారాది సంకులం॥ 5

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను వస్త్రలాభమును, భూషణ సంగ్రహమును, మాతృబంధు అభివృద్ధియు, సుఖమును, భార్యాపుత్రాది సంకులమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే నృపాద్భీతిర్ధనవ్యయం।
తాపజ్వరాదిరోగశ్చ సమానజననాశనం॥ 6

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, రాజభీతియు, ధనవ్యయమును, తాపజ్వరాది రోగబాధయు, సమానజననాశమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే మహారాజాశ్రయ స్తథా।
ఇష్టార్థం యత్నసిద్ధిశ్చ కుమారాదివి వృద్ధిదం॥ 7

తా. బుధునితో కలసినను లేక చూడబడినను మహారాజాశ్రయమును, ఇష్టార్థసిద్ధియు, కుమారాది వృద్ధియు కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే సుతదారసమాగమం।
క్షితీశమైత్రం గోలాభం విప్రప్రభువశాత్సుఖం॥ 8

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, భార్యాపుత్ర సమాగమంబును, రాజస్నేహమును, గోలాభమును, బ్రాహ్మణ ప్రభుమూలకముగా సుఖమును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే వస్త్రాభరణవాహనం।
అధికారాది వృద్ధిశ్చ ధాన్యసంగ్రహణం తథా॥ 9



తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, వస్త్రాభరణ సంగ్రహమును, వాహనలాభమును, అధికారాభి వృద్ధియు, ధాన్యలాభమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయే లాభగేపివా।
శుభగ్రహయుతేవాపి ద్రవ్యసంగ్రహణం తథా।
విద్యావినోదకుశలం సమరే శత్రునాశనం।
గోమహిష్యాది లాభశ్చ శూద్రప్రభువశాత్సుఖం॥ 10

తా. దశానాథునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయలాభముల యందున్నను, లేక శుభగ్రహముతో కూడియున్నను, ద్రవ్య సంగ్రహమును, విద్యావినోద కుశలత్వమును, యుద్ధమునందు శత్రునాశనమును, గోవులు, గేదెలు మొదలగు జీవరాసుల లాభమును, శూద్రప్రభుమూలకముగా సుఖమును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
తద్భుక్తౌ దేహహానిస్స్యాత్ మహావ్యాధి భయంతథా॥

తా. దశానాథునకు ౬-౮-౧౨ స్థానములయందున్నను లేక పాపగ్రహసంబంధము కలిగియున్నను, ఆభుక్తియందు దేహపీడయు, మహావ్యాధిభయమును కలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే అపమృత్యుర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం మృత్యుంజయ జపంచరేత్॥ 12

తా. ద్వితీయసప్తమముల యందున్నయెడల అపమృత్యువు సంభవించును. ఆదోషపరిహారార్థమై మృత్యుంజయ జప మాచరించవలయును.

కుజదశాయాం బుధభుక్తిమాసాః. 11 దినాని 27.

పారాశర్యే॥

శ్లో॥ కుజస్యాంత ర్గతేసౌమ్యే లగ్నా త్కేంద్ర త్రికోణగే।
దుశ్చిక్యేలాభగేవాపి ఉచ్చరాశి సమన్వితే।
సత్కథాశ్రవణందానం ధర్మబుద్ధిర్మహద్యశః।
నీతిమార్గ ప్రసంగంచ నిత్యమృష్టాన్న భోజనం।
వాహనాంబర పశ్వాది జ్ఞానకర్మసుఖాధికం।
క్రతుకర్మ ఫలంసిద్ధిః వాహనాంబరభూషణం।
అపూర్వవస్తుసంప్రాప్తిః మహారాజాశ్రయ స్తథా।
యత్నకార్యార్థసిద్ధిశ్చ గృహేకళ్యాణ సంభవం।
క్రయవిక్రయ కౌశల్యం మహాత్మానాంచ దర్శనం॥ 1

తా. అంగారకుని దశలో భుక్తినాథుడగు బుధుడు లగ్నమునకు కేంద్రకోణములయందున్నను, తృతీయ లాభములయం దున్నను; లేక తనఉచ్చరాశిని పొందియున్నను, ఆభుక్తియందు సత్కథాశ్రవణమును, దానధర్మబుద్ధియు, విశేషకీర్తియు, నీతిమార్గ ప్రసంగిమును, నిత్యము మృష్టాన్న భోజనమును, వాహనలాభమును, వస్త్రప్రాప్తియు, పశ్వాభివృద్ధియు, జ్ఞానసంగ్రహమును, సత్కర్మాచరణయు, సుఖాధికమును, మంత్రసిద్ధియు, వాహనాంబరభూషణమును, అపూర్వవస్తు సంప్రాప్తియు, మహారాజాశ్రయమును, యత్నకార్యార్థసిద్ధియు, యింటియందు కళ్యాణ సంభవమును, క్రయవిక్రయ కౌశల్యతయు, మహాజన సందర్శనమును కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టరాశిస్థే వ్యయేవా నీచరాశిగే।
దశాధిపేన సంయుక్తే శతృవృద్ధిర్మహద్భయం।
విదేశగమనంచైవ నానారోగంతథైవచ।



హృద్రోగం మానహానిశ్చ చతుష్పాజ్జీవనాశనం।
స్వస్థానచలనంచైవ స్వమిత్రకలహం తథా॥ 2

తా. బుధుడు, లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను, లేక తననీచరాశియం దున్నను, అథవా దశాధిపతితో కూడియున్నను, ఆభుక్తియందు శతృవృద్ధియు, అధికభయమును, విదేశగమనంబును, నానారోగభయమును, హృదయసంబంధమైన రోగమును, మానహానియు; చతుష్పాజ్జీవనాశనమును, స్వస్థానచలనమును, తనస్నేహితులతోడ కలహమును సంభవించును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే భూపాలా త్సుఖమాప్నుయాత్।
చింతితార్థస్య సిద్ధిశ్చ మణి మాణిక్య సంగ్రహం॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, రాజుల వల్ల సుఖమును, చింతించిన కార్యసిద్ధియు, మణిమాణిక్య సంగ్రహమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతే దృష్టే మాతృవంశ వివృద్ధిదం।
ఆరోగ్య గృహవృద్ధిశ్చ విద్యాధన వివృద్ధిదం॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, మాతృవంశవువారికి అభివృద్ధియు, దేహారోగ్యమును, గృహలాభమును, విద్యాభివృద్ధియు, ధనలాభమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే తనుతాపం భవిష్యతి।
ఆదౌకష్టంచ ఖేదంచ సమానజననాశనం॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను దేహతాపమును, ఆదియందు కష్టమును, దుఃఖమును, సమానజననాశనమును కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే పుత్రప్రాప్తి ర్నసంశయః

ఆత్మసంగ్రహ కౌశల్యం ద్విజదేవార్చనం తథా॥ 6

తా. గురువుతో కలసినను లేక చూడబడినను నిస్సంశయముగా పుత్రప్రాప్తి కలుగును. ఆత్మసంగ్రహ కౌశల్యత యు, దేవబ్రాహ్మణపూజయు లభించును.

శ్లో॥ శుక్రేణ సంయుతేదృష్టే స్త్రీసౌఖ్యంమణిలాభకృత్।
వాహనాదిషు సౌఖ్యంచ వస్త్రభూషణ సంగ్రహః॥ 7

తా. బుధుడు శుక్రునితో కలసినను లేక చూడబడినను ఆభుక్తియందు స్త్రీసౌఖ్యమును, మణిలాభమును, వాహనాది సౌఖ్యమును, వస్త్రలాభమును, భూషణప్రాప్తియు కలుగును.

శ్లో॥ శనివాసంయుతే దృష్టే క్షేత్రధాన్యాది నాశనం।
అకస్మాత్కలహంచైవ సమానజనపీడనం॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను, క్షేత్రధాన్యాది నాశనమును, అకస్మాత్తుగా కలహమును, సమాన జన పీడయు కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా।
శుభగ్రహాయుతేవాపి బంధుమిత్ర సమాగమం।
యత్నకార్యార్థ సిద్ధిశ్చ క్షేత్రవృద్ధిస్తథైవచ।
హేమాభరణ సంప్రాప్తిః అధికారాది లాభతః॥ 9

తా. బుధుడు దశానాథునకు కేంద్రకోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను, లేక శుభగ్రహ యుక్తుడైనను, ఆభుక్తియందు, బంధుమిత్ర సమాగమంబును, యత్నకార్యార్థ సిద్ధియు, క్షేత్రవృద్ధియు, హేమాభరణ సంప్రాప్తియు, అధికారాది లాభమును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
పుత్రదారాది పీడాచ స్థాననాశం నృపాద్భయం।
వ్యవహారేభయంచైవ చింతాకార్య వినాశనం॥ 10

తా. దశానాథునకు, ౬-౮-౧౨. స్థానముల యందున్నను లేక పాపునితో కలసియున్నను, భార్యాపుత్రాదిపీడయు, స్థాననాశమును, రాజ భయమును, వ్యవహారమునందు భయమును, చింతించిన కార్యవినాశమును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా దేహబాధా భవిష్యతి।
తద్దోషపరిహారార్థం సూర్యప్రార్థన మాచరేత్॥ 11

తా. ద్వితీయ సప్తమ రాసులయందు బుధుడున్న యెడల దేహబాధ సంభవించును. ఆదోషపరిహారార్థమై సూర్యప్రార్థన చేయవలయును.

గ్రంథాంతరే॥

శ్లో॥ అశ్వదానం ప్రకుర్వీత విష్ణుసాహస్రకంజపేత్।
సర్వసంపత్ప్రదం సౌఖ్యం సర్వారిష్ట వినాశనం॥ 12

తా. గుఱ్ఱము దానమిచ్చి విష్ణు సహస్రనామ జపము చేసిన యెడల సకలవిధ సంపత్తును, సుఖమును, సకలవిధ అరిష్ట నాశనమును కలుగునని గ్రంథాంతర వచనము.

---

కుజదశాయాం కేతుభుక్తిమాసాః. 4 దినాని 27.

కృష్ణియే॥

శ్లో॥ కుజస్యాంతర్గతే కేతౌ లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయే లాభగేవాపి ఉచ్చరాశి సమన్వితే।
స్వల్పసౌఖ్యం స్వల్పలాభం ఆదాయా దధికవ్యయం।
భుక్త్యాదౌ స్వల్పసౌఖ్యం స్యాద్బహులాభంచ సుఖావహం॥1

తా, కుజమహర్దశలో కేతుభుక్తియందు, కేతువు లగ్నమునకు కేంద్ర త్రికోణములయందున్నను, తృతీయలాభముల యందున్నను లేక తనఉచ్చరాశిని పొందియున్నను, అల్పసుఖ

మును,అల్పలాభమును,ఆదాయమునకు మించిన వ్యయమును౹ భుక్తి ఆదియందు స్వల్పసౌఖ్యమును అటుపిమ్మట భూలాభమును, అధికసుఖమును కలుగచేయును.

గ్రంథాంతరే॥

శ్లో॥ ద్రవ్యలాభం మహత్సౌఖ్యం నృపసన్మానమేవచ।
సహోదరాది సౌఖ్యంచ అధికారాది లాభతః॥
తీర్థస్నాన ఫలప్రాప్తిః గురుదేవ ద్విజార్చనం।
దీక్షాకర్మ ఫలప్రాప్తిః కీర్తివృద్ధిస్తథైవచ॥ 2

తా. ద్రవ్యలాభమును, అధికసౌఖ్యమును, రాజసన్మానమును, భ్రాతృవర్గపువారికి సుఖమును, అధికారాది లాభమును, తీర్థస్నాన ఫలప్రాప్తియు, దేవబ్రాహ్మణపూజయు, దీక్షబూని చేయదగిన కర్మఫలమును, కీర్తియు, కుజదశా కేతుభుక్తిలో కలుగునని గ్రంథాంతరమున చెప్పబడియున్నది.

శ్లో॥ షష్ఠాష్టమ వ్యయస్థేనా నీచేవా శత్రురాశిగే।
విషచోరారి బాధాచ నిద్రాలస్యం తథైవచ॥
దారపుత్రాది పీడాచ ఆప్తబంధువిరోధతా।
అన్యగృహ ప్రవాసంచ విధవా కలహంతథా॥ 3

తా. కేతువు లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయందున్నను, నీచరాశిని పొందియున్నను లేక శత్రుక్షేత్రమందున్నను ఆభుక్తియందు విషబాధయు, చోరభయమును, శత్రుపీడయు, నిద్రయు, అలస్యమును, భార్యాపుత్రాది పీడయు, ఆప్తబంధువిరోధమును, అన్యగృహప్రవేశమును, విధవా కలహమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే రాజదండోధనక్షయః।
నృపతస్కరబాధాచ శిరోరోగం జ్వరంతథా॥ 4



తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, రాజదండనయు, ధనక్షయమును, రాజభయమును, చోరబాధయు, శిరోవ్యాధియు, జ్వరపీడయు కలుగును.

శ్లో॥ శశినా సంయుతే దృష్టే మాతృకష్టం మనోవ్యథా।
అకాలభోజనప్రాప్తిః మిత్రం బంధు విరోధతా॥ 5

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, మాతృకష్టమును, మనోచింతయు, అకాలభోజనమును, మిత్రులతోడను బంధువులతోడను విరోధమును కలుగును.

శ్లో॥ కుజేన సంయుతే దృష్టే దేహరోగం మనోవ్యథా।
సర్వత్రకలహంచైవ శత్రుఘాతాది పీడనం॥ 6

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, దేహబాధయు, మనోవ్యసనమును, సర్వులతోడను కలహమును, శత్రువులచే కొట్టబడిన గాయములచేత బాధయు కలుగును.

శ్లో॥ బుధేన సంయుతే దృష్టే శస్త్రాస్త్ర కుశలీ భవేత్।
లిపివాచక వృద్ధిశ్చ గణికాదివి చింతనం॥ 7

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, శస్త్రవిద్యయందును, అస్త్రవిద్యయందును కుశలత్వమును, కావ్యవాచకాది విద్యలయందు నిపుణత్వమును, గణికాది విషయవివేకజ్ఞానమును కలుగును.

శ్లో॥ గురుణా సంయుతే దృష్టే పుత్రప్రాప్తి ర్మహత్సుఖం।
ధనవృద్ధిః నృపప్రీతిః యత్నకార్య సుసిద్ధిదం॥ 8

తా. గురువుతో కలసినను లేక చూడబడినను పుత్రప్రాప్తియు, విశేషసౌఖ్యమును, ధనవృద్ధియు, రాజప్రీతియు, యత్నకార్యసిద్ధియు కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతే దృష్టే స్త్రీనాశం కలహంతథా।

వాహనక్షేత్రనాశశ్చ బంధునాశం మతిభ్రమం॥ 9

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, స్త్రీనాశమును, కలహమును, వాహననాశమును, క్షేత్రవినాశమును, బంధుక్షయమును, మతిభ్రంశమును కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే భృత్యవర్గ వినాశనం।
నీచసేవాచ కలహం నీచస్త్రీ కలహంతథా॥ 10

తా. శనితో కలసినను లేక చూడబడినను, తనసేవకులకు నాశమును. నీచజనసేవయు, కలహమును, నీచస్త్రీతో జగడమును కలుగును.

శ్లో॥ దాయేశా త్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
సమాన జననాశశ్చ దారాపుత్రాది నాశనం।
ఆప్తబంధు విరోధశ్చ నీచస్త్రీ కలహం తథా॥ 11

తా. కేతువు దశానాధునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను లేక పాపునితో కలసియున్నను ఆభుక్తియందు సమానజననాశమును, భార్యాపుత్రాది నాశనమును, ఆప్తబంధువిరోధమును, నీచస్త్రీ కలహమును కలుగును.

శ్లో॥ దాయేశా త్కేంద్రకోణేవా దుశ్చిక్యే లాభ గేపివా।
శుభగ్రహ వశాత్సౌఖ్యం యిష్టసిద్ధిర్మనోజయం।
మహారాజ ప్రసాదేన ధనధాన్యాది సంపదః॥ 12

తా. దశానాధునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయలాభములయం దున్నను లేక శుభగ్రహ సంబంధము కలిగియున్నను, సుఖమును, యిష్టసిద్ధియు, మనోజయమును, మహారాజానుగ్రహము వలన ధన ధాన్యాది సంపదయు కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి।



తద్దోషపరిహారార్థం శ్రీరుద్రజపమాచరేత్।
ఛాగదానం ప్రకుర్వీత పశ్చాచ్ఛాంతి మవాప్నుయాత్॥ 13

తా. ద్వితీయ సప్తమస్థానములయం దున్నయెడల అపమృత్యువు సంభవించును. ఆదోషపరిహారార్థమై శ్రీరుద్రజపమాచరించ వలయును, ఛాగదానముచేసిన పిమ్మట శాంతి కలుగును.

---

## కుజదశాయాం శుక్రభుక్తిమాసాః 14.

కృష్ణీయ్యే॥

శ్లో॥ కుజస్యాంతర్గతేశుక్రే లగ్నాత్కేంద్రత్రికోణగే।
తృతీయ్యేలాభగేవాపి ఉచ్చస్వక్షేత్రసంయుతే।
రాజ్యలాభంమహాత్సౌఖ్యం గజాశ్వాంబరసంకులం।
లగ్నాధిపేనసంయుక్తే దారశ్రీ పుత్రవర్ధనం।
ఆయురారోగ్యమైశ్వర్య భాగ్యంబుద్ధి శుభాధికం।
లాభస్థానదశాకాలే లగ్నాధీశ్వరభుక్తిషు।
పుత్రలాభంమహాత్సౌఖ్యం గజాశ్వాంబరసంకులం।
మహారాజప్రసాదేన గృహేలక్ష్మీకటాక్షకృత్॥ 1

తా. కుజమహర్దశలో శుక్రభుక్తియందు, శుక్రుడు లగ్నమునకు, కేంద్రత్రికోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను,లేక ఉచ్చ స్వక్షేత్రములయందున్నను రాజ్యలాభమును,విశేషసౌఖ్యమును, ఏనుగులు, గుఱ్ఱములు, వస్త్రములు మొదలగు వాని లాభమును, కలుగును. లగ్నాధిపతితో కూడియున్నయెడల భార్యాపుత్రులకు అభివృద్ధియు, ఐశ్వర్యాభివృద్ధియు, ఆయురారోగ్యమును: బుద్ధియు, అధిక శుభమును కలుగును. లాభస్థానమందున్న కుజదశలో లగ్నాధిపతి యొక్క భుక్తియందు పుత్రలాభమును, విశేష సౌఖ్యమును,

గజాశ్వాంబర సంకులమును, మహారాజానుగ్రహము వలన యింటియందు లక్ష్మీకటాక్షమును కలుగును

శ్లో॥ లగ్నషష్ఠాష్టమేవాపి వ్యయేవానీచగాశిగే।
తస్యభుక్తౌ స్త్రీవిరోధశ్చ పుత్రదారాదిపీడనం॥
యత్నకార్యవినాశశ్చ ద్రవ్యనాశంతథైవచ।
సమరేశత్రుభీతిశ్చ వాహనాదిక్షయంభవేత్।
కృషిగోధాన్యనాశశ్చ స్త్రీమూలాత్ప్రాణహానిదః॥

తా. లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను లేక తన నీచరాశిని పొందియున్నను ఆభుక్తియందు స్త్రీవిరోధమును, భార్యాపుత్రాది పీడనయు, యత్నకార్య భంగమును, ద్రవ్యనాశమును, యుద్ధమునందు శత్రుభీతియు, వాహనాది క్షయమును, కృషినష్టమును, గో ధాన్యనాశమును, స్త్రీమూలకముగా ప్రాణహానియు కలుగును.

పారాశర్యే॥

శ్లో॥ సంగ్రామేగ్నిభయంతథాచ కలహంస్థానచ్యుతిందక్షిణే।
యాత్రారాజసమాగమో ధనపతే స్సంతాపవైరోద్భవం॥
తస్మాదిష్టఫలప్రదోష్ణశమనం భూపాలసన్మానకృత్।
శుక్రేసౌమ్యసుధాకరోప సహితేవిత్తప్రదస్సౌఖ్యదః॥
భాగ్యలాభాదిపైర్యుక్తే రుష్ణేశాధిపసంయుతే।
రోగనాశంపితృసుఖం చార్థలాభంశుభప్రదం।
వివాహోత్సవకార్యాణి భూలాభంపుత్రసౌఖ్యదం॥ 3

తా. యుద్ధమునందు అగ్నిభయమును, కలహమును, స్థాననాశమును, దక్షిణదిశకు ప్రయాణముకిలిగి అచ్చట రాజసందర్శనమును, ధనికులతోడ విరోధమును, ఇష్ట ఫలప్రదమును, ఉష్ణశమనమును, రాజసన్మానమును కలుగును. శుక్రుడు,



బుధచంద్రులతో కలసియున్నయెడల ధనాగమంబును, సౌఖ్యమును కలుగును. భాగ్యలాభాధిపతులతోగాని లేక పతితోగాని కలసియున్నయెడల రోగనాశమును, పితృసుఖమును, అర్థలాభమును, శుభమును, వివాహోత్సవ కార్యములు జరుగుటయు, భూలాభమును, పుత్రసౌఖ్యమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే బాహుజాద్దండమాప్నుయాత్।
స్వపత్నీదేహనాశశ్చ పరస్పరవిరోధకృత్॥ 4

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, తన స్వంతపత్నీ వియోగమును, దేహనాశమును, పరస్పర విరోధమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టే గంధద్రవ్యాదిలాభకృత్।
అపూర్వవస్తుసంప్రాప్తిః మాతృవంశవివృద్ధిదః॥ 5

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, గంధద్రవ్యాదిలాభమును, అపూర్వ వస్తుసంప్రాప్తియు, మాతృవంశపువారికి అభివృద్ధియు కలుగును.

శ్లో॥ కుజేన సంయుతేదృష్టే పత్నీగర్భస్యనాశనం।
ఆప్తబంధు వినాశశ్చ సర్వశత్రు వివృద్ధిదః॥ 6

తా. కుజునితో కలసినను లేక చూడబడినను పత్నీగర్భనాశమును, ఆప్తబంధుహానియు,సర్వశత్రువులకును అభివృద్ధియు కలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే విద్యాభ్యాసాదిసంగ్రహః।
బంధూనాముపకారత్వం వాక్పాండిత్యం సభాసుచ॥ 7

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, విద్యాభ్యాసాది సంగ్రహమును, బంధు జనోపకారమును, సభలయందు వాక్పాండిత్యమును కలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే దేహారోగ్యం ధనాగమం।
పండితానాంచసంసర్గః విప్రప్రభువశాత్సుఖం॥ 8

తా. గురువుతో కలసినను లేక చూడబడినను దేహారోగ్యమును, ధనాగమంబును, పండితులగోష్టియు, ప్రభుమూలకముగా సౌఖ్యమును కలుగును.

శ్లో॥ శనినాస్థానచలనం ఉద్యోగస్యవినాశనం।
నానావిధానిచింతాని సంప్రాప్తిర్భవతిధ్రువం॥ 9

తా. శనితో కలసినను లేక చూడబడినను, స్థానచలనమును, ఉద్యోగహానియు, నానావిధములైన చింతయు, నిశ్చయముగా సంభవించును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా।
శుభగ్రహయుతేవాపి దేహసౌఖ్యంవినిర్దిశేత్।
స్త్రీసౌఖ్యంపుత్రసంపత్తిః స్వప్రభోస్తుమహత్సుఖం॥ 10

తా. భుక్తినాథుడగు దశానాథునకు కేంద్రకోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను లేక శుభగ్రహములతో కూడియున్నను ఆభుక్తియందు దేహసౌఖ్యమును, స్త్రీసౌఖ్యమును, పుత్రసంపత్తియు, స్వంతప్రభుమూలకముగా విశేష సుఖమును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవాపాపసంయుతే।
తద్భుక్తౌవ్యాధిదుఃఖంచ కలహంప్రాణపీడనం।
యత్నకార్యవినాశశ్చ నృపక్రోధంధనక్షయం।
శత్రుపీడాపుత్రపీడా దారపీడాభవిష్యతి॥ 11

తా. శుక్రుడు దశానాథునకు ౬-౮-౧౨ స్థానములయందున్నను లేక పాపులతో కలసియున్నను, ఆ భుక్తియందు వ్యాధిసంభవమును, దుఃఖమును, కలహమును, ప్రాణపీడయు,



యత్న కార్యభంగమును, రాజక్రోధమును, ధనక్షయమును, పుత్రపీడయు, భార్యపీడయు కలుగును

శ్లో॥ పూర్ణచంద్రేపూర్ణఫలం పరరాష్ట్రాధిపత్యతాం।
ఉత్తరాందిశిమాశ్రిత్య ప్రయాణంరాజదర్శనం॥
క్షీణచంద్రేక్షీణఫలం అర్థవ్యయకరోభవేత్।
దారపుత్రవినాశశ్చ నృపచోరాగ్నిపీడనం॥ 12

తా. పూర్ణచంద్రునితో కలసియున్న యెడల పూర్ణఫలమును, పరరాష్ట్రాధిపత్యమును ఉత్తరదిక్కునకు ప్రయాణమును, రాజదర్శనమును కలుగును. క్షీణ చంద్రుడైన యెడల క్షీణఫలమును, అర్థవ్యయమును, భార్యాపుత్రవినాశమును, రాజచోరాగ్నిపీడనయు కలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే దేహబాధాభవిష్యతి।
తద్దోషపరిహారార్థం వనదుర్గాజపంచరేత్।
దుర్గాదానప్రకుర్వీత దానే నారోగ్యమావిశేత్॥ 13

తా. శుక్రుడు ద్వితీయ సప్తమములయందున్నయెడల దేహ బాధ కలుగును. ఆదోష పరిహారార్థమై వనదుర్గాజపమాచరించవలయును. యథావిధిగా దుర్గాదానము చేసిన పిమ్మట ఆరోగ్యము కలుగును.

---

కుజదశాయాం రవిభుక్తిమాసాః 4 దినాని 6.

కృష్ణియ్యే॥

శ్లో॥ కుజస్యాంతర్గతేసూర్యే లగ్నాత్కేంద్రత్రికోణగే।
తృతీయేలాభగేవాపి ఉచ్చస్వక్షేత్రగేపివా।
మూలత్రికోణసంయుక్తే తీర్థయాత్రాతథైవచ।
రాజాశ్రయధనప్రాప్తిః శివచింతాప్రసంగనుః।
యజ్ఞదానఫలాప్తిర్వా యత్నకార్యార్థసిద్ధిదం।

పుత్రోత్పత్తిసుఖంచైవ మిత్రప్రభువశాత్సుఖం।
స్వవారేరాజసన్మానం వస్త్రాభరణసంగ్రహః॥ 1

తా. కుజమహర్దశలో సూర్యభుక్తియందు సూర్యుడు లగ్నమునకు కేంద్రత్రికోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను లేక ఉచ్చ స్వక్షేత్రములయందున్నను, లేక మూలత్రికోణ స్థానమందున్నను, తీర్థయాత్రయు, రాజాశ్రయమును, ధనప్రాప్తియు, శివచింతా ప్రసంగమును, యజ్ఞదాన ఫలప్రాప్తియు, యత్నకార్యసిద్ధియు, పుత్రోత్పత్తియు, సుఖమును, మిత్రప్రభు మూలకముగా సుఖమును, స్వవారమునందు రాజదర్శనమును, వస్త్రాభరణ సంగ్రహమును కలుగును.

శ్లో॥ లగ్నాషష్ఠాష్టరాశిస్థే వ్యయేవానీచరాశిగే।
తద్భుక్తౌక్రోధకలహం స్థాననాశం నృపాద్భయం।
పితుర్మృతి ర్మనోదుఃఖ మాప్తబంధువినాశనం।
సమానజనవిద్వేషం పైత్యరోగాది సంభవం।
తాపజ్వరాది పీడాచ ఆలస్యం కార్యనాశనం॥ 2

తా. సూర్యుడు లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను, లేక తన నీచరాశియందున్నను ఆభుక్తియందు క్రోధమును, కలహమును, స్థాననాశమును, రాజభయమును, పితృనాశమును, మనోదుఃఖమును, ఆప్తబంధు వినాశమును, సమాన జనద్వేషమును, పైత్యరోగాది సంభవమును, తాపజ్వరాది పీడయు, దేహాలస్యమును, కార్యనాశమును కలుగును.

శ్లో॥ చంద్రేణసంయుతేదృష్టే ద్రవ్యలాభం మహత్సుఖం।
అతిప్రతాపమారోగ్యం యత్నకార్యార్థసిద్ధిదం॥ 3

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, ద్రవ్యలాభమును, విశేష సుఖమును, అతిప్రతాపమును, ఆరోగ్యమును, యత్నకార్యార్థసిద్ధియు కలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే యుద్ధేఘాతాదిపీడనం।
స్త్రీపుత్రజనపీడాచ జ్ఞాతిశత్రువివృద్ధిదం॥ 4

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, యుద్ధమునందు ఘాతాది పీడనము, భార్యాపుత్ర పీడయు, జ్ఞాతి వృద్ధియు, శత్రువృద్ధియు కలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే ఉత్తమాయుధ లబ్ధవాన్।
బంధూనాముపకారత్వం సభాపూజ్యత్వమేవచ॥ 5

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, ఉత్తమాయుధ లాభమును, బంధుజనోపకారమును, సభాపూజ్యతయు కలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే పుత్రప్రాప్తిర్నసంశయః।
స్త్రీసౌఖ్యం ధనలాభశ్చ మిత్రప్రభు వశాత్సుఖం॥ 6

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, నిస్సంశయముగా పుత్రప్రాప్తీ కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే వాహనాశ్వాదిసంగ్రహం।
అపూర్వవస్తుసంప్రాప్తి ర్మణిభూషణసంగ్రహం॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను అశ్వాది వాహన లాభమును, అపూర్వ వస్తుసంప్రాప్తియు, మణి భూషణ సంగ్రహమును కలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే గజాశ్వపశునాశనం।
భృత్యవర్గవినాశశ్చ దారాక్లేశంభవిష్యతి॥ ౮

తా. శనితో కలసినను లేక చూడబడినను, ఏనుగులు, గుఱ్ఱములు, పశువులు మొదలగువాని నాశమును, భృత్యవర్గ వినాశమును, భార్యాక్లేశమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యేలాభగేపివా।
శుభగ్రహాయుతేవాపి శుభశోభనసంయుతం।
వస్త్రాభరణసంప్రాప్తిః మహారాజాశ్రయస్తథా।
ప్రాచ్యాంప్రయాణంకురుతే యత్నకార్యార్థసిద్ధిదం।
సుగంధచందనద్రవ్యం లభతే నాత్రసంశయః॥ 9

తా. సూర్యుడు దశానాథునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయ లాభములయందున్నను, లేక శుభగ్రహముతో కూడియున్నను, ఆభుక్తియందు శుభ శోభనప్రాప్తియు, వస్త్రాభరణ సంగ్రహమును, మహారాజా శ్రయమును, పూర్వ దిక్కునకు ప్రయాణమును, యత్నకార్యార్థసిద్ధియు కలుగును. సుగంధ చందనాది ద్రవ్యలాభమును, నిస్సంశయ ముగా కలుగును.

శ్లో॥ దాయేశా త్షష్ఠరంధ్రేవా వ్యయేవాపాపసంయుతే।
సమరే శత్రువృద్ధిశ్చ పితృవర్గవినాశనం।
క్షితీశ కోపకలహం సంతాపజ్వరమేవచ॥ 10

తా. దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను లేక పాపగ్రహ సంబంధము కలిగియున్నను, యుద్ధమునందు శత్రువృద్ధియు, పితృవర్గపువారికి నాశనమును, రాజకోపమును, కలహమును, సంతాపజ్వరమును, కలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం పద్మదానం చ కారయేత్॥ 11

తా. ద్వితీయ సప్తమరాసులయం దున్నయెడల అప మృత్యువు సంభవించును. ఆ దోషపరిహారార్థమై తామర పుష్ప దాన మిచ్చిన యెడల శాంతి కలుగును.



కుజదశాయాం చంద్రభుక్తిమాసాః 7.

కృష్ణీయే॥

శ్లో॥ కుజస్యాంతర్గతేచంద్రే లగ్నాత్కేంద్రత్రికోణగే।
తృతీయలాభగేవాపి ఉచ్చరాశిస్థితేపివా॥
కళ్యాణంభూరిసంపత్తిః ఛత్రచామరభూషణం।
తూర్యవాదిత్ర నిర్ఘోషం నటగాయకసంకులం।
దారపుత్రాదిసౌభాగ్యం సమరేశత్రునాశనం।
వాహనాంబరభూమ్యాది నిక్షేపాదిస్సు లబ్ధవాన్।
క్షేత్రాదికృషివృద్ధిశ్చ ప్రయాణేకార్యసిద్ధిదం॥ 1

తా. కుజమహాదశలో చంద్రభుక్తియందు చంద్రుడు లగ్నమునకు కేంద్రత్రికోణములయందున్నను, తృతీయలాభ ములయందున్నను, లేక తన ఉచ్చరాశియందున్నను, ఆభుక్తి యందు కళ్యాణమును, భూరిసంపత్తియు, ఛత్రచామర వైభవ మును, భూషణప్రాప్తియు, తూర్యవాద్యాది ఘోషములును, నటగాయకుల సంకులమును, భార్యాపుత్రాదులయొక్క సుఖ మును, యుద్ధమందు శత్రునాశనమును, వాహనయోగమును, వస్త్రలాభమును, భూలాభమును, నిధినిక్షేపాది సంపత్తును, క్షేత్రవృద్ధిని, కృషిలాభమును, ప్రయాణమునందు కార్య సిద్ధియు కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టరాశిస్థే వ్యయేవా నీచరాశిగే।
శిరోరోగంమనస్తాపం కుత్సితాన్నాదిభోజనమ్।
ఇష్టబంధువిరోధత్వం కృషిక్షేత్రవినాశనం।
మాతృకష్టంమాతులస్య విధవాకలహాంతథా॥ 2

తా. చంద్రుడు లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను, లేక తన నీచరాశియందున్నను, శిరోరోగమును, మన

స్తాపమును, కుత్సితాన్నాది భోజనమును. ఇష్టబంధు విరోధ మును, కృషినష్టమును, క్షేత్రనాశమును, మాతృకష్టమును, మేనమామలతోడ కలహమును, విధవా కలహను కలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే ప్రభుమూలాత్సుఖంభవేత్।
అపూర్వవస్తుసంప్రాప్తిః పత్నీబంధువినాశనం॥ 3

తా. సూర్యునితోకలసినను లేకచూడబడినను రాజమూల కముగాసుఖమును, అపూర్వ వస్తుసంప్రాప్తియు, పత్నీవియోగ మును, బంధునాశమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే తాపజ్వరమరేర్భయం।
వివాదయుద్ధకలహం భూమినాశం నసంశయః॥ 4

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, తాప జ్వరమును, శత్రుభయమును, వివాద యుద్ధమును, కలహమును, భూనాశమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే గృహలాభంవిచిత్రకం।
బాంధవాదివివృద్ధిశ్చ సన్మానం నృపపూజనం॥ 5

తా. బుధునితోకలసినను లేక చూడబడినను, విచిత్ర గృహలాభమును, బంధు జనాభివృద్ధియు, సన్మానమును, రాజ పూజ్యతయు కలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే స్వపుత్రాణాంవివృద్ధిదం।
అర్థలాభంమహాసౌఖ్యం విద్యాకీర్తిర్ధనాగమం॥ 6

తా. గురువుతోకలసినను లేక చూడబడినను, పుత్రాభి వృద్ధియు, అర్థలాభమును, మేలైన సౌఖ్యమును, విద్యాయశ స్సును, ధనాగమంబును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే స్త్రీపుత్రాణాంతు సౌఖ్యదం।
సమరేవిజయంచైవ వస్త్రభూషణ లబ్ధవాన్॥ 7



తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, భార్యా పుత్రులయొక్క సౌఖ్యమును, యుద్ధమునందు జయమును, వస్త్రలాభమును, భూషణప్రాప్తియు కలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే భృత్యనాశం తథైవచ।
స్థాననాశంక్షేత్రనాశం సమానజననాశనం॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను, సేవకుల నాశనమును, స్థాననాశనమును, క్షేత్రనాశమును, సమాన జన నాశనమును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
దేహతాపంమనస్తాపం బుద్ధిజాడ్యం తథైవచ।
క్షితీశకలహంచైవ యాత్రాయాం నిష్ఫలంభవేత్॥ 9

తా. చంద్రుడు దశానాథునకు ౬-౮-౧౨. స్థానముల యందున్నను, లేక పాపగ్రహముతో కూడియున్నను, దేహ తాపమును, మనస్తాపమును, బుద్ధిభ్రంశమును, రాజకలహ మును, యాత్రయందు నిష్ఫలమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా।
శుభగ్రహయుతేవాపి ధనలాభముదీరయేత్।
మణివస్త్రాదిలాభశ్చ పుత్రికాసంభవంతథా।
స్త్రీప్రీతిర్మానవృద్ధిశ్చ విజయంచ భవిష్యతి॥ 10

తా. చంద్రుడు దశానాథునకు కేంద్రకోణములయం దున్నను తృతీయ లాభములయందున్నను, లేక శుభగ్రహ ముతో కలసియున్నను, ఆ భుక్తియందు ధనలాభము వచింప తగినది. గాకను మణివస్త్రాది లాభమును, పుత్రికాసంభవమును, స్త్రీప్రీతియు, మానవృద్ధియు, జయమును కలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే అపమృత్యుర్భవిష్యతి।

తద్దోషపరిహారార్థం దుర్గాదానంచ శాంతిదం॥ 11

తా. ద్వితీయ సప్తమరాసులయం దున్నయెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై దుర్గాదానము చేయవలయును. అటుపిమ్మట సౌఖ్యము కలుగును.

ఇతి జాతకఫల చింతామణౌ కుజదశాంతర్దశాఫలంనామ చతుర్థప్రకరణం—సమాప్తము.

---

శుభమస్తు.

# జాతకఫలచింతామణి.

## ఆంధ్ర తాత్పర్య సహితము.

### రాహుదశాఫలనామ పంచమ ప్రకరణము.

రాహుదశావత్సరాః. 18

కృష్ణిర్యే॥

శ్లో॥ అత్యంతకష్టమతి విభ్రమదారనాశం
ఘోరార్తిపుత్రమరణం పితృవర్గవినాశనం।
దేశాంతరాది గమనం స్వజనైర్విరోధం
స్యాత్సర్వదా తమశాగమనే నపుంసాం॥ 1

తా. మనుష్యునకు రాహుదశ సంప్రాప్తించిన కాలమందు అధిక కష్టమును, మతిభ్రంశమును, భార్యావియోగమును, ఘోరబాధయు, పుత్రమరణమును, పితృవర్గపువారికి నాశనమును, దేశాంతరాది గమనమును, స్వజనవిరోధమును, కలుగుచుండును.

శ్లో॥ అత్యుచ్చసంస్థస్య తమస్యదాయే
స్వబంధుసంరక్షణ వాగ్విలాసం।



పురాధిపత్యం వరవస్తులాభం
యానాంబరంక్షేత్ర సమృద్ధిదంచ॥ 2

తా. పరమోచ్చయందున్న రాహుదశలో తన బంధుజనులయొక్క సంరక్షణయు, వాగ్విలాసమును, పురాధిపత్యమును, శ్రేష్ఠమైన వస్తులాభమును, వాహన సమృద్ధియు, వస్త్రప్రాప్తియు, క్షేత్రాభివృద్ధియు కలుగును.

శ్లో॥ ఉచ్చస్థితస్య రాహోర్దాయే భూపాలపూజనంకురుతే।
వరవస్త్రహేమలాభం స్వస్త్రీసౌఖ్యంచకల్యాణం॥ 3

తా. ఉచ్చరాశియందున్న రాహు దశాకాలమందు రాజపూజ్యత కలుగును. గాకను శ్రేష్ఠమైన వస్త్రలాభమును, బంగారమును, స్వంత స్త్రీసౌఖ్యమును, కల్యాణ మహోత్సవమును కలుగును.

శ్లో॥ అతిమిత్రగృహస్థస్య రాహోర్దాయే మహత్సుఖం।
గృహక్షేత్రాభివృద్ధిశ్చ తీర్థయాత్రా విశేషతః॥ 4

తా. అధి మిత్రక్షేత్రమందున్న రాహుదశలో విశేషసుఖమును, గృహక్షేత్రాభివృద్ధియు, విశేషముగా తీర్థయాత్రాఫలమును కలుగును

శ్లో॥ మిత్రర్క్షగస్యాపి తమస్యదాయే
విద్యావిలాసం స్వజనానుకూలం।
పరోపకారం మణివస్త్రలాభం
దీక్షాప్రసంగం కురుతేసదానృణాం॥ 5

తా. మిత్రక్షేత్రమందున్న రాహు దశాకాలమందు విద్యావిలాసమును, స్వజనానుకూలమును, పరోపకారమును, మణివస్త్రలాభమును, దీక్షాప్రసంగమును, కలుగును.

శ్లో॥ సమర్క్షగస్య రాహోస్తు క్వచిత్కష్టం క్వచిత్సుఖం।

క్వచిద్బాధాదశాంతేచ స్థాననాశంమనోవ్యథా॥

తా. సమక్షేత్రమందున్న రాహుదశలో కొంతకష్టమును, కొంతసుఖమును, అల్పబాధయు, దశాంత్యమునందు స్థాననాశమును, మనోవ్యసనమును కలుగును.

శ్లో॥ శత్రుర్క్షగస్యాపి తమస్యదాయే
క్షితీశకోపం ధననాశనంచ।
యుద్ధేభయం ధాన్యవినాశనంచ
సర్వాణికార్యాణి వినాశమాహుః॥ 7

తా. శత్రుక్షేత్రమందున్న రాహువు తన దశలో రాజకోపమును, ధననాశమును, యుద్ధమునందు భయమును, ధాన్యనాశమును, సర్వకార్యములయందును నాశనమును కలుగును.

శ్లో॥ అత్యంతశత్రుభవనస్య తమస్యదాయే
స్థానచ్యుతిం స్వజనహాని ధనక్షయంచ।
భూపాలకోపకలహం విషసర్పబాధా
ఇష్టార్థకార్యవిఫలం బహురోగదశ్చ॥ 8

తా. అధి శత్రుగృహంబుననున్న రాహుదశలో స్థాననాశము, స్వజనహానియు, ధనక్షయమును, రాజకోపమును, కలహమును, విషసర్పబాధయు, ఇష్టార్థ కార్యభంగమును, బహువిధ రోగబాధయు కలుగును.

శ్లో॥ నీచస్థితస్యాపి తమస్యదాయే నీచానుసంసర్గముపైతిసిద్ధిం।
వితంతునారీకలహంభయంచ స్వస్త్రీవినాశం సుఖనాశనంచ॥

తా. నీచరాశియందున్న రాహుదశలో నీచజన సాంగత్యమును, విధవాస్త్రీతోడ కలహమును, భయమును, స్వంతస్త్రీ నాశమును, సుఖనాశనమును కలుగును.

శ్లో॥ అతినీచగతస్య రాహోర్దాయేమహద్భయం।



సమానజననాశశ్చ చతుష్పాజ్జీవనాశనం॥ 10

తా. పరమనీచస్థానగతుడైన రాహుదశలో అధిక భయమును, సమాన జననాశమును, చతుష్పా జ్జీవనాశనమును కలుగును.

శ్లో॥ శుభాన్వితస్యాపి తమస్యదాయే
యుద్ధేజయం సౌఖ్యముపైతిసిద్ధిం।
ఉద్యోగలాభం పురనాయకత్వం
క్షితీశపూజ్యం స్వజనానుకూలం॥ 11

తా. శుభగ్రహములతో కూడిన రాహుదశలో యుద్ధమునందు జయమును, సౌఖ్యమును, ఉద్యోగలాభమును, పురాధిపత్యమును, రాజ పూజ్యతయు, స్వజనానుకూలమును కలుగును

శ్లో॥ పాపాన్వితస్య రాహోస్తు దాయే పాపాదిచింతనం।
స్వస్థాననాశనంవ్యాధిః ప్రభుక్రోధంమనోవ్యథా॥ 12

తా. పాపగ్రహముతో కూడిన రాహుదశలో పాప కార్య చింతనయు, స్వస్థాననాశమును, వ్యాధియు ప్రభుక్రోధమును, మనోవ్యథయు కలుగును.

---

మేషాదిరాశిస్థిత రాహుదశాఫలం.

శ్లో॥ మేషస్థితస్యాపి తమస్యదాయే
మనోత్సవం మంగళతూర్యఘోషం।
భూమ్యాధిపత్యం పృథివీశపూజ్యం
స్త్రీపుత్రమిత్రాదిషు సౌఖ్యమేతి॥ 13

తా. మేషరాశియందున్న రాహుదశాకాలమందు మనస్సంతోషమును, మంగళకరములైన వాద్యఘోషములును, భూమ్యాధి పత్యమును, రాజపూజ్యతయు, భార్యాపుత్రుల

యొక్కయు, స్నేహితులయొక్కయు. సుఖమును కలుగును.

శ్లో॥ వృషస్థితస్యాపి తమస్యదాయే
క్షేత్రార్థలాభం పృథివీశపూజ్యం।
విద్యావిలాసం వరవస్తులాభం
గోభూమిధాన్యాంబర హేమలాభం॥ 14

తా. వృషభరాశియందున్న రాహువు తనదశలో క్షేత్రవృద్ధియు, అర్థలాభమును, రాజ పూజ్యతయు, విద్యావిలాసమును, శ్రేష్ఠమైన వస్తులాభమును, గోవులు, భూములు, ధాన్యములు, వస్త్రములు, బంగారము మొదలగువాని లాభమును కలుగును.

శ్లో॥ యుగ్మగతరాహుదాయే శత్రుక్రోధంనృపాలభీతిశ్చ।
స్వస్త్రీబాధాకష్టం బంధువిరోధం మనస్తాపం॥ 15

తా. మిథునరాశియందున్న రాహుదశలో శత్రుక్రోధమును, రాజభీతియు, స్వంతస్త్రీబాధయు, కష్టమును, బంధువిరోధమును, మనస్తాపమును కలుగును.

శ్లో॥ కర్కిస్థస్యతమస్యపాక శుభదా రాజ్యాధి పత్యప్రదా।
దారాపుత్రసుఖప్రదా బహుధనప్రాప్తిప్రదాసౌఖ్యదా ।
భూక్షేత్రాది బహుప్రదావిజయదా విద్యాప్రదాశ్రీప్రదా।
నానాధాన్యసమృద్ధిదా విజయతే నృణాంసుసిద్ధిప్రదా॥ 16

తా. రాహువు కర్కాటకరాశియందుండగా తనదశలో రాజ్యాధిపత్యము నిచ్చువాడును, భార్యాపుత్ర సుఖము నిచ్చువాడును, విశేషధనము నిచ్చువాడును, సౌఖ్యము నిచ్చువాడును యగును, గాకను భూక్షేత్రాది ఫలప్రాప్తిని, విజయమును, విద్యాలాభమును, సకలైశ్వర్యభోగమును, నానాధాన్యసమృద్ధిని, సర్వత్రవిజయమును సహా కలుగచేయును.



శ్లో॥ సింహస్థితస్య రాహోశ్చ భూపాలవిగ్రహం।
ధనధాన్యవినాశశ్చ క్షేత్రధాన్యాది నాశనం॥ 17

తా. సింహరాశియందున్న రాహుదశలో రాజవిద్వేషమును, ధనధాన్య నాశమును, క్షేత్రధాన్యాది నాశమును కలుగును.

శ్లో॥ కన్యాయాంస్థిత రాహుదాయకాలే
క్షేత్రాప్తిం పరమణి వస్త్రలాభం।
భూపత్వం బుధవర పూజ్యయానం
స్త్రీసౌఖ్యం సుతజన్మ భూమిలాభం॥ 18

తా. కన్యారాశియందున్న రాహుదశలో క్షేత్రప్రాప్తియు, శ్రేష్ఠమైన వస్త్రలాభమును, భూమ్యాధిపత్యమును, విద్వాంసులవల్ల గౌరవమును, స్త్రీసౌఖ్యమును, పుత్రజననమును, భూలాభమును కలుగును.

శ్లో॥ తులాస్థితస్యాపి తమస్యదాయే
క్షేత్రార్థనాశం కృషినిష్ఫలంచ।
నృపాద్భయం స్థానవినాశనంచ
సమానకష్టం పితృబంధునాశం॥ 19

తా. తులారాశియందున్న రాహుదశలో క్షేత్రార్థనాశనమును, వ్యయసాయమునందు నష్టమును, రాజభయమును, స్థాననాశమును, సమానజనకష్టమును, పితృవియోగమును, బంధునాశమును కలుగును.

శ్లో॥ అళిగతరాహు దశాయాం క్షితిపతి
పూజ్యం బంధుమైత్రత్వం।
గోభూ బహు ధనలాభం సమరే
శత్రువినాశనం కురుతే॥ 20

తా. వృశ్చికరాశియందున్న రాహుదశలో రాజపూజ్యతయు, బంధుస్నేహమును, గోలాభమును, భూలాభమును, విశేష ధన ప్రాప్తియు, యుద్ధమునందు శత్రు నాశనమును కలుగును.

శ్లో॥ ధనుస్థితస్యాపి తమస్యదాయే
పశ్వాదినాశం స్వజనానురోధం।
మహద్భయం శత్రువివృద్ధిదంచ
సమానకష్టం పితృబంధునాశం॥ 21

తా. ధనుస్సుయందున్న రాహుదశలో పశ్వాదినాశనమును, స్వజనకష్టమును, అధికభయమును, శత్రువృద్ధియు, సమాన జన కష్టమును, పితృహానియు, బంధు నాశమును కలుగును.

శ్లో॥ నక్రస్థితస్యాపి తమస్యదాయే
గ్రామాధిపత్యం క్షితిపాలపూజ్యం।
స్వదారపుత్రాది సమస్తసౌఖ్యం
క్షేత్రార్థగోభూమి విశేషవృద్ధిం॥ 22

తా. మకర రాశియందున్న రాహుదశలో గ్రామాధిపత్యమును, రాజపూజ్యతయు, భార్యాపుత్రాది సమస్త సౌఖ్యమును, క్షేత్రార్థలాభమును, పశువృద్ధియు, విశేషభూలాభమును కలుగును.

శ్లో॥ ఘటస్థస్య రాహోర్దశాయాంతుకష్టం
రిపువృద్ధి క్షేత్రార్థ పశ్వాదినాశం।
స్వభార్యాత్మజాగారనాశం ప్రకామం
స్వదేహస్యకష్టం విషప్రాప్తిమేతి॥ 23

తా. కుంభరాశియందున్న రాహుదశలో కష్టమును, శత్రువృద్ధియు, క్షేత్రార్థక్షయమును, పశ్వాదినాశమును, స్వకీయ భార్యాపుత్ర వినాశమును, దేహబాధయు, విషభీతియు సంభవించును.



శ్లో॥ మీనస్థితస్య రాహోస్తుదాయే కష్టంమహద్భయం।
చోరాగ్నినృపభీతిశ్చ సమానజననాశనం॥ 24

తా. మీనరాశియందున్న రాహుదశలో కష్టమును అధికభయమును, చోరాగ్నిభయమును, రాజభీతియు, సమానజననాశనమును కలుగును.



తన్వాదిభావస్థిత రాహుదశాఫలం.

శ్లో॥ తనుగత రాహుదశాయా
ముష్ణత్వం కాంతిహీనత్వం।
స్వస్థాననాశం కురుతేచవృద్ధిం
శత్రోర్భయం బంధువిరోధతాంశ్చ॥ 25

తా. లగ్నమందున్న రాహుదశలో ఉష్ణాధిక్యమును, కాంతిహీనతయు, స్వస్థాననాశమును, శత్రుభయమును, బంధువిరోధమును కలుగును.

శ్లో॥ ధనస్థితస్యాపి తమస్యదాయే
ధాన్యాదినాశం కలహంభయంచ।
స్త్రీపుత్రనాశం క్షితిపాలకోపం
ధనక్షయం నేత్రరుజం వివాదం॥ 26

తా. లగ్నమునకు రెండవ యింటియందున్న రాహుదశలో ధాన్యాదినాశమును, కలహమును, భయమును, భార్యాపుత్ర వినాశమును, రాజకోపమును, ధనక్షయమును, నేత్రరోగమును, వివాదమును కలుగును.

శ్లో॥ తృతీయస్థ రాహో ర్దశాయాం
హేమాంబర వస్త్రమణీ ప్రవృద్ధిం।
బంధూపకారం బుధవర్గపూజ్యం
క్షితీశమిత్రం నగరాధిపత్యం॥ 27

తా. లగ్నమునకు మూడవయింటి యందున్న రాహుదశలో వస్త్రాభరణ మణిప్రాప్తియు, బంధు యుపకారంబును, విద్వాంసులవల్ల గౌరవమును, రాజస్నేహమును, నగరాధిపత్యమును కలుగును.

శ్లో॥ బంధుస్థితస్యాపి తమస్యదాయే
బంధుక్షయం మాతృవినాశనంచ।
క్షేత్రాదినాశం ధరనాథకోపం
సమానకష్టం కృషినాశనంచ॥ 28

తా. లగ్నమునకు నాల్గవయింటియందున్న రాహుదశలో బంధుక్షయమును, మాతృవినాశమును, క్షేత్రాదినాశనమును, రాజకోపమును, సమానజనకష్టముచు, కృషినాశమును కలుగును.

శ్లో॥ పుత్రస్థితస్య రాహోస్తుదాయే స్వస్త్రీసుతక్షయం।
అకస్మాత్కలహంచైవ యత్నకార్యవినాశనం॥ 29

తా. లగ్నమునకు ఐదవయింటియందున్న రాహుదశలో స్వకీయ పుత్ర నాశమును, అకస్మాత్తుగా కలహమును, యత్నకార్య వినాశమును కలుగును.

శ్లో॥ శత్రుస్థితస్యాపి తమస్యదాయే
రిపుక్షయం కాంతి బలప్రదంచ।
క్షితీశమిత్రం వరవస్తులాభం
హేమాంబరం మౌక్తికరత్నలాభం॥ 30



తా. లగ్నమునకు ఆఱవయింటియందున్న రాహుదశలో శత్రునాశమును, తేజోవృద్ధియు, రాజస్నేహమును, శ్రేష్ఠమైన వస్తులాభమును, బంగారు ఆభరణములును, మౌక్తిక రత్నలాభమును కలుగును.

శ్లో॥ జామిత్రసంస్థస్య తమస్యదాయే
నృపాద్భయం దుఃఖవివాదభీతిం।
స్థానచ్యుతిం క్షేత్రవినాశనంచ
నీచారిపీడాంచ స్వమిత్రవైరం॥ 31

తా. లగ్నమునకు సప్తమస్థానమందున్న రాహుదశలో రాజభయమును, దుఃఖమును, వివాదభయమును, స్థానచలనమును, క్షేత్రనాశనమును, నీచబాధయు, శత్రుపీడయు, స్వకీయ మిత్రజనవిరోధమును కలుగును.

శ్లో॥ రంధ్రస్థరాహుదశాయాం దేహార్తింబంధునాశంచ।
రిపురుణదుఃఖవివృద్ధిం క్షితిపతికోపం కళత్రపీడాచ॥ 32

తా. లగ్నమునకు అష్టమస్థానమందున్న రాహుదశలో శరీరబాధయు, బంధునాశమును, శత్రుపీడయు, ఋణవృద్ధియు, దుఃఖమును, రాజకోపమును, కళత్రపీడయు కలుగును.

శ్లో॥ ధర్మస్థితస్యాపి తమస్యదాయే
ధాన్యార్థవృద్ధిం బహుధర్మబుద్ధిం।
బంధూపకారం క్షితిపాలమిత్రం సు
తీర్థయాత్రా లభతే సదానృణాం॥ 33

తా. నవమస్థానమందున్న రాహుదశలో ధాన్యార్థవృద్ధియు, బహుకార్యచింతనయు, బంధుజనోపకారమును, రాజస్నేహమును, మంచి తీర్థయాత్రా ఫలమును, నరులకు ఎల్లపుడును కలుగును.

శ్లో॥ కర్మస్థస్యతమస్యదాయశుభదం యజ్ఞాదికర్మప్రదం।
మంత్రారాధన తత్పరోక్షితిసురై స్సంపూజ్యమానోధనీ।
భేరీశంఖరవాది తూర్యనినదై ర్యుక్తో సదా శ్రీయుతః।
క్షేత్రార్థాంసిరఇష్టసిద్ధి కురుతేయానాదిసిద్ధిర్భవేత్॥ 34

తా॥ లగ్నమునకు దశమస్థానమందున్న రాహుదశ శుభఫలము నిచ్చునదియు, యజ్ఞాది కర్మఫలప్రాప్తి నిచ్చునదియు, మంత్రారాధన ఫలసిద్ధి నిచ్చునదియు, దేవబ్రాహ్మణ పూజ్యత నిచ్చునదియు, బహుధనము నిచ్చునదియు నగును. గృహమునందు సదాకాలము భేరీమృదంగాది మంగళవాద్యంబులతో కూడిన ఐశ్వర్యమును, క్షేత్రార్థలాభమును, వస్త్రప్రాప్తియు, ఇష్టసిద్ధియు, యాత్రసిద్ధియు కలుగును.

శ్లో॥ లాభస్థితస్యాపి తమస్యదాయే
కరోతిలాభం క్షితిపాలపూజ్యం।
బంధూపకారం ధనధాన్యవృద్ధిం
యానాంబరం భూషణ వాగ్విలాసం॥ 35

తా॥ లాభస్థానమందున్న రాహుదశలో లాభమును, రాజపూజ్యతయు, బంధుజనోపకారమును, ధనధాన్యవృద్ధియు, వాహన వస్త్రభూషణములును, వాగ్విలాసమును కలుగును.

శ్లో॥ వ్యయస్థితస్య రాహోస్తుదాయే భూమ్యర్థనాశనం।
సమానజనశోకంచ స్త్రీపుత్రాది వినాశనం॥ 36

తా॥ లగ్నమునకు పండ్రెండవ యింటి యందున్న రాహుదశలో భూనాశమును, అర్థహానియు, సమానజనశోకమును, స్త్రీపుత్రాదినాశనమును కలుగును.

శ్లో॥ కేంద్రస్థితస్యాపి తమస్యదాయే
క్షితీశమిత్రత్వ ముదాహరంతి।



యానాంబరంభూషణ వాగ్విలాసం
క్షేత్రాభివృద్ధిం ధనధాన్యవృద్ధిం॥ 37

తా॥ కేంద్రస్థానముల యందున్న రాహుదశలో రాజస్నేహమును, వాహనలాభమును, వస్త్రాభరణ సంగ్రహమును, వాగ్విలాసమును, క్షేత్రాభి వృద్ధియు, ధనధాన్య వృద్ధియు కలుగును.

శ్లో॥ త్రికోణనిలయస్థస్య రాహోర్దాయే శుభప్రదం।
క్షేత్రధాన్యాభివృద్ధిశ్చ నటగాయక సంకులం॥ 38

తా॥ త్రికోణరాసులయందు రాహువుండగా ఆదశ సంప్రాప్తించిన కాలమునందు శుభఫలము జరుగును. క్షేత్రవృద్ధియు, ధాన్యాభి వృద్ధియు, నటగాయకుల సంకులమును కలుగును.

శ్లో॥ షష్ఠాష్టమవ్యయస్థస్యరాహోర్దాయే విపద్యతా।
మాతృనాశం మనఃఖేదం దారపుత్రవినాశనం॥ 39

తా॥ లగ్నమునకు ౬-౮-౧౨. స్థానముల యందున్న రాహుదశలో విపత్తుసంభవించును, మాతృనాశమును, మనోక్లేశమును, భార్యాపుత్రనాశనమును కలుగును.

---

ఆరోహ రాహుదశాఫలం.

శ్లో॥ ఆరోహస్థస్య రాహోస్తు దాయే దారార్థసంపదః।
గ్రామాధిపత్యం కురుతే మిత్ర ప్రభువశాత్సుఖం॥ 40

తా॥ ఆరోహగతియందున్న రాహువు తన దశా కాలమందు భార్యాపుత్రులయొక్క సంపదయు, అర్థలాభమును, గ్రామాధిపత్యమును, మిత్ర ప్రభు మూలకముగా సుఖమును కలుగును.

అవరోహ రాహుదశాఫలం.

శ్లో॥ అవరోహాత మోదాయే భూపాల కలహంతథా।
మనఃక్లేశం మానభంగం మహదాపది లభ్యతే॥ 41

తా. అవరోహణ స్థితియందున్న రాహుదశలో రాజ కలహమును మనోదుఃఖమును, మానభంగమును, గొప్ప ఆపత్తును సంభవించును.

శ్లో॥ ఉచ్చగ్రహాయుతే రాహౌ, రాజ్యలాభం కరోతిచ।
స్త్రీపుత్ర ధనసంపత్తిం వస్త్రాభరణలేపనం॥ 42

తా. రాహువు ఉచ్చగ్రహ సంబంధము కలిగియున్న యెడల రాజ్యలాభమును, స్త్రీపుత్ర ధనసంపత్తియు, వస్త్రాభరణ లేపనాది వస్తులాభమును గలుగచేయును.

శ్లో॥ నీచగ్రహాయుతే రాహౌ నీచవృత్త్యాను జీవతి।
కుభోజనంకుదారాశ్చ కుపుత్రాన్ లభతే నరః॥ 43

తా. రాహువు నీచగ్రహముతో కూడియున్న యెడల నీచవృత్తివల్ల జీవనమును, కుత్సితాన్నభోజనమును, కుత్సిత రూపముగల భార్యాపుత్రులును, కలుగచేయును.

శ్లో॥ దశాదౌసుఖమాప్నోతి దశామధ్యే మహత్సుఖం।
దశాంతే ధననాశంస్యా ద్గురుమిత్రాది నాశనం॥ 44

తా. దశ ఆదిభాగమందు సుఖమును, మధ్యభాగమందు సుఖాధికమును, అంత్యమందు ధననాశమును, గురు మిత్రాది నాశనమును కలుగును.

---

రాహుదశాయాం రాహుభుక్తిమాసాః 32. దినాని 12.

కృష్ణియే॥

శ్లో॥ రాహోరంతర్గతే రాహౌ లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయేలాభగేవాపి శుభగ్రహాయుతే పివా।



క్షితీశత్వం ద్రవ్యలాభం బంధుసన్మాన పూజనం।
తీర్థయాత్రాప్రసంగంచ దేవతానాంచ దర్శనం।
అపూర్వవస్తు సంప్రాప్తిః దారపుత్రాది సౌఖ్యదం।
కృషిక్షేత్రాభివృద్ధిశ్చ స్వప్రభోస్తుమహత్సుఖం।
కళ్యాణాదిశుభప్రాప్తిః గ్రామనాథత్వమాప్నుయాత్।
స్త్రీమూలాద్ధనసంప్రాప్తిః విధవాదిసమాగమం॥ 1

తా. రాహుదశలో స్వభుక్తియందు రాహువు లగ్నమునకు కేంద్రకోణములయందున్నను, తృతీయలాభములయందున్నను లేక శుభగ్రహముతో కూడియున్నను, ప్రభుత్వమును, ద్రవ్యలాభమును, బంధుసన్మానమును, తీర్థయాత్రా ప్రసంగమును, దేవతాదర్శనమును, అపూర్వవస్తు సంప్రాప్తియు, భార్యాపుత్రాది సౌఖ్యమును, కృషిలాభమును, క్షేత్రాభివృద్ధియు, స్వంతప్రభువు మూలకముగా సుఖమును, కళ్యాణాది శుభకార్యములు జరుగుటయు గ్రామాధిపత్యమును, స్త్రీమూలకముగా ధనప్రాప్తియు, విధవా సమాగమంబును కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టగేవాపి వ్యయేవాపాపసంయుతే।
తద్భుక్తౌ స్త్రీవిరోధశ్చ విధవా కలహంతథా।
దారాపుత్రాదిపీడాచ క్షేత్రనాశం తథైవచ।
యత్నకార్యవినాశశ్చ జ్ఞాతీనాం కలహంతథా॥ 2

తా. రాహువు లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయందున్నను, లేక పాపులతో కలసియున్నను ఆ భుక్తియందు స్త్రీ విరోధమును, విధవాకలహమును, భార్యపుత్రాది పీడయు, క్షేత్రనాశమును, యత్నకార్యనాశమును, జ్ఞాతులతోడ కలహమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే సన్నిపాతజ్వరాదికం।
చతుష్పాజ్జీవనాశశ్చ సర్వత్రకలహంతథా॥ 3

తా. రవితో కలసినను లేక చూడబడినను, సన్నిపాత జ్వరభయమును, చతుష్పాజ్జీవనాశమును, సర్వులతోడను కలహమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టే మాతృకష్టంవినిర్దిశేత్।
మనఃక్లేశంమానభంగం యుద్ధేశత్రుభయంభవేత్॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, మాతృకష్టమును, మనోదుఃఖమును, మానభంగమును, యుద్ధమునందు శత్రుభయమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే అకస్మాత్కలహంతథా।
చోరాదివిషభీతిశ్చ సమానజననాశనం। 5

తా. రాహువు కుజునితో కలసినను లేక చూడబడినను అకస్మాత్తుగా జగడమును, చోరబాధయు, విషభీతియు, సమాన జననాశమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే స్వజనాద్భీతి మాప్నుయాత్।
అపవాదభయప్రాప్తిః అకస్మాత్కలహంతథా॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను స్వంత జనులవల్ల భయమును, అపవాద భయమును, అకస్మాత్తుగా కలహమును కలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే విప్రాణాంకలహంతథా।
సమానజనకోపశ్చ పుత్రపీడాభవిష్యతి॥ 7

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, బ్రాహ్మణులతోడ కలహమును, సమాన జనకోపమును, పుత్రపీడయు కలుగును.



శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే స్వస్త్రీవ్యాధి భయంతథా।
వాహనాదివినాశశ్చ ధనధాన్య వినాశనం॥ 8

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, స్వంత స్త్రీకి వ్యాధిభయమును, వాహనాది వినాశమును, ధనధాన్య వినాశమును, కలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే స్వభృత్యకలహంతథా।
ధాన్యాదినాశనప్రాప్తిః సమానజననాశనం॥ 9

తా. శనితో కలసినను లేక చూడబడినను తన సేవకులతోడ కలహమును ధాన్యాదినాశమును, సమాన జననాశమును కలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుర్భవిభవ్యతి।
తద్దోషపరిహారార్థం నాగదానం చ కారయేత్।
దుర్గాజపంప్రకుర్వీత రాహుప్రీతికరంభవేత్॥ 10

తా. రాహువు ద్వితీయ సప్తమ స్థానములయందున్న యెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై నాగదానము యిచ్చి, దుర్గాజపము చేసినయెడల రాహుప్రీతి యగును.

---

రాహుదశాయాం గురుభుక్తిమాసాః 28. దినాని 24.

పారాశర్యే॥

శ్లో॥ రాహోరంతర్గతేజీవే లగ్నాత్కేంద్రత్రికోణగే।
దుశ్చిక్యేలాభగేవాపి ఉచ్చక్షేత్రస్థితేపివా।
స్వక్షేత్రమిత్రసంయుక్తే తుంగాంశేస్వాంశగేపివా।
రాజపూజ్యం మహత్సౌఖ్యం శత్రునాశం మహద్యశః।
దినేదినేవృద్ధిమేతి సితపక్షేయథాశశీ।

వాహనాది ధనంభూమి ర్గృహగోధన సంకులం।
నైఋత్యాంపశ్చిమేభాగే ప్రయాణంరాజదర్శనం।
యత్నకార్యార్థసిద్ధిస్స్యా త్స్వదేశం పునరేష్యతి।
ఉపకుర్వ౯ బ్రాహ్మణానాం తీర్థయాత్రాది కర్మణాం।
వాహనగ్రామలాభశ్చ దేవబ్రాహ్మణపూజనం।
పుత్రోత్సవాదిసంతోషం నిత్యం మృష్టాన్నభోజనం॥ 1

తా. రాహుదశలో భుక్తినాథుడగు గురువు లగ్నమునకు కేంద్రకోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను, తన ఉచ్ఛక్షేత్రమందున్నను, స్వక్షేత్ర మిత్రక్షేత్రములయందున్నను. లేక ఉచ్చాంశయందుగాని అథవా స్వనవాంశయందుగాని యున్నను, ఆ భుక్తియందు రాజపూజ్యతయు. అధిక సుఖమును, శత్రునాశమును, మేలైన యశస్సును, శుక్లపక్షపు చంద్రునివలె దినేదినే అభివృద్ధియు, వాహనలాభమును, ధనప్రాప్తియు, భూలాభమును, గృహలాభమును, పశ్వాభివృద్ధియు, ధనసంకులమును, నైఋత్యమూలయందును, పశ్చిమభాగమందు ప్రయాణమును, రాజదర్శనమును, యత్నకార్యార్థసిద్ధియు, మరల స్వదేశ ప్రయాణమును, బ్రాహ్మణులతోడ తీర్థయాత్రాది కర్మఫలప్రాప్తియు, వాహనప్రాప్తియు, గ్రామాధిపత్యమును, దేవబ్రాహ్మణ పూజయు, పుత్రోత్సవాది సంతోషమును, నిత్యము మృష్టాన్న భోజనమును లభించును.

శ్లో॥ నీచేవాస్తంగతేవాపి శత్రుక్షేత్రగతేపివా।
షష్ఠాష్టమవ్యయేవాపి పాపయుక్తోథవీక్షితే।
ఏవంకర్మరతో నిత్యం పాపచింతాభవిష్యతి।
ధనధాన్యవ్యయశ్చైవ పుత్రపీడామహద్భయం।



హృద్రోగంరాజకార్యాణి వాహనాంబరనాశనం।
స్థానచ్యుతిర్మనోహానిః పాదభుక్తిర్నసంశయః॥ 2

తా. గురువు తన నీచరాశియందున్నను, అస్తంగతుడైనను, శత్రుక్షేత్రమందును, లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను, లేక పాపగ్రహముతో కూడియున్నను, అథవా చూడబడినను కర్మభ్రష్టత్వమును, ఎల్లపుడు పాపకార్యములయందు చింతయు, ధనధాన్య వ్యయమును, పుత్రపీడయు, గొప్ప భయమును, హృదయ సంబంధమగు రోగబాధయు, రాజకార్య భంగమును, వాహనాంబర నాశమును, స్థానభ్రంశమును, మనోవ్యాకులమును, పాపభుక్తియందు నిస్సంశయముగా జరుగును.

కృష్టిర్యే॥

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే క్షితీశాత్కలహంతథా।
ధనవ్రయంమనస్తాపం స్థాననాశమవాప్నుయాత్॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, రాజులతోడ కలహమును, ధనవ్రయమును, మనస్థాపమును, స్థాననాశమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టే వస్త్రాభరణ లాభవా౯।
శ్వేతాశ్వాది మహాలాభః మహారాజప్రసాదతః॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, వస్త్రాభరణప్రాప్తియు, మహారాజానుగ్రహమువలన తెల్లనిగుఱ్ఱము మొదలగు వాహనలాభమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే పైత్యవ్యాధికృతంతథా॥
ఉష్ణతాత్పతనంచైవ వ్రణశస్త్రాదిపీడనం॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, పిత్త

వ్యాధియు, ఉన్నతస్థలమునుండి క్రిందపడుటయు, వ్రణశస్త్రాది పీడయు కలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే విద్యాభ్యాసాది సంగ్రహః।
విచిత్రగృహలాభశ్చ విష్ణుభక్తిపరాయణః॥ 6

తా. బుధునితో కలసినను లేకచూడబడినను, విద్యాభ్యాసాది సంగ్రహమును, విచిత్ర గృహలాభమును, విష్ణుభక్తియు కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే వస్త్రాభరణలాభవాన్।
వాహనాందోళికఃప్రాప్తిః ఇష్టసిద్ధిర్భవిష్యతి॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, వస్త్రాభరణ ప్రాప్తియు, వాహనాందోళిక లాభమును, ఇష్టసిద్ధియు లభించును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే దాసీదాస జనక్షయం।
శత్రువృద్ధిర్మనస్తాపం దాయాది జనవిద్వరం॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను, దాసదాసీజన క్షయమును, శత్రువృద్ధియు, మనస్తాపమును, దాయాదిజన విద్వేరమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయే లాభగేపివా।
శుభగ్రహయుతేవాపి విత్తలాభముదీరయేత్।
పుత్రోత్సవాదిసంతోషం స్వప్రభోస్తుమహత్సుఖం।
క్షేత్రధాన్యాభివృద్ధిశ్చ శివభక్తిర్భవిష్యతి।
యాత్రాయాంకార్యసిద్ధిశ్చ ఇష్టప్రభువశాత్సుఖం॥ 9

తా. దశానాథునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయ లాభములయందున్నను, లేక శుభగ్రహముతో కూడియున్నను, ఆభుక్తియందు ధనలాభమును. పుత్రోత్సవాది సంతోషమును, స్వకీయ ప్రభువు మూలకముగా విశేషసుఖమును, క్షేత్రలాభమును, ధాన్యాభివృద్ధియు,శివభక్తియు, యాత్రయందు కార్యసిద్ధియు, మిత్రప్రభువువల్ల సౌఖ్యమును కలుగును.



శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవాపాపసంయుతే।
బుద్ధివైకల్యమాప్నోతి పుత్రదారాదిపీడనం।
యత్నకార్యవినాశశ్చ సర్వత్రకలహంతథా।
నృపక్రోధంద్రవ్యనాశం విప్రాణాంకలహంతథా॥ 10

తా. దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను, లేక పాపులతో కలసియున్నను, బుద్ధివైకల్యమును, భార్యాపుత్రుల పీడయు, యత్నకార్య భంగమును, సర్వులతోడ కలహమును, రాజక్రోధమును, ద్రవ్యనాశమును, బ్రాహ్మణులతోడ జగడమును కలుగును.

శ్లో॥ ద్వితీయద్యూన నాథేన యుక్తే తద్భుక్తిమృత్యుదా।
తద్దోషపరిహారార్థం శతరుద్రజపంచరేత్।
స్వర్ణదానం ప్రకుర్వీత అపమృత్యు నివారణం॥ 11

తా. ద్వితీయ సప్తమాధిపతులతో కూడియున్నయెడల ఆభుక్తియందు అపమృత్యువు సంభవించును. అదోషపరిహారార్థమై నూరుమారులు రుద్రజపము చేయవలయును. స్వర్ణదానము చేసిన పిమ్మట అపమృత్యువు నివారణయగును.

---

రాహుదశాయాం శనిభుక్తిమాసాః 35. దినాని 6.

కృష్ణీయే॥

శ్లో॥ రాహోరంతర్గతే మందే లగ్నాత్కేంద్రత్రికోణగే।
తృతీయే లాభగేవాపి ఉచ్చరాశిస్థితేపివా।
కలహంరాజవిద్వేషం బంధునాశం తథైవచ।

సమానజనకోపశ్చ చతుష్పాజ్జీవనాశనం।
సమరే శత్రువృద్ధిశ్చ పుత్రదారవినాశనం।
అకస్మాత్కలహంచైవ స్థాననాశం తథైవచ।
యాత్రాయాం కార్యనాశశ్చ బంధుభిఃకలహంతథా।
నీచసేవాదికష్టంచ స్వప్రభోస్తు భయంభవేత్।
స్వవారే దేహసౌఖ్యంచ అంత్యే సౌఖ్యంతథైవచ॥ 1

తా. రాహుదశలో శనిభుక్తియందు, భుక్తినాథుడు, లగ్నమునకు కేంద్రత్రికోణముల యందున్నను, తృతీయలాభముల యందున్నను, లేక తనఉచ్చరాశిని పొందియున్నను, కలహమును, రాజద్వేషమును, బంధునాశమును, సమానజనకోపమును, చతుష్పాజ్జీవనాశనమును, యుద్ధమునందు శత్రువృద్ధియు, భార్యాపుత్ర నాశనమును, అకస్మాత్తుగా కలహమును, స్థాననాశమును, యాత్రయందు కార్యనాశనమును, బంధువులతోడ కలహమును, నీచసేవయు, కష్టమును, స్వకీయప్రభువువల్ల భయమును, తనవారలందు దేహసౌఖ్యమును, భుక్తి అంత్యమందు సౌఖ్యమును కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టగే మందే వ్యయేవా పాపసంయుతే।
తద్భుక్తౌమిశ్రఫలదం క్వచిత్కష్టం క్వచిత్సుఖం।
ఆదౌసౌఖ్యం ధనప్రాప్తిః భృత్యవర్గవి వృద్ధిదం।
ధాన్యార్థ క్షేత్రలాభశ్చ శూద్రప్రభువశాత్సుఖం।
అంత్యేతుద్రవ్యనాశంచ ప్రాణకష్టం తథైవచ।
స్త్రీపుత్రవర్గపీడాది జ్ఞాతిశత్రుభయం తథా॥ 2

తా. లగ్నమునకు ౬-౮-౧౨. స్థానముల యందున్నను లేక పాపునితోకలసినను, ఆభుక్తియందు మిశ్రఫలము జరుగును. అనగా కొంతకష్టమును, కొంతసుఖమును, కలుగును.



భుక్తి ఆదిభాగమందు సౌఖ్యమును, ధనప్రాప్తియు, సేవకజనులయొక్క అభివృద్ధియు, ధాన్యార్థలాభములును, క్షేత్రలాభమును, శూద్రప్రభువువల్ల సుఖమును, అంత్యమందు ద్రవ్యనాశమును, ప్రాణహానియు, భార్యాపుత్రులయొక్కయు, జ్ఞాతి శత్రువులయొక్కయు పీడనయు కలుగును.

గ్రంథాంతరే॥

శ్లో॥ శుభగ్రహైః సమాయోగే లగ్నేవాస్వాంశయుక్తతః।
కార్యేకర్మేశయోగేవా దారపుత్రాదివర్ధనం॥
భుక్త్యాదౌచోరభీతిశ్చ విషశస్త్రాదిభిఃక్వచిత్।
తతస్సౌఖ్యకరం నిత్యం బహువిత్తం సమశ్నుతే॥ 3

తా. శుభగ్రహముతోకూడి లగ్నమందున్నను, స్వనవాంశమందున్నను, లేక ధర్మకర్మాధిపతులతో కూడియున్నను, భార్యాపుత్రాది అభివృద్ధియు, భుక్తి ఆదియందు చోరభయమును, విషశస్త్రాదులవల్ల భయమును, కలుగును. అటుపిమ్మట అనగా అంత్యభాగమందు సౌఖ్యమును, అధిక ద్రవ్యలాభమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే పితృవర్గవినాశనం।
స్థాననాశంబంధుకోపం ధననాశంపదచ్యుతిం॥ 4

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను పితృవర్గపువారికి నాశనమును, స్థానభ్రంశంబును, బంధుకోపంబును, ధననాశమును, ఉద్యోగభంగమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతే దృష్టే మాతృవర్గవినాశనం।
మనఃక్లేశం మానభంగం స్త్రీకోపం బంధువిగ్రహం॥ 5

తా. చంద్రునితో కలసినను లేకచూడబడినను, మాతృవర్గపువారికి నాశనమును, మనోదుఃఖమును, మానభంగము

ను, స్త్రీకోపమును, బంధుజనవిగ్రహమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే జ్ఞాతివర్గవినాశనం।
సమానజనహానిస్స్యాత్ స్వస్యనాథస్య నిగ్రహం॥ 6

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, జ్ఞాతివర్గవినాశమును, సమానజనహానియు, తనయజమానుని యొక్క నిగ్రహమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే విద్యామూలాద్ధనాగమం।
సత్కథాశ్రవణంచైవ తీర్థస్థానాదిజం ఫలం॥ 7

తా. బుధునితో కలసినను లేక చూడబడినను విద్యాపాండిత్యమువల్ల ధనాగమంబును, సత్కథాశ్రవణమును, తీర్థస్థానాది ఫలమును కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే పుత్రపీడాభవిష్యతి।
గురుస్వామి విరోధత్వం ధననాశం తథైవచ॥ 8

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, పుత్రపీడయు, గురుద్వేషమును, తనయజమానునితో విరోధమును ధననాశమును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే భూమిధాన్య వివృద్ధిదం।
అశ్వాదివాహనప్రాప్తిః యత్నకార్యార్థ సిద్ధిదం॥ 9

తా. శుక్రునితోకలసినను లేక చూడబడినను, భూలాభమును, ధాన్యవృద్ధియు, అశ్వాదివాహన ప్రాప్తియు, యత్నకార్యార్థ సిద్ధియు కలుగును

శ్లో॥ దాయేశా త్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా।
శుభగ్రహయుతేవాపి ధనలాభం వినిర్దిశేత్।
అవనీపతి సన్మానంగృహే కళ్యాణసంభవం।
దారపుత్రాదిసౌఖ్యంచ దాసీదాసాది సంగ్రహం।



గోమహిష్యాది వృద్ధిశ్చ నీలవస్త్రాదిది సంగ్రహం॥ 10

తా. దశానాథునకు కేంద్రకోణముల యందున్నను, తృతీయలాభముల యందున్నను, లేక శుభగ్రహములతో కూడియున్నను, ధనలాభముకలుగును, గాకను రాజసన్మానమును, గృహమునందు కల్యాణసంభవమును, భార్యాపుత్రాది సౌఖ్యమును, దాసదాసీజనసేవయు, గోవులు, గేదెలు మొదలగు చతుష్పాజ్జీవరాసులకు అభివృద్ధియు, నీలవస్త్రాదిది సంగ్రహమును కలుగును.

శ్లో॥ దాయేశాత్ష్టరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
తద్భుక్తౌ స్థాననాశంచ అపకీర్తిభయంతథా।
స్వబంధుజనవైషమ్యం సమానజననాశనం।
నీచసేవాతి కలహం స్థానభ్రంశం పశుక్షయం।
హృద్రోగం మానహానిస్స్య ద్విషాగ్ని నృపపీడనం।
ప్రమేహం క్షయగుల్మాదిశూల హృద్రోగికోభవేత్।
కుభోజనం కుత్సితరాజసేవా మనోవిచారస్వజనైశ్చకోపః॥

తా. దశానాథునకు ౬-౮-౧౨. స్థానముల యందున్నను, లేక పాపులతో కలసియున్నను, ఆభుక్తియందు స్థాననాశనమును, అపకీర్తిభయమును, స్వకీయ బంధుజనులతోడ విరోధమును, సమానజననాశనమును, నీచసేవయు, అతికలహమును, స్థానభ్రంశమును, పశుక్షయమును, హృదయ సంబంధమగు రోగమును, మానహానియు, విషభీతియు, అగ్నిభయమును, రాజపీడనయు, ప్రమేహమును, క్షయరోగమును, గుల్మవ్యాధియు, శూలరోగము, కుత్సితభోజనమును, కుత్సితరాజసేవయు, మనోవిచారమును, స్వజనకోపమును కలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి।

తద్దోషపరిహారార్థం విష్ణుసాహస్రకం జపేత్।
ఛాగదానం ప్రకుర్వీత శాంతి మాప్నోత్యసంశయః॥ 12

తా. ద్వితీయ సప్తమరాసులయందు భుక్తినాథుడగు శనియున్న యెడల అపమృత్యువు సంభవించును. ఆదోషపరిహారార్థమై విష్ణుసాహస్రక జపమాచరించి ఛాగదానముచేసిన యెడల నిస్సంశయముగా శాంతికలుగును.

---

రాహుదశాయాం బుధభుక్తిమాసాః 30. దినాని 18. కృష్ణియే॥

శ్లో॥ రాహోరంతర్గతే సౌమ్యే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయేలాభగేవాపి ఉచ్చస్వక్షేత్ర సంయుతే।
శుభగ్రహాయుతే దృష్టే మిత్రరాశిసమన్వితే।
వాహనబంధుసంపత్తిః అశ్వాద్యారోహణం తథా।
కృషిక్షేత్రాభివృద్ధిశ్చ గోమహిష్యాది సంకులం।
దారపుత్రాది సౌఖ్యంచ హేమాభరణలాభకృత్।
పశ్చిమాం దిశమాశ్రిత్య ప్రయాణంరాజదర్శనం।
ఇష్టప్రభువశాత్సౌఖ్యం గృహేకల్యాణ సంభవం।
విచిత్రగృహలాభశ్చ క్రయవిక్రయ కౌశలం।
కృషిమూలాద్ధనప్రాప్తిః ఇష్టసిద్ధిర్భవిష్యతి॥ 1

తా. రాహుదశలో బుధభుక్తియందు, బుధుడు, లగ్నమునకు కేంద్రత్రికోణముల యందున్నను, తృతీయలాభముల యందున్నను, ఉచ్చస్వక్షేత్రముల యందున్నను, శుభగ్రహములతో కూడియున్నను, లేక మిత్రరాశియందున్నను, వాహనప్రాప్తియు, బంధుసంపత్తియు, అశ్వాది ఆరోహణమును, కృషిలాభమును, క్షేత్రవృద్ధియు, గోవులు, గేదెలు మొదలగువాని సంకులమును, భార్యాపుత్రాది సౌఖ్యమును, బంగారు, ఆభరణముల సంగ్రహమును,పశ్చిమదిక్కునకు ప్రయాణమును, రాజదర్శనమును, స్నేహప్రభు మూలకముగా సౌఖ్యమును, యింటియందు కల్యాణసంభవమును, విచిత్రగృహలాభమును, క్రయవిక్రయ కౌశల్యతయు, కృషిమూలకముగా ధనప్రాప్తియు, ఇష్టసిద్ధియు కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్ట రాశిస్థే వ్యయేవా నీచరాశిగే।
పాపగ్రహాయుతే దృష్టే శత్రుక్షేత్రగతేపివా।
బంధుక్రోధం స్థాననాశం యత్నకార్య వినాశనం।
విరోధకష్టసంప్రాప్తిః ధాన్యార్థపశునాశనం।
పరాపవాదకష్టంచ సర్వత్ర కలహంతథా।
స్వప్రభోస్తు మహత్కష్టం యుద్ధేశత్రుభయంతథా॥ 2

తా. బుధుడు లగ్నమునకు ౬-౮-౧౨. స్థానముల యందున్నను, నీచరాశియందున్నను, పాపగ్రహముతో కూడియున్నను, లేక చూడబడినను, లేక శత్రుక్షేత్రమందున్నను, ఆభుక్తియందు, బంధుక్రోధమును, స్థాననాశమును, యత్నకార్యభంగమును, విరోధమును, కష్టప్రాప్తియు, ధాన్యనాశమును, అర్థహానియు, పశుక్షయమును, పరజనులచేత అపవాదమును, కష్టమును, సర్వులతోడను కలహమును, స్వంత ప్రభువుమూలకముగా కష్టమును, యుద్ధమునందు శత్రుభయమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే సంతాప జ్వరసంభవం।
స్థాననాశం నృపాద్భీతిః యుద్ధే శత్రుభయంతథా॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, సంతాపజ్వరసంభవమును, స్థాననాశమును, రాజభీతియు, యుద్ధమునందు శత్రుభయమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతే దృష్టే మాతృసౌఖ్యం మహత్సుఖం।

నటగాయక సంసర్గః యత్నకార్యార్థసిద్ధిదః॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, మాతృ సౌఖ్యమును, విశేషసుఖమును, నటగాయకుల సంపర్కమును, యత్నకార్యసిద్ధియు కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే శస్త్రఘాతాధిపీడనం।
ఉన్మాదచిత్తవైకల్యం స్వస్త్రీవ్యాధిర్భవిష్యతి॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, శస్త్ర ప్రయోగముచే కలిగిన ఘాతాదిపీడయు, ఉన్మాదమును, చిత్త వైకల్యమును, స్వస్త్రీవ్యాధియు కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే స్త్రీపుత్రాణాంచ సౌఖ్యదం।
అర్థసిద్ధిర్మహత్సౌఖ్యం క్షేత్రగోధనవర్ధనం॥ 6

తా. గురునితో కలసినను లేక చూడబడినను, భార్యా పుత్రాదుల సౌఖ్యమును, అర్థసిద్ధియు, అధిక సుఖమును, క్షేత్రాభివృద్ధియు, గోలాభమును, ధనప్రాప్తియు కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే ధనధాన్యాభివృద్ధిదం।
వాహనాంబర సంప్రాప్తిః బహుద్రవ్యయుతింతథా॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, ధన ధాన్యాభివృద్ధియు, వాహనప్రాప్తియు, వస్త్రలాభమును, విశేషద్రవ్యార్జనయు కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే దాసీదాసాది నాశనం।
క్షేత్రధాన్యవినాశశ్చ సర్వత్రకలహం తథా॥ 8

తా. శనితోకలసినను లేక చూడబడినను, దాసదాసీ జననాశనమును, క్షేత్రహానియు, ధాన్యనాశనమును, సర్వుల తోడను కలహమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా।



శుభగ్రహయుతేవాపి తద్భుక్తౌ ద్రవ్యలాభకృత్।
స్త్రీపుత్రజ్ఞాతివృద్ధిశ్చ శత్రునాశం తథైవచ।
పశుధాన్యవివృద్ధిశ్చ పుత్రవృద్ధి స్సుఖంభవేత్॥ 9

తా. దశానాథునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయ లాభములయందున్నను, లేక శుభగ్రహములతో కూడియున్నను, ఆభుక్తియందు ద్రవ్యలాభమును, భార్యా పుత్రులకు అభివృద్ధియు, జ్ఞాతివృద్ధియు, శత్రునాశనమును, పశు వృద్ధియు,ధాన్యలాభమును,పుత్రవృద్ధియు,సుఖమును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవాపాపసంయుతే।
నీచగ్రహయుతేవాపి పాపచింతామనోవ్యథా।
ఉద్యోగభంగమాలస్యం స్థాననాశం మహద్భయం।
కారమృత్యుభయంచైవ హింసా దారిద్రపీడనం॥ 10

తా. దశానాథునకు ౬-౮-౧౨ స్థానములయందున్నను, పాపులతో కలసినను లేక నీచగ్రహముతో కూడియున్నను, పాపచింతయు, మనోదుఃఖమును, ఉద్యోగభంగమును, దేహాలస్యమును, స్థాననాశమును, అధిక భయమును, భయంకరమైన మృత్యువును, హింసయు, దారిద్రావస్థయు కలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే అపమృత్యుర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం విష్ణుసాహస్రకంజపేత్।
శ్రీమూర్తిదానంకుర్వీత శాంతిమాప్నోత్యసంశయః॥

తా. ద్వితీయ సప్తమరాసులయం దున్నయెడల అప మృత్యువుసంభవించును. ఆదోషపరిహారార్థమై విష్ణుసాహస్రక జపము చేయువలయును. గాకను, సాలగ్రామదానము చేసిన పిమ్మట నిస్సంశయముగా శాంతి కలుగును.

రాహుదశాయాం కేతుభుక్తిమాసాః 12. దినాని 18.

వృష్ణియ్యో॥

శ్లో॥ రాహోరంతర్గతే కేతౌ లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయే లాభగేవాపి ఉచ్చరాశిస్థితేపివా।
శ్వేతచ్ఛత్రాదివృద్ధిశ్చ శ్వేతాశ్వ ప్రాప్తిరేవచ।
మహారాజప్రసాదేన ఇష్టసిద్ధిర్భవిష్యతి।
దారపుత్రాదిసౌఖ్యంచ యుద్ధేజయ మవాప్నుయాత్।
కళ్యాణశుభవృద్ధిశ్చ హేమధాన్యాదిసంగ్రహః।
పుత్రీవివాహసంపత్తిః చోరమూలార్థ నాగమం।
మణిమంత్రౌష ధనప్రాప్తిః ఇష్టసిద్ధిర్భవిష్యతి॥ 1

తా. రాహుదశా కేతుభుక్తిలో కేతువు లగ్నమునకు కేంద్రత్రికోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను. ఉచ్చరాశియందున్నను, శ్వేతచ్ఛత్రాది వృద్ధియు, శ్వేతాశ్వప్రాప్తియు, మహారాజానుగ్రహమువల్ల ఇష్టకార్య సిద్ధియు, భార్యాపుత్రాది సౌఖ్యమును, యుద్ధమందు జయ మును, కల్యాణాది శుభకర్మప్రాప్తియు, బంగారు, ధాన్యము, మొదలగువాని సంగ్రహమును, పుత్రీ వివాహమును, దొంగల మూలకముగా ధనప్రాప్తి, మణిమంత్రాది సంప్రాప్తియు, అర్థలాభమును ఇష్టసిద్ధియు కలుగును.

---

గ్రంథాంతరే॥

శ్లో॥ రాహోరంతర్గతే కేతౌ భ్రమణం రాజవిడ్వరం।
వాతజ్వరాదిరోగంచ క్షుద్రశూన్యాది రోగకృత్।
దారపుత్రాది రోగంచ చతుష్పాజ్జీవనాశనం।
వాహనాధిపసంయుక్తే వాహనంభవతి ధృవం।
శుభగ్రహయుతే దృష్టే పుత్రలాభం మహత్సుఖం।



రాజయోగం ప్రకుర్వీత సర్వసంపత్ప్రదాయకం।
షష్ఠాష్టమవ్యయే కేతౌ తద్భుక్తౌ మరణంధ్రువం।
ద్వితీయే విషపీడాచ తృతీయేజీర్ణభాసకృత్।
నవమేపితృనాశంచ చతుర్థేమాతృనాశనం।
త్రిషడ్దశాయే కేతౌతు మహాత్సౌఖ్యం ధనాగమం।
ఉచ్చేవారాజ్యసంపత్తిః ధనధాన్యాభివృద్ధికృత్।
వస్త్రవాహన భూషాది గృహగోష్ఠీరసంకులం॥ 2

తా. రాహుదశలో కేతుభుక్తియందు బుద్ధిభ్రంశంబును, రాజనిష్ఠూరమును, వాతజ్వరాది రోగభయమును, క్షుద్ర శూన్యాదిరోగబాధయు, భార్యాపుత్రాది రోగమును, చతుష్పాజ్జీవనాశనమును కలుగును. కేతువు వాహనాధిపతితో కూడియున్నయెడల నిశ్చయముగా వాహనయోగము కలుగును. శుభగ్రహముతో కూడియున్న యెడల పుత్రలాభమును, విశేషసుఖమును, రాజయోగమును, సకలవిధములయిన భాగ్య సంపత్తియు కలుగును. లగ్నమునకు ౬-౮-౧౨. స్థానముల యందున్న కేతుభుక్తియందు నిశ్చయముగా మరణము కలుగును. ద్వితీయస్థానమందున్న యెడల విషబాధయు, తృతీయ స్థానమందున్న యెడల జీర్ణభాసరోగమును, నవమస్థానమందు పితృనాశమును, చతుర్థస్థానమందు మాతృనాశమును, కలుగును. దశానాథునకు ౩-౬ స్థానములయందు కేతువున్న యెడల గొప్పసుఖమును, ధనాగమంబును, కలుగును. తన ఉచ్చరాశియందున్న యెడల రాజ్యసంపత్తియు, ధనధాన్యాభివృద్ధియు, వస్త్రప్రాప్తియు, వాహనలాభమును, భూషణలాభమును, గృహలాభమును, గోలాభమును, గోష్ఠీగపానాది సుఖమును లభించును.

కృష్ణీయే॥

శ్లో॥ లగ్నషష్ఠాష్టరాశిస్థే వ్యయేవా నీచరాశిగే।
తద్భుక్తౌ శత్రువృద్ధిశ్చ చోరశస్త్రాగ్నిపీడనం।
దారిద్ర్యకృషివిద్వేషం సమానజననాశనం।
మహాప్రభువిరోదశ్చ స్థాననాశం తథైవచ।
విధవాకలహంచైవ అర్థనాశం తథైవచ।
స్వస్త్రీపుత్రవినాశశ్చ క్షేత్రధాన్య వినాశనం॥ 3

తా. కేతువులగ్నమునకు ౬-౮-౧౨. రాసులయందున్నను, లేక తననీచరాశియందున్నను, ఆభుక్తియందు శత్రువృద్ధియు, చోరభయమును, శస్త్రభీతియు, అగ్నిపీడయు, దారిద్ర్యమును, కృషినాశనమును, సమానజననాశనమును, మహాప్రభువిరోధమును, స్థాననాశమును, విధవాకలహమును, అర్థనాశమును, భార్యాపుత్ర వియోగమును, క్షేత్రనాశమును, ధాన్యనాశనమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే విషమజ్వరసంభవం।
రాజపీడాస్థాననాశం బుద్ధివిభ్రమ కారణం॥ 4

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, విషమజ్వర సంభవమును, రాజబాధయు, స్థాననాశమును, బుద్ధివికారమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతే దృష్టే మనస్తాపం భవిష్యతి।
నీచానాంకలహంచైవ విధవాకలహం తథా॥ 5

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, మనస్తాపమును, నీచులతోడ కలహమును, విధవా కలహమును కలుగును.

శ్లో॥ భౌమేనసంయుతేదృష్టే గృహిణ్యాః క్షయసంభవం।
అపస్మారజనాత్కష్టం దాయాదిజనపీడనం॥ 6

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, గృహిణ్యాది క్షయరోగములును, నీచజనులవల్ల కష్టమును, దాయాదిజనపీడయు కలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే మాతులాది వినాశనం।
బాంధవాది విరోధశ్చ మిత్రప్రభువిరోధకృత్॥ 7

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, మేనమామలయొక్క నాశనమును, బంధుజనులతోడ విరోధమును, మిత్రప్రభువిరోధమును కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే పుత్రదారాది పీడనం।
ధననాశం దేహపీడా బ్రాహ్మణాద్భయమాప్నుయాత్॥ 8

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, భార్యాపుత్రాదిపీడయు, ధననాశమును, దేహపీడయు, బ్రాహ్మణులవల్ల భయమును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే స్వస్త్రీవ్యాధి భయంతథా।
స్త్రీమూలాత్కలహంచైవ వస్త్రనాశం ధనవ్యయం॥ 9

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, స్వంతస్త్రీకి అనగా భార్యకు వ్యాధిభయమును, స్త్రీమూలకముగా కలహమును, వస్త్రనాశమును, ధనవ్యయమును కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే స్త్రీపుత్రాదివినాశనం।
సమానజనశోకంచ నీచసేవామహద్భయం॥ 10

తా. శనితోకలసినను లేక చూడబడినను, భార్యాపుత్రాది వినాశమును, సమానజనశోకమును, నీచజనసేవయు, గొప్పభయమును కలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే అపమృత్యుర్భవిష్యతి।

తద్దోషపరిహారార్థం నాగదానంచ కారయేత్॥ 11

తా. ద్వితీయ సప్తమరాసుల యందున్న యెడల అపమృత్యువు కలుగును. ఆదోషపరిహారార్థమై నాగదానము చేయవలయును.

---

రాహుదశాయాం శుక్రభుక్తిమాసాః 36.

కృష్ణీయే॥

శ్లో॥ రాహోరంతర్గతే శుక్రే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయేలాభగేవాపి ఉచ్చస్వక్షేత్రసంయుతే।
రాజ్యలాభం మహాసౌఖ్యం గజాశ్వాంబర సంపదః।
విద్యావినోదపాండిత్యం నటగాయక సంకులం।
స్త్రీసౌఖ్యం పుత్రవృద్ధిశ్చ వివాహోత్సవ సంభ్రమః।
అపూర్వవస్తు సంప్రాప్తిః హేమరత్నాదిలాభకృత్।
స్వప్రభోస్తుమహాసౌఖ్యం పురనాథత్వమాప్నుయాత్।
సుగంధపుష్పశయ్యాదిసౌఖ్యం యానాదిలబ్ధవాన్॥ 1

తా. రాహుదశలో శుక్రభుక్తియందు, శుక్రుడు లగ్నమునకు కేంద్రకోణముల యందున్నను, తృతీయలాభముల యందున్నను, లేక ఉచ్చస్వక్షేత్రముల యందున్నను, రాజ్యలాభమును, విశేషసుఖమును, ఏనుగులు, గుఱ్ఱములు మొదలగు వాహనప్రాప్తియు, వస్త్రలాభమును, విద్యావినోద పాండిత్యమును, నటగాయకులయొక్క సమూహమును, స్త్రీసౌఖ్యమును, పుత్రవృద్ధియు, వివాహాది మహోత్సవములును, అపూర్వవస్తుసంప్రాప్తియు, హేమరత్నాది లాభమును, తనప్రభువు మూలకముగా నధికసౌఖ్యమును, పురాధిపత్యమును, సుగంధపుష్పములతో గూడిన శయ్యాది సుఖభోగములును, వాహనప్రాప్తియు కలుగును.



శ్లో॥ లగ్నషష్ఠాష్టమే శుక్రే వ్యయేవా నీచరాశిగే।
తద్భుక్తౌ స్త్రీవిరోధశ్చ వాహనాది పశుక్షయం।
స్త్రీవివాదశ్చకలహం యత్నకార్యవినాశనం।
సమానజనకోపశ్చ చతుష్పాజ్జీవనాశనం।
యుద్ధే శత్రుభయంచైవ యాత్రాయాం కార్యనాశనం।
పుత్రదారాది కష్టంచ స్వపదచ్యుతి విభ్రమం॥ 2

తా. లగ్నమునకు ౬-౮-౧౨. స్థానముల యందుగాని లేక తన నీచరాశియందుగాని శుక్రుడున్నయెడల ఆభుక్తియందు స్త్రీవిరోధమును, వాహనాది పశుక్షయమును, స్త్రీవివాదమును, కలహమును, యత్నకార్యభంగమును, సమానజనకోపమును, చతుష్పాజ్జీవనాశనమును, యుద్ధమునందు శత్రుభయమును, యాత్రయందు కార్యనాశనమును, భార్యాపుత్రాది కష్టమును, స్థాననాశమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే స్త్రీమూలా ద్ధననాశనం।
స్వప్రభోస్తువిరోధశ్చ సర్వత్ర కలహంతథా॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, స్త్రీమూలకముగా ధననాశనమును, తనయజమానునితో విరోధమును, సర్వులతోడను కలహమును, కలుగును.

శ్లో॥ శశినాసంయుతే దృష్టే నిత్యం సూపాన్నభోజనం।
మాతృవంశవివృద్ధిశ్చ యుద్ధే శత్రువినాశనం॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, నిత్యము భక్ష్యభోజ్యాది సుఖమును, మాతృవంశాభివృద్ధియు, యుద్ధమునందు శత్రునాశనమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే వాదశాస్త్రాది చింతనం।
మహాప్రభువిరోధశ్చ యత్నకార్యవినాశనం॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను వాద శాస్త్రాది పాపప్రసంగమును, మహారాజు విరోధమును, యత్న కార్య భంగమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే వేదశాస్త్రాది చింతనం।
అతీవసౌఖ్యం కల్యాణం బంధూనాం హితకారకం॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, వేద శాస్త్రాది చింతనయు, అధికసుఖమును, కల్యాణ సంభ్రమమును, బంధుహితమును కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే సుతజన్మోత్సవంతథా।
గృహేకల్యాణ సంపత్తిః దేహారోగ్యం మహత్సుఖం॥ 7

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, పుత్ర జన్మోత్సవమును, యింటియందు కల్యాణ సంపత్తియు, దేహారోగ్యమును, మహత్సౌఖ్యమును కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే దాసదాసీవిరోధకృత్।
మిత్రప్రభువిరోధశ్చ దేశాద్దేశాంతరం యయుః॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను తన సేవకులతోడ విరోధమును, మిత్రప్రభువుతోడ విరోధమును, దేశదేశాంతరవాసమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా।
శుభగ్రహాయుతేవాపి ఆరామక్షేత్ర వృద్ధికం।
ప్రియవస్తుషుసంప్రాప్తిః వారస్త్రీ సంగమంతథా।
స్వగృహేధాన్యవృద్ధిశ్చ హేమరత్నాది సంగ్రహం॥ 9

తా. శుక్రుడు దశానాథునకు కేంద్రకోణముల యందున్నను, తృతీయలాభముల యందున్నను, లేక శుభగ్రహముతో కూడియున్నను, ఆభుక్తియందు తోటలు, క్షేత్రములు



మొదలగునవి అభివృద్ధియు, అపూర్వవస్తు సంప్రాప్తియు, వేశ్యా స్త్రీసంగమంబును, యింటియందు ధాన్యాభివృద్ధియు, హేమరత్నాది సంగ్రహమును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా నీచరాశిగే।
పాపయుక్తేథవా దృష్టే స్త్రీమూలా ద్ధననాశనం।
గృహధాన్య వినాశశ్చ స్త్రీవివాదం మహద్భయం।
సుతదారావియోగశ్చ భూమినాశం నృపాద్భయం।
కుక్షిబాధాశిరోరోగం నేత్రరోగం మనోవ్యథా॥ 10

తా. శుక్రుడు దశానాథునకు ౬-౮-౧౨. స్థానముల యందున్నను, తన నీచరాశియందున్నను లేక పాపగ్రహముతో కూడియున్నను, చూడబడినను, స్త్రీమూలకముగా ధన నాశనమును, యింటియందు ధాన్యనాశమును, స్త్రీవివాదమును, గొప్పభయమును, భార్యాపుత్ర వియోగమును, భూనాశనమును, రాజభయమును, కుక్షిబాధయు, శిరోరోగమును, నేత్రవ్యాధియు, మనోవ్యథయు సంభవించును.

శ్లో॥ ద్వితీయద్యూననాథేన అపమృత్యు భయంభవేత్।
తద్దోషపరిహారార్థం దుర్గాదానం జపంచరేత్।
పయస్వినీంచగాందద్యా త్సర్వారిష్ట వినాశనం॥ 11

తా. ద్వితీయ సప్తమరాసులయందున్న యెడల అపమృత్యువు సంభవించును. ఆదోషపరిహారార్థమై దుర్గాజపము చేయవలయును. గాకను గోదానమిచ్చిన యెడల సకల అరిష్టములు నశించును.

---

రాహుదశాయాం రవిభుక్తిమాసాః 10 దినాని 24.

పారాశర్యే ॥

శ్లో॥ రాహోరంతర్గతేసూర్యే స్వోచ్చస్వక్షేత్ర కేంద్రగే।

సుతభాగ్యగతేలాభే శుభయుక్తే శుభేక్షితే।
రాజసన్మానకీర్తిశ్చ అల్పసౌఖ్యం శుభాశుభే।
అల్పగ్రామాధిపత్యంస్యాద్దారపుత్రాదివర్ధనం।
లగ్నభాగ్యాధిపయుతే గురుచంద్రేక్షితేతథా।
రాజాశ్రయంచనిపుణం ప్రమోదాది విలాసకృత్।
శ్వేతాతపత్రనృప పూజిత దేశలాభం।
హస్త్యశ్వయాన పరిపూర్ణ మనోరథాశ్చ।
స్వోచ్చస్థితే వ్యుపచయే బలయుగ్గ్రహాస్యాత్।
సౌభాగ్యవృద్ధివిభవం జననాయకత్వం॥ 1

తా. రాహుదశలో సూర్యభుక్తియందు సూర్యుడు స్వోచ్చస్వక్షేత్రముల యందున్నను, కేంద్రస్థానముల యందున్నను, పంచమ నవమములయందున్నను, లాభస్థానమందున్నను, లేక శుభగ్రహముతో కూడియున్నను లేక చూడబడినను, రాజసన్మానమును, కీర్తియు, అల్పసౌఖ్యమును, శుభాశుభ ఫలములును, అల్పగ్రామాధిపత్యమును, భార్యాపుత్రాభివృద్ధియు, కలుగును. లగ్నభాగ్యాధిపతులతో కూడినను లేక గురుచంద్రులచే చూడబడినను రాజాశ్రయ నిపుణతయు, ప్రమోదాది విలాసమును, దేశలాభమును, గజతురగాది యానలాభమును, పరిపూర్ణమనోభిలాష సంసిద్ధియు, కలుగును. తన ఉచ్చరాశియందున్నను, లేక ఉపచయరాసులయందు బలసహితమైన గ్రహముతో కూడియున్నను, సౌభాగ్యవృద్ధియు, విభవమును, దేశపరిపాలనాధికారమును కలుగును.

కృష్ణియ్యే॥

శ్లో॥ లగ్నషష్ఠాష్టమే సూర్యే వ్యయేవా నీచరాశిగే।
శరీరే రోగపీడాచ సమానజననాశనం।



స్థాననాశం నృపాద్భీతిః కలహంచ మనోవ్యథా।
ఆప్తబంధు వినాశశ్చ యుద్ధే ప్రాణభయంతథా।
అప్తస్యరిపుభావశ్చ యత్నకార్య వినాశనం॥ 2

తా. లగ్నమునకు ౬-౮-౧౨ స్థానముల యందుగాని లేక తన నీచరాశియందుగాని సూర్యుడున్నయెడల శరీరమునందు రోగబాధయు, సమానజననాశనమును, స్థాననాశమును, రాజభీతియు, కలహమును, మనోవ్యథయును, ఆప్తబంధుహానియు, యుద్ధమునందు ప్రాణభయమును, మిత్రద్వేషమును, యత్నకార్యభంగమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతే దృష్టే అన్నదానపరోభవేత్।
సమానప్రభుసన్మానం వస్త్రాభరణ వృద్ధిదం॥ 3

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, అన్నదానము చేయుటయు, సమాన ప్రభుసన్మానమును, వస్త్రాభరణవృద్ధియు సిద్ధించును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే పరస్త్రీకలహంతథా।
విషశస్త్రాగ్నిబాధాచ సహోదరవినాశనం॥ 4

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, అన్యస్త్రీతో కలహమును, విషశస్త్రాగ్ని బాధలును, అన్నదమ్ముల నాశనమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే హేమవస్త్రవిభూషణం।
బంధూపకారసతతం పశుధాన్యాదివృద్ధిదం॥ 5

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, బంగారు ఆభరణ సంప్రాప్తియు, వస్త్రభూషణమును, ఎల్లవుడు బంధుజనోపకారమును, పశుధాన్యాభివృద్ధియు కలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే వేదశాస్త్రాది సంగ్రహం।

యజ్ఞదీక్షాప్రసంగశ్చ గురుదేవ ద్విజార్చనం॥ 6

తా. గురువుతో కలసినను లేక చూడబడినను వేద శాస్త్రాది సంగ్రహమును, యజ్ఞదీక్షా ప్రసంగమును, గురుభక్తియు దేవబ్రాహ్మణపూజయు లభించును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే మణిమాణిక్యసంగ్రహః।
అపూర్వవస్తుసంప్రాప్తిః మిత్రప్రభు వశాత్సుఖం॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, మణి మాణిక్యాదుల సంగ్రహమును, అపూర్వ వస్తుసంప్రాప్తియు, స్నేహప్రభు మూలకముగా సుఖమును కలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే దాసీదాసాది నాశనమ్।
క్షేత్రార్థపశునాశశ్చ నీచసేవా భవిష్యతి॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను, దాసదాసీ జన నాశనమును, క్షేత్రార్థ నాశనమును, పశుహానియు, నీచ జనసేవయు సంభవించును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యేలాభగేపివా।
శుభగ్రహాయుతేవాపి ధనలాభముదీరయేత్।
మహారాజప్రసాదేన వాహనాది లభేద్ధ్రువం।
విద్యావినోదవిజయం కీర్తిలబ్ధి సుఖావహాం।
పితృవర్గవివృద్ధిశ్చ ప్రభావ బలవర్ధనం।
వస్త్రాద్యాయుధ సంప్రాప్తిః అధికారాది లబ్ధవాన్॥ 9

తా. భుక్తినాథుడగు సూర్యుడు దశానాథునకు కేంద్ర కోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక శుభగ్రహములతో కూడియున్నను, ధనలాభము వచింప తగినది. గాకను మహారాజానుగ్రహమువల్ల నిశ్చయముగా వాహనప్రాప్తి లభించును. విద్యావినోద విజయమును, మంచి



కీర్తియు, సుఖమును, పితృవర్గపువారికి అభివృద్ధియు ప్రభావ మును, బలవృద్ధియు, వస్త్రప్రాప్తియు, ఆయుధ సంగ్రహ మును, అధికారాది లాభమును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
ద్రవ్యనాశం స్థాననాశం వాహనాది పశుక్షయం।
మానభంగోమనఃఖేదః సమానజననాశనం।
అరివర్గకృతంపీడా మహదాపత్సు సంభవం॥ 10

తా. సూర్యుడు దశానాథునకు ౬-౮-౧౨. స్థానముల యందున్నను, లేక పాపగ్రహముతో కూడియున్నను, ద్రవ్య నాశమును, స్థాననాశమును, వాహనాది పశుక్షయమును, మానహానియు, మనోదుఃఖమును సమాన జననాశమును, శత్రుజనపీడయు, గొప్ప ఆపదయు సంభవించును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే అపమృత్యుర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం సూర్యప్రార్థనమాచరేత్।
తిలపద్మప్రదానేన సర్వారిష్టవినాశనం॥ 11

తా. ద్వితీయ సప్తమరాసులయందు సూర్యుడున్న యెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై సూర్యప్రార్థన చేయవలయును. తిలపద్మ దానముచేత సకల అరిష్టములు తొలగును.

---

రాహుదశాయాం చంద్రభుక్తిమాసాః 18.

కృష్ణీయే॥

శ్లో॥ రాహోరంతర్గతేచంద్రే లగ్నాత్కేంద్రత్రికోణగే।
తృతీయే లాభగేవాపి ఉచ్చరాశిస్థితేపివా।
పూర్ణచంద్రే పూర్ణఫలం మధ్యమే మధ్యమంతథా।
సర్వకార్యవివృద్ధిశ్చ వివాహాది శుభంతథా।

అపూర్వవస్తుసంప్రాప్తిః ప్రియవస్తును సంగ్రహం।
మనోల్లాసం మహత్సౌఖ్యం కీర్తిప్రాప్తి ర్భవిష్యతి।
స్త్రీసౌఖ్యంపుత్రవృద్ధిశ్చ బంధూనాముపకారకం।
మిత్రప్రభువశాత్సౌఖ్యం గృహే గోధనసంకులం।
మాతృవంశవివృద్ధిశ్చ పుత్రీపుత్రోత్సవంతథా। 1

తా. రాహుదశలో చంద్రభుక్తియందు చంద్రుడు లగ్నమునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక తన ఉచ్చరాశిని పొందియున్నను, పూర్ణచంద్రుడైన యెడల పూర్ణఫలమును, మధ్యచంద్రుడైనయెడల మధ్యను ఫలమును, సర్వకార్యముల యందును, అభివృద్ధియు, వివాహాది శుభములును, అపూర్వ వస్తుసంప్రాప్తియు, ప్రియవస్తు సంగ్రహమును, మనోల్లాసమును, విశేష సుఖమును, కీర్తిప్రాప్తియు, స్త్రీసౌఖ్యమును, పుత్రవృద్ధియు, బంధుజనోప కారమును, స్నేహప్రభు మూలకముగా సుఖమును, యింటియందు గోలాభమును, ధనాభివృద్ధియు, మాతృవంశపు వారికి అభివృద్ధియు, పుత్రోత్సవమును, పుత్రికా జననమును కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టమేవాపి వ్యయేవా నీచరాశిగే।
తద్భుక్తౌ మాతృనాశంచ ప్రభోఃక్రోధ మవాప్స్యతి।
క్షేత్రనాశంచగోనాశం ధనధాన్య వినాశనం।
స్త్రీవివాదంచకలహం సమాన జననాశనం।
ఆప్తబంధువిరోధశ్చ స్థాననాశం తథైవచ।
విద్యాకీర్తి వినాశశ్చ యత్నకార్య వినాశనం॥ 2

తా. చంద్రుడు లగ్నమునకు ౬-౮-౧౨. స్థానముల యందున్నను, లేక తన నీచరాశిని పొందియున్నను, ఆ భుక్తి



యందు మాతృవియోగమును, రాజకోపమును, క్షేత్రహానియు, గో నాశనమును, ధనధాన్య వినాశమును, స్త్రీ వివాదమును, కలహమును, సమాన జననాశమును, ఆప్తబంధు విరోధమును, స్థాననాశమును, విద్యాకీర్తిభంగమును, యత్న కార్య వినాశమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే నృపాన్నాశం భవిష్యతి।
తాపజ్వరాది సంప్రాప్తిః స్థాననాశం మనోవ్యథా॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, రాజమూలకముగా నాశనమును, తాపజ్వరాది పీడయు, స్థాననాశమును, మనోదుఃఖమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే శస్త్రఘాతాదిపీడనం।
సమాన జనశోకశ్చ అపమృత్యు భయంతథా॥ 4

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, శస్త్ర దెబ్బలచేత కలిగిన బాధయు, సమాన జనశోకమును, అపమృత్యు భయమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే విద్యాకీర్తిజయప్రదం।
ప్రియవస్తుషులాభశ్చ యత్నకార్యసుసిద్ధిదం॥ 5

తా. బుధునితో కలసినను లేక చూడబడినను విద్యాకీర్తియు, జయమును, ప్రియ వస్తులాభమును, యత్నకార్య సిద్ధియు కలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే పుత్రస్త్రీ భాగ్యసంపదః।
గజగోవాజిలాభశ్చ వస్త్రాభరణసంగ్రహః॥ 6

తా. గురునితో కలసిసినను లేక చూడబడినను, పుత్రసంపదయు, స్త్రీభాగ్యమును, ఏనుగులు, గుఱ్ఱములు, గోవులు మొదలగువాని లాభమును,వస్త్రా భరణసంప్రాప్తియు కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే స్త్రీసౌఖ్యం బంధువైభవం।
మిత్రప్రభువశాదిష్టం యత్నకార్యార్థసిద్ధిదం॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, స్త్రీసౌఖ్యమును, బంధుజనాను కూలమును, మిత్రప్రభువు మూలకముగా యిష్టసిద్ధియు, యత్నకార్యాను కూలమును, అర్థప్రాప్తియు కలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే గోమహిష్యాదినాశనం।
ఇష్టప్రభువిరోధశ్చ నానామూలా ద్ధనవ్యయం॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను, గోవులు, గేదెలు, మొదలగు పశ్వాదుల నాశమును, ఇష్టప్రభు విరోధమును, నానా విధములుగా ధనవ్యయమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయే లాభగేపివా।
శుభగ్రహయుతేవాపి హేమవస్త్రాదిసంగ్రహః।
విచిత్రవస్త్రలాభశ్చ నానామూలా ద్ధనాగమం।

తా. దశానాథునకు కేంద్రకోణములయందు గాని, తృతీయ లాభములయందు గాని, లేక శుభగ్రహముతో కలసిగాని చంద్రుడున్నయెడల ఆ భుక్తియందు హేమలాభమును, వస్త్రప్రాప్తియు, విచిత్ర వస్త్రలాభమును, నానా మూలకముగా ధనాగమంబును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
తద్భుక్తౌ ప్రాణనాశశ్చ రిపురోగ వివృద్ధిదం।
మానభంగంచకలహం కుక్షిబాధా భవిష్యతి।
చతుష్పాజ్జీవనాశశ్చ ధనధాన్యవినాశనం॥ 10

తా. చంద్రుడు దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను, లేక పాపగ్రహ సంబంధము కలిగియున్నను,



ఆ భుక్తియందు ప్రాణహానియు, శత్రుబాధయు, రోగపీడయు, మానభంగమును, కలహమును, కుక్షిబాధయు, చతుష్పాజ్జీవనాశనమును, ధనధాన్య వినాశమును, కలుగును.

శ్లో॥ ద్వితీయ ద్యూననాథేవా అపమృత్యుభయంతథా।
తద్దోషపరిహారార్థం మృత్యుంజయ మథార్చయేత్।
వహ్నిదానం ప్రకుర్వీత ఇష్టసిద్ధిర్భవిష్యతి॥ 11

తా. ద్వితీయ సప్తమ స్థానంబులయందు చంద్రుడున్నయెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై మృత్యుంజయ జపము చేయవలయును. స్వర్ణదానము చేసిన పిమ్మట ఇష్టసిద్ధి కలుగును.

---

రాహుదశాయాం కుజభుక్తిమాసాః 12. దినాని 18.

కృష్ణీయే॥

శ్లో॥ రాహోరంతర్గతేభామే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయే లాభగేవాపి ఉచ్చరాశిస్థితేపివా।
శుభాంశే శుభసంయుక్తే తద్భుక్తౌ క్షేత్రసంగ్రహః।
కృషిక్షేత్రవివృద్ధిశ్చ హేమవస్త్రాదిసంగ్రహః।
ముక్తప్రవాళ వాభశ్చ ప్రియవస్తుసుసంగ్రహం।
యుద్ధేజయం కీర్తిలాభం బహుద్రవ్యా యతింతథా।
సహోదరాదివృద్ధిశ్చ దారపుత్రాది వృద్ధికృత్॥ 1

తా. రాహుదశలో కుజుడు లగ్నమునకు కేంద్రకోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను, తన ఉచ్చరాశియందున్నను, శుభాంశయందున్నను, లేక శుభగ్రహముతో కలసియున్నను, ఆ భుక్తియందు క్షేత్రలాభమును, కృషిలాభమును, క్షేత్రవృద్ధియు, హేమలాభమును, వస్త్రప్రాప్తియు, ప్రవాళ మౌక్తికాది సంగ్రహమును, ప్రియవస్తు

సంగ్రహమును, యుద్ధమునందు జయమును, కీర్తిలాభమును, విశేష ద్రవ్యార్జనయు, సహోదరాభి వృద్ధియు, భార్యాపుత్రాభి వృద్ధియు కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్ట రాశిస్థే వ్యయేవా నీచరాశిగే।
అపవాదం మహత్కష్టం కీర్తినాశం తథైవచ।
జ్ఞాతిశత్రువివృద్ధిశ్చ చోరబాధా భవిష్యతి।
ఆప్తబంధువియోగశ్చ సర్వత్ర కలహంతథా।
స్థానాంతరాది గమనం కార్యనాశం తథైవచ।
గ్రహణిక్షయ రోగాది శ్వాసఖాసాది పీడనం॥ 2

తా. కుజుడు లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయందున్నను లేక తన నీచరాశిని, పొందియున్నను, అపవాదమును, అధిక కష్టమును, కీర్తినాశమును, జ్ఞాతివృద్ధియు, శత్రువృద్ధియు, చోరబాధయు, ఆప్తబంధు వియోగంబును, సర్వులతోడను కలహమును, దేశాంతరగమనమును, కార్య నాశనమును, గ్రహణి క్షయరోగ బాధలును, శ్వాస ఖాసాది పీడయు సంభవించును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే తాపజ్వర భయంతథా।
యుద్ధేశత్రుభయంచైవ సమాన జననాశనం॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, తాపజ్వర భయమును, యుద్ధమునందు శత్రుభయమును, సమాన జననాశనమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టే మహాప్రభు వశాత్సుఖం।
కళ్యాణాది శుభప్రాప్తిః క్షేత్రవృద్ధి ర్భవిష్యతి॥ 4

తా. చంద్రునితో కలసినను, లేక చూడబడినను, మహాప్రభు మూలకముగా సుఖమును, కళ్యాణాది శుభప్రాప్తియు, క్షేత్రవృద్ధియు కలుగును.



శ్లో॥ బుధేన సంయుతేదృష్టే మాతులాది వినాశనం।
వ్యవహారే భయంచైవ బంధూనాంవిప్రియంతథా॥ 5

తా. బుధునితో కలసినను, లేక చూడబడినను మేనమామలకు నాశనమును, వ్యవహారమునందు భయమును, బంధుజన ద్వేషమును కలుగును.

శ్లో॥ గురుణా సంయుతేదృష్టే పుత్రనాశం ధనక్షయం।
నిస్స్వత్వం కాంతిహీనత్వం సర్వకార్య వినాశనం॥ 6

తా. గురువుతో కలసినను, లేక చూడబడినను, పుత్రనాశమును, ధనక్షయమును, నిస్స్వత్వమును, కాంతిహీనతయు, సర్వకార్య వినాశమును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే అశ్వాందోళాది లబ్ధవాన్।
పుత్రదారాదిసౌఖ్యంచ గృహే కళ్యాణమేవచ॥ 7

తా. శుక్రునితో కలసినను, లేక చూడబడినను, అశ్వాందోళాది వాహనప్రాప్తియు, భార్యాపుత్రాదుల సౌఖ్యమును, యింటియందు కళ్యాణాది శుభములును లభించును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే పశుక్షేత్రవినాశనం।
సమానజననాశశ్చ చతుష్పాజ్జీవనాశనం॥ 8

తా. శనితోకలసినను, లేక చూడబడినను, పశుహానియు, క్షేత్రనాశమును, సమాన జననాశనమును, చతుష్పాజ్జీవ నాశనమును కలుగును.

శ్లో॥ దాయేశా త్కేంద్రకోణేవా దుశ్చిక్యే లాభగేపివా।
పశువృద్ధి ర్ధాన్యవృద్ధిః అశ్వాద్యారోహణంతథా।
పుత్రీపుత్ర వివృద్ధిశ్చ చతుష్పాజ్జీవలాభకృత్।
సువస్త్రాభరణప్రాప్తి సుకీర్తి విజయంతథా॥ 9

తా. కుజుడు దశానాథునకు కేంద్రకోణముల యందున్నను,తృతీయలాభముల యందున్నను పశువృద్ధియు,ధాన్యవృద్ధియు, అశ్వాద్యారోహణ ప్రాప్తియు, పుత్రాభివృద్ధియు, పుత్రికల కభివృద్ధియు, చతుష్పాజ్జీవలాభమును, శ్రేష్ఠమైన వస్త్రాభరణప్రాప్తియు, మంచి కీర్తియు, జయమును కలుగును.

శ్లో॥ దాయేశాత్త్వష్టరంధ్రేవా వ్యయేవాపాపసంయుతే।
తద్భుక్తౌ జ్ఞాతిరోధశ్చ విధవా కలహంతథా।
క్షేత్రనాశం ధాన్యనాశం సమానజననాశనం।
ధననాశం పుత్రపీడా దుష్కీర్తి ప్రాప్తిమేవచ॥ 10

తా. కుజుడు దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను, లేక పాపగ్రహ సంబంధము కలిగియున్నను, ఆ భుక్తియందు జ్ఞాతివిరోధమును, విధవా కలహమును, క్షేత్రనాశమును, ధాన్యనాశనమును, సమాన జననాశనమును, ధనక్షయమును, పుత్రపీడయు, అపకీర్తియు కలుగును.

శ్లో॥ ద్వితీయ ద్యూనరాశిస్థే అపమృత్యుర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం సుబ్రహ్మణ్యంచపూజయేత్।
నాగదానంప్రకుర్వీత సర్వారిష్ట వినాశనం॥ 11

తా. భుక్తినాథుడు ద్వితీయ సప్తమములయందున్నయెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై సుబ్రహ్మణ్య జపము చేయవలయును. గాకను, నాగదానము యిచ్చినపిమ్మట సకల అరిష్టములును నశించును.

ఇతి జాతకఫల చింతామణౌ రాహుదశాంతర్దశాఫలంనామ
పంచమప్రకరణం—సమాప్తము.



శుభమస్తు.

# జాతకఫలచింతామణి.

ఆంధ్ర తాత్పర్య సహితము.

## గురుదశాఫలనామ - షష్ఠమ ప్రకరణము.

గురుదశావత్సరాః 16

శ్లో॥ హేమాంబరాభరణ సంగ్రహకీర్తిలాభః।
విద్యావినోదవిభవ స్స్వజనానుమోదః।
స్త్రీపుత్రసౌఖ్య విభవః పశుధాన్యవృద్ధిః।
స్యాత్సర్వదా గురుదశాగమనే నపుంసాం॥ 1

తా. మనుష్యునకు గురు మహర్దశ సంప్రాప్తించిన కాలమందు బంగారము, వస్త్రము, ఆభరణములు మొదలగు వాని సంగ్రహమును, కీర్తిలాభమును, విద్యావినోద విభవమును, స్వజన సంతోషమును, భార్యాపుత్ర సౌఖ్యమును, విభవమును, పశుధాన్య వృద్ధియు, ఎల్లపుడును కలుగుచుండును.

శ్లో॥ జీవదశాయామీశో గ్రామాణాం మండలాధినాథోవా।
ద్విజభూపాల్లబ్ధధనో మేధావీకాంతిమాన్వినీతజ్ఞః॥ 2

తా. గురుదశయందు గ్రామాధిపత్యమును, లేక రాజ్యాధిపత్యమును, బ్రాహ్మణ ప్రభువువల్ల రాబడిన ధనమును, మేధాశక్తియు, విశేష కాంతియు, నీతికార్య ప్రవర్తనయు కలుగును.

శ్లో॥ అత్యుచ్చసంస్థస్య గురోర్దశాయాం
యానాంబరాభరణ భూషణరత్నలాభః।
అతీవసౌఖ్యం స్వజనానుమోద
స్సునామ పద్యాంకిత కీర్తిలాభః॥ 3

తా. పరమోచ్చయందున్న గురుదశలో వాహనవస్త్రాభరణ భూషణ రత్నలాభములును, విశేషసౌఖ్యమును, స్వకీయ జనానురాగమును, తనపేరు అంకితము గాగల పద్యములచేత పొగడింపబడు కీర్తియు కలుగును.

శ్లో॥ ఉచ్చస్థితస్యాపి గురోర్దశాయాం
కరోతిసౌఖ్యం సుతబంధువృద్ధిం।
యజ్ఞాదిసత్కర్మ సుసిద్ధిదంచ
మనోవిలాసం మహదాధిపత్యం॥ 4

తా. తన ఉచ్చరాశియందున్న గురుదశలో అధిక సౌఖ్యమును, పుత్రవృద్ధియు, బంధుజనాభి వృద్ధియు, యజ్ఞాది సత్కర్మసిద్ధియు, మనోవిలాసమును, గొప్పపదవియు కలుగును.

శ్లో॥ ఉచ్చాంశసంయుక్త గురోర్దశాయాం
భాగ్యోత్తరం రాజసమానమేతి।
ప్రవాళముక్తామణి రత్నలాభం
సర్వేషుముఖ్యత్వ ముపైతిసౌఖ్యం॥ 5

తా. ఉచ్చాంశను పొందియున్న గురుదశలో రాజసమానమై నటువంటి భాగ్యలాభమును, ప్రవాళ ముక్తామణి రత్నలాభమును, సర్వ జనులయందును, ప్రధానత్వమును, సౌఖ్యమును కలుగును.

శ్లో॥ ఉచ్చఖేచరసంయుక్త గురోర్దాయే మహత్సుఖం।
తటాక గోపురాదీనాం నిర్మాణం నృపపూజ్యతాం॥ 6

తా. ఉచ్చరాశిని పొందియున్న గ్రహములతో కలసిన గురుదశయందు అధిక సుఖమును, తటాక గోపురాది నిర్మాణమును, రాజపూజ్యతయు కలుగును.

శ్లో॥ నీచఖేచర సంయుక్త గురోర్దాయే మనోరుజం।



పరప్రేష్యాది వాదంచ స్త్రీపుత్రాణాం విరోధతా॥ 7

తా. నీచగ్రహములతో కూడియున్న గురుదశలో మనోవ్యాకులమును, పరులయొక్క సేవయు, భార్యాపుత్రులయొక్క విరోధమును కలుగును.

శ్లో॥ అత్యంత నీచస్థితజీవదాయే స్వస్థాననాశం క్షితిపాలకోపం।
సమాననాశం బహుకష్టవృత్తిం స్త్రీపుత్రపీడాధననాశనంచ॥

తా. పరమ నీచరాశియందున్న గురుదశలో స్వస్థాన నాశమును, రాజకోపమును, సమాన జననాశనమును, అధిక కష్ట జీవనమును, భార్యాపుత్రుల పీడయు, ధన నాశనమును కలుగును.

శ్లో॥ నీచాన్వితస్యాపి గురోర్దశాయాం
స్త్రీపుత్రనాశం స్వజనానురోధం।
మనోవిచారం కృషినాశనంచ
ధాన్యాదినాశం బహుకష్టమేతి॥ 9

తా. నీచగ్రహముతో గూడిన గురుదశలో స్త్రీనాశమును, పుత్రనాశమును, స్వజనవిరోధమును, మనోవిచారమును, వ్యవసాయ నష్టమును, ధాన్యనాశమును, అధిక కష్టమును, కలుగును.

శ్లో॥ నీచస్థితస్యాపిగురోర్దశాయాం క్షితీశకోపం స్వజనానురోధం।
విదేశయానం ధననాశనంచ మనోవికారం కృషినాశనంచ॥

తా. నీచస్థితిని పొందియున్న గురుదశలో రాజకోపమును, స్వజన విరోధమును, విదేశ ప్రయాణమును, ధననాశనమును, మనోవికారము, కృషినాశనమును కలుగును.

శ్లో॥ ఉచ్చస్థోపి గురుర్నీచ రాశ్యాంశక సమన్వితః।
మహాభోగేతు సంప్రాప్తే తత్క్షణాదేవ నశ్యతి॥ 11

తా. గురువు తన ఉచ్చరాశియందున్నను, నీచాంశను, పొందియున్నయెడల మహా భోగప్రాప్తి కలిగినను తత్క్షణమే నశించును.

శ్లో॥ నీచస్థేదేవపూజ్యోపి స్వోచ్చాంశక సమన్వితః।
భాగ్యంక్షయేతు సంప్రాప్తే భాగ్యంయాతి సదానరః॥

తా. గురువు నీచరాశిస్థితుడైనను, తన ఉచ్చాంశను, పొందియున్నయెడల భాగ్యక్షయము, సంప్రాప్తించినను, ఎల్లపుడు భాగ్యము లభించుచుండును.

శ్లో॥ అత్యంత మిత్రభవన స్థితజీవదాయే
రాజ్యాధికారమవనీపతి పూజ్యమానం।
క్షేత్రాభివృద్ధి ధనధాన్యసమృద్ధిదంచ
దారాదిసౌఖ్యసుతసంభవ కీర్తిలబ్ధం॥ 13

తా. అధి మిత్రక్షేత్రమందున్న గురుదశలో రాజ్యాధికారమును, రాజపూజ్యతయు, క్షేత్రాభివృద్ధియు, ధనధాన్యసమృద్ధియు, భార్యాపుత్ర సౌఖ్యమును, పుత్రోత్పత్తియు, కీర్తి లాభమును కలుగును.

శ్లో॥ మిత్రర్క్షగస్యాపి గురోర్దశాయాం
రాజ్యాధికారం పరవస్తులాభం।
పురాణగీత శ్రవణంవినోదం
ధాన్యాభివృద్ధిం పశువృద్ధిదంచ॥ 14

తా. మిత్రరాశియందున్న గురుదశలో రాజ్యాధికారమును, శ్రేష్ఠమైన వస్తులాభమును, పురాణగీత శ్రవణమును, వినోదమును, ధాన్యాభివృద్ధియు, పశువృద్ధియు కలుగును.

శ్లో॥ స్వక్షేత్రసంస్థిత సురార్చితదాయకాలే
విద్యావినోదవిభవం బహుహేమవృద్ధిం।



క్షేత్రాభివృద్ధి బహుధాన్యవిచిత్రలాభం
రాజ్యాధికారవిభవం నవరత్నలాభం॥ 15

తా. స్వక్షేత్రగతుడైన గురుదశలో విద్యావినోద విభవమును, విశేషముగా బంగారు సంగ్రహమును, క్షేత్రాభివృద్ధియు, బహువిచిత్ర ధాన్య లాభమును, రాజ్యాధికార విభవమును, నవరత్న లాభమును కలుగును.

శ్లో॥ సమర్క్షగస్యాపి గురోర్దశాయాం
క్వచిత్సుఖం ధాన్యవివృద్ధిదంచ।
నృపాలమిత్రం స్వజనానుకూలం
సుతీర్థయాత్రాది ఫలంప్రదంచ॥ 16

తా. సమరాశియందున్న గురుదశలో కొంతసుఖమును, ధాన్యవృద్ధియు, రాజస్నేహమును, స్వజనాను కూలమును, మంచితీర్థయాత్రాది ఫలమును లభించును.

శ్లో॥ శత్రూర్క్షసంస్థస్య సురార్చితస్య దశావిపాకే ధననాశనంచ।
మనోవిచారంచ శరీరకష్టం క్షేత్రాదినాశం పదవిచ్యుతంచ॥

తా. శత్రుక్షేత్రమందున్న గురుదశలో ధననాశనమును, మనోవిచారమును, దేహకష్టమును, క్షేత్రాది నాశనమును, స్థాననాశనమును, కలుగును.

శ్లో॥ అతిశత్రూర్క్షసంస్థస్య గురోర్దాయే మహద్భయం।
దారపుత్రవినాశశ్చ దేహబాధా భవిష్యతి॥ 18

తా. అధి శత్రురాశియందున్న గురుదశలో గొప్పభయమును, భార్యాపుత్ర నాశనమును, దేహబాధయు కలుగును.

శ్లో॥ శుభాన్వితస్య జీవస్యదశాసౌఖ్య ఫలప్రదా।
యత్నకార్యార్థ సిద్ధిశ్చ బాంధవాది సమాగమః॥ 19

తా. శుభగ్రహములతో గూడిన గురుదశ సౌఖ్యఫల

మును, కలుగచేయును. గాకను, యత్నకార్యసిద్ధియు, అర్థ లాభమును, బంధు సమాగమంబును కలుగును.

శ్లో॥ పాపాన్వితస్య జీవస్య దశాకష్ట ఫలప్రదా।
సర్వత్రకలహాంచైవ యత్నకార్యవినాశనం॥ 20

తా. పాపగ్రహములతో గూడిన గురుదశలో కష్ట ఫలము కలుగును. గాకను, సర్వజనులతోడను కలహమును, యత్నకార్య నాశనమును కలుగును.

శ్లో॥ శుభేక్షితస్యాపి గురోర్దశాయాం
దేశాంతరే విత్తి ముపైతిభూపాత్।
దేవార్చనం భూసురతర్పణంచ
తీర్థాభిషేకం గురుపూజనంచ॥ 21

తా. శుభగ్రహ వీక్షణగల గురుదశలో దేశాంతరము నుండి రాజులవల్ల సంపాదింపబడిన ధనమును, దేవపూజయు, బ్రాహ్మణ సంతర్పణయు, తీర్థాభిషేకమును, గురుపూజయు కలుగును.

శ్లో॥ పాపేక్షితస్యాపి గురోర్దశాయాం
ప్రాప్తోసుఖంకించి దుపైతిసౌఖ్యం।
క్వచిద్యశః కుత్రచిదత్రసౌఖ్యం
క్వచిద్ధనంనాశ ముపైతిచాంతే॥ 22

తా. పాపగ్రహముచే చూడబడెడి గురుని దశయందు సుఖప్రాప్తియు, కొంచెము సౌఖ్యమును, ఒకానొకపుడు కీర్తియును, ఒకానొకపుడు, సౌఖ్యమును, ఒకానొకపుడు కించిద్ధన ప్రాప్తియు కలుగును.

శ్లో॥ కేంద్రస్థితస్యాపి గురోర్దశాయాం
అతీవసౌఖ్యం వరవస్తులాభం।



సుకీర్తిలాభం సురసంఘపూజా
స్త్రీపుత్రసౌఖ్యంచ శుభంకరోతి॥ 23

తా. కేంద్రరాశియందున్న గురుదశలో అధిక సౌఖ్యమును, శ్రేష్ఠమైన వస్తులాభమును, మంచికీర్తియు, బ్రాహ్మణ సంఘ పూజయు, భార్యాపుత్ర సౌఖ్యమును, శుభమును కలుగును.

శ్లో॥ త్రికోణస్థస్యజీవస్య దాయేసౌఖ్యం ధనాగమః।
యత్నకార్యసుసిద్ధిశ్చ పుత్రవృద్ధిర్భవిష్యతి॥ 24

తా. త్రికోణరాశియందున్న గురుదశలో సౌఖ్యమును, ధనాగమంబును, యత్నకార్యసిద్ధియు,పుత్రవృద్ధియు కలుగును.

శ్లో॥ షష్ఠాష్టమవ్యయస్థస్య జీవస్యాతి భయప్రదం।
సమానజనకష్టంచ స్థానవిచ్యుతి కారణం॥ 25

తా. లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయందు గురువున్నయెడల అధికభయము కలుగును. గాకను సమానజన కష్టమును, స్థాననాశమును కలుగును.

శ్లో॥ మూలత్రికోణ నిలయస్య గురుర్దశాయాం
రాజ్యార్థభూమి సుతదార విశేషసౌఖ్యం।
యానాదిరోహణమపి స్వబలాత్తవిత్తం
యజ్ఞాదికర్మ జనపూజిత కార్యసిద్ధిం॥ 26

తా. మూలత్రికోణ రాశియందున్న గురుదశలో రాజ్య ప్రాప్తియు, అర్థలాభమును, భూలాభమును, భార్యాపుత్ర సౌఖ్యమును, వాహనారోహణ ప్రాప్తియు, స్వతంత్రముగా సంపాదింపబడిన ధనమును, యజ్ఞాది శుభకర్మప్రాప్తియు, జన పూజ్యతయు, కార్యసిద్ధియు కలుగును.

శ్లో॥ పాకేస్థానబలాన్వితస్యచ గురోఃక్షేత్రాది దారాత్మజా

సంప్రాప్నోతి గజాశ్వవైభవ సుఖచిత్రాంబరం భూషణం।
దిగ్వీర్యాన్వితదేవ నాయకగురౌ లోకే ప్రసిద్ధంతదా
జీవేకాలబలాధికే నృపవధూసన్మానితాం యాతిచ॥ 27

తా. స్థానబలముగల గురుదశలో క్షేత్రలాభమును, భార్యాపుత్ర సంప్రాప్తియు, గజాశ్వవైభవమును, సుఖమును, విచిత్రవస్త్రప్రాప్తియు, భూషణలాభమును, కలుగును. దిగ్వీర్యముతో గూడిన గురుదశలో లోకఖ్యాతియు, కాలబలముగల గురుదశలో రాజసన్మానమును కలుగును.

శ్లో॥ నిసర్గవీర్యాన్విత జీవదాయే
నిసర్గితశ్చాపి సుఖం మహత్వం।
విద్యావిలాసం రతి కేళిసౌఖ్యం
గంగాదితో యాదికృతాభిషేకం॥ 28

తా. నైసర్గిక బలముగల గురుదశలో సహజమైన సుఖమును, మహత్వమును, విద్యావిలాసమును, రతి కేళీసౌఖ్యమును, గంగాది పుణ్యతీర్థస్నానమును కలుగును.

శ్లో॥ వక్రంగతస్యాపి గురోర్దశాయాం
మహత్వతాయాతి సుతార్థసౌఖ్యాత్।
యుద్ధేజయంభూపతి మిత్రతాంచ
సుగంధ చీనాంబరవాగ్విలాసం॥ 29

తా. వక్రత్వమునొందిన గురుదశలో మహత్వమును, పుత్రప్రాప్తియు, అర్థలాభమును, సుఖమును, యుద్ధమునందు జయమును, రాజస్నేహమును, సుగంధ చందనాదిలేపన సుఖమును, చీనాంబరప్రాప్తియు, వాగ్విలాసమును కలుగును.

శ్లో॥ దిగ్వీర్యయుక్తస్య గురోర్విపాకే
కృపాకటాక్షేణ మహీపతీనాం।



సమస్తభాగ్యం సముపైతి నిత్యం
దేశాంతరేభ్రామతికించి దేవం॥ 30

తా. దిగ్వీర్యబలముగల గురుదశలో రాజకృపాకటాక్షమును, సమస్తభాగ్యమును, నిత్యం దేశాంతర గమనమును కలుగును.

శ్లో॥ క్రూరషష్ట్యంశయుక్తస్య గురోర్దాయేతి కష్టతాం।
రాజకోపావమానాదీన్ లభతే నాత్రసంశయః॥ 31

తా. క్రూరషష్ట్యంశ యుక్తుడైన గురుదశలో అధిక కష్టము సంభవించును. రాజకోపమును, అవమానమును కలుగును.

శ్లో॥ సౌమ్యషష్ట్యంశయుక్తస్య గురోర్దాయేతి సౌఖ్యతాం।
వాహనబంధుసన్మానం యజ్ఞవైవాహికం శుభం॥ 32

తా. శుభషష్ట్యంశ యుక్తుడైన గురుదశలో అధిక సౌఖ్యమును, వాహనప్రాప్తియు, బంధుసన్మానమును, యజ్ఞవైవాహికంబును, శుభమును కలుగును.

శ్లో॥ పారావతాంశ యుక్తస్య గురోఃపాకే మహత్సుఖం।
మృద్వన్నపాన వస్త్రంచ హేమవిద్రుమ భూషణం॥ 33

తా. పారావతాంశ యందున్న గురుదశలో అధికసుఖమును, మృద్వన్నపాన సుఖమును, వస్త్రలాభమును, హేమలాభమును, భూషణప్రాప్తియు కలుగును.

శ్లో॥ పాపద్రేక్కాణయుక్తస్య గురోర్దాయేతి కష్టతాం।
కారాగృహప్రవేశంచ భ్రమణం భార్యానిగ్రహం॥ 34

తా. పాపగ్రహ ద్రేక్కాణ మందున్న గురుదశలో అధిక కష్టమును, కారాగృహ ప్రవేశమును, బుద్ధిభ్రమణమును, భార్యానిగ్రహమును కలుగును.

---

మేషాదిరాశిస్థిత గురుదశాఫలం.

శ్లో॥ మేషస్థితస్యాపి గురోర్దశాయాం
క్షేత్రాంబరప్రాప్తి ముదాహరంతి।
మనోవిలాసం మహదాధిపత్యం
సమానసన్మాన ముపైతి సిద్ధిం॥ 35

తా. మేషరాశియందున్న గురుదశలో క్షేత్రలాభమును, వస్త్రప్రాప్తియు, మనోవిలాసమును, మేలైన ఆధిపత్యమును, సమానసన్మానమును కలుగును.

శ్లో॥ వృషభగతజీవదాయే కరోతిరాజ్యం భూపసన్మానం।
ధనధాన్య గోసమృద్ధిం వరమణిలాభం సమానమిత్రత్వం॥

తా. వృషభరాశియందున్న గురుదశలో రాజ్యప్రాప్తియు, రాజసన్మానమును, ధనధాన్యాభి వృద్ధియు, గోసమృద్ధియు, శ్రేష్ఠమైన మణిలాభమును, సమాన జనస్నేహమును కలుగును.

శ్లో॥ యుగ్మస్థితస్యాపి గురోర్దశాయాం
స్త్రీపుత్రనాశం కృషినాశనంచ।
అత్యంతకష్టం స్వజనానురోధం
నృపాలకోపం పదవిచ్యుతించ॥ 37

తా. మిథునరాశియందున్న గురుదశలో భార్యాపుత్రనాశనమును, కృషినాశమును, అధికకష్టమును, స్వజనవిరోధమును, రాజకోపమును, స్థాననాశమును కలుగును.

శ్లో॥ కుళీరసంస్థస్య సురార్చితస్యదాయే
నృపాప్తిం వరవస్తులాభం।
క్షేత్రార్థగోధాన్య సమృద్ధిదంచ
భూమ్యాధిపత్యం స్వజనానుకూలం॥ 38



తా. కర్కాటక రాశియందున్న గురుదశలో రాజస్నేహమును, శ్రేష్ఠమైన వస్తులాభమును, క్షేత్రవృద్ధియు, అర్థప్రాప్తియు, గోధాన్యసమృద్ధియు, భూమ్యాధిపత్యమును, స్వజనానుకూలమును కలుగును.

శ్లో॥ సింహస్థస్య గురోర్దాయే భూప్రాప్తిం రాజ్యపూజ్యతాం।
యత్నకార్యార్థ సిద్ధించ దుర్గారణ్యవిచారణం॥ 39

తా. సింహరాశియందున్న గురుదశలో భూలాభమును, రాజపూజ్యతయు, యత్నకార్యార్థ సిద్ధియు, దుర్గారణ్యవిచారణాధికారమును కలుగును.

శ్లో॥ కన్యాయాం సురపూజితదాయే
క్షేత్రార్థం గోధననాశనంచ।
దారాత్మజ బంధువర్గవిరోధం
దేహాయా సంస్థాననాశం కురుతే॥ 40

తా. కన్యారాశియందున్న గురుదశలో క్షేత్రార్థనాశనమును, పశుహానియు, ధనక్షయమును, భార్యాపుత్ర బంధువర్గవిరోధమును, దేహాయాసమును, స్థాననాశమును కలుగును.

శ్లో॥ తులాన్వితస్యజీవస్య దశాస్థానాంతర ప్రదా।
అత్యంతకష్టఫలదా ద్విజాతి కలహప్రదా॥ 41

తా. తులారాశియందున్న గురుదశలో స్థానచలనమును, అత్యంత కష్టమును, బ్రాహ్మణులతోడ కలహమును కలుగును.

శ్లో॥ కీటస్థితస్యాపి గురోర్దశాయాం
మనోవిలాసం మహదాధిపత్యం।
సురార్చనం భూసురవర్గ పూజా
యజ్ఞాది సత్కర్మ ఫలప్రదంచ॥ 42

తా. వృశ్చికరాశియందున్న గురుదశలో మనోవిలాస

మును, మహదాధిపత్యమును, దేవతాపూజయు, బ్రాహ్మణ సత్కారమును, యజ్ఞాది సత్కర్మఫలమును కలుగును.

శ్లో॥ ధనుషిభవనసంస్థే దేవపూజ్యస్యదాయే
సతిసుత ధనవృద్ధిం కార్యార్థసిద్ధిం।
వరమణి వసనాప్తిం మిత్రభూపార్థనాప్తిం
విపులసుఖ సమృద్ధిం కీర్తిలాభం కరోతి॥ 43

తా. ధనూరాశియందున్న గురుదశలో భార్యాపుత్ర వృద్ధియు, ధనవృద్ధియు, కార్యార్థసిద్ధియు, శ్రేష్ఠమైన మణిలాభమును, వస్త్రప్రాప్తియు, మిత్ర ప్రభుమూలకముగా ధనలాభమును, అధికసౌఖ్యమును, కీర్తిలాభమును కలుగును.

శ్లో॥ మృగస్థస్య జీవస్యదాయేతి
కష్టంసుత స్త్రీవినాశం ధనక్షేత్రనాశం।
క్షితీశస్యకోపం మతిభ్రంశ మన్యత్రవాసం
విరోధం బహూశత్రువృద్ధిం॥ 44

తా. మకరరాశియందున్న గురుదశలో అధికకష్టమును, భార్యాపుత్ర వినాశమును, ధననాశమును, క్షేత్రనాశమును, రాజకోపమును, బుద్ధివికారమును, పరస్థళవాసమును, విరోధమును, శత్రువృద్ధియు కలుగును.

శ్లో॥ కుంభస్థితస్యాపి సురార్చితస్య దశావిపాకే పశుపీడితంచ।
స్వవర్గపీడాం రిపువర్గవృద్ధిం సమానకష్టంచ ధనక్షయంచ॥

తా. కుంభరాశియందున్న గురుదశాకాలమందు పశుపీడయు, స్వజనపీడయు, శత్రువృద్ధియు, సమాన జనకష్టమును, ధనక్షయమును కలుగును.

శ్లో॥ మీనస్థస్య సురార్చితస్యచ దశావిఖ్యాత కీర్తిప్రదా
తీర్థజ్ఞాన సుయజ్ఞదీక్షితఫలా క్షేత్రార్థ సౌఖ్యప్రదా॥



పుత్రోత్పత్తి సమృద్ధిదావిజయదా విద్యావివాదప్రదా
నగరగ్రామ పురత్వముఖ్య ఫలదాగోధాన్య సిద్ధిప్రదా।

తా. మీనరాశియందున్న గురుదశలో విశేషకీర్తియు, తీర్థస్నానఫలమును, జ్ఞానవృద్ధియు, శ్రేష్ఠమైన యజ్ఞదీక్షాఫలమును, క్షేత్రార్థలాభమును, సౌఖ్యమును, పుత్రోత్పత్తియు, జయమును, విద్యావివాద జయమును, నగరాధిపత్యమును, గ్రామాధిపత్యమును, పురాధిపత్యమును, గోధాన్యవృద్ధియు కలుగును.

---

### తన్వాదిభావస్థిత గురుదశాఫలం.

శ్లో॥ తనుగతజీవదశాయాం కరోతి సౌఖ్యంచ భూపసన్మానం।
స్త్రీసుత బాంధవసౌఖ్యం బహుహేమ వస్త్రలాభాదీన్॥ 47

తా. లగ్నమందున్న గురుదశలో సౌఖ్యమును, రాజసన్మానమును, భార్యాపుత్ర సౌఖ్యమును, బంధుసౌఖ్యమును, అధికబంగారు సంప్రాప్తియు, వస్త్రలాభమును కలుగును.

శ్లో॥ ధనస్థితస్యాపి గురోర్దశాయాం
కుటుంబసంరక్షణ వాగ్విలాసం।
సత్యవ్రతాచార సురార్చనంచ
సౌఖ్యం ధనప్రాప్తి ముదాహరంతి॥ 48

తా. ధనస్థానమందున్న గురుదశలో కుటుంబసంరక్షణయు, వాగ్విలాసమును, సత్యవ్రతమును, దేవపూజయు, సౌఖ్యమును, ధనప్రాప్తియు కలుగును.

శ్లో॥ తృతీయస్థస్య జీవస్యదశాయాం భ్రాతృవృద్ధిదం।
యుద్ధేజయమవాప్నోతి యత్నకార్య సుసిద్ధిదం॥ 49

తా. లగ్నమునకు తృతీయమందున్న గురుదశలో భ్రాతృవృద్ధియు, యుద్ధమునందు జయమును, యత్నకార్య సిద్ధి

యు కలుగును.

శ్లో॥ వాహనస్థస్య గురోర్దాయకాలే
వేశ్మవృద్ధి బహుక్షేత్ర వృద్ధిదం।
ధాన్యవృద్ధి వరభూషణలాభం
గోగజాశ్వ బహువాహనలాభం॥ 50

తా. లగ్నమునకు నాల్గవరాశి యందున్న గురుదశలో వృద్ధియు, బహుక్షేత్రవృద్ధియు, ధాన్యసమృద్ధియు, శ్రేష్ఠమైన భూషణప్రాప్తియు, పశులాభమును, గజాశ్వాది బహువాహన లాభమును కలుగును.

శ్లో॥ తనయగత జీవదాయే సుతసుఖ
ధనవృద్ధిం శోభనప్రాప్తిమేతి।
ధరణీసురపూజ్య మన్నదాన ప్రభుత్వం
వరమణి వసనాప్తిం చింతితార్థస్య సిద్ధిం॥ 51

తా. పంచమరాశి యందున్న గురుదశలో పుత్రవృద్ధియు, సుఖప్రాప్తియు, ధనలాభమును, విశేష శుభమును, బ్రాహ్మణపూజయు, అన్నదాన పరత్వమును, శ్రేష్ఠమైన మణి వస్త్రలాభమును, చింతించిన కార్యసిద్ధియు కలుగును.

శ్లో॥ రిపుస్థితస్యాపి సురార్చితస్యదాయే
పదభ్రంశ మనోవిచారం।
రాజ్ఞాంప్రకోపం ధనధాన్యనాశం
స్త్రీపుత్రనాశం నిధనం కరోతి॥ 52

తా. లగ్నమునకు ఆరవయింటి యందున్న గురుదశా కాలమందు స్థానభ్రంశమును, మనోవిచారమును, రాజకోపమును, ధనధాన్యనాశమును, భార్యాపుత్ర నాశనమును, మరణమును కలుగును.



శ్లో॥ కళత్రస్థ జీవస్య దాయే శుభత్వం
స్త్రీపుత్రసౌఖ్యం మణివస్త్రలాభం।
సత్కర్మవృద్ధి స్సుతీర్థాదిసేవాం
ధర్మస్యబుద్ధిం సుతనోతినిత్యం॥

తా. లగ్నమునకు సప్తమ రాశియందున్న గురుదశలో శుభత్వమును, భార్యాపుత్ర సౌఖ్యమును, మణివస్త్ర లాభమును, సత్కర్మవృద్ధియు, పుణ్యతీర్థయాత్రాది ఫలమును, ధర్మకార్య ప్రవర్తనయందు బుద్ధియు కలుగును.

శ్లో॥ మృత్యుస్థితస్య జీవస్యదాయే పుత్రవినాశనం।
సమానజననాశశ్చ ధాన్యార్థ పశునాశనం॥ 54

తా. అష్టమస్థానమందున్న గురుదశలో పుత్రనాశనమును, సమాన జననాశనమును, ధాన్యక్షయమును, అర్థ నాశనమును, పశుహానియు కలుగును.

శ్లో॥ ధర్మస్థితస్యాపి సురార్చితస్య
దాయేతిసౌఖ్యం బహుధర్మబుద్ధిం।
శివార్చనం మంత్ర రహస్యవేద్యం
పుత్రాదివృద్ధిం బహుహేమవృద్ధిం॥ 55

తా. లగ్నమునకు తొమ్మిదవ రాశియందున్న గురుదశలో అధిక సౌఖ్యమును, బహుధర్మబుద్ధియు, శివారాధనయు, మంత్రరహస్య జ్ఞానమును, పుత్రాభివృద్ధియు, విశేషముగా బంగారు సంగ్రహమును కలుగును.

శ్లో॥ కర్మస్థితస్యాపి గురోర్దశాయాం
సత్కీర్తిలాభం సుతదారవృద్ధిం।
సత్కర్మయజ్ఞాది ఫలప్రదంచ
క్షేత్రాంబరప్రాప్తి ముదాహరంతి॥ 56

తా. లగ్నమునకు దశమమందున్న గురుదశలో మంచి కీర్తిలాభమును, భార్యాపుత్రవృద్ధియు, సత్కర్మయజ్ఞాదిఫలసిద్ధియు, క్షేత్రప్రాప్తియు, వస్త్రలాభమును కలుగును.

శ్లో॥ లాభరాశి గత సుర పూజితదాయే
హేమవృద్ధి వరభూషణలాభం।
క్షేత్రదార సుతబంధు సమృద్ధిం
భూపతుల్య విభవం సుఖదంచ॥ 57

తా. ఏకాదశ స్థానమందున్న గురుదశలో హేమవృద్ధియు, శ్రేష్ఠమైన భూషణ లాభమును, క్షేత్రాభివృద్ధియు భార్యాపుత్ర సుఖమును, బంధుసమృద్ధియు, రాజసమానమగు విభవమును, సుఖమును కలుగును.

శ్లో॥ ద్వాదశస్థస్య జీవస్య దశాయాం సుతనాశనం।
మతిభ్రంశం మానభంగం సమానజననాశనం॥ 58

తా. లగ్నమునకు వ్యయ భావమందున్న గురుదశలో పుత్రనాశనమును, బుద్ధివికారమును, మానభంగమును, సమానజననాశనమును, కలుగును.

ఆరోహ గురుదశాఫలం.

శ్లో॥ ఆరోహస్థస్యజీవస్య దశారాజ్యఫలప్రదా।
కీర్తిలాభం మహత్సౌఖ్యం హేమవస్త్రాదిసంగ్రహం॥ 59

తా. ఆరోహణయందున్న గురుదశలో రాజ్యఫలము కలుగును. గాకను, కీర్తిలాభమును, అధిక సుఖమును, హేమలాభమును, వస్త్రప్రాప్తియు కలుగును.

అవరోహ గురుదశాఫలం.

శ్లో॥ అవరోహ గురోః పాకే భూపాల కలహంతథా।
అర్థవ్రయం మనస్తాపం స్థాననాశం తథైవచ॥ 60



తా. అవరోహణయందున్న గురుదశలో రాజ కలహమును, అర్థ వ్రయమును, మనస్తాపమును, స్థాననాశనమును కలుగును.

గురుదశాయాం గురుభుక్తిమాసాః 25. దినాని 18.

కృష్ణీయే॥

శ్లో॥ జీవస్యాంత ర్గతే జీవే లగ్నాత్కేంద్రత్రికోణగే।
తృతీయేలాభ గేవాపి ఉచ్చస్వక్షేత్ర సంయుతే।
తద్భుక్తౌపుణ్యతీర్థాది స్నానందైవత దర్శనం।
యజ్ఞకర్మసు సిద్ధిశ్చ సుతజన్మోత్సవ స్తథా।
విప్రప్రభువశాత్సౌఖ్య మన్నదానపరోభ వేత్।
విద్యావినోదపాండిత్యం బాంధవానాం సమాగమః।
క్షేత్రధాన్యాభివృద్ధిశ్చ పశువాహన సంకులం।
స్వవారే రాజసన్మానం గృహేకళ్యాణమేవచ।
యత్నకార్యార్థ సిద్ధిశ్చ యుద్ధేజయ మవాప్నుయాత్।
గోపురాంశ గతేజీవే కర్మభాగ్యప సంయుతే।
బ్రాహ్మణప్రభుసన్మానం స్వప్రభోశ్చ ఫలాధికం।
చతుష్పాజ్జీవలాభస్స్యా ద్గురోరంత ర్దశాఫలం॥ 1

తా. గురుదశలో స్వభుక్తియందు గురువు లగ్నమునకు కేంద్రకోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను, ఉచ్చ స్వక్షేత్రములయందున్నను, ఆభుక్తియందు పుణ్యతీర్థాది స్నానఫలమును, దేవతా దర్శనమును, యజ్ఞకర్మ సంసిద్ధియు, పుత్ర జననమును, బ్రాహ్మణ ప్రభు మూలకముగా సౌఖ్యమును, అన్నదాన పరవ్రతమును, విద్యావినోద పాండిత్యమును, బంధుజన సమాగమంబును, క్షేత్రవృద్ధియు, ధాన్య

లాభమును, పశువృద్ధియు, వాహన ప్రాప్తియు, తన వారము నందు రాజ సన్మానమును, యింటియందు కళ్యాణాది శుభ ములును, యత్నకార్యార్థ సిద్ధియు, యుద్ధమునందు జయమును కలుగును. ఆగురువు గోపురాంశను పొందియున్నను, లేక నవమ, దశమాధిపతులతో కలసియున్నను, బ్రాహ్మణప్రభుసన్మా నమును, తన ప్రభువు మూలకముగా నధిక ఫలమును, చతుష్పా జ్జీవలాభమును కలుగును.

పారాశర్యే॥

శ్లో॥ నీచాంశే నీచరాశిస్థే షష్ఠాష్ట వ్యయరాశిగే।
పాపయుక్తేథవాదృష్టే నిధనాధిప సంయుతే।
భుక్త్యాదౌ రాజకలహః ధనధాన్య పరిభ్రమః।
శత్రుభీతి ర్మహత్పీడా దాయాది జనవిద్వరం।
కలహేన విచారస్సాన్య త్స్వభూపాత్ మరణంభవేత్।
పుత్రదారా వియోగశ్చ దేహపీడా తథైవచ॥ 2

తా. నీచాంశయం దున్నను, నీచరాశియం దున్నను, ౬-౮-౧౨. రాసులయం దున్నను, పాపగ్రహ దృష్టిగాని వీక్షణగాని కలిగియున్నను, లేక అష్టమాధిపతితో కూడి యున్నను, భుక్తి ఆదియందు రాజ కలహమును, ధనధాన్య నాశమును, శత్రుభయమును, గొప్పపీడయు, దాయాది జన విద్వరమును, కలహ మూలకముగా మనోవ్యాకులమును, రా జువల్ల మరణమును, కలుగును. గాకను, భార్యాపుత్ర నాశన మును, దేహపీడయు కలుగును.

శ్లో॥ రవిణా సంయుతేదృష్టే రాజవిద్వర మేవచ।
కలహాయాస దుఃఖంచ స్థాననాశం తథైవచ॥ 3

తా. సూర్యునితో కలసినను, లేక చూడబడినను, రాజ



ద్వేషమును, కలహమును, ఆయాసమును, మనోవ్యసనమును, స్థాననాశమును కలుగును.

శ్లో॥ చంద్రేణ సంయుతేదృష్టే గజాశ్వాంబర లబ్ధవాన్।
మాతృవంశవి వృద్ధిశ్చ ఇష్టప్రభువశాత్సుఖం॥ 4

తా. చంద్రునితో కలసినను, లేక చూడబడినను ఏను గులు, గుఱ్ఱములు, వస్త్రములు, మొదలగు వాని లాభమును, మాతృవంశపు వారికి అభివృద్ధియు, ఇష్టప్రభు మూలకముగా సుఖమును కలుగును.

శ్లో॥ కుజేన సంయుతేదృష్టే శత్రువృద్ధి ర్ధనక్షయః।
యుద్ధేష్వప జయశ్చైవ జ్ఞాతీనాం కలహ స్తథా॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, శత్రు వృద్ధియు, ధనక్షయమును, యుద్ధమునందు అపజయమును, జ్ఞాతులతోడ కలహమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే విద్యాభ్యాసాది సంగ్రహః।
బంధూనాముపకారశ్చ యత్నకార్యార్థసిద్ధిదః॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, విద్యా భ్యాసాది సంగ్రహమును, బంధు జనోపకారమును, యత్న కార్య సిద్ధియు కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతేదృష్టే దారపుత్రాది సౌఖ్యదం।
మణివస్త్రాది లాభశ్చ గృహేకళ్యాణ శోభనం॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, భార్యా పుత్రాది సౌఖ్యమును, మణివస్త్రాది లాభమును, యింటియందు కళ్యాణాది శుభములును కలుగును.

శ్లో॥ శనినా సంయుతేదృష్టే నానామూలాద్ధనవ్యయః।
స్వభృత్యకలహశ్చైవ గురుపుత్రాది నాశనం॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను నానా మూలకముగా ధనవ్రయమును, తన సేవకులతోడ కలహమును, గురుపుత్రాది నాశనమును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా అపమృత్యు భయం తథా।
తద్దోష పరిహారార్థం శ్రీరుద్ర జపమాచరేత్।
సువర్ణ ప్రతిమాదానం కుర్యాచ్ఛాంతి మవాప్నుయాత్॥

తా. ద్వితీయ సప్తమ రాసులయం దున్నయెడల అపమృత్యు భయము కలుగును. ఆ దోషపరిహారార్థమై శ్రీరుద్ర జపము చేయవలయును. గాకను, బంగారు ప్రతిమదానము చేసిన పిమ్మట శాంతి కలుగును.

---

గురుదశాయాం శనిభుక్తిమాసాః 31. దినాని 12.

కృష్ణీయే॥

శ్లో॥ జీవస్యాంత ర్గతేమందే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయ లాభగేవాపి ఉచ్చరాశి స్థితేపివా।
తద్భుక్తౌ కార్యసిద్ధిశ్చ మహారాజాశ్రయ స్తథా।
కృషిపశ్వాది వృద్ధిశ్చ క్షేత్ర ధాన్యాది సంగ్రహః।
నీలవస్త్రాని లాభశ్చ శూద్రప్రభు వశాత్సుఖం।
పుత్రబంధువి వృద్ధిశ్చ వాహనాది సులబ్ధకృత్।
భుక్త్యంతే స్థానచలనం స్వదేశ కలహ స్తథా।
ఏవంఫలం పంచమాసా త్పరసౌఖ్యం కరంశుభం।
స్త్రీసౌఖ్యం విజయాశ్చైవ యత్నకార్యాణి సిద్ధిదః॥ 1

తా. గురుదశలో శనిభుక్తియందు శని లగ్నమునకు కేంద్ర కోణములయందున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక తన ఉచ్చరాశియం దున్నను, ఆభుక్తియందు కార్యసిద్ధియు, మహారాజాశ్రయమును, కృషిలాభమును, పశ్వాది



జీవరాసుల వృద్ధియు, క్షేత్రలాభమును, ధాన్యాది సంగ్రహమును, నీలవస్త్రవుల యొక్క లాభమును, శూద్రప్రభువు మూలకముగా సుఖమును, పుత్రప్రాప్తియు, బంధువృద్ధియు, వాహనాది లాభమును, భుక్తి అంత్యభాగమందు స్థాన చలనము స్వదేశపు వారితోడ కలహమును కలుగును. ఈఫలమంతయు ఐదు నెలలు పిమ్మట జరుగును దేహసౌఖ్యమును, శుభమును, స్త్రీ సౌఖ్యమును, విజయమును, యత్న కార్యసిద్ధియు కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టమేవాపి వ్యయేవా నీచరాశిగే।
స్వస్త్రీవియోగం కలహం సుత బంధు వినాశనం।
ధాన్యాది పశునాశశ్చ సర్వత్ర కలహ స్తథా।
స్వప్రభో స్త్వపమృత్యుశ్చ శూద్రస్త్రీ కలహ స్తథా।
దుష్కీర్తిం మానభంగంచ నీచసేవా భవిష్యతి।
వాహనాది వినాశశ్చ అర్థనాశ స్తథైవచ॥ 2

తా. లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయందు శనియున్నను, లేక తన నీచరాశిని పొందియున్నను, భార్యావియోగమును, కలహమును, పుత్రనాశమును, బంధుహానియు, ధాన్యాది నాశనమును, పశుహానియు, సర్వులతోడ కలహమును, తన స్వంత ప్రభువువల్ల అపమృత్యు భయమును, శూద్రస్త్రీతోడ కలహమును, అపకీర్తియు మానభంగమును, నీచ జన సేవయు, వాహనాది వినాశమును, అర్థ నాశనమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే శిరోరోగ స్తథైవచ।
అధికార వినాశశ్చ స్వనృపా ద్ధననాశనం॥ 3

తా. సూర్యునితో కలసినను, లేక చూడబడినను, శిరో

రోగమును, అధికార భంగమును, తన రాజుమూలకముగా ధననాశమును కలుగును.

శ్లో॥ శశినా సంయుతేదృష్టే వాతరోగాది పీడనం।
మాతృవంశ వినాశశ్చ పుత్రనాశ స్తథైవచ॥ 4

తా. చంద్రునితో కూడినను లేక చూడబడినను, వాత రోగాది పీడయు, మాతృవంశపు వారికి నాశనమును, పుత్ర నాశనమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టేయాత్రాయాంయుద్ధమాప్నుయాత్।
స్వజనేషు విరోధశ్చ మిత్రేషు కలహా స్తథా॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, యాత్ర యందు యుద్ధమును, స్వజనులతోడ విరోధమును, మిత్రుల తోడ కలహమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే ఇష్టమిత్ర సమాగమః।
ఆలేఖ్య గృహవాసశ్చ గాయకాది సమాగమః॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, ఇష్ట మిత్రులతోడ కలియుటయు, లెక్కలేని గృహములయందు నివసించుటయు,గాయకాది జనుల సమాగమంబును కలుగును.

శ్లో॥ గురుణా సంయుతేదృష్టే పుత్రశోకో భవిష్యతి।
దేహాయాసో స్థాననాశః మతిభ్రంశ స్తథైవచ॥ 7

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, పుత్ర శోకమును, దేహాయాసమును, స్థాననాశమును, బుద్ధిభ్రంశ మును కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతేదృష్టే స్త్రీసౌఖ్యం యాగలాభకృత్।
మహారాజాశ్రయప్రాప్తిః ఇష్టసిద్ధి ర్భవిష్యతి॥ 8

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, స్త్రీ



సౌఖ్యమును, యాగలాభమును, మహారాజాశ్రయమును, ఇష్ట సిద్ధియు కలుగును

శ్లో॥ దాయేశా త్కేంద్రకోణేవా దుశ్చిక్యేలాభగేపివా।
శుభగ్రహయుతేవాపి ధనలాభ ముదీరయేత్।
స్వస్త్రీసౌఖ్యం సుతప్రాప్తిః హేమవస్త్రాదిలాభకృత్।
శూద్రప్రభువశాత్సౌఖ్యం యుద్ధేశత్రువినాశనం॥ 9

తా. దశానాథునకు కేంద్ర కోణములయం దున్నను తృతీయలాభముల యందున్నను లేక శుభగ్రహముతో కూడి యున్నను ధనలాభము కలుగును. భార్యాసౌఖ్యమును, పుత్ర ప్రాప్తియు, హేమవస్త్రాదిలాభమును, శూద్రప్రభుమూలకము గా సౌఖ్యమును, యుద్ధమునందు శత్రునాశనమును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
నీచారికలహాశ్చైవ బంధుపీడా తథైవచ।
స్త్రీపుత్రకలహాశ్చైవ నృపమూలా ద్భయంతథా।
యత్నకార్యవినాశశ్చ నానామూలా ద్ధనవ్యయః॥ 10

తా. దశానాథునకు ౬-౮-౧౨. స్థానముల యందు న్నను లేక పాపులతో కలసియున్నను ఆభుక్తియందు నీచజను లతోడను, శత్రువులతోడను కలహమును, బంధుజనపీడయు, భార్యాపుత్రులతోడ విరోధమును,రాజభయమును, యత్నకా ర్యభంగమును, నానామూలకముగా ధనవ్యయమునుకలుగును.

శ్లో॥ ద్వితీయ ద్యూనరాశిస్థే అపమృత్యు ర్భవిష్యతి।
తద్దోష పరిహారార్థం దానంకృష్ణ మృగంతథా।
మృత్యుసూక్తం పఠేద్యస్తు అపమృత్యు నివారణం॥ 11

తా. భుక్తినాథుడగు శని ద్వితీయ సప్తమరాసులయం దున్న యెడల, అపమృత్యువు కలుగును. ఆదోషపరిహారార్థమై

నల్లని మేకను దానముచేసి మృత్యుసూక్త జపముచేసిన యెడల అపమృత్యు నివారణయగును.

---

గురుదశాయాం బుధభుక్తిమాసాః 27 దినాని 6.

కృష్ణీయే॥

శ్లో॥ జీవస్యాంతర్గతే సౌమ్యే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయేలాభగేవాపి స్వోచ్చస్వక్షేత్రమిత్రగే।
విద్యావిలాసః పాండిత్యం బాంధవప్రియమేవచ।
స్వనామాంకిత ఉద్యోగః మిత్రప్రభు వశాత్సుఖం।
మహారాజాశ్రయ ప్రాప్తిః ఇష్టసిద్ధి శుభాధికం।
వ్యవసాయే ఫలప్రాప్తిః వ్యవహారే జయ స్తథా।
వాహనాభరణప్రాప్తిః పుత్రప్రాప్తి ర్భవిష్యతి।
కళ్యాణాది శుభప్రాప్తిః గృహలాభో విచిత్రకః।
సేతుస్నాన ఫలప్రాప్తిః యజ్ఞదీక్షాది చింతనం॥ 1

తా. గురుదశలో బుధభుక్తియందు బుధుడు లగ్నమునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక తనఉచ్చ, స్వక్షేత్రమిత్ర క్షేత్రములయందున్నను, విద్యావిలాసమును, పాండిత్యమును, బంధుప్రియమును, స్వతంత్ర ముద్రాధికారమును, మిత్రప్రభు మూలకముగా సుఖమును, మహారాజా శ్రయమును, ఇష్టసిద్ధియు, అధికశుభమును, వ్యవసాయ మూలకముగా లాభమును, వ్యవహారమునందు జయమును, వాహనాభరణ ప్రాప్తియు పుత్రప్రాప్తియు కలుగును. గాకను కళ్యాణాది శుభప్రాప్తియు, విచిత్రగృహలాభమును, సేతుస్నాన ఫలమును, యజ్ఞదీక్షాది చింతనయు, కలుగును.

శ్లో॥ లగ్నష్షష్టమే సౌమ్యే వ్యయేవా నీచరాశిగే।



శత్రుగ్రహాయుతే దృష్టే శత్రువృద్ధిర్భవిష్యతి।
సమానప్రభు కోపశ్చ చతుష్పాజ్జీవనాశనం।
అపకీర్తిభయంచైవ స్వకులాచార నాశనం।
జాతిభ్రంశాదిసం సర్గం గురుద్వేష కృత భయం।
స్త్రీపుత్ర జ్ఞాతినాశశ్చ సమాన జననాశనం।
క్షేత్రార్థ పశుపీడాచ ధాన్యనాశం తథైవచ॥ 2

తా. బుధుడు లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయం దున్నను లేక శత్రుగ్రహములతో కూడినను చూడబడినను, శత్రువృద్ధియు, సమాన ప్రభుకోపమును, చతుష్పాజ్జీవనాశనమును, అపకీర్తిభయమును, స్వకులాచార నాశనమును, జాతిభ్రంశాది సంసర్గమును, గురుద్వేషమువల్ల కలిగెడు భయమును, స్త్రీనాశమును, పుత్రహానియు, జ్ఞాతివినాశమును, సమాన జననాశమును, క్షేత్రార్థహానియు, పశుపీడయు, ధాన్యనాశమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే బంధుసన్మానమేవచ।
దేశాంతరాది గమనం శిరోరోగం మహద్భయం॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను బంధుసన్మానమును, దేశాంతరాది గమనమును, శిరోరోగమును, విశేష భయమును కలుగును.

శ్లో॥ చంద్రేణసంయుతే దృష్టే మనోల్లాసం మహత్సుఖం।
వస్త్రాభరణ సంప్రాప్తి ర్యత్నకార్యార్థసిద్ధిదః॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను మనోల్లాసమును, అధికసుఖమును, వస్త్రాభరణసంప్రాప్తియు, యత్నకార్యార్థసిద్ధియు కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే శస్త్రబాధాభవిష్యతి।

యుద్ధేష్వపజయశ్చైవ కుత్సితాన్నాది భోజనం॥ 5

తా. కుజునితో కలసినను లేకచూడబడినను, శస్త్రభా భయు, యుద్ధమునందు అపజయమును, కుత్సితాన్నాది భోజనమును కలుగును.

శ్లో॥ గురుణా సంయుతే దృష్టే వేదశాస్త్రాది చింతనం।
యజ్ఞదీక్షా ప్రసంగశ్చ శివకేశవ చింతనం॥ 6

తా. గురునితో కలసినను చూడబడినను, వేదశాస్త్రాది చింతనయు, యజ్ఞ దీక్షాప్రసంగమును, శివకేశవ చింతనయు కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే కావ్యాలంకార సంగ్రహః।
వాహనాదివి వృద్ధిశ్చ వారస్త్రీసంగమస్తథా॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, కావ్యాలంకార సంగ్రహంబును, వాహనాద్యభి వృద్ధియు, వేశ్యాస్త్రీ సంగమంబును కలుగును.

శ్లో॥ శనినా సంయుతే దృష్టే పశుదాస వినాశనం।
క్షేత్రధాన్య వినాశశ్చ యత్నకార్య వినాశనం॥ 8

తా. శనితోకలసినను లేక చూడబడినను పశునాశనమును, భృత్యనాశనమును, క్షేత్రహానియు, ధాన్యనాశనమును, యత్నకార్యభంగమును కలుగును.

శ్లో॥ దాయేశా త్కేంద్రకోణేవా తృతీయే లాభగేపివా।
శుభగ్రహయుతేవాపి విత్తలాభ ముదీరయేత్।
సర్వకార్యను సిద్ధిస్స్యా ద్బాంధవానాం ప్రియంతథా।
దారపుత్రాది సౌఖ్యంచ కృషివృద్ధి ర్భవిష్యతి॥ 9

తా. బుధుడు దశానాథునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయలాభములయం దున్నను లేక శుభగ్రహము



తో కూడియున్నను, ఆ భుక్తియందు ధనలాభమును, సర్వకార్యసిద్ధియు, బంధుజనహితంబును, భార్యాపుత్రాది సౌఖ్యమును, కృషిలాభమును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠ రంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
తద్భుక్తౌ కలహవ్యాధి పీడా దారిద్ర్య దుఃఖదః।
బంధునాశం మనస్తాపం పశునాశంతథైవచ।
విద్యావాదేషు కలహం సమాన జననాశనం॥ 10

తా. దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను లేక పాపగ్రహముతో కలసియున్నను ఆ భుక్తియందుకలహమును, వ్యాధిపీడయు, దారిద్ర్యదుఃఖమును, బంధునాశమును, మనస్తాపమును, పశునాశమును, విద్యావాదమువల్ల కలహమును, సమాన జననాశనమును కలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యు ర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం మకరం దాన ముచ్యతే॥ 11

తా. ద్వితీయ సప్తమ రాసులయం దున్న యెడల అపమృత్యువు సంభవించును. ఆదోషపరిహారార్థమై మకరవాహనముతో గూడిన సువర్ణ వరుణ ప్రతిమ దానము చేయవలెను.

---

గురుదశాయాం కేతుభుక్తిమాసాః 11. దినాని 6.

పారాశర్యే ॥

శ్లో॥ గురోరంతర్గతే కేతౌ లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయే లాభగేవాపి ఉచ్చరాశిస్థితేపివా।
కీర్తిప్రతాప మారోగ్యం మహారాజా శ్రయస్తథా।
మణిమంత్రాది సిద్ధిశ్చ పుత్రికా జనసంతథా।
శుభశోభనవృద్ధిశ్చ స్త్రీసౌఖ్యం ధనలాభకృత్।
యజ్ఞకర్మను సిద్ధిశ్చ దేవతా స్థాపనాదికం।

పుణ్యతీర్థాది గమనం సత్కథా శ్రవణంతథా।
సుతదారాది వృద్ధిశ్చ దూరాద్వాహన పత్రికా।
వివాహ శుభకార్యాణి యత్నకార్యాణి సిద్ధిదః॥ 1

తా. గురుదశలో కేతుభుక్తియందు కేతువు లగ్నమునకు కేంద్ర త్రికోణములయం దున్నను, తృతీయలాభములయందున్నను, లేక తనఉచ్చరాశియం దున్నను, కీర్తిప్రతాపమును, ఆరోగ్యమును, మహారాజాశ్రయమును, మణిమంత్రాదిసిద్ధియు, పుత్రికాజననమును, శుభశోభనవృద్ధియు, స్త్రీసౌఖ్యమును, ధనలాభమును, యజ్ఞకర్మసంసిద్ధియు, దేవతాస్థాపనయు, పుణ్యతీర్థాది స్నానఫలమును, సత్కథాశ్రవణమును, భార్యాపుత్రాభివృద్ధియు, దూరదేశమునుండి పత్రికాగమనమును, వివాహ శుభకార్య సంప్రాప్తియు, యత్నకార్య సిద్ధియు కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టమేవాపి వ్యయేవా నీచరాశిగే।
తద్భుక్తౌ స్థానచలనం మానభంగం మహద్భయం।
ఉద్యోగ చలనంవిద్యా ద్వ్యవహారే మహద్భయం।
దారపుత్ర వినాశశ్చ కృషేరల్ప ఫలంతథా।
యత్నకార్య వినాశశ్చ గోనాశం ధననాశనం॥ 2

తా. లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయందైనను లేక తన నీచరాశియందైనను కేతువున్నయెడల ఆభుక్తియందు స్థానచలనమును, మానభంగమును, విశేషభయమును, ఉద్యోగచలనమును, విద్యావివాద భయమును, భార్యాపుత్ర వినాశనమును, కృషివల్ల అల్పఫలమును, యత్నకార్య భంగమును, పశుహానియు, ధననాశమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే నానామూలా ధనవ్రయం।



శిరోరోగంచ కురుతే పితృవర్గ వినాశనం॥ 3

తా. సూర్యునితో కూడినను లేక చూడబడినను నానామూలకముగా ధనవ్రయమును, శిరోరోగమును, పితృవర్గపువారికి నాశనమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతే దృష్టే మాతృకష్టం మతిభ్రమం।
స్వస్థాననాశనంచైవ అపమృత్యు భయంతథా॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, మాతృకష్టమును, బుద్ధిభ్రంశమును, స్వస్థాననాశనమును, అపమృత్యుభయమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే యుద్ధేశస్త్రా ద్భయంతథా।
కలహం మానహానిశ్చ దాయాది జనవిద్వేరం॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, యుద్ధమునందు శత్రుభయమును, కలహమును, మానభంగమును, దాయాది జననిష్ఠూరమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే బంధువృద్ధి ర్భవిష్యతి।
వ్యవహారే జయశ్చైవ క్రయవిక్రయ కౌశలం॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను బంధువృద్ధియు, వ్యవహారమునందు జయమును, క్రయవిక్రయ కుశలత్వమును కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే గురుపీడా భవిష్యతి।
మతిభ్రంశం దేహబాధా పుత్రపీడా భవిష్యతి॥ 7

తా. గురునితో కలసినను లేక చూడబడినను, గురుపీడయు, బుద్ధివికారమును, దేహబాధయు, పుత్రపీడయు కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతేదృష్టే స్త్రీమూలా త్కలహస్తథా।

వాహనాది వినాశశ్చగాయకాది సమాగమః॥ 8

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను స్త్రీ మూలకముగా కలహమును, వాహనాది వినాశమును, గాయకాది సమాగమంబును కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే అతిసారాదిరోగజం।
సమానజననాశశ్చ ఆప్తబంధు వినాశనం॥ 9

తా. శనితోకలసినను లేక చూడబడినను, అతిసారాది రోగభయమును, సమాన జననాశనమును, ఆప్తబంధు వినాశమును కలుగును.

శ్లో॥ దాయేశా త్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా।
శుభగ్రహాయుతేవాపి ఉచ్చరాశి సమన్వితే।
యత్నకార్యసు సిద్ధిస్స్యాత్ స్వప్రభోస్తు మహత్సుఖం।
పుత్రీపుత్రవివాహాశ్చ గృహేధనవి వృద్ధిదః॥ 10

తా. కేతువు దశానాథునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయలాభములయం దున్నను, శుభగ్రహముతో కూడియున్నను లేక తనఉచ్చరాశిని పొందియున్నను, ఆభుక్తి యందు యత్నకార్యసిద్ధియు, స్వంతప్రభువు మూలకముగా నధిక సుఖమును, పుత్రికా వివాహమును, పుత్రవివాహమును, యింటియందు ధనసమృద్ధియు కలుగును.

శ్లో॥ దాయేశా త్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
పుత్రమిత్ర వినాశశ్చ స్థాననాశం నృపాద్భయం।
విధవా కలహశ్చైవ నీచస్త్రీ సంగమం తథా।
శూద్రప్రభు విరోధశ్చ స్వప్రభో స్త్వప మృత్యుకృత్॥

తా. దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను లేక పాపులతో కలసియున్నను పుత్రమిత్రవినాశమును,



స్థాననాశమును, రాజభయమును, విధవా కలహమును, నీచ స్త్రీ సంగమంబును, శూద్రప్రభు విరోధమును, స్వంతప్రభువు వల్ల అపమృత్యు భయమును కలుగును.

శ్లో॥ ద్వితీయ ద్యూనరాశిస్థే అపమృత్యు ర్భవిష్యతి।
తద్దోష పరిహారార్థం శివలింగార్చనం తథా।
మేషదానం ప్రకుర్వీత శాంతిమాప్నో త్యసంశయః॥

తా. ద్వితీయ సప్తమ రాసులయం దున్నయెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై శివలింగార్చనము చేయవలయును. గాకను, మేషదానము చేసిన పిమ్మట నిస్సంశయముగా శాంతి కలుగును.

---

గురుదశాయాం శుక్రభుక్తిమాసాః 32.

**శృష్టియ్యే॥**

శ్లో॥ జీవస్యాంత ర్గతేశుక్రే లగ్నా త్కేంద్ర త్రికోణగే।
తృతీయే లాభగేవాపి ఉచ్చరాశి స్థితేపివా।
వివాహ శుభకార్యాణి ఛత్రచామర వైభవం।
అతీవ సుఖమాప్నోతి బంధుసంగమ లాలనం।
దారపుత్రాది సౌఖ్యంచ విద్యాలాభో భవిష్యతి।
పుత్రీపుత్ర వివాహాశ్చ శుభశోభన మేవచ।
పురాధిపత్య లభతే మహారాజా శ్రయస్తథా।
కృషిక్షేత్రాభివృద్ధిశ్చ పశువాహన వృద్ధిదః॥ 1

తా. గురుదశలో శుక్రభుక్తియందు శుక్రుడు లగ్నమునకు కేంద్రత్రికోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక తన ఉచ్చరాశియం దున్నను, వివాహ శుభకార్యములు, జరుగుటయు, ఛత్రచామర వైభవమును, విశేష సౌఖ్యమును, బంధుజన సంగమంబును, మరియు

లాలనయు, భార్యాపుత్రాది సౌఖ్యమును, విద్యాలాభమును, పుత్రుల యొక్కయు, పుత్రికల యొక్కయు, వివాహమును, శుభ శోభనమును, పురాధిపత్యమును, మహారాజాశ్రయమును కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టమేవాపి వ్యయేవా నీచరాశిగే।
తద్భుక్తౌ స్థానచలనం రాజకోపం భవిష్యతి।
క్షేత్రార్థ పశునాశశ్చ స్వస్త్రీ కలహమేవచ।
ఇష్టబంధు విరోధశ్చ ఆప్తబంధు వినాశనం।
చోరాది భీతిమాప్నోతి మనస్తాపం భవిష్యతి॥ 2

తా. శుక్రుడు లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయం దున్నను, లేక తన నీచరాశిని పొందియున్నను, ఆ భుక్తియందు స్థానచలనమును, రాజకోపమును, క్షేత్రనాశనమును, అర్థ క్షయమును, పశునాశనమును భార్యతోడ కలహమును, ఇష్ట బంధు విరోధమును, ఆప్తబంధు నాశనమును, చోరాది జన భయమును, మనస్తాపమును కలుగును.

శ్లో॥ రవిణా సంయుతేదృష్టే దుర్గారణ్య విచారణం।
సర్వకార్య వినాశశ్చ వాహనాశ్వాది నాశనం॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, దుర్గ ముల మీదను, అరణ్యముల మీదను, విచారణాధి కార మును, సర్వకార్య వినాశమును, అశ్వాది వాహన నాశనమును కలుగును.

శ్లో॥ శశినా సంయుతేదృష్టే వాహనాది వివృద్ధిదః।
మణిహేమాంబరప్రాప్తి స్సర్వకార్య సుసిద్ధిదః॥ 4

తా. చంద్రునితో కూడినను, లేక చూడబడినను, వాహనాది వృద్ధియు, మణి సంగ్రహమును, హేమ లాభ



మును, వస్త్రప్రాప్తియు, సర్వకార్య సిద్ధియు కలుగును.

శ్లో॥ కుజేన సంయుతేదృష్టే యుద్ధే శత్రుభయంతథా।
చోరాగ్ని విషభీతిశ్చ సమాన జననాశనం॥ 5

తా. కుజునితో కలసినను, లేక చూడబడినను, యుద్ధ మునందు శత్రుభయమును, చోరబాధయు, అగ్నిభయమును, విషభీతియు, సమాన జననాశనమును కలుగును.

శ్లో॥ బుధేశాస్త్ర ప్రసంగాది యజ్ఞదీక్షాది చింతనం।
విచిత్ర గృహలాభశ్చ బాంధవాది సమాగమం॥ 6

తా. బుధునితో కలసినను, లేక చూడబడినను, వేద శాస్త్ర ప్రసంగమును, యజ్ఞదీక్షాది చింతనయు విచిత్ర గృహ లాభమును, బంధుజన సమాగమంబును కలుగును.

శ్లో॥ గురుణా సంయుతేదృష్టే పురభూసుర చింతనం।
అన్నదాన పరోనిత్యం సభాయాం పూజ్యతాభవేత్॥

తా. గురునితో కలసినను, లేక చూడబడినను, దేవ బ్రాహ్మణ చింతనయు, అన్నదాన పరత్వమును, సభలయందు పూజ్యతయు కలుగును.

శ్లో॥ శనినా సంయుతేదృష్టే చింతాస్థాన వినాశనం।
సమాన జననాశశ్చ చతుష్పాజ్జీవనాశనం॥ ౬

తా. శనితో కలసినను, లేక చూడబడినను, చింతయు, స్థాననాశమును, సమాన జననాశమును, చతుష్పాజ్జీవనాశన మును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయే లాభగేపివా।
శుభగ్రహ యుతేవాపి ధనలాభ ముదీరయేత్।
కళ్యాణ శుభసౌఖ్యాది వాహనం ధనవృద్ధిదం।
అపూర్వ వసుసంప్రాప్తిః తీర్థయాత్రా తథైవచ।

పశుధాన్యాది వృద్ధిశ్చ క్షేత్రవృద్ధిశ్చ జాయతే।
అశ్వాది వాహనప్రాప్తిః మిత్రప్రభు వశాత్సుఖం॥ 9

తా. శుక్రుడు దశానాథునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక శుభగ్రహముతో కూడియున్నను, ధనలాభము కలుగును. గాకను, కళ్యాణాది శుభసంప్రాప్తియు, సౌఖ్యమును, వాహన లాభమును, ధనవృద్ధియు, అపూర్వ వస్తుసంప్రాప్తియు, తీర్థయాత్ర ఫలమును, పశువృద్ధియు, ధాన్య సమృద్ధియు, క్షేత్రవృద్ధియు, అశ్వాది వాహన ప్రాప్తియు, మిత్రప్రభు మూలకముగా సుఖమును, కలుగును.

శ్లో॥ దాయేశా త్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపయుతే।
క్షేత్రనాశం మానభంగం స్త్రీపుత్రాణాంతు పీడనం।
యత్నకార్య వినాశశ్చ రక్తస్రావాది పీడనం।
ప్రాణహానిం ప్రకురుతే చతుష్పాజ్జీవనాశనం॥ 10

తా. శుక్రుడు దశానాథునకు ౬-౮-౧౨. రాసులయం దున్నను, లేక పాపులతో కలసియున్నను, క్షేత్రనాశమును, మానభంగమును, భార్యాపుత్రులయొక్క పీడయు, యత్నకార్య భంగమును, రక్తస్రావాది పీడనయు, ప్రాణహానియు, చతుష్పాజ్జీవనాశనమును కలుగును.

శ్లో॥ ద్వితీయ ద్యూననాథేవా అపమృత్యు భయంతథా।
లక్ష్మీనారాయణందానం కుర్యాచ్ఛాంతి మవాప్నుయాత్॥

తా. ద్వితీయ సప్తమ రాసులయం దున్నయెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై లక్ష్మీనారాయణ దానము చేసినయెడల శాంతి కలుగును.



గురుదశాయాం రవిభుక్తిమాసాః 9. దినాని 18,
కృష్ణిర్ష్యో॥

శ్లో॥ జీవస్యాంత ర్గతేసూర్యే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
దుశ్చిక్యే లాభగేవాపి ఉచ్ఛరాశి గతేపివా।
భాగ్యాధిపేన సంయుక్తే భాగ్యలాభం భవేద్ధ్రువం।
ధనాధిపేన సంయుక్తే విశేష ధనలాభకృత్।
సుఖాధిపేన సంయుక్తే విశేష ధనలాభకృత్।
నగరగ్రామ నేతాచ మహారాజ ప్రసాదతః।
కీర్తిలాభం మహత్సౌఖ్యం ఉత్తమాశ్వాది సంగ్రహః।
అనేక ధనలాభశ్చ సుతదారాది సౌఖ్యదః।
స్వవారే రాజసన్మానం మూరాదాహ్వాన పత్రికా।
స్వప్రభోస్తు మహత్సౌఖ్యం మణిమంత్రాది సిద్ధికృత్।
మహావాక్యార్థ తత్వజ్ఞో దీక్షాకర్మాది సిద్ధిదం।
దుర్గారణ్యాది సంచారం తీర్థయాత్రాది సంగ్రహః।
మహాత్మానం దర్శనంచ చింతితార్థస్య సిద్ధిదః॥ 1

తా. గురుదశలో సూర్యభుక్తియందు సూర్యుడు లగ్నమునకు కేంద్రత్రికోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక తన ఉచ్ఛరాశిని పొందియున్నను, భాగ్యాధిపతి సంబంధము కలిగియున్నయెడల నిశ్చయముగా భాగ్యలాభమును, ధనాధిపతితో కలసియున్నయెడల ధన లాభమును, చతుర్థాధి పతితో కలసియున్నయెడల విశేష ధనలాభమును, మహారాజానుగ్రహమువల్ల నగరాధి పత్యమును, గ్రామాధి పత్యమును, కీర్తిలాభమును, మహత్సౌఖ్యమును, శ్రేష్ఠమైన అశ్వాది వాహన సంగ్రహంబును, అనేక ధనలాభమును, భార్యాపుత్రాది సౌఖ్యమును, తన వారము

నందు రాజ సన్మానమును, దూరదేశమునుండి ఆహ్వాన పత్రికా గమనమును, స్వంత ప్రభువువల్ల అధిక సౌఖ్యమును, మణి మంత్రాది సిద్ధియు, మహా వాక్యార్థ జ్ఞానసిద్ధియు, దీక్షాకర్మాది సిద్ధియు, దుర్గములయందును, అరణ్యములయందును సంచారమును, తీర్థయాత్ర ఫలమును, మహాత్ముల సందర్శనమును, చింతించిన కార్యసిద్ధియు కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టమే సూర్యే వ్యయేవా నీచరాశిగే।
పాపగ్రహా యుతేదృష్టే పుత్రీపుత్ర వినాశనం।
అత్యంత ధనహానిశ్చ గురునాశ స్తథైవచ।
స్వస్థాన చలనంచైవ బంధువిప్రియ మేవచ।
సర్వకార్య వినాశశ్చ యుద్ధే ప్వపజయ స్తథా।
వారుణ్యాంవా ఉదీచ్యాంవా మహాసజ్గరమాప్నుయాత్॥

తా. సూర్యుడు లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయందున్నను, తన నీచరాశియందున్నను, పాపగ్రహముతో కలసి యున్నను లేక చూడబడినను, ఆ భుక్తియందు పుత్రికల యొక్కయు, పుత్రులయొక్కయు, వినాశమును, విశేష ధన హానియు, గురునాశమును, స్వస్థాన చలనమును, బంధుద్వేషమును, సర్వకార్య భంగమును, యుద్ధమునందు అపజయమును, పశ్చిమదిశయందు గాని లేక ఉత్తరదిక్కున గాని మహా యుద్ధసంభవమును కలుగును.

శ్లో॥ శశినా సంయుతేదృష్టే అపూర్వ వస్తుసంగ్రహః।
మనోల్లాసం మహత్సౌఖ్యం మిత్రప్రభు వశాత్సుఖం॥ 3

తా. చంద్రునితో కలసినను, లేక చూడబడినను, అపూర్వ వస్తుసంగ్రహంబును, మనోల్లాసమును, అధిక సుఖమును మిత్ర ప్రభుమూలకముగా సుఖమును కలుగును.



శ్లో॥ కుజేన సంయుతేస్పృష్టే శస్త్రఘాతా ద్వ్యయంతథా।
సమాన జననాశశ్చ విషూచీ గుల్మపీడనం॥ 4

తా. కుజునితో కలసినను, లేక చూడబడినను, శస్త్రములచే కొట్టబడిన గాయముల బాధయు, సమాన జననాశనమును, విషూచీ గుల్మాది రోగపీడయు కలుగును.

శ్లో॥ బుధేన సంయుతేదృష్టే శాస్త్రాభ్యాసాది సంగ్రహః।
బంధుప్రియోస్వాధికార ప్రాప్తిర్భూపాత్సుఖంభవేత్॥

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, శాస్త్రాభ్యాసాది సంగ్రహమును, బంధుజన ప్రియమును స్వతంత్రాధికార ప్రాప్తియు, రాజులవల్ల సుఖమును కలుగును.

శ్లో॥ గురుణా సంయుతేదృష్టే శైవపూజాది చింతనం।
సత్కథా శ్రవణంచైవ స్వవారే రాజదర్శనం॥ 6

తా. గురువుతో కలసినను, లేక చూడబడినను, శివపూజాది చింతనయు, సత్కథా శ్రవణమును, తన వారమునందు రాజదర్శనమును కలుగును

శ్లో॥ శుక్రేణ సంయుతేదృష్టే ముక్తాలాభో భవేద్ధ్రువం।
హేమాభరణ సంప్రాప్తి ర్వాహనాది వివృద్ధితః॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, నిశ్చయముగా ముత్యాభరణ లాభమును, హేమాభరణ సంప్రాప్తియు, వాహనాది వృద్ధియు కలుగును.

శ్లో॥ శనినా సంయుతేదృష్టే అర్థనాశం మనోవ్యథా।
స్వస్థాన నాశనంచైవ అపమృత్యు భయంతథా॥ 8

తా. శనితో కలసినను, లేక చూడబడినను, అర్థ నాశమును, మనోవ్యథయును, స్వస్థాన నాశమును, అపమృత్యు భయమును కలుగును.

శ్లో॥ దాయేశా త్కేంద్రకోణేవా తృతీయే లాభగేపివా।
ధననాశం మనోదుఃఖం బంధు ద్వేషం మనోరుజం।
కుక్షిరోగం భూమినాశం విరుద్ధం బంధుభిస్సహ।
ఉత్సాహోబంధుకళ్యాణం భుక్త్యంతే శుభదం భవేత్॥

తా. సూర్యుడు దశానాథునకు కేంద్రకోణములయం దున్నను లేక తృతీయ లాభములయం దున్నను, ఆ భుక్తి యందు ధననాశమును, మనోదుఃఖమును, బంధు ద్వేషమును, మనో వ్యాకులమును, కుక్షిరోగమును, భూ నాశనమును, బంధుజన విరోధమును, ఉత్సాహమును, బంధు కళ్యాణమును, భుక్తి అంత్యభాగమందు శుభమును కలుగును.

శ్లో॥ దాయేశా త్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
అతికష్టం స్థానహాని స్సమాన జననాశనం।
స్వపుత్ర కలహ శ్చైవ కార్యనాశం మనోవ్యథా।
పితుఃపితృ సమానస్య మరణం నాత్రసంశయః।
వాహనాది వినాశశ్చ స్వభృత్య కలహ స్తథా॥ 10

తా. సూర్యుడు దశానాథునకు ౬-౮-౧౨. స్థానముల యం దున్నను లేక పాపులతో కలసియున్నను, అధిక కష్టమును, స్థానహానియు, సమాన జననాశనమును, తన పుత్రులతోడ కలహమును, కార్యనాశమును, మనోవ్యథయును, పితృ యొక్కయు, పితృ సమానులయొక్కయు,మరణమును,వాహన క్షయమును, తన సేవకులతోడ కలహమును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా అపమృత్యు ర్భవిష్యతి।
తద్దోష పరిహారార్థం భాస్కర ప్రార్థనంచరేత్।
ఛాగదానం ప్రకుర్వీత హ్యాయురారోగ్య వర్ధనం॥ 11

తా. భుక్తినాథుడగు సూర్యుడు ద్వితీయ సప్తమ



రాసులయందున్న యెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై సూర్యప్రార్థన చేయవలయును. మరియు మేకదానముచేసిన యెడల ఆయురారోగ్యాభి వృద్ధి కలుగును.

గురుదశాయాం చంద్రభుక్తిర్మాసాః 16.

పారాశర్యే॥

శ్లో॥ జీవస్యాంత ర్గతేచంద్రే కేంద్రేలాభ త్రికోణగే।
స్వోచ్చేవా స్వర్క్ష రాశిస్థే తృతీయే శుభసంయుతే।
రాజ్యలాభో యశోవృద్ధిః వాహనం వస్తుసంగ్రహః।
దారపుత్రాది సౌఖ్యంచ పయఃపూర్ణ స్తుభోజనం।
స్వధర్మసిద్ధిరారోగ్యం రాజసన్మాన సంభ్రమం।
గృహేశుభకరంచైవ పుత్రలాభం సుశోభనం॥ 1

తా. గురుదశలో చంద్రభుక్తియందు చంద్రుడు, కేంద్రత్రికోణ రాసులయందున్నను, తృతీయలాభముల యందున్నను, తన ఉచ్చస్వక్షేత్రములయం దున్నను లేక శుభగ్రహములతో కలసియున్నను, ఆభుక్తియందు, రాజ్యలాభమును, కీర్తిలాభమును, వాహన ప్రాప్తియు, వస్తు సంగ్రహమును, భార్యాపుత్రాది సౌఖ్యమును, క్షీరపాయసాదులతో గూడిన మృష్టాన్నభోజనమును, తనకులాచార ధర్మసిద్ధియు, రాజసన్మానమును, సంభ్రమమును, యింటియందు శుభమును, పుత్రలాభమును, మంగళప్రదమును కలుగును.

గ్రంథాంతరే॥

శ్లో॥ గజాశ్వలాభం సుకళత్రసౌఖ్యం మనేకసేనాధిపతీశ్వరత్వం
బహ్వర్థలాభంబహుధాన్యవృద్ధిం పశ్వాదిలాభంకృషివృద్ధి।
గృహస్యోత్తరదిగ్భాగే బహుసౌఖ్యం వినిర్దిశేత్। [మేతి।
మహారాజప్రసాదేన గజాంతైశ్వర్యమాదిశేత్॥ 2

తా. ఏనుగులు, గుఱ్ఱములు మొదలగు వాహనలాభమును, కళత్రసౌఖ్యమును, అనేకసేనలకు ఆధిపత్యము వహించు సేనాధిపత్యమును, బహు అర్థలాభమును, అధికధాన్యలాభమును, పశ్వాదిలాభమును, కృషివృద్ధియు, గృహమునకు ఉత్తరదిగ్భాగమందు అధికసౌఖ్యమును, మహారాజా సంగ్రహమువల్ల ఏనుగు లపరిమితి ఐశ్వర్యమును లభించునని గ్రంథాంతర వచనము.

శ్లో॥ షష్ఠాష్టమ వ్యయేచంద్రే క్షీణేవా పాపసంయుతే।
నీచేవాస్తంగతేవాపి రాజద్వేషం మనోరుజం।
అర్థహానిర్యశోహానిః బుద్ధివైకల్యమాదిశేత్।
జాడ్యత్వం జనవైషమ్యం దేశభ్రష్టం ధనక్షయం।
మహావ్యాధి సముత్పత్తిం పీనసం రోగ మాప్నుయాత్।
సర్వదారోగభీతిశ్చ మూత్రకృచ్ఛ్రాది రోగకృత్॥ 3

తా. చంద్రుడు లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను, క్షీణుడైనను, పాపులతో కలసియున్నను నీచరాశియందున్నను లేక అస్తంగతుడైనను ఆభుక్తియందు రాజద్వేషమును, మనోదుఃఖమును, అర్థహానియు, కీర్తినాశమును, బుద్ధివైకల్యమును, దేహజాడ్యమును, జనవిరోధమును, దేశభ్రష్టత్వమును, ధనక్షయమును, మహావ్యాధి సంభవమును, పీనసరోగమును, సర్వదారోగభయమును, మూత్రకృచ్ఛ్రాది రోగమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే కలహం స్థాననాశనం।
రాజద్వేషం కార్యనాశం వ్యాయామ జ్వరపీడనం॥ 4

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను కలహమును, స్థాననాశమును, రాజద్వేషమును, కార్యనాశనమును,



జ్వరపీడయు కలుగును.

శ్లో॥ కుజేన సంయుతే దృష్టే యుద్ధే శత్రుభయంతథా।
అగ్నిబాధా మనస్తాపం సమాన జననాశనం॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను యుద్ధమునందు శత్రుభయమును, అగ్నిబాధయు, మనస్తాపమును, సమానజననాశమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే క్రయవిక్రయ వృద్ధిదం।
వణిగ్జనాదిసంపర్కం వ్యవహారే జయంతథా॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను క్రయవిక్రయ కౌశల్యమును, వర్తకజనాది సంపర్కమును, వ్యవహారమునందు జయమును కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే గురుదేవ ద్విజార్చనం।
శివదీక్షాప్రసంగంచ నానామూలా ద్ధనాగమం॥ 7

తా. గురువుతో కలసినను లేక చూడబడినను గురుభక్తియు, దేవతార్చనమును, బ్రాహ్మణపూజయు, శివదీక్షాప్రసంగమును, నానామూలకముగా ధనాగమంబును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే వరభూషణ లాభవాక్।
యానాది వాహనప్రాప్తిః కార్యసిద్ధి ర్భవిష్యతి॥ 8

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను శ్రేష్ఠమైన భూషణలాభమును, యానాదివాహనప్రాప్తియు, కార్యసిద్ధియు కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే సమాన జననాశనం।
చతుష్పాజ్జీవనాశంచ పిశాచాది భయంతథా॥ 9

తా. శనితో కలసినను లేక చూడబడినను సమాన జననాశనమును, చతుష్పాజ్జీవ నాశనమును, పిశాచాది భయ

మును కలుగును.

శ్లో॥ దాయేశా త్కేంద్రకోణేవా దుశ్చిక్యే లాభగేపివా।
శుభగ్రహయుతేవాపి కార్యసిద్ధి ర్భవిష్యతి।
విజయం దేహమారోగ్యం దారపుత్రాది సౌఖ్యదం।
కృషిక్షేత్ర ధనప్రాప్తిః బాంధవ ప్రియభోజనం।
సమరే శత్రునాశశ్చ చింతాశోక వినాశనం॥ 10

తా. దశానాథునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయలాభములయం దున్నను, లేక శుభగ్రహముతో కూడి యున్నను కార్యసిద్ధియు, విజయమును, దేహారోగ్యమును, భార్యాపుత్రాది సౌఖ్యమును, కృషిలాభమును, క్షేత్రవృద్ధియు, ధనప్రాప్తియు, బంధుయిష్టులతోడ సుఖభోజనమును, యుద్ధమునందు శత్రునాశమును, చింతాశోక వినాశమును కలుగును.

శ్లో॥ దాయేశా త్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
తద్భుక్తౌ కార్యహానిశ్చ మానహానిశ్చ జాయతే।
ఉద్యోగభంగం చలనం స్థాననాశం తథైవచ।
బాంధవానాం వినాశశ్చ చింతితార్థంచ నాశనం॥ 11

తా. చంద్రుడు దశానాథునకు ౬-౮-౧౨. స్థానముల యందున్నను లేక పాపులతో కలసియున్నను, ఆభుక్తియందు కార్యహానియు, మానహానియు, ఉద్యోగభంగమును, చలనమును, స్థాననాశమును, బంధునాశమును, చింతించిన కార్యనాశమును కలుగును.

శ్లో॥ ద్వితీయ ద్యూనరాశిస్థే అపమృత్యు ర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం ఛాగదానం సమాచరేత్॥ 12

తా. చంద్రుడు ద్వితీయ సప్తమరాసులయం దున్న



యెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై ఛాగదానము చేయవలయును.

---

గురుదశాయాం కుజభుక్తిమాసాః 16. దినాని 6.

కృష్ణీయే॥

శ్లో॥ గురోరంతర్గతేభౌమే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయే లాభగేవాపి ఉచ్చ స్వక్షేత్రగేపివా।
తద్భుక్తౌ భూమిలాభశ్చ కుంజరాశ్వాది సంగ్రహః।
ధనలాభం రత్నలాభం పుత్రపౌత్ర ప్రవర్ధనం।
కృషిక్షేత్ర వివృద్ధిశ్చ దాసీదాసాది వృద్ధిదం।
ఆప్తబంధు సుహృత్సౌఖ్యం కళ్యాణాది మహోత్సవం।
యజ్ఞకర్మ సుసిద్ధిశ్చ సంతాప ప్రాప్తిమేవచ।
స్వవారే రాజసన్మానం దూరాత్ప్రియ సమాగమః।
దారాపుత్రాది సౌఖ్యంచ నానామూలా ద్ధనాగమం।
దేహారోగ్యం మహత్సౌఖ్యం తీర్థయాత్రాఫలంలభేత్॥

తా. గురుదశలో కుజభుక్తియందు కుజుడు లగ్నమునకు కేంద్రత్రికోణములయం దున్నను, తృతీయ శుభముల యందున్నను, లేక ఉచ్చస్వక్షేత్రములయం దున్నను, భూమిలాభమును, గజాశ్వాది సంగ్రహమును, ధనలాభమును, రత్నలాభమును, పుత్రపౌత్రాభి వృద్ధియు, కృషిలాభమును, క్షేత్రాభివృద్ధియు, దాసదాసీ జనాభివృద్ధియు, ఆప్తబంధు మిత్రసౌఖ్యమును, కళ్యాణాది మహోత్సవమును, యజ్ఞకర్మ సంసిద్ధియు, సంతాపమును, తనవారమునందు రాజసన్మానమును, దూరదేశమునుండి ప్రియసమాగమంబును, భార్యాపుత్రాది సౌఖ్యమును, నానామూలకముగా ధనాగమంబును, దేహారోగ్యమును, అధికసుఖమును, తీర్థయాత్రా ఫలమును

కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టమే వాపి వ్యయేవా నీచరాశిగే।
దాయాది కలహంకష్టం రాజచోరాగ్ని పీడనం।
బంధనంనిగళప్రాప్తిః కారాగృహ నివేశనం।
పైత్యగుల్మాది రోగాశ్చ ఉన్నతాత్పతనం తథా।
విదేశగమనంచైవ స్త్రీమూలా ద్ధననాశనం।
పైత్యాపస్మార కష్టంచ హ్యేతికృత్రిమపీడనం॥ 2

తా. కుజుడు లగ్నమునకు ౬-౮-౧౨. స్థానముల యందున్నను లేక తన నీచరాశియందున్నను, ఆభుక్తియందు దాయాది కలహమును, కష్టమును, రాజబాధయు, చోరభయమును, అగ్నిపీడయు, సంకెళ్లచే బంధనప్రాప్తియు, కారాగృహప్రవేశమును, పైత్య గుల్మాదిరోగభయమును, ఉన్నతస్థలము నుండి పడుటయు, విదేశగమనమును, స్త్రీమూలకముగా ధననాశనమును, పైత్యాపస్మార కష్టమును, కృత్రిమ పీడనయు కలుగును.

శ్లో॥ రవిణా సంయుతే దృష్టే రాజద్వేషం ధనవ్యయం।
ఉద్యోగ చలనంహాని స్సర్వత్ర కలహం తథా॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను రాజద్వేషమును, ధనవ్యయమును, ఉద్యోగచలనమును, ఉద్యోగహానియు, సర్వులతోడను కలహమును కలుగును.

శ్లో॥ శశినా సంయుతే దృష్టే మహాత్సౌఖ్యం ధనాగమం।
మనోవిలాసం విజయం ఉద్యోగం కార్యసిద్ధిదం॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను అధిక సౌఖ్యమును, ధనాగమంబును, మనోవిలాసమును, విజయమును, ఉద్యోగప్రాప్తియు, కార్యసిద్ధియు కలుగును.



శ్లో॥ బుధేనసంయుతే దృష్టే గృహలాభం విచిత్రకం।
వాక్కౌశలం బంధువృద్ధిః వ్యవహారే జయంభవేత్॥ 5

తా. బుధునితో కలసినను లేక చూడబడినను విచిత్ర గృహలాభమును, వాక్కౌశల్యమును, బంధువృద్ధియు, వ్యవహారమునందు జయమును కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే పుత్రప్రాప్తి ర్ధనాగమం।
వస్త్రభూషణ లాభశ్చ కళ్యాణాది వివృద్ధిదః॥ 6

తా. గురువుతో కూడినను లేక చూడబడినను, పుత్రప్రాప్తియు, ధనాగమంబును, వస్త్రలాభమును,భూషణ సంగ్రహంబును, కళ్యాణాది అభివృద్ధియు కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే వాహనాది లభేద్ధ్రువం।
ముక్తామణివిశేషశ్చ ధనలాభం భవేద్ధ్రువం॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను వాహనాది లాభమును, ముక్తామణి ప్రాప్తియు, విశేషధనలాభమును కలుగును.

శ్లో॥ శనినా సంయుతే దృష్టే వాహనాది పశుక్షయః।
నీచారికలహాశ్చైవ గురుపుత్ర వినాశనం॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను వాహనాది పశుక్షయమును, నీచజనులతోడను, శత్రువులతోడను కలహమును, గురుహానియు, పుత్రనాశమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యేలాభగేపివా।
శుభగ్రహాయుతేవాపి ధనలాభ ముదీరయేత్।
విద్యావిలాసం పాండిత్యం సమాన ప్రభుదర్శనం।
మహారాజాశ్రయ ప్రాప్తి ఇష్టసిద్ధి ర్యశివిఖ్యాతి।
భూలాభం పుత్రలాభంచ క్షేత్రధాన్య వివృద్ధిదం॥ 9

తా. కుజుడు దశానాథునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయలాభముల యందున్నను లేక శుభగ్రహముతో కూడియున్నను, ఆభుక్తియందు ధనలాభమును, విద్యావిలాసమును, పాండిత్యమును, సమాన ప్రభుదర్శనమును, మహారాజాశ్రయ ప్రాప్తియు, ఇష్టసిద్ధియు, భూలాభమును, పుత్రలాభమును, క్షేత్రవృద్ధియు, ధాన్యవృద్ధియు కలుగును.

శ్లో॥ దాయేశా త్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
స్థాననాశం బంధునాశం నానామూలా ద్ధనవ్యయం।
కృషిక్షేత్ర వినాశశ్చ చింతితార్థస్య నాశనం।
సమాన జనశోకశ్చ జ్ఞాతిశత్రు వివృద్ధిదః॥ 10

తా. కుజుడు దశానాథునకు ౬-౮-౧౨. స్థానముల యందున్నను లేక పాపులతో కలసినను ఆభుక్తియందు స్థాననాశమును, బంధునాశనమును, నానామూలకముగా ధనవ్యయమును, కృషినాశనమును, క్షేత్రక్షయమును, చింతించిన కార్యభంగమును, సమాన జనశోకమును, జ్ఞాతివృద్ధియు, శత్రువృద్ధియు కలుగును.

శ్లో॥ ద్వితీయ ద్యూనరాశిస్థే అపమృత్యు ర్భవిష్యతి।
తద్దోష పరిహారార్థం స్వర్ణదానం సమాచరేత్॥ 11

తా. ద్వితీయ సప్తమ రాసులయం దున్నయెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై స్వర్ణదానము చేయవలయును.

---

గురుదశాయాం రాహుభుక్తిమాసాః ౨౮. దినాని 24.

పారాశర్యే॥

శ్లో॥ జీవస్యాంతర్గతే రాహౌ పాపయుక్తే భవాయది।
కేంద్రగే త్రికోణగేవాపి కలహం సముపేష్యతి॥



మిత్రప్రభు విరోధస్స్యా త్స్వగ్రామే ధాన్యనాశనం।
పుత్రమిత్ర విరోధస్స్యా దాత్మబంధు మనోరుజం।
విధవా సంగమంచైవ దారాక్లేశో భవిష్యతి।
శుభయుక్తే భవారాహౌ క్వచిద్దుఃఖం క్వచిత్సుఖం।
రాజనిగ్రహ శాంతిశ్చ స్వల్పగ్రామాధి పత్యతాం।
సోదరేణ విరోధస్స్యా త్స్వగ్రామే ధాన్యసంపదః॥ 1

తా. గురుదశలో రాహుభుక్తియందు రాహువు పాపులతో కలసినను, లేక కేంద్రత్రికోణములయం దున్నను, కలహమును, మిత్రప్రభు విరోధమును, స్వగ్రామమునందు ధాన్యనాశమును, పుత్రమిత్ర విరోధమును, ఆత్మ బంధు నాశమును, మనోవ్యాకులమును, విధవా సంగమంబును, భార్యవియోగమును, కలుగును. శుభగ్రహములతో గూడిన రాహుభుక్తియందు కొంతదుఃఖమును, కొంతసుఖమును, రాజ నిగ్రహమును, శాంతియు, స్వల్ప గ్రామాధిపత్యమును, సహోదర విరోధమును, స్వగ్రామమునందు ధాన్యసంపదయు కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టమే రాహౌ నీచేవా మిత్రరాశిగే।
లాభేస్వక్షేత్ర సంయుక్తే కలహం రాజవిడ్వరం।
చోరభీతి ర్మనోదుఃఖం ద్రవ్యనాశో రిపోర్భయం।
అపస్మార పిశాచాద్యై రపమృత్యు భయంభవేత్।
అకస్మా త్కలహశ్చైవ క్షుద్రశూన్యాది రోగకృత్॥ 2

తా. రాహువు లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయం దున్నను, నీచరాశియం దున్నను, మిత్రక్షేత్రమం దున్నను, లాభస్థానమం దున్నను, లేక స్వక్షేత్రమం దున్నను, ఆభుక్తియందు కలహమును, రాజ విడ్వరమును, చోరభీతియు, మనోదుఃఖమును. ద్రవ్యనాశమును, శత్రుభయమును, అపస్మార పిశా

చాదులవల్ల అపమృత్యు భయమును, అకస్మాత్తుగా కలహమును, క్షుద్రశూన్యాది రోగభయమును కలుగును.

గ్రంథాంతరే॥

శ్లో॥ భుక్త్యాదౌతు క్వచిత్కష్టం నానావ్యాధి కరంతథా।
తత్పరంతు క్వచిత్సౌఖ్యం ధనలాభం భవిష్యతి।
పుత్రదారాదిసౌఖ్యంచ స్వనృపాత్సుఖమాప్నుయాత్।
మిత్రబంధు సుహృత్సౌఖ్యం ఉద్యోగ ప్రాప్తిమేవచ॥

తా. భుక్తి ఆదియందు కొంచకష్టమును, నానావిధ వ్యాధియు, అటుపిమ్మట కొంత సౌఖ్యమును, ధనలాభమును, భార్యాపుత్రాది సౌఖ్యమును, రాజమూలకముగా సుఖమును, మిత్రబంధు సుఖమును, ఉద్యోగప్రాప్తియు కలుగును.

కృష్ణీయే॥

శ్లో॥ రవిణా సంయుతేదృష్టే చోరాగ్ని నృపపీడనం।
ఉద్యోగచలనంచైవ స్వస్థాన చలనం భవేత్॥ 4

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, చోరబాధయు, అగ్నిభీతియు, రాజపీడయు, ఉద్యోగ చలనమును, స్వస్థాన చలనమును కలుగును.

శ్లో॥ శశినా సంయుతేదృష్టే మాతృవంశ వినాశనం।
అపకీర్తి భయప్రాప్తి శిరోకుక్ష్యక్షి పీడనం॥ 5

తా. చంద్రునితో కలసినను, లేక చూడబడినను, మాతృవంశపు వారికి నాశనమును, అపకీర్తి భయమును, శిరోబాధయు, కుక్షిపీడయు, నేత్రబాధయు కలుగును.

శ్లో॥ కుజేన సంయుతేదృష్టే యుద్ధశత్రు భయంతథా।
జ్ఞాతిభిః కలహంవ్యాధిః మహదాపద సంభవః॥ 6

తా. కుజునితో కలసినను, లేక చూడబడినను, యుద్ధము



నందు శత్రుభయమును, జ్ఞాతులతోడ కలహమును, వ్యాధి భయమును, గొప్ప ఆపదయు కలుగును.

శ్లో॥ బుధేన సంయుతేదృష్టే మాతులాది వివృద్ధిదం।
బంధుసన్మాన మాధిక్యం యత్నకార్య సుసిద్ధిదం॥ 7

తా. బుధునితో కలసినను, లేక చూడబడినను, మేనమామలకు అభివృద్ధియు, బంధు సన్మానమును, యత్నకార్య సిద్ధియు కలుగును.

శ్లో॥ గురుణా సంయుతేదృష్టే పుత్రదారాది పీడనం।
బుద్ధినాశో హ్యర్థహాని స్సమాన జననాశనం॥ 8

తా. గురునితో కలసినను లేక చూడబడినను, భార్యాపుత్రాది పీడయు, బుద్ధినాశమును, అర్థహానియు, సమాన జననాశనమును కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతేదృష్టే దారావర్గాది నాశనం।
శనినా సంయుతేదృష్టే భృత్యావర్గ వినాశనం॥ 9

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, భార్యావర్గపు వారికి నాశనము కలుగును. శనితో కలసినను, లేక చూడబడినను, భృత్యావర్గపు వారికి నాశనమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యే లాభగేపివా।
శుభగ్రహయుతేవాపి తద్భుక్తౌ శుభదం భవేత్॥
కృషి క్షేత్ర ధనాప్తిశ్చ మిత్రప్రభు వశాత్సుఖం।
అపూర్వ వస్తు సంప్రాప్తి ఇష్టసిద్ధి ర్భవిష్యతి॥ 10

తా. రాహువు దశానాథునకు కేంద్రకోణములయందున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక శుభగ్రహముతో కూడియున్నను, ఆ భుక్తియందు శుభమును, కృషి లాభమును, క్షేత్రలాభమును, ధనప్రాప్తియు, మిత్రప్రభు

మూలకముగా సుఖమును, అపూర్వ వస్తుసంప్రాప్తియు, ఇష్ట సిద్ధియు కలుగును.

శ్లో॥ దాయేశా త్షష్ఠరంధ్రేవా వ్యయేవా నీచసంయుతే।
సమాన జనశోకశ్చ స్థాననాశం భవిష్యతి।
అసత్యం పాపచింతాచ కలహః క్షితిపాద్భయం।
యత్నకార్య వినాశశ్చ గురుద్వేషో భవిష్యతి॥ 11

తా. దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను, లేక తన నీచరాశియం దున్నను, సమాన జనశోకమును, స్థాన నాశమును, అసత్యమును, పాపకార్య చింతయు, కలహమును, రాజభయమును, యత్నకార్య భంగమును, గురుద్వేషమును కలుగును.

శ్లో॥ ద్వితీయ ద్యూనరాశిస్థే అపమృత్యు భయంవదేత్।
తద్దోష పరిహారార్థం తిలహోమం సమాచరేత్।
రజితం మాహిషందద్యా త్పశ్చా దారోగ్య వర్ధనం॥ 12

తా. ద్వితీయ సప్తమ రాసులయం దున్నయెడల అపమృత్యువు కలుగును. ఆదోష పరిహారార్థమై తిలహోమము చేయవలయును. మరియు రజిత మహిషదానము యిచ్చిన పిమ్మట ఆయురారోగ్యము కలుగును.

ఇతి జాలతకఫల చింతామణౌ గురుదశాంతర్దశాఫలం నామ షష్ఠమప్రకరణం—సమాప్తము.



శుభమస్తు.

# జాతకఫలచింతామణి.

ఆంధ్ర తాత్పర్య సహితము.

శనిదశాంతర్దశాఫలం నామ సప్తమ ప్రకరణమ్.



శనిదశా సంవత్సరాః. 19.

శ్లో॥ మిథ్యాపవాద రిపుభీతినృపాగ్నిపీడా।
క్షేత్రార్థనాశపదవీ చ్యుతిమానహానిః।
స్త్రీపుత్రరోగ ధననాశమనోవిచారః।
స్యాత్సర్వదా శనిదశాగమనేనపుంసాం॥ 1

తా. పురుషునకు శనిదశ సంప్రాప్తించినచో నిష్కారణముగా అపవాదమును, శత్రుభయమును, రాజపీడయు, అగ్నిభయమును, క్షేత్రార్థహానియు, స్థాననాశమును, మానభంగమును, భార్యాపుత్రులకు రోగసంభవమును, ధననాశమును, మనోవిచారమును, సర్వదా కలుగుచుండును.

శ్లో॥ స్థానస్థవీర్యయుత మందదశాయాం
దారపుత్ర ధనకీర్తి ముపైతి।
చోరశత్రు నృపవహ్నిభయంవా
బంధునాశన మథాతిగుదార్తిం॥ 2

తా. జన్మకాలమందు స్థానబలముతో కూడియున్న శనిమహా దశాకాలము సంప్రాప్తించినపుడు మంచిగుణముగల భార్యచేతను, మంచి గుణవంతులగు పుత్రులచేతను, సత్పాత్ర వినియోగము చేయుటవల్ల ధనముచేతను సంపాదింపబడిన కీర్తి లాభమును, చోరులచేతను, శత్రువులచేతను, రాజుచేతను,

అగ్నిచేతను భయమును, లేక బంధునాశనమును, నేత్ర గుద ములయందు వ్యాధులచే దుఃఖమును కలుగును.

శ్లో॥ మందస్య దిగ్వీర్యయుతస్య
దాయేదిగంత రాక్రాంత సుఖాప్తికీర్తిం।
భూభృత్య దారాత్మజ సోదరాణాం
వినాశనం బంధుజనై ర్విరోధం॥ 3

తా. జననకాలమందు దిగ్బలముతో కూడిన శనిదశలో దిగంతరములనుంచి పొందబడిన సుఖమును, కీర్తియు, భూనాశమును, భార్యా పుత్రులకును, సోదరులకును, హానియు, బంధుజనులతోటి విరోధమును కలుగును.

శ్లో॥ కాలవీర్యయుత మందదశాయాం
కాలకూట విషభీతిముపైతి।
దారపుత్ర నృపచోర భయంవా
ధాన్యభూమి కృషివాహనలాభం॥ 4

తా. కాలబలయుక్తుడగు శనిదశలో కాలకూట విషముచేత కలిగిన భీతియు, భార్యా పుత్రులచేతను, రాజులచేతను, దొంగలవల్లను కలిగిన భీతియు, మరియు, ధాన్యలాభమును, భూసమృద్ధియు, కృషిలాభమును, వాహనప్రాప్తియు కలుగును.

శ్లో॥ వక్రచార యుతోమందః కరోతి విఫలక్రియాం।
ఉద్యోగభంగం దుఃఖంచ సోదరాది వినాశనం॥ 5

తా. వక్రగతియందున్న శనిదశా కాలమందు నిష్ఫలంబగు కార్యములు చేయుటయు, ఉద్యోగ భంగమును, దుఃఖప్రాప్తియు, సహోదర నాశనమును కలుగును.

శ్లో॥ క్రూరషష్ఠ్యంశ యుక్తస్య శనిపాకే మహద్భయం।
నృపక్రోధం పదభ్రంశం కారాగృహ నివేశనం॥ 6



తా. శనైశ్చరుడు క్రూర షష్ఠ్యంశములను పొంది యుండగా ఆదశయందు, అధిక భయమును, రాజకోపమును, స్థానభ్రష్టతయు, కారాగృహ ప్రవేశమును కలుగును.

శ్లో॥ సౌమ్యషష్ఠ్యంశ యుక్తస్య శనేర్దాయే మహత్సుఖం।
దారపుత్రార్థ సంపత్తిం లభతే బంధుతోషణం॥ 7

తా. శుభ షష్ఠ్యంశలయందున్న శనిదశలో అధిక సౌఖ్యమును, భార్యాపుత్ర సంపదయు, ధనసంపత్తియు, బంధుజన సంతోషమును కలుగును.

శ్లో॥ వైశేషికాంశన గతశ్చ నిస్సౌఖ్యం కరోతిచ।
విశేషద్రాజసన్మానం విచిత్రాంబరభూషణం॥ 8

తా. జన్మకాలమందు వైశేషికాంశముతో కూడియుండెడి శనిమహాదశ సంప్రాప్తించి నపుడు సౌఖ్యఫలంబు కలుగును. విశేష రాజసన్మానమును, విచిత్ర వస్త్రాలంకార భూషణప్రాప్తియు కలుగును.

శ్లో॥ క్రూరద్రేక్కాణ సంయుక్త శనేర్దాయే మహద్భయం।
ఉద్బంధనం విషాద్భీతిం నృపచోరాగ్నిజం భయం॥ 9

తా. క్రూరగ్రహ సంబంధమైన ద్రేక్కాణయుక్తుడైన శనిదశలో అధిక భయమును, ఉరి మొదలగునవి వేయుటయు, విషము వలన భయమును, రాజుచేతనున్నూ, చోరులచేతను, అగ్నిచేతను, కలిగిన భయోత్పాతంబును కలుగును.

శ్లో॥ నీచరాశి గతోమందః ఉచ్చాంశక సమన్వితః।
దశాదా దుఃఖమాప్నోతి దశాంతేత్వతి సౌఖ్యదః॥ 10

తా. తన నీచరాశియందు శని యున్నను, స్వోచ్చ నవాంశగతుండాయెనేని ఆదశ ప్రారంభమునందు దుఃఖ సంప్రాప్తియు,అంత్య భాగమందు అధిక సౌఖ్యమునుకలుగును.

శ్లో॥ ఉచ్చరాశి గతోమందో నీచాంశక సమన్వితః।
దశాదౌ సుఖసంకృత్వా దశాంతే కష్టదోభవేత్॥ 11

తా. శని తన ఉచ్చరాశియం దున్నను, నీచాంశను పొందియున్నయెడల, దశ ఆదిభాగమందు సుఖమును, అంత్య భాగమందు కష్టమును సంభవించును.

శ్లో॥ అత్యుచ్చసంస్థస్య శనేర్దశాయాం
భూమ్యర్థలాభం స్వజనానుమోదం।
స్త్రీపుత్రసౌఖ్యం పశుదాసవృద్ధిం
యానాంబరం భూషణరత్నలాభం॥ 12

తా. పరమోచ్చయందున్న శనిదశలో భూలాభమును, ధన లాభమును, స్వంత జనులయొక్క సంతోషమును, భార్యా పుత్ర సౌఖ్యమును, పశువృద్ధియు, దాసదాసీజన సంగ్రహమును, వాహన, వస్త్రాభరణ, భూషణ రత్న లాభములును లభించును.

శ్లో॥ ఉచ్చస్థితస్యోష్ణ కరస్యసూనో
ర్దశావిపాకే ధనలాభమేతి।
సుకీర్తిలబ్ధం స్వజనానుమోదం
మనోవిలాసం మహదాధిపత్యం॥ 13

తా. తన ఉచ్చరాశియందున్న శనిమహర్దశలో ధన లాభమును, మంచి కీర్తియు, స్వకీయ జనానుమోదమును, మనోవిలాసమును, గొప్ప ఆధిపత్యమును కలుగును.

శ్లో॥ మూలత్రికోణ నిలయస్య శనేర్దశాయాం
యానాంబరార్థ పశువాహన రత్నలాభం।
క్షేత్రాభివృద్ధి రిపునాశకరం సుఖత్వం
విద్యావినోదవిభవం స్వజనానుకూలం॥ 14



తా. మూలత్రికోణ రాశియందున్న శనిదశలో వాహన, వస్త్ర, ధనలాభంబులును, పశులాభమును, రత్నసంగ్రహమును, క్షేత్రాభివృద్ధియు, శత్రునాశమును, సుఖమును, విద్యా వినోద విభవమును, స్వజనాను కూలమును కలుగును.

శ్లో॥ స్వర్క్షస్థితస్య దిననాథ సుతస్యదాయే
రత్నాదిలాభ పశువాహన హేమలాభం।
దారాదిసౌఖ్యవిభవం వరవస్తులాభం
భూపాత్సుఖం స్వజనవృద్ధి ముదాహరంతి॥ 15

తా. స్వక్షేత్రములయందున్న శని దశలో రత్నాది లాభమును, పశువృద్ధియు, వాహనప్రాప్తియు, హేమలాభమును, భార్యాపుత్రాది సౌఖ్యవిభవమును, శ్రేష్ఠమైన వస్తు లాభమును, రాజువల్ల సుఖమును, స్వజనవృద్ధియు కలుగును.

శ్లో॥ అత్యంతమిత్ర నిలయాన్విత మందదాయే
భూపాత్సుఖం సుత సుహృజ్జనలాభ సౌఖ్యం।
విద్యావినోద విభవం బహుకీర్తిలాభం
సంగ్రామ కేళివిజయం మణివస్త్రలాభం॥ 16

తా. అధిమిత్రక్షేత్రమందున్న శనిదశలో రాజుమూలకముగా సుఖమును, పుత్రలాభమును, మిత్రలాభమును, సౌఖ్యమును, విద్యావినోద విభవమును, విశేషకీర్తియు, యుద్ధమునందు జయమును, మణివస్త్రలాభమును కలుగును.

శ్లో॥ మిత్రర్క్ష సంస్థస్య శనేర్దశాయాం
క్షేత్రాభివృద్ధిం పశుదాసవృద్ధిం।
భూపాలపూజ్యం వరవస్తులాభం
సమానవర్గాత్సు విశేషలాభం॥ 17

తా. మిత్రక్షేత్రమందున్న శనిదశలో క్షేత్రాభివృద్ధి

యు, పశువృద్ధియు, దాసదాసీజనాభి వృద్ధియు, రాజసన్మానమును, శ్రేష్ఠమైన వస్తులాభమును, సమానజనులవల్ల విశేష లాభమును కలుగును.

శ్లో॥ సమర్క్షగస్యాపి శనేర్దశాయాం
క్వచిత్సుఖంస్యా ద్ధనలాభమేతి।
స్వస్థానవాసం పరదేశవాసం
సమానమిత్రం సముపైతి సిద్ధిం॥ 18

తా. సమరాశియందున్న శనిదశలో కొంచము సుఖమును, ధనలాభమును, స్వస్థాన వాసమును, పరదేశవాసమును, సమాన జనస్నేహమును కలుగును.

శ్లో॥ శత్రుర్క్షసంస్థస్య శనేర్దశాయాం
మనోవిచారం మతిమానభంగం।
క్షితీశకోపం స్వజనై ర్విరోధం
సమానకష్టంచ విదేశవాసం॥ 19

తా. శతృక్షేత్రమందున్న శనిదశలో మనోవిచారమును, బుద్ధిభ్రంశమును, మానభంగమును, రాజకోపమును, స్వంతజనులతోడ విరోధమును, సమాన జనకష్టమును, పరస్థలవాసమును కలుగును.

శ్లో॥ అత్యంతశతృ భవనస్థిత మందదాయే
మానార్థహాని మతివిభ్రమ దుఃఖభీతిం।
స్త్రీపుత్రనాశ మతికష్ట సమానపీడా
క్షేత్రాదినాశనకరం హ్యతికష్టమేతి॥ 20

తా. అధి శతృక్షేత్రమందున్న శనిదశలో మానహానియు, అర్థనాశమును, మతిభ్రంశమును, దుఃఖభీతియు, భార్యాపుత్రనాశమును, అధిక కష్టమును, సమానజనపీడయు, క్షేత్రా



దినాశనమును, బహుకష్టమును కలుగును.

శ్లో॥ నీచాన్వితస్య మందస్య దశాపాప ఫలప్రదా।
అతికష్టం మానభంగం పశుక్షేత్ర వినాశనం॥ 21

తా. నీచరాశియందున్న శనిదశలో పాపఫలము కలుగును. అధిక కష్టమును, మానభంగమును, పశుహానియు, క్షేత్ర నాశనమును కలుగును.

శ్లో॥ శుభాన్వితస్య మందస్య దాయేసౌఖ్యం మహత్సుఖం।
పశుదాసవృద్ధిశ్చ యత్నకార్య సుసిద్ధిదం॥ 22

తా. శుభగ్రహములతో కూడిన శనిదశలో సౌఖ్యమును, అధికసుఖమును, పశువృద్ధియు, దాసదాసీ జనాభివృద్ధియు, యత్నకార్య సిద్ధియు కలుగును.

శ్లో॥ పాపాన్వితస్య మందస్య దాయే రాజభయంభవేత్।
చతుష్పాజ్జీవనాశంచ సమాన జననాశనం॥ 23

తా. పాపగ్రహములతో కూడిన శనిదశలో రాజభయమును, చతుష్పాజ్జీవనాశమును, సమాన జననాశనమును కలుగును.

శ్లో॥ కేంద్రస్థితస్య దినపస్య సుతస్యదాయే
భూపాల పూజ్య విభవం బుధవర్గమిత్రం।
నానాధనాని వివిధాభరణాని లాభం
స్త్రీపుత్ర సౌఖ్య విభవం క్షితినాయకత్వం॥ 24

తా. కేంద్రస్థానములయందున్న శని దశలో రాజపూజ్య విభవమును, పండిత జనస్నేహమును, నానామూలకముగా ధనలాభమును, వివిధాభరణ లాభమును, భార్యాపుత్ర సౌఖ్యమును, రాజ్యాధికారమును కలుగును.

శ్లో॥ త్రికోణస్థస్యమందస్య దశాత్యంత శుభప్రదా।

బంధుప్రియం మనోత్సాహం కృషిక్షేత్ర వివృద్ధిదం॥

తా. త్రికోణరాసుల యందున్న శనిదశలో విశేషశుభమును, బంధుప్రియమును, మనోత్సాహమును, కృషిలాభమును, క్షేత్రవృద్ధియు కలుగును.

శ్లో॥ దుస్థానసంస్థస్య శనేర్దశాయాం
దుఃఖం మహావ్యాధికరం భయంచ।
యుద్ధేభయం శత్రువివృద్ధిదంచ
క్షేత్రాదినాశం పశునాశనంచ॥ 26

తా. దుస్థానములయందున్న శని దశలో దుఃఖసంభవమును, మహావ్యాధి భయమును, యుద్ధమునందు భయమును, శత్రువృద్ధియు, క్షేత్రాది నాశనమును, పశుహానియు కలుగును.

శ్లో॥ ఉచ్చాంశమందదాయే వివిధసుఖాన్నంచ భోగభాగ్యాదీన్
కురుతే విదేశయానం గ్రామ సభామండలాధి పత్యంవా॥ 27

తా. ఉచ్చాంశను పొందియున్న శనిదశలో వివిధసుఖాన్నభోగమును, భాగ్యప్రాప్తియు, పరస్థళ ప్రయాణమును, గ్రామాధి పత్యమును, సభాధిపత్యమును లేక మండలాధి పత్యమును కలుగును.

శ్లో॥ నీచాంశ మందదాయే నీచాచారంచ కష్టజీవనంలభతే।
సర్వేషాం ప్రేష్యత్వం ధనసుతదారైశ్చనిగ్రహందుఃఖం॥

తా. నీచాంశను పొందియున్న శనిదశలో నీచఆచారమును, కష్టజీవనమును, సర్వజనుల సేవయు, ధననాశమును, భార్యాపుత్ర నాశమును, దుఃఖమును కలుగును.

శ్లో॥ అర్కగతమందదాయే స్వజనద్వేషం పరస్త్రీయంలభతే।
భృత్యాపత్యవిరోధం మహోద్య మందోప పరిభూతిం॥ 29

తా. సూర్యునితో కూడియున్న శనిదశలో స్వజనద్వే



షమును, పరస్త్రీలాభమును, తనభృత్యులతోడను, పుత్రులతోడను విరోధమును, దోషముతో విశేషముగా కూడియుండెడి అధికమగు పాపకార్యము చేయుటయు సంభవించును.

శ్లో॥ శుభేక్షితస్యాపి శనేర్దశాయాం
స్త్రీపుత్ర భృత్యార్థ ముపైతికాలే।
పశ్చాదుపేత్యత్ర మహత్వకష్టం
గోభూమి వాణిజ్య కృషిత్వనాశం॥ ౩౦

తా. శుభగ్రహావీక్షణ గల శనిదశలో స్త్రీలాభమును, పుత్రప్రాప్తియు, దాసదాసీజనసంగ్రహమును, అర్థలాభమును కలుగును. అనంతరమునందు అధిక కష్టమును, పశుహానియు, భూనాశనమును, వ్యవహారనష్టమును, కృషినాశమునుకలుగును.

శ్లో॥ పాపేక్షితస్యాపి శనేర్దశాయాం
భృత్యార్థ దారాత్మజ సోదరాణాం।
నాశం సమాయాతి పరాపవాదం
కుభోజనం కుత్సితగంధమాల్యం॥ 31

తా. పాపగ్రహ వీక్షణగల శనిదశలో భృత్యులకును, ధనమునకును, భార్యకును, పుత్రులకును, సహోదరులకును నాశనము కలుగుటయు, పరులవల్ల అపవాదభయమును, కుత్సితాన్న భోజనమును, కుత్సితములగు గంధమాల్యములు లభించుటయు సంభవించును.

---

మేషాది రాశిస్థిత శనిదశాఫలం.

శ్లో॥ మేషస్థితస్యాపి శనేర్దశాయాం
క్షేత్రాదినాశం పశునాశనంచ।
సమానకష్టం స్వజనాని బాధా
స్త్రీపుత్రపీడాది పదచ్యుతిశ్చ॥ 32

తా. మేషరాశియందున్న శనిదశలో క్షేత్రాదినాశనమును, పశుహానియు, సమాన జనకష్టమును, స్వంతజనుల బాధయు, భార్యాపుత్రపీడయు, స్థాననాశమును కలుగును.

శ్లో॥ వృషస్థితస్యాపి శనేర్దశాయాం
కృషేర్ధనాప్తిం వరవస్తులాభం।
నీలాంబరం నీలమణిస్తులాభం
గ్రామాధిపత్యం సుఖవృద్ధి దంచ॥ 33

తా. వృషభరాశియందున్న శని దశలో వ్యవసాయము వల్ల ధనలాభమును, శ్రేష్ఠమైన వస్తులాభమును, నీలవస్తులాభమును, నీలమణుల సంగ్రహంబును, గ్రామాధిపత్యమును, సుఖవృద్ధియు కలుగును.

శ్లో॥ యుగ్మస్థితస్య దిననాథ సుతస్యదాయే
క్షేత్రార్థలాభ మవనీపతి పూజ్యమానం।
స్త్రీపుత్రసౌఖ్య విభవం స్వజనానుమోదం
దాసాదివృద్ధి విభవం బహులాభమేతి॥ 34

తా. మిధునరాశియందున్న శని తన దశలో క్షేత్రార్థలాభమును, రాజపూజ్యతయు, స్త్రీపుత్ర సౌఖ్యాదివిభవమును, స్వజనాను రాగమును, దాసదాసీ జనులయొక్క అభివృద్ధియు, విశేషలాభమును కలుగచేయును.

శ్లో॥ కుళీరస్థస్య మందస్య దశాకష్టఫలప్రదా।
సమానజనశోకశ్చ స్థాననాశం పశుక్షయం॥ 35

తా. కర్కాటక రాశియందున్న శనిదశలో అధిక కష్ట ఫలము కలుగును. సమానజన వ్యసనమును, స్థాననాశమును, పశుహానియు కలుగును.

శ్లో॥ సింహస్థితస్యాస్య శనేర్దశాయాం



క్షితీశకోపం రిపువృద్ధిదంచ।
మనోవిచారంచ సమానపీడాం
క్షేత్రాదినాశం బహుకష్టమేతి॥ 36

తా. సింహరాశి యందున్న శని తన దశాకాలమందు, రాజకోపమును, శత్రువృద్ధియును, క్షేత్రాది నాశనమును, మనోవిచారమును, సమాన జనపీడయు, అధిక కష్టమును కలుగచేయును.

శ్లో॥ కన్యాగత రవిసూనోర్దాయే సౌఖ్యంచ భూపసన్మానం।
మిత్రప్రవృద్ధిం ధనధాన్యవృద్ధిం
గోధాన్యక్షేత్రం సుఖవృద్ధిదంచ॥ 37

తా. కన్యారాశి యందున్న శనిదశలో జాతకునకు సౌఖ్యమును, రాజసన్మానమును, స్నేహవృద్ధియు, ధనధాన్యసమృద్ధియు, గోలాభమును, ధాన్యలాభమును, క్షేత్రవృద్ధియు, సుఖవృద్ధియు కలుగును.

శ్లో॥ తౌలిస్థితస్య దినపస్య సుతస్యదాయే
రాజ్యాధికార విభవం బహుధాన్యవృద్ధిం।
స్త్రీపుత్రసౌఖ్య విభవం బహురత్నలాభం
సత్కీర్తిలబ్ధ విభవం బహుతీర్థయాత్రా॥ 38

తా. తులారాశి యందున్న శనిదశలో రాజ్యాధికార విభవమును, విశేషముగా ధాన్యాభివృద్ధియు, స్త్రీపుత్రసౌఖ్య విభవమును, బహురత్నలాభమును, సత్కీర్తియు, బహుతీర్థయాత్రా ఫలమును కలుగును.

శ్లో॥ కీటస్థిత మందదాయే మతివిభ్రంశం స్వమానభంగంచ।
స్వస్త్రీసుత ధననాశంయుద్ధే శత్రుభయంవివాదకలహంచ॥

తా. వృశ్చికరాశి యందున్న శనిదశాకాలమందు బుద్ధి

భ్రంశంబును, మానహానియు, స్వంత భార్యాపుత్రులకు కీడును, ధననాశమును, యుద్ధమునందు శత్రుభయమును, వివాద కలహమును జరుగును.

శ్లో॥ ధనుషి భవనసంస్థే సూర్యసూనో ర్దశాయాం
ద్విజగురు జనపూజ్యం బంధుకళ్యాణవృద్ధిం।
పరమణివసనాప్తిం నీలవస్త్రప్రలాభం
స్వసుతసుఖసమృద్ధిం కీర్తిలాభం కరోతి॥ 40

తా. ధనుస్సునందుండు శనిదశలో దేవబ్రాహ్మణపూజయు, బంధుకళ్యాణ వృద్ధియు, శ్రేష్ఠమైన మణివస్త్రలాభములును, నీలవస్త్ర సంప్రాప్తియు, తనపుత్రులయొక్క సౌఖ్యాభివృద్ధియు, కీర్తిలాభమును కలుగును.

శ్లో॥ మృగస్థితస్యాపి శనేర్దశాయాం
క్షేత్రాభివృద్ధిం బహుధాన్యలాభం।
సమానభూనాయక పూజ్యమానం
సుతీర్థయాత్రాది మహాత్సుఖత్వం॥ 41

తా. మకరరాశి యందున్న శని తన దశాకాలమందు క్షేత్రాభివృద్ధియు, బహుధాన్య లాభమును, సమాన జనులయొక్కయు, రాజులయొక్కయు గౌరవమును, మంచి పుణ్యతీర్థయాత్రాది ఫలమును, విశేష సుఖమును కలుగును.

శ్లో॥ కుంభస్థితస్యాపి శనే ర్దశాయాం
యానాదిరోహణ విధిం బహుకీర్తిలాభం।
యుద్ధేజయం స్వసుత బంధు విశేషసౌఖ్యం
నిత్యాన్నదాన విభవం బహుధాన్యవృద్ధిం॥ 42

తా. కుంభరాశి యందున్న శనిదశలో యానారోహణ ప్రాప్తియు, బహుకీర్తియు, యుద్ధమునందుజయమును, స్వంత



పుత్రులయొక్కయు, బంధువులయొక్క విశేష సౌఖ్యమును, నిత్యాన్నదాన విభవమును, బహుధాన్యవృద్ధియు కలుగును.

శ్లో॥ మీనస్థితస్య మందస్య క్వచిద్దుఃఖం క్వచిత్సుఖం।
గురుబంధువిరోధశ్చ స్వకులాచార నాశనం॥ 43

తా. మీనరాశియందున్న శనిదశలో కొంతకష్టమును, కొంత సుఖమును, గురుద్వేషమును, బంధుజన విరోధంబును, తన కులాచార నాశనమును కలుగును.

---

తన్వాదిభావస్థిత శనిదశాఫలం.

శ్లో॥ తనుగతమందదశాయాం నిస్వత్వంవాతరోగబాధాచ।
స్వకులాచారవిరుద్ధం క్షితిపతికోపం సమానజననాశంచ॥

తా. లగ్నక్షేత్రమందున్న శనిదశా కాలమందు వాతరోగబాధలవల్ల కలిగెడు నిశ్శక్తియు, తన కులాచార పద్ధతికి విరోధమును, రాజకోపమును,సమాన జననాశమును కలుగును.

శ్లో॥ ధనగత మంద దశాయాం ధనహానిం నేత్రరోగంచ।
స్వస్త్రీబాధాకలహం పరగృహవాసం పరాన్నభుక్తంచ॥

తా. లగ్నమునకు ద్వితీయ స్థానమందున్న శనిదశలో ధనహానియు, నేత్రరోగమును, స్వస్త్రీబాధయు, కలహమును, పరగృహ వాసమును, పరాన్న భోజనమును కలుగును.

శ్లో॥ సహజభవనసంస్థే సూర్యపుత్రస్యదాయే
విభవ ధనసమృద్ధిం బంధు విఖ్యాతకీర్తిం।
సహజసుతసమృద్ధిం భూపతుల్య ప్రభుత్వం
వివిధ వసనలాభం భూషణ ప్రాప్తిమేతి॥ 46

తా. తృతీయ స్థానమందున్న సూర్యపుత్రుని దశాకాలమందు విభవమును, ధనసమృద్ధియు, బంధు విఖ్యాతికీర్తియు, పుత్రసోదర జన సమృద్ధియు, రాజ సమానమగు

అధికారమును, నానావిధములగు వస్త్రలాభమును, భూషణ ప్రాప్తియు కలుగును.

శ్లో॥ బంధుస్థిత మందదాయే బంధుసమృద్ధిం భూపసన్మానం।
క్షేత్రార్థపశుసమృద్ధిం దాసజనధాన్య వివృద్ధించ॥ 47

తా. లగ్నమునకు నాల్గవయింటియందున్న శనిదశలో బంధుసమృద్ధియు, రాజ సన్మానమును, క్షేత్రార్థ లాభమును, పశుసమృద్ధియు, సేవకులకు అభివృద్ధియు, ధాన్యసమృద్ధియు కలుగును.

శ్లో॥ సుతస్థస్య మందస్య దాయేతికష్టం
స్వభృత్యాదినాశం పశుక్షేత్రనాశం।
ధాత్రీశకోపం మతిభ్రంశకంచ
సమానప్రభోర్నాశ యుద్ధేజయంచ॥ 48

తా. లగ్నమునకు ఐదవ యింటియందున్న శనిదశలో అధికకష్టమును, తన సేవకజనులకు నాశనమును, పశుహానియు, క్షేత్రనాశమును, రాజకోపమును, బుద్ధిభ్రంశమును, సమాన ప్రభునాశనమును, యుద్ధమునందు జయమును కలుగును.

శ్లో॥ అరిస్థస్య మందస్యదాయే మహత్వం
స్వశత్రుర్వినాశంచ ధాత్రీశమానం।
కృషిక్షేత్రవృద్ధిం స్వభృత్యాదివృద్ధిం
కళత్రస్యసౌఖ్యం పురాధీశతాంచ॥ 49

తా. లగ్నమునకు ఆఱవయింటనున్న శనిదశలో గొప్పతనమును, తన శత్రునాశమును, రాజసన్మానమును, కృషి క్షేత్రాభి వృద్ధియు, దాసదాసీజన వృద్ధియు, భార్య సౌఖ్యమును, పురాధిపత్యమును కలుగును.

శ్లో॥ కళత్రస్థితస్యాస్య మందస్యదాయే



మహత్కీర్తిలాభం క్షితీశాత్సుఖంచ।
క్షేత్రార్థ దారారిపుత్రాదిసౌఖ్యం
స్వనామాంకితోద్యోగలాభం శుభంచ॥ 50

తా. లగ్నమునకు సప్తమరాశి యందున్న శని దశా కాలమందు విశేషకీర్తి లాభమును, రాజు మూలకముగా సుఖమును, క్షేత్రలాభమును, అర్థప్రాప్తియు, భార్యాపుత్రాది సౌఖ్యమును, స్వతంత్ర ముద్రాధికార ప్రాప్తియు, శుభమును కలుగును.

శ్లో॥ రంధ్రస్థస్య శనైశ్చరస్యచ దశాహ్యత్యంత కష్టప్రదా।
స్వపుత్రార్థ వినాశదా మతిపదభ్రంశప్రదామృత్యుదా।
సంగ్రామే రిపువృద్ధిదా నరపతిక్రోధ ప్రదాహానిదా।
గోక్షేత్రాది వినాశదా నిధనదా చండాలసేవాప్రదా॥

తా. లగ్నమునకు అష్టమ స్థానమందున్న శని అత్యంత కష్టప్రదుండును, స్వంత పుత్ర నాశకరుడును, అర్థనాశకుడును, మతిభ్రంశకుడును, స్థాననాశకుడును, మృత్యు దాయకుడును, యుద్ధమునందు శత్రు వృద్ధికరుడును, రాజక్రోధ ప్రదుడును, హానికరుడును, పశుక్షేత్రాది వినాశకుడును, మృత్యుకరుడును, చండాల సేవాప్రదుడును యగును.

శ్లో॥ ధర్మస్థితస్యాపి శనేర్దశాయాం
ధాన్యాభివృద్ధిం వరతీర్థలాభం।
క్షేత్రాభివృద్ధిం వసుధీశమిత్రం
నీలాంబరా భూషణ వస్తులాభం॥ 52

తా. లగ్నమునకు నవమ స్థానమందున్న శనిదశలో ధాన్యాభివృద్ధియు, శ్రేష్ఠమైన తీర్థ లాభమును, క్షేత్రాభి వృద్ధియు, రాజస్నేహమును, నీలాంబరాభరణ భూషణ వస్తు

లాభమును కలుగును.

శ్లో॥ కర్మస్థితస్యాపిశనేర్దశాయాం స్వకీర్తిలబ్ధంవిజయప్రభుత్వం।
పురాణగీతశ్రవణంవినోదం సుతీర్థయాత్రాది ఫలప్రపంచ॥

తా. దశమ స్థానమందున్న శని తన దశాకాలమందు స్వకీర్తి లాభమును, జయముతో గూడిన ప్రభుత్వమును, పురాణ గీతశ్రవణా ద్వినోదమును, మంచి పుణ్యతీర్థయాత్రాది ఫలమును కలుగును.

శ్లో॥ లాభగతమందదాయే ధనలాభం శత్రునాశంచ।
కురుతే క్షేత్రార్థ పశువృద్ధిం స్త్రీపుత్రజ్ఞాతిసౌఖ్యంచ॥

తా. లగ్నమునకు ఏకాదశ స్థానమందున్న శనిదశలో ధనలాభమును, శత్రునాశమును, క్షేత్రార్థ వృద్ధియు, పశువృద్ధియు, భార్యాపుత్రాది సౌఖ్యమును, జ్ఞాతి సౌఖ్యమును కలుగును.

శ్లో॥ వ్యయస్థస్య మందస్యదాయేతికష్టం
స్వభృత్యార్థనాశం పశుక్షేత్రహానిం।
కళత్రస్యబాధా స్వదేహస్యకష్టం
రిపుర్వృద్ధిమారంభ కార్యాణినాశం॥ 55

తా. లగ్నమునకు పండ్రెండవ యింటియందున్న శని దశలో అధిక కష్టమును, స్వంత సేవకా జననాశమును, అర్థహానియు, పశుహానియు, క్షేత్రనాశమును, కళత్ర పీడయు, దేహాలస్యమును, శత్రువృద్ధియు, ఆరంభ కార్య వినాశమును కలుగును.

---

ఆరోహ శనిదశాఫలం.

శ్లో॥ ఆరోహ సంస్థస్య శనేర్దశాయాం
సద్భృత్యో వర్గాది వివృద్ధిదంచ।



స్వదారపుత్రార్థ వివృద్ధిదంచ
క్షేత్రాభివృద్ధిం పశుధాన్యవృద్ధిం॥ 56

తా. జన్మకాలమందు శనైశ్చరుడు ఉచ్చరోహిణీ యుక్తుడై యుండగా అట్టి కాలమందు మంచి భృత్యజనుల సంపర్గమును, స్వంత భార్యాపుత్రాభి వృద్ధియు, అర్థప్రాప్తియు, క్షేత్రాభివృద్ధియు, పశువృద్ధియు, ధాన్యవృద్ధియు కలుగును.

శ్లో॥ అవరోహ శనేర్దాయే స్త్రీక్షేత్ర పశునాశనం।
సమాన జనకష్టంచ చతుష్పాజ్జీవనాశనం॥ 57

తా. ఆవరోహణ స్థితియందున్న శనిదశలో స్త్రీ నాశమును, క్షేత్రహానియు, పశునాశనమును, సమాన జనకష్టమును, చతుష్పాజ్జీవనాశనమును కలుగును.

---

శనిదశాయాం శనిభుక్తిమాసాః 36. దినాని 3.

కృష్ణీయ్యే॥

శ్లో॥ శనేరంతర్గతేమందే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయే లాభగేవాపి ఉచ్చరాశి స్థితేపివా।
తద్భుక్తౌ వాహనార్థశ్చ పశుధాన్యాది సంగ్రహః।
మహారాజ ప్రసాదేన ఇష్టసిద్ధి సుఖాదికం।
మణిభూషణ సంప్రాప్తిః మిత్రసంగ్రహ లాభదః।
పశ్చిమాందిశి మాశ్రిత్య ప్రయాణం రాజదర్శనం।
శూద్రప్రభు వశాత్సౌఖ్యం యుద్ధే శత్రువినాశనం।
నీలవస్తును సంప్రాప్తిః ధాన్యవృద్ధి ర్భవిష్యతి।
గోధనాని సమృద్ధిశ్చ శత్రునాశం తథైవచ।
యత్నకార్యార్థ సిద్ధిశ్చ దేహారోగ్యం తథైవచ॥ 1

తా. శనిదశలో స్వభుక్తియందు శని లగ్నమునకు కేంద్రత్రికోణములయం దున్నను, తృతీయ లాభములయం

దున్నను, లేక తన ఉచ్చరాశియందున్నను, వాహన లాభ
మును, అర్థప్రాప్తియు, పశువృద్ధియు, ధాన్యాది సంగ్రహ
మును, మహారాజాను గ్రహమువల్ల ఇష్టసిద్ధియు, అధిక సుఖ
మును, మణిభూషణ సంప్రాప్తియు, మిత్ర సంగ్రహమును,
పశ్చిమ దిక్కునకు ప్రయాణమును, రాజదర్శనమును, శూద్ర
ప్రభు మూలకముగా సుఖమును, యుద్ధమునందు శత్రునాశ
మును, నీలవస్తు సంప్రాప్తియు, ధాన్యవృద్ధియు, గో ధనసమృ
ద్ధియు, శత్రునాశమును, యత్నకార్యార్థ సిద్ధియు, దేహారోగ్య
మును కలుగును.

గ్రంథాంతరే॥

శ్లో॥ మందదాయే మందభుక్తౌ వ్యాధిపీడా భవిష్యతి।
స్థానభ్రంశం మనోదుఃఖం నృపచోరాగ్ని పీడనం।
దాయాది కలహంచైవ క్రూరమాసే మహద్భయం।
శుభమాసే శుభంప్రోక్తం నీచమాసేర్థనాశనం।
కోదండ మీనరాశౌ వాతద్దాయే సుఖదోభవేత్।
రాజయోగంప్రకుర్వీత విశేష ధనలాభకృత్॥ 2

తా. శనిదశలో స్వభుక్తియందు వ్యాధిపీడయు, స్థాన
భ్రంశమును, మనోదుఃఖమును, రాజ చోరాగ్ని పీడయు,
దాయాది జనులతోడ కలహమును, క్రూరమాసమునందు
గొప్ప భయమును, శుభమాసమునందు శుభఫలమును, నీచ
రాశియందుండగా అర్థనాశనమును, ధను ర్మీనరాసులయం
దుండగా ఆ భుక్తియందు సుఖమును, రాజయోగమును, విశే
ష ధన లాభమును కలుగును.

శ్లో॥ లగ్న షష్ఠాష్టమేవాపి వ్యయేవా నీచరాశిగే।
తద్భుక్తౌ వ్యాధిశోకంచ చింతాకష్టం రిపోద్భయం।



సమాన జననాశశ్చ చతుష్పాజ్జీవనాశనం।
నీచారి కలహంచైవ మహద్దుఃఖం భవిష్యతి।
నానామూలార్థనాశశ్చ ధాన్యాదీనాం వినాశనం।
ఉద్యోగభంగం చలన మపకీర్తి భయంతథా॥ 3

తా. లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను,
లేక నీచరాశియం దున్నను,ఆభుక్తియందు వ్యాధిభయమును,
మనోవ్యాకులమును, కష్టమును, శత్రుభయమును, సమాన జన
నాశమును, చతుష్పాజ్జీవనాశనమును, నీచజనులతోడను, శత్రు
వులతోడను, కలహమును, అధిక దుఃఖమును, నానామూలక
ముగా ధననాశమును, ధాన్యనాశమును, ఉద్యోగ భంగమును,
చలనమును, అపకీర్తిభయమును కలుగును.

శ్లో॥ రవిణా సంయుతేదృష్టే శిరోరోగ మతిభ్రమం।
ఉద్యోగభంగం చలనం నృపక్రోధం భవిష్యతి॥ 4

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, శిరో
రోగమును, మతిభ్రమణయు, ఉద్యోగ భంగమును, చలన
మును, రాజక్రోధమును కలుగును.

శ్లో॥ శశినా సంయుతే దృష్టే మాతృవంశ వినాశనం।
మనోవిచార ఖేదంచ సర్వకార్య వినాశనం॥ 5

తా. చంద్రునితో కలసినను, లేక చూడబడినను,
మాతృవంశపు వారికి వినాశమును, మనోవిచారమును, దుఃఖ
మును, సర్వకార్య వినాశమును కలుగును.

శ్లో॥ కుజేన సంయుతేదృష్టే యుద్ధే ష్వపజయంతథా।
జ్వరాతిసార గ్రహణి రోగబాధా నసంశయః॥ 6

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, యుద్ధ
మునందు అపజయమును, నిస్సంశయమును, జ్వరాతిసార గ్ర

హాని రోగబాధలును కలుగును.

శ్లో॥ బుధేన సంయుతేదృష్టే విద్యామూలా ద్ధనాగమం।
బంధుప్రియ జయంచైవ యత్నకార్య సు సిద్ధిదం॥ 7

తా. బుధునితో కలసినను, లేక చూడబడినను విద్యా పాండిత్యమువల్ల ధనాగమంబును బంధుప్రియమును, యత్న కార్యకార్య సిద్ధియు కలుగును.

శ్లో॥ గురుణా సంయుతేదృష్టే పుత్రదారాదినాశనం।
ధననాశం దేహబాధా బుద్ధిభ్రంశో భవిష్యతి॥ 8

తా. గురువుతో కలసినను, లేక చూడబడినను, భార్యా పుత్ర నాశనమును, ధననాశమును, దేహబాధయు, బుద్ధి భ్రంశమును కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతే దృష్టే స్వకళత్రస్య నాశనం।
గర్భస్రావం వ్యాధిపీడా పరస్త్రీ కలహంతథా॥ 9

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, స్వంత భార్య నాశనమును, గర్భస్రావమును, వ్యాధిపీడయు, అన్య స్త్రీతోడ కలహమును కలుగును.

శ్లో॥ రంధ్రాధిపేన సంయుక్తో రంధ్రస్థానగతోపివా।
ద్వితీయ సప్తమస్థేవా అపమృత్యు ర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం మృత్యుంజయ జపంచరేత్।
తిలదానం ప్రకుర్వీత కృష్ణధేనుం ప్రదాపయేత్॥ 10

తా. శని అష్టమాధి పతితో కలసినను లేక అష్టమ స్థానమం దున్నను, లేక ద్వితీయ సప్తమ రాసులయం దున్నను, అపమృత్యువు సంభవించును. ఆ దోష పరిహారార్థమై మృత్యుంజయ జపము చేయవయును, అటుపిమ్మట తిలదాన మును, నల్లని గోదానముచు చేసినపిమ్మట శాంతి కలుగును.



శనిదశాయాం బుధభుక్తిమాసాః 32. దినాని 9.

కృష్ణిర్యే॥

శ్లో॥ శనేరంతర్గతే సౌమ్యే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయే లాభగేవాపి ఉచ్చరాశిస్థితేపివా।
వివాహం భాగ్యవృద్ధిశ్చ విద్యాలాభో భవిష్యతి।
బంధూనా ముపకారశ్చ వస్త్రాభరణ సంగ్రహః।
సమాన ప్రభుసన్మానం యవనప్రభుదర్శనం।
ఇష్టసిద్ధి స్సుఖంచైవ స్వవారేనృపదర్శనం।
క్రయవిక్రయకౌశల్యం వ్యవహారే జయోభవేత్।
సభాపూజ్యత్వ మాప్నోతి త్వన్నదాన పరోభవేత్।
విష్ణుపూజాం విశేషేణ సురభూసుర పూజనం।
యత్నకార్యార్థ సిద్ధిశ్చ స్త్రీసౌఖ్యం పుత్రవృద్ధిదం॥ 1

తా. శనిదశలో బుధభుక్తియందు బుధుడు లగ్నమునకు కేంద్రత్రికోణముల యందున్నను, తృతీయలాభముల యందు న్నను, లేక తన ఉచ్చరాశిని పొందియున్నను, వివాహప్రాప్తి యు, భాగ్యాభివృద్ధియు, విద్యాలాభమును, బంధుజనోపకార మును, వస్త్రాభరణ సంగ్రహమును, సమాన ప్రభుసన్మానము ను, మ్లేచ్ఛప్రభుదర్శనమును, ఇష్టసిద్ధియు, సుఖమును, తనవా రమునందు రాజదర్శనము, క్రయవిక్రయ కౌశల్యతయు, వ్యవ హారమునందు జయమును, సభాపూజ్యతయు, అన్నదానపర త్వము, విష్ణుపూజయును, విశేషముగా దేవబ్రాహ్మణపూజ యు, యత్నకార్యార్థసిద్ధియు, భార్యాపుత్ర సౌఖ్యముచు, అభి వృద్ధియు కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టమే సౌమ్యే వ్యయేవా నీచరాశిగే।
బంధుభిః కలహశ్చైవ నానాశోక సమాగమః॥

స్త్రీపుత్ర కలహశ్చైవ ఉదీచ్యాం శత్రుభిర్భయం।
యత్నకార్య వినాశశ్చ బంధుపీడా భవిష్యతి।
కృషిక్షేత్ర వినాశశ్చ వాహనాది పశుక్షయః।
విద్యావినాశనంచైవ మాతృవర్గాది పీడనం॥ 2

తా. బుధుడు లగ్నమునకు ౬-౮-౧౨. స్థానముల యందున్నను, లేక తన నీచరాశియందున్నను, బంధుజనులతోడ కలహమును, నానావిధ దుఃఖసంభవమును, భార్యాపుత్ర కలహమును, ఉత్తరదిక్కునందు శత్రుభయమును, యత్నకార్య భంగమును, బంధుజనపీడయు, కృషినష్టమును, క్షేత్రనాశమును, వాహనాది క్షయమును, పశుహానియు, విద్యావినాశమును, మాతృవర్గాది పీడయు కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే బంధుప్రీతిః ప్రజాయతే।
వివాహకార్య యత్నాని భూపాలాత్సుఖమశ్నుతే॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను బంధుప్రీతియు, వివాహకార్య ప్రయత్నమును, రాజువల్ల సౌఖ్యమును కలుగును.

శ్లో॥ చంద్రేణసంయుతే దృష్టే ముక్తామణి సుసంగ్రహః।
అపూర్వ వస్తుసంప్రాప్తిః ఇష్టసిద్ధిర్భవిష్యతి॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, ముక్తామణి సంగ్రహమును, అపూర్వవస్తు సంప్రాప్తియు, ఇష్టసిద్ధియు కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే యుద్ధేశత్రువివర్ధనం।
పాకశాలాధికారశ్చ సోదరాణాం వివర్ధనం॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను యుద్ధమునందు శత్రువృద్ధియు, పాకశాలాధి కారమును, సహోదరాభి



వృద్ధియు కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే వేదశాస్త్ర ప్రసంగతః।
ప్రాకారాధీశ మిత్రత్వం పుత్రప్రాప్తి ర్నసంశయః॥ 6

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, వేదశాస్త్ర ప్రసంగమును, రాజస్నేహమును, నిస్సంశయముగా పుత్రప్రాప్తియు కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే వస్త్రవాహన సంగ్రహః।
మహారాజాశ్రయప్రాప్తిః స్త్రీమూలాత్సుఖమాప్నుయాత్॥

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, వస్త్రవాహన సంగ్రహమును, మహారాజాశ్రయ ప్రాప్తియు, స్త్రీమూలకముగా సుఖమును కలుగును.

శ్లో॥ శనినా దేహబాధాచ సర్వత్రకలహస్తథా।
అపకీర్తిస్సుభీతిశ్చ స్వభృత్య కలహస్తథా॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను దేహబాధయు, సర్వులతోడను కలహమును, అపకీర్తిభయమును, తన సేవకులతోడ కలహమును కలుగును

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యేలాభగేపివా।
శుభగ్రహయుతేవాపి తద్భుక్తౌ శుభసంపదః।
హేమాభరణ వస్త్రాప్తి రపూర్వ ప్రియదర్శనం॥
గోమహిష్యాది వృద్ధిశ్చ నిత్యం బ్రాహ్మణభోజనం।
శుభశోభన సంప్రాప్తి శ్శూద్రప్రభువశాత్సుఖం।
సమానజనమిత్రత్వం గ్రామనేతా భవిష్యతి॥ 9

తా. బుధుడు దశానాథునకు కేంద్రకోణముల యందున్నను, తృతీయలాభముల యందున్నను, లేక శుభగ్రహములతో యున్నను, ఆభుక్తియందు శుభసంపదయు, హేమా

భరణ సంప్రాప్తియు, అపూర్వ ప్రియదర్శనమును, గోమహి
ష్యాది వృద్ధియు, నిత్యము బ్రాహ్మణ సంతర్పణయు, శుభశో
భన సంప్రాప్తియు, శూద్ర ప్రభు మూలకముగా సుఖమును,
సమాన జనస్నేహమును, గ్రామాధిపత్యమును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
పాపగ్రహాయుతేవాపి పాపచింతా భవిష్యతి।
అకస్మాత్కలహశ్చైవ బాంధవాది వినాశనం।
విద్యావాదే భయంచైవ విదేశగమనంతథా॥ 10

తా. బుధుడు దశానాథునకు ౬-౮-౧౨. స్థానములలో
యున్నను, పాపసంబంధము కలిగియున్నను లేక పాపగ్రహ
ముతో కూడియున్నను, ఆభుక్తియందు పాపకార్య చింతయు,
అకస్మాత్తుగా కలహమును, బంధుజన నాశనమును, విద్యావాద
భయమును, విదేశ గమనమును కలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యు ర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం మహిషీ దాన మాచరేత్॥ 11

తా. బుధుడు ద్వితీయ సప్తమరాసుల యందున్న
యెడల అపమృత్యువు సంభవించును. ఆదోషపరిహారార్థమై
ఎనుముదానము చేయవలయును.

---

శనిదశాయాం కేతుభుక్తిమాసాః 13. దినాని 9.

కృష్ణిర్యో॥

శ్లో॥ మందస్యాంతర్గతే కేతౌ కలహో రాజవిడ్వరః।
సర్వకార్యవినాశశ్చ చతుష్పాజ్జీవనాశనం।
సమాన జనశోకార్తిః బంధుభిఃకలహస్తథా।
కళత్రపుత్రపీడాచ యాత్రాయాం కార్యనాశనం।
విధవాకలహశ్చైవ నీచసేవా భవిష్యతి।



శూద్రప్రభువిరోధశ్చ స్థానభ్రష్టో ధనక్షయః।
గ్రహణీజ్వరబాధాచ ఉద్యోగ చలనంతథా।
మతిభ్రంశో మానభంగో హ్యాపకీర్తి కర స్తథా।
ఏవంఫలం దశాధీశా త్కేంద్రేకోణే ధ్వజేస్థితే।
అష్టమేవా వ్యయేవాపి బహుకష్ట తరోభవేత్॥ 1

తా. శనిదశలో భుక్తినాథుడగు కేతువు దశానాథునకు
కేంద్రకోణముల యందున్న యెడల, కలహమును, రాజవిడ్వ
రమును, సర్వకార్య భంగమును, చతుష్పాజ్జీవనాశనమును,
సమాన జనదుఃఖమును, బంధువులతోడ కలహమును, భార్యా
పుత్రపీడయు, ప్రయాణమునందు కార్యనాశనమును, విధవా
స్త్రీతోడ కలహమును, నీచజనసేవయు, శూద్రప్రభువుతోడ
విరోధమును, స్థానభ్రష్టత్వమును, ధనక్షయమును, గ్రహణీ
జ్వరబాధయు, ఉద్యోగచలనమును, బుద్ధిభ్రంశమును, మాన
భంగమును, అపకీర్తియు కలుగును. కేతువు దశానాథునకు
అష్టమ వ్యయముల యందున్న యెడల అధిక కష్టము
సంభవించును.

శ్లో॥ లగ్నస్య లాభరాశిస్థే తృతీయే షష్ఠగేపివా।
తద్భుక్తౌ వాహనప్రాప్తిః యుద్ధేశత్రు జయ స్తథా।
దారపుత్రాది సౌఖ్యంచ మిత్రప్రభు వశాత్సుఖం।
ఉద్యోగలాభో సుఖదః ధనధాన్యాధిక స్తథా।
అశ్వాదివాహనప్రాప్తిః మహారాజ ప్రసాదతః।
యజ్ఞదీక్షాది ధర్మశ్చ మంత్రసిద్ధి ర్భవిష్యతి॥ 2

తా. కేతువు లగ్నమునకు లాభస్థానమందున్నను, తృతీ
య షష్టమరాసులయం దున్నను, ఆభుక్తియందు వాహన
ప్రాప్తియు, యుద్ధమునందు శత్రుజయమును, భార్యాపుత్రాది

సౌఖ్యమును, స్నేహప్రభుమూలకముగా సుఖమును, ఉద్యోగ లాభమును, సుఖమును, ధనధాన్య సమృద్ధియు, అశ్వాది వాహనప్రాప్తియు, మహారాజానుగ్రహమును, యజ్ఞదీక్షాది ధర్మకార్యసిద్ధియు, మంత్రసిద్ధియు కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే స్థాననాశం వదేద్బుధః।
ఉద్యోగనాశనం దుఃఖం చింతావ్యాధి భయంతథా॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను స్థాననాశము కలుగునని పండితులచే చెప్పబడుచున్నది. గాకను ఉద్యోగనాశనమును, దుఃఖమును, చింతయు, వ్యాధిభయమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతే దృష్టే క్షీరాన్నం రాజభోజనం।
విద్యావినోదకీర్తించ సర్వకార్యాణి సిద్ధిదం॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, క్షీరాన్నమును, మృష్టాన్న రాజభోజనమును, విద్యావినోద కీర్తియు, సర్వకార్యసిదియు కలుగును.

శ్లో॥ కుజేన సంయుతే దృష్టే ధనధాన్య వ్రయస్తదా।
స్థానాంతరాది సంప్రాప్తిర్యుద్ధే శత్రుభయంతథా॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను ధనధాన్యవ్రయము, స్థానాంతరాది వాసమును, యుద్ధమునందు శత్రుభయమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే విద్యాభ్యాసాది సంగ్రహః।
సత్కథాశ్రవణంచైవ యత్నకార్య సుసిద్ధిదః॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను విద్యాభ్యాసాది సంగ్రహమును, సత్కథాశ్రవణమును, యత్నకార్యసిద్ధియు కలుగును.



శ్లో॥ గురుణాసంయుతే దృష్టే గురుపుత్ర వినాశనం।
విప్రజాతి విరోధశ్చ నానామూలా ధనవ్రయం॥ 7

తా. గురువుతో కలసినను లేక చూడబడినను గురుహానియు, లేక పుత్రనాశనమును, బ్రాహ్మణ విరోధమును, నానా మూలకముగా ధనవ్రయము కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే వస్త్రవాహన సంగ్రహం।
ముక్తామణి నిధిర్లాభం నృపాల సదృశోపమః॥ 8

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను వస్త్రప్రాప్తియు, వాహన సంగ్రహమును, మౌక్తికాది మణుల సంప్రాప్తియు, నిధి నిక్షేపలాభమును, రాజసమానమగు ఐశ్వర్యమును కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే దారపుత్ర వినాశనం।
సమాన జనశోకంచ నానారోగాది పీడనం॥ 9

తా. శనితో కలసినను లేక చూడబడినను, భార్యాపుత్ర వినాశమును, సమాన జనశోకమును, నానావిధరోగ బాధయు కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యే లాభగేపివా।
శుభగ్రహ యుతేవాపి దారసౌభాగ్య మేవచ।
యత్నకార్యాణి సిద్ధిశ్చ రత్నకాంచన లాభకృత్।
వినోద విద్యావిజయం సమరే శత్రునాశనం॥ 10

తా. కేతువు దశానాథునకు కేంద్రకోణముల యందున్నను, తృతీయలాభముల యందున్నను, లేక శుభగ్రహముతో కూడియున్నను, ఆభుక్తియందు కళత్ర సౌభాగ్యమును, యత్నకార్యసిద్ధియు, రత్నలాభమును, హేమసంగ్రహమును, మనోవిలాసమును, విద్యావిజయ వైభవమును, యుద్ధము

నందు శత్రునాశమును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
స్త్రీనాశం పుత్రనాశంచ సర్వకార్యాది నాశనం।
యాత్రాయాం కార్యహానిశ్చ ఇష్టప్రభువినాశనం।
విధవాకలహంచైవ యత్నకార్య వినాశనం॥ 11

తా. కేతువు దశానాథునకు ౬-౮-౧౨ స్థానములయం దున్నను, లేక పాపులతో కలసియున్నను, ఆభుక్తియందు భార్యాపుత్రనాశనమును, సర్వకార్యముల యందును భంగ మును, యాత్రయందు కార్యహానియు, ఇష్టప్రభువినాశమును, విధవాకలహమును, యత్నకార్య భంగమును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా అపమృత్యు ర్భవిష్యతి।
తద్దోష పరిహారార్థం మృత్యుంజయ మథార్చనం।
సువర్ణస తిలందానం కుర్యాచ్ఛాంతి మవాప్నుయాత్॥

తా. ద్వితీయ సప్తమరాసులయందు కేతువున్న యెడల అపమృత్యువు సంభవించును. ఆదోషపరిహారార్థమై మృత్యుం జయ జపము చేయవలయును. మరియు, సువర్ణ తిలదానము చేసిన పిమ్మట శాంతి కలుగును.

---

శనిదశాయాం శుక్రభుక్తిమాసాః 38.

పారాశర్యే॥

శ్లో॥ శనేరంతర్గతే శుక్రే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయే లాభగేవాపి ఉచ్చ స్వక్షేత్ర సంయుతే।
వివాహో విజయప్రాప్తిః పుత్రలాభం భవిష్యతి।
గృహే కళ్యాణవిభవో బంధువృద్ధి స్తథాభవేత్।
సువస్త్రాభరణః ప్రాప్తిం స్వపదప్రాప్తి మేవచ।
దారపుత్రాదిసౌఖ్యంచ యానవాహన మాప్నుయాత్।



స్వనామాంకిత ఉద్యోగః కీర్తిప్రాప్తి ర్నసంశయః।
సర్వకార్యార్థ సిద్ధించ సత్కర్మ ఫలమశ్నుతే॥ 1

తా. శనిదశలో శుక్రభుక్తియందు శుక్రుడులగ్నమునకు కేంద్రకోణములయందున్నను, తృతీయలాభములయందున్నను, లేక తనఉచ్చస్వక్షేత్రములయందున్నను, ఆభుక్తియందువివా హ ప్రాప్తియు,విజయమును, పుత్రలాభమును, యింటియందు కళ్యాణవిభవమును, బంధువృద్ధియు, శ్రేష్ఠమైన వస్త్రాభరణప్రా ప్తియు,స్థాననాశనమును,భార్యాపుత్రాది సౌఖ్యమును,యానా రోహణమును, వాహనప్రాప్తియు, స్వతంత్ర ముద్రాధికార మును, కీర్తిలాభమును, సర్వకార్యార్థ సిద్ధియు, సత్కర్మ ఫల మును కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టగే శుక్రే వ్యయేవా నీచరాశిగే।
క్రూరగ్రహేణ సంయుక్తే నీచస్త్రీ భోగమాప్నుయాత్।
కలహం ధననాశంచ విగ్రహో బంధుభిస్సహా।
నానాకార్య వినాశశ్చ వాహనాది భయ స్తదా।
మనఃఖేదో మానభంగో హ్యాపకీర్తి భయ స్తథా।
పుత్రమిత్ర విరోధశ్చ స్వస్త్రీవ్యాధి ర్భవిష్యతి॥ 2

తా. శుక్రుడు లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను, నీచరాశిని పొందియున్నను, లేక క్రూరగ్రహముతో కూడియున్నను, నీచస్త్రీ సంభోగమును, కలహమును, ధన నాశమును, బంధు ద్వేషమును, నానాకార్య వినాశమును, వాహనాది భయమును, మనోదుఃఖమును, మానభంగమును, అపకీర్తి భయమును, పుత్రమిత్ర విరోధమును, స్వస్త్రీకి వ్యాధి సంభవమును కలుగును.

శ్లో॥ రవిణా సంయుతేదృష్టే యత్నకార్య వినాశనం।

స్వప్రభోస్తు విరోధశ్చ చింతాప్రాబల్య మేవచ॥ 3

తా. సూర్యునితో కలసినను, లేక చూడబడినను, యత్నకార్య వినాశమును, తన ప్రభువుతోడ విరోధమును, మనో వ్యాకులమును కలుగును.

శ్లో॥ శశినా సంయుతేదృష్టే రత్నభూషణ సంగ్రహః।
ఉత్తమాశ్వాది లాభశ్చ చిత్రవస్త్రాది సంగ్రహః॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, రత్నభూషణ సంగ్రహమును, ఉత్తమాశ్వాది లాభమును, చిత్ర వస్త్రాది సంగ్రహమును కలుగును.

శ్లో॥ కుజేన సంయుతేదృష్టే వ్యాధిపీడా మహద్భయం।
సమానప్రభుకోపశ్చ దాయాది జనపీడనం॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, వ్యాధి పీడయు, గొప్ప భయమును, సమాన ప్రభు కోపమును, దాయాది జనపీడయు కలుగును.

శ్లో॥ బుధేన సంయుతేదృష్టే వేదశాస్త్రాది చింతనం।
బంధువృద్ధిశ్చ కళ్యాణం పుత్రప్రాప్తి స్సువృద్ధిదా॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, వేద శాస్త్రాది చింతనయు, బంధువృద్ధియు, కళ్యాణమును, పుత్ర ప్రాప్తియు కలుగును

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే నిధిలాభో భవేద్ధ్రువం।
యజ్ఞదీక్షాది సత్కర్మ లభతే నాత్రసంశయః॥ 7

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, నిధి నిక్షేపమును, యజ్ఞదీక్షాది సత్కర్మ ఫలమును కలుగును.

శ్లో॥ మందేన సంయుతేదృష్టే దారావర్గ వినాశనం।
స్వప్రభోస్తు మహత్కష్టం స్వవారే నృపపీడనం॥ 8



తా. శనితో కలసినను, లేక చూడబడినను, కళత్ర వర్గపు వారికి నాశనమును, తన ప్రభువునకు విశేష కష్టమును, తన వారమునందు రాజపీడయు కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యే లాభగేపివా।
శుభగ్రహ యుతేవాపి లాభం భూపాలపూజనం।
అతిసౌఖ్యం సుతప్రాప్తిం గృహే గో ధనసంకులం।
వాహనాంబర లాభంచ వ్యవసాయ వివృద్ధిదం।
దూరదేశాది గమనం సుతీర్థ స్నానమాప్నుయాత్।
అత్యంత శుభసంప్రాప్తి స్సర్వకార్యార్థ సిద్ధిదా॥ 9

తా. శుక్రుడు దశానాథునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక శుభగ్రహ ముతో కూడియున్నను, లాభమును, రాజసన్మానమును, అధిక సుఖమును, పుత్రోత్పనమును, యింటియందు గోధన సంకుల మును, వాహన ప్రాప్తియు, వస్త్ర లాభమును, వ్యవసాయ వృద్ధియు, దూరదేశాది గమనమును, పుణ్యతీర్థ స్థానఫలమును, విశేష శుభసంప్రాప్తియు, సర్వకార్యార్థ సిద్ధియుకలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
స్వాధికార వినాశశ్చ ధననాశం వదేద్బుధః॥
సర్వత్ర కలహాశ్చైవ స్థాననాశం భవిష్యతి।
అవమానం కష్టఫలం స్త్రీమూలాత్కలహాస్తథా॥ 10

తా. దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను, లేక పాపునితో కలసియున్నను, అధికార భంగమును, ధన నాశమును, కలుగునని విద్వాంసులు చెప్పెదరు. గాకను, సర్వ జనులతోడను, కలహమును. స్థాననాశమును, మానభంగ

మును, కష్టఫలమును, స్త్రీమూలకముగా కలహమును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి।
తద్దోష పరిహారార్థం ఛాగపంచక మాచరేత్॥ 11

తా. ద్వితీయ సప్తమ రాసులయందు శుక్రుడున్న యెడల అపమృత్యువు కలుగును. ఆదోష పరిహారార్థమై ఐదు మేకలను దానము చేయవలయును.

---

శనిదశాయాం రవిభుక్తిమాసాః 11. దినాని 12.

శృష్టిర్యో॥

శ్లో॥ శనేరంతర్గతేసూర్యే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
లాభేవా బలసంయుక్తే ఉచ్చస్థేవా తృతీయగే।
రాజ్యాధికార విభవం మణిమాణిక్య సంగ్రహం।
ద్వీపాంతరాణి వస్తూని లభే త్సర్వ ప్రయత్నతః।
స్వవారే రాజసన్మానం బంధూనా ముపకారకం।
విద్యావినోదం విజయం సమరే శత్రునాశనం।
స్వనామాంకిత పద్యాది శ్రవణం కీర్తిమాప్నుయాత్।
సర్వకార్య సుసిద్ధిశ్చ దేహారోగ్యం తథైవచ॥ 1

తా. శనిదశలో సూర్యభుక్తియందు సూర్యుడు లగ్నమునకు కేంద్రకోణములయం దున్నను, లాభస్థానమందు బలము కలిగియున్నను, ఉచ్చరాశియం దున్నను, లేక తృతీయ స్థానమం దున్నను, రాజ్యాధికార విభవమును, మణిమాణిక్య సంగ్రహమును, ద్వీపాంతర వస్తు సంప్రాప్తియు, తన వారమునందు రాజసన్మానమును, బంధు జనోపకారంబును, విద్యా వినోదమును, విజయమును, యుద్ధమునందు శత్రునాశనమును, తనపేరు అంకితము గాగల పద్యములచే పొగడ్తనొందిన కీర్తి విశేషమును, సర్వకార్య సిద్ధియు, దేహారోగ్యమును కలుగును.



శ్లో॥ లగ్నాత్షష్టాష్టగే సూర్యే వ్యయేవా నీచరాశిగే।
తద్భుక్తౌ రాజకలహం సమరే శత్రుపీడనం।
స్వకులాచార హానించ చతుష్పాజ్జీవనాశనం।
శరీరాయాస దుఃఖేన పైత్యరోగాది పీడనం।
అపస్మార భయంచైవ సమాన జననాశనం।
రాజద్వారే కార్యనాశం చింతితార్థ వినాశనం॥ 2

తా. సూర్యుడు లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను, లేక తన నీచరాశిని పొందియున్నను, ఆ భుక్తియందు రాజ కలహమును, యుద్ధమునందు శత్రుపీడయు, తన కులాచార హానియు, చతుష్పాజ్జీవనాశనమును, దేహాలస్యమును, దుఃఖమును, పైత్యరోగాది పీడయు, అపస్మార భయమును, సమాన జననాశమును కలుగును.

శ్లో॥ శశినా సంయుతేదృష్టే మతిభ్రంశం మహద్భయం।
సర్వత్ర కలహశ్చైవ అతిసారాదికం భయం॥ 3

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, బుద్ధి భ్రంశమును, గొప్ప భయమును, సర్వులతోడ కలహమును, అతిసారాది రోగ భయమును కలుగును.

శ్లో॥ భౌమేన సంయుతేదృష్టే జ్వరస్ఫోట భయంతథా।
శస్త్రఘాతాది బాధాచ నీచానాం కలహంతథా॥ 4

తా. కుజునితో కలసినను, లేక చూడబడినను, జ్వర పీడయు స్ఫోటకాది రోగభయమును, శస్త్రదెబ్బలచేకలిగిన బాధయు, నీచ జనులతోడ కలహమును కలుగును.

శ్లో॥ బుధేన సంయుతేదృష్టే తీర్థయాత్రా దిజంఫలం।
స్వవారే నృపసన్మానం క్రయవిక్రయ కౌశలం॥ 5

తా. బుధునితో కలసినను లేక చూడబడినను తీర్థ

యాత్రాది ఫలమును, తన వారమునందు రాజసన్మానమును క్రయవిక్రయ కుశలతయు కలుగును.

శ్లో॥ గురుణా పుత్రరోగాది దేహబాధా ధనక్షయం।
స్వస్త్రీగర్భ వినాశంచ చింతావ్యాధి సమాకులం॥ 6

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, పుత్త్రాది రోగపీడయు, దేహబాధయు, ధనక్షయమును, స్వంత స్త్రీ యొక్క గర్భనాశమును, మనోచింతయు, వ్యాధి సంభవమును కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతేదృష్టే చతుష్పాజ్జీవలాభకృత్।
వస్త్రాభరణ సంప్రాప్తి ర్యత్నసిద్ధి ర్భవిష్యతి॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, చతుష్పాజ్జీవలాభమును, వస్త్రాభరణ సంప్రాప్తియు, యత్నకార్య సిద్ధియు కలుగును.

శ్లో॥ శనినా వ్యాధిశోకంచ పితృవర్గ వినాశనం।
స్వభృత్య జననాశంచ నానాధాన్య వినాశనం॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను, పితృవర్గపు వారికి హానియు, తన సేవకులకు నాశనమును, నానాధాన్య వినాశమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేషు దుశ్చిక్యే లాభగేపివా।
శుభగ్రహ యుతేవాపి ధనధాన్య సుఖప్రదః।
కీర్తిప్రతాప వృద్ధిశ్చ యుద్ధేశత్రు వినాశనం।
ప్రాచ్యాదిశి ప్రయాణంస్యా దత్యంత కలహోభవేత్।
దారపుత్రాది సౌఖ్యంచ పశులాభో భవేత్సుఖం।
మిత్రప్రభు వశాత్సౌఖ్యం యత్నసిద్ధి ర్భవిష్యతి॥ 9

తా. సూర్యుడు దశానాథునకు కేంద్రకోణములయం



దున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక శుభగ్రహముతో కూడియున్నను, ధనధాన్య లాభమును, సుఖమును, కీర్తియు, ప్రతాప వృద్ధియు, యుద్ధమునందు శత్రునాశనమును, పశ్చిమ దిక్కునకు ప్రయాణమును, అత్యంత కలహమును, భార్యాపుత్రాది సౌఖ్యమును, పశులాభమును, సుఖమును, మిత్రప్రభు మూలకముగా సౌఖ్యమును, యత్నకార్య సిద్ధియు కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
తద్భుక్తౌ వ్యాధిపీడాచ సమాన జననాశనం।
కలహం వ్యాధిపీడాచ మతిభ్రంశం మనోవ్యధా।
చతుష్పాజ్జీవనాశంచ యుద్ధేశత్రు భయంతధా॥ 10

తా. సూర్యుడు దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను, లేక పాపగ్రహముతో కూడియున్నను, ఆ భుక్తియందు వ్యాధిపీడయు, సమాన జననాశనమును, కలహమును, బుద్ధి భ్రంశంబును, మనోవ్యథయును, చతుష్పాజ్జీవనాశనమును, యుద్ధమునందు శత్రుభయమును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా హ్యపమృత్యు ర్భవిష్యతి।
తద్దోష పరిహారార్థం సూర్యప్రార్థన మాచరేత్।
స్వర్ణ గర్భిత కూశ్మాండ దానే నారోగ్యమావిశేత్॥ 11

తా. సూర్యుడు ద్వితీయ సప్తమ రాసులయం దున్న యెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై సూర్యప్రార్థన చేయవలయును. మరియు, గుమ్మడి కాయిలో బంగారు నుంచి దానము చేసినయెడల దేహారోగ్యము కలుగును.

శనిదశాయాం చంద్రభుక్తిఫలాః 19.

పారాశర్యే ॥

శ్లో॥ మందస్యాంతర్గతే చంద్రే జీవదృష్టి సమన్వితే।
అథవా సౌమ్యయుక్తేవా రాజ్యప్రాప్తి ర్నసంశయః।
రాజ్యాభిషేక సంయుక్తే యవనప్రభు దర్శనం।
సౌభాగ్యం సుఖవృద్ధించ భృత్యస్య పరిపాలనం।
పితృమాతృ కులాత్సౌఖ్యం పశువృద్ధి స్సుఖాధికం॥ 1

తా. శనిదశలో చంద్రునియొక్క భుక్తియందు చంద్రుడు గురువీక్షణ కలిగియున్నను, లేక శుభగ్రహముతో కూడియున్నను, నిస్సంశయముగా రాజ్య ప్రాప్తియు, రాజ్యాభిషేకమును, మ్లేచ్ఛప్రభు దర్శనమును, సౌభాగ్యమును, సుఖవృద్ధియు, దాసదాసీజన సేవయు, మాతాపితృ వర్గపు వారికి సుఖమును, పశువృద్ధియు, విశేష సౌఖ్యమును కలుగును.

కృష్ణీయే॥

శ్లో॥ శనేరంతర్గతే చంద్రే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయే లాభగేవాపి హ్యుచ్చరాశి స్థితేపివా।
గంగాస్నాన ఫలప్రాప్తి స్సేతుస్నానా దిజంఫలం।
యత్నకార్యార్థ సిద్ధిశ్చ వివాహాది శుభంఫలం।
కల్యాణ గుణమైశ్వర్య మశ్వారోహణ మేవచ।
సర్వేషా ముపకారత్వం వాక్పారుష్యం సభాజయం।
సమాన జనసన్మానం నానామూలా ద్ధనాగమం॥ 2

తా. శనిదశలో చంద్రభుక్తియందు చంద్రుడు లగ్నమునకు కేంద్రత్రికోణముల యందున్నను, తృతీయ లాభముల యందున్నను, లేక తన ఉచ్చరాశియందున్నను గంగాస్నాన ఫలప్రాప్తియు, సేతుస్నానఫలమును, యత్నకార్యార్థ సిద్ధియు,



వివాహాది శుభకర్మప్రాప్తియు, కళ్యాణ గుణమును, ఐశ్వర్యమును, అశ్వారోహణ ప్రాప్తియు, సర్వజనులకు ఉపకారమును, వాగ్విలాసమును, సభలయందు జయమును, సమాన జన సన్మానమును, నానామూలకముగా ధనాగమంబును కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టగే చంద్రే వ్యయేవా నీచరాశిగే।
క్షీణేవా పాపసంయుక్తే క్రూరక్షేత్ర గతోపివా।
తద్భుక్తౌతు మహత్కష్టం రాజకోపం ధనక్షయం।
పితృమాతృ వియోగంచ పుత్రీపుత్ర వినాశనం।
మిత్రప్రభువినాశంచ స్వదేహాయాస పీడనం॥ 3

తా. లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయందు చంద్రుడున్నను, తన నీచరాశియందున్నను, క్షీణుండైనను, పాపగ్రహముతో కలిసియున్నను, లేక క్రూరక్షేత్రమం దున్నను, ఆభుక్తియందు విశేషకష్టమును, రాజకోపమును, ధనక్షయమును, మాతాపితృ వియోగమును, పుత్రీపుత్ర వినాశమును, మిత్రప్రభునాశమును, దేహాలస్యమును, దేహపీడయు కలుగును.

శ్లో॥ రవిణా సంయుతే దృష్టే శిరోరోగం తథైవచ।
పితృవర్గ విరోధంచ స్వస్థానే భయకృద్భవేత్॥ 4

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, శిరోబాధయు, పితృవర్గవిరోధమును, స్వస్థానభయమును కలుగును.

శ్లో॥ భౌమేనసంయుతే దృష్టే యుద్ధేభయ మవాప్నుయాత్।
దాయాది కలహశ్చైవ శత్రువృద్ధి ర్భవిష్యతి॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, యుద్ధమందు భయమును, దాయాదిజన కలహమును, శత్రువృద్ధియు కలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే ధర్మవృద్ధి పరోభవేత్।

అన్నదాన పరో నిత్యం దేవబ్రాహ్మణ పూజనం॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను ధర్మ కార్యవృద్ధియు, అన్నదాన పరత్వమును, దేవబ్రాహ్మణ పూజయు కలుగును.

శ్లో॥ గురుణాశ్వాదిలాభంచ గృహే కళ్యాణ సంభ్రమం।
మహారాజప్రసాదేన ఇష్టసిద్ధి స్సుఖాధికం॥ 7

తా. గురునితో కలసినను లేక చూడబడినను అశ్వాది లాభమును, యింటియందు కళ్యాణ సంభ్రమమును, మహారాజానుగ్రహమువల్ల యిష్టకార్యసిద్ధియు, అధిక సుఖమును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే క్షీరాన్నం రాజపూజ్యతా।
అధికారాది సిద్ధిశ్చ మహారాజాశ్రయ స్తథా॥ 8

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను క్షీరాన్నమును, రాజపూజ్యతయు, అధికారాదిసిద్ధియు, మహారాజాశ్రయమును కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే వాతరోగాది పీడనం।
స్వభృత్య పశునాశంచ నీచారి కలహం తథా॥ 9

తా. శనితో కలసినను లేక చూడబడినను వాతరోగాది పీడనయు, తన సేవకులకు నాశనమును, పశుహానియు, నీచ జనులతోడను, శత్రువులతోడను కలహమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యే లాభగేపివా।
శుభగ్రహయుతేవాపి శుభంఫల ముదీరయేత్।
విచిత్రవస్త్రలాభంచ ధనధాన్యాది సంగ్రహం।
అపూర్వవస్తుసంప్రాప్తిం పండితానాం సమాగమం।
పుణ్యతీర్థాదిగమనం దూరాదాహ్వాన పత్రికా।



యత్నకార్యార్థసిద్ధించ నానామూలా ద్ధనాగమం॥ 10

తా. చంద్రుడు దశానాథునకు కేంద్రకోణముల యందున్నను, తృతీయలాభములయందున్నను, లేక శుభగ్రహముతో కూడియున్నను శుభఫలము వచింపతగినది. గాకను విచిత్ర వస్త్రలాభమును, ధనధాన్యాది సంగ్రహమును, అపూర్వవస్తు సంప్రాప్తియు, విద్వాంసులయొక్క సమాగమంబును, పుణ్యతీర్థాది గమనంబును, దూరదేశమునుండి ఆహ్వాన పత్రికా గమనమును, యత్నకార్యార్థ సిద్ధియు, నానా మూలకముగా ధనలాభమును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠ రంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
దూరయాత్రా కార్యహాని స్సంగ్రామే ప్రాణహానిదః।
బాంధవాది విరోధశ్చ నానాచింతా పశుక్షయః।
అర్థవ్రయంచ దుఃఖంచ అశ్వనాశో భవిష్యతి॥ 11

తా. చంద్రుడు దశానాథునకు ౬-౮-౧౨. స్థానముల యందున్నను లేక పాపగ్రహముతో కలసియున్నను, దూర దేశ ప్రయాణమును, కార్యహానియు, యుద్ధమునందు ప్రాణహానియు, బంధుజనులతోడ విరోధమును, నానావిధచింతయు, పశుక్షయమును, ధనవ్రయమును, దుఃఖమును, అశ్వనాశమును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా అపమృత్యు ర్భవిష్యతి।
తద్దోష పరిహారార్థం శ్వేతాంగాం దానమాచరేత్॥

తా. చంద్రుడు ద్వితీయ సప్తమరాసుల యందున్నయెడల అపమృత్యువు సంభవించును. ఆదోషపరిహారార్థమై తెల్లని ఆవును దానము చేయవలయును.

శనిదశాయాం కుజభుక్తిమాసాః 13. దినాని 9.

కృష్ణీయే॥

శ్లో॥ శనేరంతర్గతే భౌమే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయే లాభగేవాపి హ్యుచ్చస్వక్షేత్రగేపివా।
తద్భుక్తౌ జ్ఞాతివృద్ధిశ్చ సహోదరమృతి ర్భవేత్।
దాయాదివ్యవహారంచ దేహకష్టం మతిభ్రమం।
దేశాంతరాదిగమనం మనశ్చాంచల్య మేవచ।
స్వమిత్రజనవైరత్వం కారాగృహ ప్రవేశనం।
నిగళంరాజభీతించ స్వజనానాం వినాశనం।
అకస్మాత్కలహంచైవ స్వస్త్రీపుత్రాది పీడనం।
క్షితీశాత్కలహంచైవ స్వప్రభోస్తు మహద్భయం।
సమాన జనశోకంచ కృషిక్షేత్ర వినాశనం॥ 1

తా. శని మహర్దశలో కుజభుక్తియందు కుజుడు లగ్నమునకు కేంద్ర త్రికోణములయం దున్నను, తృతీయలాభములయం దున్నను లేక తన ఉచ్చస్వక్షేత్రముల యందున్నను జ్ఞాతివృద్ధియు, భ్రాతృనాశనమును. దాయాది వ్యవహారమును, దేహకష్టమును, బుద్ధి భ్రంశమును, దేశాంతరాది గమనమును, మన శ్చాంచల్యమును, తన మిత్రులతోడ విరోధమును, కారా గృహప్రవేశమును, బంధన ప్రాప్తియు, రాజభీతియు, స్వజన నాశనమును, అకస్మాత్తుగా కలహమును, భార్యాపుత్రాది పీడయు, రాజుతోడ కలహమును, తన యజమానుని వల్ల గొప్పభయమును, సమాన జనశోకమును, కృషినష్టమును, క్షేత్రనాశమును కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్ట దుశ్చిక్యే లాభేభౌమే బలైర్యుతే।
భూపాల మిత్రసుఖదం ధనధాన్య సమృద్ధిదం।



మహారాజాశ్రయప్రాప్తి మిష్టసిద్ధిం సుఖాధికం।
కళ్యాణ గుణమైశ్వర్యం స్వవారే రాజదర్శనం।
యత్నకార్యాది సిద్ధించ సహోదర వివృద్ధిదం।
దాయాది జననాశంచ చతుష్పాజ్జీవవృద్ధిదం॥ 2

తా. కుజుడు లగ్నమునకు ౬-౮. రాసుల యందున్నను, లేక తృతీయ లాభములయందు బలముతో కూడియున్నను, రాజస్నేహమును, సుఖమును, ధనధాన్య సమృద్ధియు, మహారాజాశ్రయ ప్రాప్తియు, ఇష్టసిద్ధియు, విశేష సుఖమును, కళ్యాణ గుణమైశ్వర్యమును, తనవారమునందు రాజదర్శనమును, యత్నకార్యసిద్ధియు, భ్రాతృవృద్ధియు, దాయాది జననాశమును, చతుష్పాజ్జీవరాసులకు అభివృద్ధియు కలుగును.

శ్లో॥ రవిణా సంయుతే దృష్టే సహోదర మృతిస్తథా।
బుద్ధిభ్రంశో మానభంగో హ్యపకీర్తి భయంతథా॥ 3

తా సూర్యునితో కలసినను లేక చూడబడినను, భ్రాతృనాశమును, మతిభ్రంశమును, మానభంగమును, అపకీర్తిభయమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతే దృష్టే స్త్రీలాభం పుత్రలాభకృత్।
మనోవిలాసం పాండిత్యం స్వాధికారాది వృద్ధిదం॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను స్త్రీలాభమును, పుత్రలాభమును, మనోవిలాసమును, పాండిత్యమును, తన అధికారవృద్ధియు కలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే బంధూనా ముపకారకం।
స్వస్త్రీవిలాసం పాండిత్యం విచిత్ర గృహలాభకృత్॥ 5

తా. బుధునితో కలసినను లేక చూడబడినను బంధుజనోపకారమును, స్వంతస్త్రీతోడ విలాసమును, పాండిత్యము

ను, విచిత్ర గృహలాభమును కలుగును.

శ్లో॥ గురుణా సంయుతే దృష్టే పుత్రపీడా ధనక్షయం।
దేహబాధా మతిభ్రంశం స్వాధికార వినాశనం॥ 6

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, పుత్రపీడయు, ధనక్షయమును, దేహబాధయు, బుద్ధిభ్రంశమును, తన అధికార భంగమును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే భోగస్త్రీభోగవైభవం।
గృహేకళ్యాణ సంపత్తిం వస్త్రలాభం విచిత్రకం॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను భోగమును, ముఖ్యముగా స్త్రీభోగ విభవమును, యింటియందు కళ్యాణ సంపత్తియు, విచిత్ర వస్త్రలాభమును కలుగును.

శ్లో॥ శనినా సంయుతే దృష్టే నీచసేవా మహద్భయం।
ఉద్యోగ చలనం చైవ సమాన జనపీడనం॥ 8

తా. శనితో కూడినను లేక చూడబడినను, నీచజనసేవయు, విశేషభయమును, ఉద్యోగచలనమును, సమాన జనపీడయు కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్ర కోణేవా షష్ఠేలాభ తృతీయగే।
భౌమే బల యుతేవాపి వివాహాది సుఖప్రదం।
స్త్రీపుత్రసౌఖ్యం సుఖదం మనోత్సాహం తథైవచ।
భూలాభం ధాన్యవృద్ధించ గోలాభం ధనవృద్ధిదం।
యత్నకార్యార్థ సిద్ధించ దేహారోగ్యం తథైవచ॥ 9

తా. కుజుడు బలముతో కూడినవాడై, దశానాథునకు కేంద్ర కోణములయం దున్నను, తృతీయలాభములయం దున్నను, షష్టమస్థానమందున్నను వివాహాది సుఖమును, భార్యాపుత్ర సౌఖ్యమును, సుఖమును, మనోత్సాహమును, భూలాభ



మును, ధాన్యవృద్ధియు, గోలాభమును, ధనసమృద్ధియు, యత్నకార్యసిద్ధియు, అర్థలాభమును, దేహారోగ్యమును కలుగును

శ్లో॥ దాయేశాదష్టమేరాశౌ వ్యయేవా నీచరాశిగే।
అపకీర్తి భయంచైవ మానహాని ర్భవిష్యతి।
చోరాగ్ని రిపుబాధాచ స్థాననాశం తథైవచ।
యత్నకార్య వినాశశ్చ శస్త్రబాధా భవిష్యతి॥ 10

తా. కుజుడు దశానాథునకు అష్టమ వ్యయములయం దున్నను, లేక తన నీచరాశిని పొందియున్నను, అపకీర్తి భయమును, మానహానియు, చోరబాధయు, అగ్నిభీతియు, శత్రుపీడయు, స్థాననాశమును, యత్నకార్య భంగమును, శస్త్రబాధయు కలుగును

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా అపమృత్యు ర్భవిష్యతి।
తద్దోష పరిహారార్థం మహిషీ దానమాచరేత్॥ 11

తా. ద్వితీయ సప్తమరాసులయం దున్న యెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై మహిష దానము చేయవలయును.

---

శనిదశాయాం రాహుభుక్తిమాసాః 34. దినాని 6.

పారాశర్యే॥

శ్లో॥ మందస్యాంతర్గతేరాహౌ కలహేన మనోవ్యథా।
లగ్నాధిపేన సంయుక్తస్త్వాదౌ సౌఖ్యం ధనాగమం।
మధ్యాంతే క్లేశమాప్నోతి మృతవార్తా గమోభవేత్।
హృద్రోగో మానహానిస్స్యా ద్ధనధాన్య పశుక్షయః॥ 1

తా. శని మహర్దశలో రాహుభుక్తియందు కలహమూలకముగా మనోవ్యథయు, అట్టిరాహువు లగ్నాధిపతితో కూడియున్న యెడల ఆదిభాగమందు సౌఖ్యమును, ధనాగమం

బును, మధ్యభాగమందును, అంత్యభాగమందును, దుఃఖమును, మృతవార్తా గమనంబును, హృదయ సంబంధమగు రోగబాధయు, మానభంగమును, ధనధాన్య పశునాశమును కలుగును.

శ్లో॥ లగ్నా దుపచయేరాహౌ కుళీరే వృషభేతథా।
కన్యా మిథునసంస్థేవా సన్మానం భవతిధ్రువం।
మహారాజ ప్రసాదేన మృష్టాన్నాంబర భూషణం।
ఇష్టదేవ ప్రసాదేన సర్వకార్యాణి సిద్ధిదం।
శన్యారరాహుసంయుక్తే దారాక్లేశం భవిష్యతి।
మాతాపితృవినాశశ్చ బంధుక్లేశో భవిష్యతి॥ 2

తా. రాహువు లగ్నమునకు ఉపచయ రాసులయందున్నను, వృషభ కర్కాటక రాసులయందున్నను, లేక కన్యామిథున రాసులయందున్నను, ఆభుక్తియందు రాజసన్మానమును, మహారాజానుగ్రహమువల్ల మృష్టాన్నభోజనమును, వస్త్రప్రాప్తియు, భూషణలాభమును, ఇష్టదైవానుగ్రహమువల్ల సర్వకార్యసిద్ధియు, కలుగును, శని కుజరాహువులు చేరియున్నయెడల భార్యాశోకమును, మాతాపితృ వినాశమును, బంధువ్యసనమును కలుగును.

గ్రంథాంతరే ॥

శ్లో॥ మందస్యాంతర్గతేరాహౌ లగ్నాత్కేంద్రే త్రికోణగే।
తృతీయే లాభగేవాపి షష్ఠరాశిస్థితేపివా।
ఉచ్చాంశకయుతేవాపి ఉచ్చరాశి స్థితేపివా।
బలోవా యోగనాథోవా యోగకారక సంయుతే।
తద్భుక్తౌ రాజ్యలాభంచ నృపసన్మానమేవచ।
నిత్యంకర్మ రతోనిత్యం దేవతా గురు భక్తిమాన్।
యత్నకార్యార్థ సిద్ధిశ్చ దారపుత్రాది సౌఖ్యదః।
పుత్రప్రాప్తి ర్మహత్సౌఖ్యం ధనలాభో భవిష్యతి॥ 3



తా. శనిదశలో రాహుభుక్తియందు రాహువు లగ్నమునకు కేంద్రత్రికోణములయం దున్నను, తృతీయలాభములయందున్నను, ఆఱవ యింటియందున్నను, ఉచ్చాంశను పొందియున్నను, ఉచ్చరాశియం దున్నను, బలవద్గ్రహముతో కూడియున్నను, లేక యోగకారకగ్రహముతో కూడియున్నను, ఆ భుక్తియందు రాజ్యలాభమును, రాజసన్మానమును, నిత్యము కర్మప్రాప్తియు, దేవతాపూజయు, గురుభక్తియు, యత్నకార్యార్థ సిద్ధియు, భార్యాపుత్రాది సౌఖ్యమును, పుత్రప్రాప్తియు, మేలైన సుఖమును, ధనలాభమును కలుగును.

శ్లో॥ లగ్నాష్టమస్థ వ్యయగే నీచరాశి గతేపివా।
మహావ్యాధి ప్రపీడాచ యత్నకార్య వినాశనం।
విధవా కలహంచైవ నీచస్త్రీ నీచసేవనం।
శూద్రప్రభు వశాత్కష్టం పశుదాస ధనక్షయం।
స్వాధికార వినాశంచ సోదరీ వర్గపీడనం।
పితామహ వినాశంచ దేహబాధా మతిభ్రమం॥ 4

తా. లగ్నమునకు అష్టమ వ్యయ స్థానములయందు రాహువున్నను లేక తననీచరాశిని పొందియున్నను, ఆ భుక్తియందు గొప్ప వ్యాధి సంభవమును, యత్నకార్య భంగమును, విధవా కలహమును, నీచస్త్రీ సంపర్కమును, నీచజన సేవయు, శూద్రప్రభు మూలకముగా కష్టమును, పశుహానియు, దాసదాసీజన నాశమును, ధనక్షయమును, అధికార నాశనమును, సోదరీలకు నాశమును, పితామహ నాశమును, దేహబాధయు, బుద్ధి భ్రంశమును కలుగును.

శ్లో॥ రవిణా సంయుతే దృష్టే రాజదండో ధనక్షయః।
పైత్యభ్రమణ రోగాది దుర్గారణ్య చరోభవేత్॥ 5

తా. సూర్యునితో కలసినను, లేక చూడబడినను, రాజ దండనయు, ధనక్షయమును, పిత్త వికారమును, రోగ బాధయు, దుర్గారణ్యములయందు సంచారణయు కలుగును.

శ్లో॥ శశినా సంయుతే దృష్టే మాతృపీడా మహద్భయం।
అభిమానాది భంగంచ హ్యాపకీర్తి భయంతథా॥ 6

తా. చంద్రునితో కలసినను, లేక చూడబడినను, మాతృపీడయు, విశేష భయమును, అభిమాన భంగమును, అపకీర్తి భయమును కలుగును.

శ్లో॥ కుజేన సంయుతే దృష్టే శస్త్రవర్ణ కృతంభయం।
సహోదర వినాశశ్చ అగ్నిబాధా భవిష్యతి॥ 7

తా. కుజునితో కలసినను, లేక చూడబడినను, శస్త్రములచే గాయములును, భ్రాతృ నాశమును, అగ్నిబాధయు కలుగును.

శ్లో॥ బుధేన సంయుతే దృష్టే విద్యాలాభో భవిష్యతి।
వస్త్రాభరణ వృద్ధిశ్చ మిత్రవర్గ విరోధకృత్॥ 8

తా. బుధునితో కలసినను, లేక చూడబడినను, విద్యా లాభమును, వస్త్రాభరణ ప్రాప్తియు, స్నేహితులతోడ విరోధమును కలుగును.

శ్లో॥ గురుణా సంయుతే దృష్టే కులాచార వినాశనం।
పుత్రపీడా ద్రవ్యహానిః దేహబాధా భవిష్యతి॥ 9

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, కులాచార భంగమును, పుత్రపీడయు, ద్రవ్యహానియు, దేహబాధయు కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతే దృష్టే దారపుత్ర వినాశనం।
స్త్రీవివాదం మనఃక్లేశం వాహనాది పశుక్షయం॥ 10



తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, భార్యాపుత్ర వినాశమును, స్త్రీ వివాదమును, మనోదుఃఖమును, వాహనాది పశుక్షయమును కలుగును.

శ్లో॥ శనినా సంయుతే దృష్టే సమాన జననాశనం।
చండాల జనసంవాదం తస్మాద్ద్రవ్యనాశనం॥ 11

తా. శనితో కలసినను లేక చూడబడినను, సమాన జన నాశనమును, చండాల జనులతోడ కలహమును, ఆమూలకముగా ద్రవ్యనాశనమును కలుగును.

శ్లో॥ దాయేశా త్షష్ఠగే కేంద్రే త్రికోణే లాభగే బలీ।
తృతీయే శుభసంయుక్తే ధనధాన్య సమృద్ధిదః।
యానవాహన సంప్రాప్తిః దారాపుత్రాది సౌఖ్యదః।
సమాన ప్రభుసన్మానం వివిధై ర్ధన లాభకృత్॥ 12

తా. రాహువు బలయుక్తుడై కేంద్రకోణములయందు, ఆఱవ యింటియందుగాని లాభస్థానమందుగాని యున్నను, తృతీయ స్థానమందున్నను, లేక శుభగ్రహ సంబంధము కలిగి యున్నను, ఆభుక్తియందు ధనధాన్య సమృద్ధియు, యాన వాహన సంప్రాప్తియు, భార్యాపుత్రాది సౌఖ్యమును, సమాన ప్రభు సన్మానమును, నానా మూలకముగా ధన లాభమును కలుగును.

శ్లో॥ దాయేశా త్కేంద్రగే నీచ వ్యయేవా పాపసంయుతే।
కరోతి విపులంకష్టం మహదాపత్సుసంభవం।
బంధుశోకం వ్యాకులంచ విధవా కలహంతథా।
దాయాది కలహంచైవ రాజమూలా ద్ధనక్షయం॥ 13

తా. రాహువు దశానాథునకు కేంద్రస్థానములయందున్నను, తన నీచరాశియందున్నను, వ్యయ భావమం

దున్నను, లేక పాపగ్రహముతో కలసి యున్నను, ఆ భుక్తి యందు అధిక కష్టమును, గొప్ప ఆపత్తును, బంధు శోకమును, మనోవ్యాకులమును, విధవా కలహమును, దాయాది జనుల తోడ కలహమును,రాజమూలకముగా ధననాశమునుకలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా మృత్యుబాధా నసంశయః।
తద్దోష పరిహారార్థం నాగదానం చ కారయేత్।
సుబ్రహ్మణ్య జపంకుర్యా ద్దేహే నారోగ్యమావిశేత్॥14

తా. ద్వితీయ సప్తమ రాసులయం దున్న యెడల నిస్సంశయముగా అపమృత్యువు సంభవించును ఆదోష పరిహారార్థమై నాగదానము చేయవలయును. గాకను, సుబ్రహ్మణ్య జపముకూడా చేసినపిమ్మట దేహారోగ్యము కలుగును.

శనిదశాయాం గురుభుక్తిమాసాః 30. దినాని 12.

కృష్ణీయ్యే॥

శ్లో॥ శనేరంతర్గతేజీవే లగ్నాత్కేంద్రే త్రికోణగే।
తృతీయే లాభగేవాపి ఉచ్చరాశి స్థితేపివా।
పుత్రదారాది వృద్ధించ పుత్రికా వృద్ధిమేవచ।
గృహేకళ్యాణ సంపత్తిం గృహలాభం విచిత్రకం।
అపూర్వ వస్తు సంప్రాప్తి ర్విశేష ధనలాభకృత్।
మహారాజాధి కారంచ యజ్ఞదీక్షాది చింతనం।
స్వప్రభోస్తు మహత్సౌఖ్యం స్వవారే ప్రభుదర్శనం।
క్షేత్రధాన్య వివృద్ధించ వాహనాది సమృద్ధికం।
అన్నదాన రతోనిత్యం తీర్థయాత్రాది తత్ఫలం॥ 1

తా. శనిమహర్దశలో గురుభుక్తియందు గురువు లగ్నమునకు కేంద్రత్రికోణములయం దున్నను, తృతీయ లాభ



ములయం దున్నను,లేక తన ఉచ్చరాశియం దున్నను, భార్యాపుత్రాది వృద్ధియు, పుత్రికా వృద్ధియు, యింటియందు కళ్యాణ సంపత్తియు, విచిత్ర గృహలాభమును, అపూర్వ వస్తు సంప్రాప్తియు, విశేష ధనలాభమును, మహారాజాధి కారమును, యజ్ఞదీక్షాది చింతయు, తన ప్రభువు మూలకముగా సుఖమును, తన వారమునందు ప్రభుదర్శనమును క్షేత్రవృద్ధియు, ధాన్యలాభమును, వాహనాది సమృద్ధియు, నిత్యము అన్నదానమును, పుణ్యతీర్థయాత్రాది సేవాఫలమును కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టమేవ్యాపి వ్యయేవా నీచరాశిగే।
గురుపుత్ర వినాశంచ బంధునిగ్రహ మేవచ।
కులాచారాది నాశంచ ధననాశం తథైవచ।
బుద్ధిభ్రంశం దేహబాధా స్వస్థాన ఫలనాశనం।
ఉద్యోగచలనంచైవ క్షేత్రధాన్యాది నాశనం।
సమరే యుద్ధభీతిశ్చ శత్రువృద్ధి ర్భవిష్యతి॥ 2

తా. లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయందు గాని లేక తన నీచరాశియందుగాని రాహు వున్నయెడల గురునాశమును, పుత్రహానియు, బంధు నిగ్రహమును, కులాచార ధర్మనాశమును, ధననాశమును, బుద్ధి వికల్పమును, దేహబాధయు, స్వస్థాన చలనమును, ఉద్యోగ భంగమును, క్షేత్రహానియు, ధాన్యాది నాశనమును, యుద్ధమునందు భయమును, శత్రువృద్ధియు కలుగును.

శ్లో॥ రవిణా సంయుతేదృష్టే గురుదేవ ద్విజార్చనం।
తీర్థయాత్రా ఫలప్రాప్తి శ్శివపూజా ఫలప్రదః॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, గురుభక్తియు, దేవబ్రాహ్మణ పూజయు, తీర్థయాత్రా ఫలప్రాప్తి

యు, శివపూజా ఫలమును కలుగును.

శ్లో॥ శశినా సంయుతేదృష్టే పుంనాథ త్వమేవచ।
అశ్వాందోళ్యాది లాభంచ యుద్ధేజయ మవాప్నుయాత్॥

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, పురాధిపత్యమును, అశ్వాందోళాది వాహన లాభమును, యుద్ధమునందు జయమును కలుగును.

శ్లో॥ కుజేన సంయుతేదృష్టే ప్రవాళ మణిలాభకృత్।
సహోదరాది వృద్ధిశ్చ క్షేత్రవృద్ధిస్తు జాయతే॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, ప్రవాళ మణి లాభమును, సహోదరాది వృద్ధియు, క్షేత్రవృద్ధియు కలుగును.

శ్లో॥ బుధేన సంయుతేదృష్టే గురుపూజా భవిష్యతి।
శివపూజాది సిద్ధిశ్చ పుత్రప్రాప్తి ర్భవిష్యతి॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, గురుపూజయు, శివపూజాఫల సిద్ధియు, పుత్రప్రాప్తియు కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతేదృష్టే స్త్రీసౌఖ్యం బహులాభకృత్।
వాహనం భూషణప్రాప్తిః మహారాజా శ్రయ స్తథా॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, స్త్రీసౌఖ్యమును, విశేష లాభమును, వాహనప్రాప్తియు, భూషణ సంగ్రహమును, మహారాజాశ్రయమును కలుగును.

శ్లో॥ శనినా సంయుతేదృష్టే దాసీదాస వినాశనం।
పశుధాన్య వినాశశ్చ దేహబాధా భవిష్యతి॥ 8

తా. శనితో కలసినను, లేక చూడబడినను, దాసదాసీజన నాశనమును, పశుహానియు, ధాన్యక్షయమును, దేహబాధయు కలుగును.



శ్లో॥ దాయేశా త్కేంద్రకోణేవా దుశ్చిక్యే లాభగేపివా।
శుభగ్రహయుతేవాపి కళ్యాణాది శుభంభవేత్।
పుత్రదారాది సౌఖ్యంచ పుత్రజన్మాది సంభవం।
స్వప్రభోస్తు మహత్సౌఖ్యం రాజమూలా ద్ధనాగమం।
బ్రాహ్మణప్రభు మిత్రత్వం బంధూనా ముపకారకం।
యజ్ఞకర్మాది సంప్రాప్తి రత్నదాన పరోభవేత్॥ 9

తా. దశానాథునకు కేంద్రకోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను లేక శుభగ్రహముతో కూడియున్నను, కళ్యాణాది శుభమును, భార్యాపుత్ర సౌఖ్యమును, పుత్ర జన్మోత్సవమును, తన ప్రభువు మూలకముగా అధిక సౌఖ్యమును, రాజ మూలకముగా ధనాగమంబును, బ్రాహ్మణ ప్రభు స్నేహమును, బంధుజనోపకారమును, యజ్ఞకర్మాది సంప్రాప్తియు, రత్నదాన పరత్వమును కలుగును.

శ్లో॥ దాయేశా దష్టమేషష్టే వ్యయేవా పాపసంయుతే।
గురుపుత్ర వినాశాది సమాన జననాశనం।
మిత్రవర్గ విరోధత్వం ధననాశ స్తథైవచ।
శూద్రసేవా మహావ్యాధిః స్త్రీపీడా బంధుభిర్ద్వేషం॥

తా. దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను, లేక పాపులతో కూడియున్నను, గురుపుత్ర వినాశమును, సమాన జననాశనమును, స్నేహితులతోడ విరోధమును, ధన నాశమును, శూద్రజన సేవయు, మహావ్యాధియు, స్త్రీపీడయు, బంధుద్వేషమును కలుగును.

గ్రంథాంతరే॥

శ్లో॥ స్వోచ్చాంశకే బలయుతే పశ్చాత్సౌఖ్యం వినిర్దిశేత్।
నష్టరాజ్య ధనప్రాప్తిః పుత్రపౌత్రాభి వర్ధనం।

భుక్త్యంతే రోగపీడాస్యా చ్ఛుభదృష్టేన దోషభాక్॥

తా. గురువు తన నవాంశయందు బలముతో కూడి యున్న యెడల విస్తట సౌఖ్యమును, నష్ట రాజ్యప్రాప్తియు, ధనలాభమును, పుత్రపౌత్రాభివృద్ధియు, భుక్తి అంత్యమందు రోగపీడయు, శుభదృష్టి యున్నయెడల దేహ శాంతియు కలుగును.

శ్లో॥ ద్వితీయ ద్యూననాథేవా అపమృత్యు ర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం త్రియంబక జపంచరేత్।
స్వర్ణేన నిర్మితంఛాగ దానేనారోగ్యమావిశేత్॥ 12

తా. ద్వితీయ సప్తమ రాసులయం దున్నయెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై త్రియంబక జపము చేయవలయును. గాకను, బంగారుతో చేయబడిన మేకను దానముచేసిన పిమ్మట ఆరోగ్యము కలుగును.

ఇతి జాతకఫల చింతామణౌ శనిదశాంతర్దశాఫలంనామ
సప్తమప్రకరణం—సమాప్తము.

శుభమస్తు.

# జాతకఫలచింతామణి.

ఆంధ్ర తాత్పర్య సహితము.

## బుధదశాంతర్దశాఫలంనామ అష్టమప్రకరణము.

బుధదశాసంవత్సరాః 17.

శ్లో॥ సౌమ్యదశాయామాదౌలభతే ధనధాన్యసంపదంపురుషః।
అంతే స్వజనవిరోధం మధ్యేదాయే నరేశయాన సన్మానం॥ 1



తా. బుధదశలో ఆదిభాగమందు ధనధాన్య సంపదలు నరులకు లభించును మధ్యభాగమందు రాజసన్మానమును కలుగును. అంత్యభాగమందు స్వజనవిరోధము కలుగును.

శ్లో॥ స్థానవీర్య యుతేసౌమ్యే తత్పాకే కీర్తిరాజ్యదః।
మనోధైర్యో మహోత్సాహో యజ్ఞదీక్షాశుభక్రియా॥

తా. బుధుడు స్థానబలముతో కూడియుండగా కీర్తియు, రాజ్యప్రదంబును, మనోధైర్యమును, మహోత్సాహమును, యజ్ఞదీక్షయు, శుభకర్మ ఫలప్రాప్తియు కలుగచేయును.

శ్లో॥ తద్విహీనే బుధేస్థానే దారాపుత్రై ర్భయాద్భయం।
విదేశవాస దుఃఖంచ నానావిధ పరాఙ్ముఖం॥ 3

తా. అట్టిబుధుడు స్థాన బలహీనుడగు చుండగా స్థాననాశమును, భార్యాపుత్రులకు భీతియు, విదేశవాస దుఃఖంబులును, అనేక విధములగు అవమాన కార్యంబులును కలుగును.

శ్లో॥ దిగ్వీర్యయుతేసౌమ్యే దిగంత ధనికాత్సుఖీ।
సామంత రాజమిత్రత్వం గంధమాల్యాను లేపనం॥ 4

తా. బుధుడు దిగ్బలయుక్తుడైన యెడల యితర దిక్కులనుండి పొందబడిన ధనము గలవాడును, సుఖవంతుడును, సామంతరాజుతోటి స్నేహంబును, గంధమాల్యాను లేపనంబును కలుగును.

శ్లో॥ కాలవీర్యయుతేసౌమ్యే దశాయాం దేహసౌఖ్యదః।
దారాపుత్రాది సన్మానం గంగాపూత తనుర్భవేత్॥ 5

తా. కాలబలముగల బుధుని దశయందు, దేహసౌఖ్యమును, భార్యాపుత్రాది సన్మానమును, గంగా జలస్నానముచే పరిశుద్ధతయు కలుగును.

శ్లో॥ నిసర్గవీర్యాన్విత సౌమ్యదాయే నిసర్గతశ్చాపిశుభాదికర్మ।

విద్యావివాదం స్వజనై ర్విరోధః
మాతు ర్వియోగ స్త్వధవా స్వనాశః॥ 6

తా. నైసర్గిక బలముగల బుధుని దశాకాలమందు ప్రయత్నము లేకనే శుభాదికర్మ సిద్ధియు, విద్యావివాదంబును, స్వజనులతోటి విరోధంబును, మాతృ వియోగంబును లేక మాతృవర్గపు వారికి నాశనమును కలుగును.

శ్లో॥ వక్రశ్రేష్టా బలీసౌమ్యే భాగ్యదార సుతార్థభాక్।
పురాణదానదీక్షాది సముద్రస్థాన మాదిశేత్॥ 7

తా. బుధుడు వక్రచేష్టా బలము కలవాడైన యెడల భాగ్యలాభమును, భార్యాపుత్ర ప్రాప్తియు, ధనప్రాప్తియు, పురాణము, దానము, దీక్షాదికము, సముద్రస్నానము మొదలగు ఫలంబులు కలుగును.

శ్లో॥ నైసర్గిక బలేసౌమ్యే సర్వభూతేషు సౌమ్యతాం।
కరోతి రతికేళించ రాజభాగ్య సమన్వితం॥ 8

తా. నైసర్గిక బలముగల బుధదశలో సర్వప్రాణుల యందు సౌమ్యత్వమును, రతికేళీవిలాసమును, రాజుతోసమానమైన భాగ్యమును కలుగును.

శ్లో॥ క్రూరషష్ట్యంశ సౌమ్యస్య దశాకాలే మహద్భయం।
చోరాగ్ని భూపైర్హానిస్యా చ్ఛుభదృగ్యోగ వర్జితే॥ 9

తా. క్రూరషష్ట్యంశ యుక్తుడగు బుధుని దశాకాల మందు అధికభయంబును, చోరాగ్నిరాజులచే భీతియు, శుభగ్రహ సంబంధ దృష్టిలేని యెడల కలుగును.

శ్లో॥ మృద్వంశాది యుతేసౌమ్యే రాజ్యలాభో మహత్సుఖం।
మార్దవం సర్వభూతేషు కృషిపుత్రార్థ సంపదః॥ 10

తా. బుధుడు, మృదుషష్ట్యంశ యుక్తుడగు చుండగా



రాజ్యలాభమును, అధికసౌఖ్యమును, మృదు స్వభావమును, సర్వభూతముల యందును సౌమ్యత్వంబును, కృషిపుత్ర ధన సంపదలును కలుగును.

శ్లో॥ సౌమ్యేవైశేషికాంశస్థే విశేషా ద్రాజ్యపూజ్యతా।
సుగంధాంబర మాల్యంచ విద్యాగోష్ఠి రహస్యతా॥ 11

తా. బుధుడు వైశేషికాంశ యందుండగా విశేషముగా రాజపూజ్యతయు, సుగంధ పదార్థములు, వస్త్రములు, పుష్పమాలలు, విద్యాగోష్ఠి, ఏకాంతసౌఖ్యము మొదలగు ఫలములును కలుగును.

శ్లో॥ క్రూరద్రేక్కాణ సంయుక్త శ్చంద్రసూను ర్యధాతథా।
చోరాగ్నిభూపతిభయం స్థాననాశం మహద్భయం॥ 12

తా. క్రూరద్రేక్కాణ మందున్న బుధ దశాకాలమందు చోరాగ్ని, రాజులచే భయంబును, స్థాననాశమును, అధిక భయంబును కలుగును.

శ్లో॥ అత్యుచ్ఛసంస్థస్య బుధస్యదాయే
దేశాధిపత్యం నరవాహనాప్తిం।
విద్యావిలాసం వరరత్నలాభం
క్షేత్రాభివృద్ధిం కృషిధాన్య వృద్ధిం॥ 13

తా. పరమోచ్ఛ యందున్న బుధ దశా కాలమందు దేశాధి పత్యమును, నరవాహన ప్రాప్తియు, విద్యావిలాసమును, శ్రేష్ఠమైన రత్నలాభమును, క్షేత్రాభివృద్ధియు, కృషిలాభమును, ధాన్యసమృద్ధియు కలుగును.

శ్లో॥ ఉచ్ఛస్థితస్యాపి శశాంకజస్యపాకే
దశాయాంచ ధనాదివృద్ధిం।
పురాణ గీత శ్రవణం వినోదం

బంధూపకారం పురవర్గవృద్ధిం॥ 14

తా. తన ఉచ్చరాశియందున్న బుధ దశలో ధనవృద్ధియు, పురాణ గీత శ్రవణంబును, వినోదమును, బంధు జనోపకారంబును, పురజనాభి వృద్ధియు కలుగును

శ్లో॥ నీచస్థ చంద్రాత్మజ దాయకాలే
జ్ఞానస్య హీన స్స్వజనైర్వియుక్తః।
పదచ్యుతి ర్బంధు విరోధతాచ
విదేశయానం వనవాసదుఃఖం॥ 15

తా. తన నీచరాశియందున్న బుధుని దశాకాలమందు జ్ఞానహీనమును, బంధువియోగమును, స్థానభంగమును, బంధు విరోధమును, పరదేశ ప్రయాణమును, వనవాస ప్రాప్తియు కలుగును.

శ్లో॥ అత్యంతనీచస్థిత సౌమ్యదాయే స్వస్థాననాశంధననాశమేతి।
కష్టంవివాదంస్వకులస్యహానిం మనోవిచారంగృహనాశమేతి॥

తా. పరమ నీచస్థానమందున్న బుధదశలో స్థాననాశమును, ధననాశమును, కష్టమును, వివాదభయమును, కులహానియు, మనోవిచారమును, గృహనాశమును కలుగును.

శ్లో॥ ఉచ్చఖేచరసంయుక్త సౌమ్యదాయే మహత్సుఖం।
భాగ్యోత్తరంసు విద్యాంశ వాణిజ్యంగో కృషిక్రియాం॥

తా. ఉచ్చరాశిని పొందియున్న గ్రహముతో బుధుడు కూడియుండగా ఆదశాకాలమందు అధిక సుఖమును, ఉత్తర కాల భాగ్యమును, మంచివిద్యయు, వర్తకమును, గోలాభమును, కృషిలాభమును కలుగును.

శ్లో॥ నీచఖేచర సంయుక్త సౌమ్యదాయేతి కష్టతా।
పదభ్రంశం బంధునాశం కర్మనాశం మనోరుజం॥ 18



తా. నీచరాశిని పొందియున్న గ్రహముతో కూడియున్న బుధుని దశాకాలమందు అధిక కష్టమును, స్థానచలనమును, బంధునాశమును, కర్మనాశమును, మనోవ్యాధియు కలుగును.

శ్లో॥ ఉచ్చాంశ సంయుక్త శశాంకసూనో
ర్దశా విశేషసుత భూషణాని।
మనోవిలాసం మదనాభిరామం
ఉత్సాహశౌర్యంచ జలాభిషేకం॥ 19

తా. ఉచ్చ నవాంశయందున్న బుధ దశాకాలమునందు బహుపుత్ర ప్రాప్తియు, విశేష భూషణలాభమును, మనోవిలాసమును, రతికేళీ విలాసమును, ఉత్సాహమును, శౌర్యమును, జలాభిషేకమును కలుగును.

శ్లో॥ నీచాంశకయుత స్సౌమ్యే నీచవృత్త్యాను జీవనం।
ప్రేష్యత్వం పరిహాసంచ తద్దశాయాం కరోతితం॥ 20

తా. నీచాంశను పొందియున్న బుధునిదశలో నీచవృత్తిచేత జీవనమును, దాసత్వమును, పరిహాసాస్పదమును, కలుగును.

శ్లో॥ ఉచ్చరాశి గతేసౌమ్యే నీచాంశక గతోపివా।
రాజ్యంసుఖం మహత్కీర్తిం వినాశయతి తత్క్షణాత్॥ 21

తా. బుధుడు ఉచ్చరాశి గతుడైనను నీచ నవాంశ యుక్తుడాయెనేని, అట్టి దశాకాలమందు, రాజ్యమును, సుఖమును, కీర్తియు తత్క్షణమే నశింపచేయును.

శ్లో॥ చంద్రాత్మజోపి నీచస్థః స్వోచ్చాంశక సమన్వితః।
అశుభం ఫలమాదౌతు శుభమంతే ప్రయచ్ఛతి॥ 22

తా. బుధుడు నీచరాశియం దున్నను, ఉచ్చనవాంశ యుక్తుడాయెనేని ప్రథమమందు అశుభ ఫలంబును, అంత్యమందు శుభఫలంబును యిచ్చును.

శ్లో॥ మూలత్రికోణ నిలయస్య శశాంకజస్య
దాయేర్థలాభ సుతదార జనాభిసౌఖ్యం।
చిత్రాంబరాది బహుభూషణ రత్నలాభం
క్షేత్రాభివృద్ధి కృషిధాన్య వివృద్ధిదంచ॥ 23

తా. మూలత్రికోణ రాశియందున్న బుధదశలో అర్థలాభమును, భార్యాపుత్ర సౌఖ్యమును, వస్త్రలాభమును, విశేషభూషణ రత్నలాభములును, క్షేత్రాభి వృద్ధియు, కృషిలాభమును, ధాన్యవృద్ధియు కలుగును.

శ్లో॥ స్వక్షేత్రసంస్థస్య బుధస్యదాయే
మహత్సుఖం బంధుజనాను రాగం।
విష్ణ్వర్చనం భూసురపూజనంచ
మిత్రక్షితీశా త్సుఖముచ్చ మేతి॥ 24

తా. స్వక్షేత్రమందున్న బుధదశలో విశేషసుఖమును, బంధు జనానురాగంబును, విష్ణుపూజయు, బ్రాహ్మణభక్తియు, మిత్రప్రభు మూలకముగా సుఖమును కలుగును.

శ్లో॥ అత్యంతమిత్ర భవన స్థిత సౌమ్యదాయే
భూపాల మిత్రవిభవం సుతదారసౌఖ్యం।
క్షేత్రాభివృద్ధి ధనధాన్య సమృద్ధిదంచ
సత్కీర్తి లబ్ధవిభవం హ్యధికారలాభం॥ 25

తా. అధి మిత్రక్షేత్రమందున్న బుధుని దశలో రాజస్నేహమును, విభవమును, భార్యాపుత్ర సౌఖ్యమును, క్షేత్రాభివృద్ధియు, ధనధాన్య సమృద్ధియు, సత్కీర్తియు, అధికార లాభమును కలుగును.

శ్లో॥ మిత్రర్క్ష సంస్థస్య శశాంకజస్య దశావిపాకే ధనలాభమేతి।
వాణిజ్యకర్మ కృషిధాన్య సమృద్ధిదంచ



గోవృద్ధి మశ్వాంబర రత్నలాభం॥ 26

తా. మిత్రక్షేత్ర మందున్న బుధదశలో ధనలాభమును, వ్యాపారలాభము, కృషిలాభమును, ధాన్యసమృద్ధియు, గోసమృద్ధియు, అశ్వలాభమును, వస్త్రప్రాప్తియు, రత్నలాభమును కలుగును.

శ్లో॥ సమక్షేత్రస్థ సౌమ్యస్య దశాయాంతు క్వచిత్సుఖం।
క్వచిల్లాభం క్వచిత్కష్ట మారోగ్యంచ క్వచిత్క్వచిత్॥

తా. సమక్షేత్ర మందున్న బుధుని దశా కాలమందు అల్పసుఖమును, అల్పలాభమును, కొంతకష్టమును, కొంత ఆరోగ్యమును, కలుగును.

శ్లో॥ శత్రుర్క్ష సంస్థస్య శశాంకజస్య
దాయేతి కష్టం స్వజనైర్విరోధం।
దుష్కీర్తిలాభం వినయాదిహీనం
శరీరబాధాంచ సమానకష్టం॥ 28

తా. శత్రుక్షేత్ర మందున్న బుధదశలో అధిక కష్టమును, స్వజనవిరోధమును, దుష్కీర్తియు, వినయ హీనత్వమును, శరీరబాధయు, సమాన జనకష్టమును కలుగును.

శ్లో॥ అత్యంత శత్రు భవనస్థిత సౌమ్యదాయే
హ్యాచారహీన మతికష్ట మనోవిచారం।
భూపాద్భయం స్వజనవర్గ విరోధతాంచ
స్వస్థానహానించ పశుక్షయంచ॥ 29

తా. అధి శత్రుక్షేత్రమందున్న బుధుని దశాకాలమందు ఆచారహీనమును, అతికష్టమును, మనోవిచారమును, రాజభయమును, స్వజనవిరోధమును, స్వస్థానహానియు, పశునాశనమును కలుగును.

శ్లో॥ శుభాన్వితస్య సౌమ్యస్య దశాయాం బహుసౌఖ్యదం।
పుత్రదారాది సౌఖ్యంచ గృహేకళ్యాణ వృద్ధిదం॥ 30

తా. శుభగ్రహముతో కూడిన బుధ దశాకాలమందు బహుసౌఖ్యమును, భార్యాపుత్రాది సౌఖ్యమును, యింటి యందు కళ్యాణ వైభవమును కలుగును.

శ్లో॥ పాపాన్వితస్య సౌమ్యస్యపాకే వాహననాశనం।
బాంధవాది విరోధంచ సమాన జనపీడనం॥ 31

తా. పాపగ్రహయుక్తుడైన బుధదశలో వాహననాశమును, బంధుజన విరోధంబును, సమానజనపీడయు కలుగును.

శ్లో॥ సౌమ్యేక్షితస్యాపి శశాంక సూనో
ర్దశావిపాకే మహతీంచ కీర్తిం।
విద్యావిలాసోద్భవ రాజపూజ్య
కాంతిప్రతాపం యశసాసమేతం॥ 32

తా. శుభగ్రహ వీక్షణగల బుధదశా కాలమందు విశేష కీర్తియును, విద్యావిలాసమువల్ల కలిగిన రాజపూజ్యతయును, దేహకాంతి ప్రతాపంబులును, యశస్సును కలుగును.

శ్లో॥ పాపేక్షితస్యాపి శశాంక సూనో
ర్ధాన్యక్షయం బంధు జనైర్విరోధం।
విదేశయానం స్వపదచ్యుతించ
ప్రేష్యాను వృత్త్యా కలహంచ కృచ్ఛ్రం॥ 33

తా. పాపగ్రహ వీక్షణగల బుధుని దశాకాలమందు, ధాన్యక్షయమును, బంధుజన విరోధంబును, పరదేశ ప్రయాణమును, స్థానచలనమును, దాస్యవృత్తిచేత కలహమును,అధిక కష్టఫలంబులును కలుగును.

శ్లో॥ కేంద్రాన్వితస్య సౌమ్యస్య దశాయాం బంధువృద్ధిదం।



సుతోత్సవాది సంతోషం నిత్యందాన రతోభవేత్॥ 34

తా. కేంద్రస్థానగతుడైన బుధుని దశలో బంధుజనాభివృద్ధియు, పుత్రోత్సవాది సంతోషమును, నిత్యము అన్నదాన ఫలమును కలుగును.

శ్లో॥ షష్ఠాష్ట మవ్యయస్థస్య బుధస్యా పహృతంధనం।
సమాన జనశోకార్తిం స్వస్థాన చలనంభవేత్॥ 35

తా. లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయందున్న బుధ దశలో ధననాశమును, సమాన జన దుఃఖమును, స్థానచలనమును కలుగును.

---

మేషాదిరాశిస్థిత బుధదశాఫలం.

శ్లో॥ మేషగతసౌమ్యదాయే భూప్రాప్తిం బంధుసన్మానం।
వరమణి భూషణలాభం స్త్రీపుత్రజ్ఞాతి సౌఖ్యంచ॥ 36

తా. మేషరాశియందున్న బుధదశలో రాజస్నేహమును, బంధు సన్మానమును, శ్రేష్ఠమైన మణి భూషణ లాభమును, భార్యాపుత్ర సౌఖ్యమును, జ్ఞాతి జన సౌఖ్యమును కలుగును.

శ్లో॥ వృషస్థితస్యాపి శశాంకజస్య దశావిపాకే నటవర్గగోష్ఠిం।
సంగీతహాస్యాదివినోదగోష్ఠిం విద్యాదిలాభం మహదాధిపత్యం॥

తా. వృషభరాశియందున్న బుధదశలో నటగాయకుల గోష్ఠియు, సంగీతహాస్యాది వినోదగోష్ఠియు విద్యాలాభమును, గొప్ప ఆధిపత్యమును కలుగును.

శ్లో॥ యుగ్మస్థస్య శశాంకజస్యచ దశా విద్యావినోదప్రదా।
క్షోణీశ ప్రతిమానసౌఖ్య బహుదా సంగీతహాస్యప్రదా।
స్త్రీపుత్రాత్మజ సౌఖ్యదా విజయదా విఖ్యాతకీర్తిప్రదా।
ధాన్యక్షేత్ర పశుప్రదాతి సుఖదా క్షేత్రాభివృద్ధిప్రదా॥ 38

తా. మిథునరాశియందున్న బుధుడు విద్యావినోద ప్రదుడును, రాజసన్మాన ప్రదుడును, సౌఖ్యప్రదుడును, సంగీత హాస్యప్రదుడును, భార్యాపుత్ర సౌఖ్యప్రదుడును, విజయ ప్రదుడును, విశేష కీర్తిప్రదుడును, ధాన్యక్షేత్ర పశు ప్రదుడును, సుఖప్రదుడును, క్షేత్రాభి వృద్ధిప్రదుడును యగును.

శ్లో॥ కటకగత బుధదశాయాం బంధు ద్వేషం కాంతిహీనత్వం।
ద్విజసజ్జన సంవాదం స్వపదభ్రంశం స్వాధికారనాశంచ॥

తా. కర్కాటక రాశియందున్న బుధదశలో బంధు ద్వేషమును, కాంతిహీనతయు, బ్రాహ్మణ సజ్జనులతోడ వివాదమును. స్థాననాశమును, అధికార నాశనమును కలుగును.

శ్లో॥ సింహస్థ బుధదాయేచ నగరాధి పతిర్భవేత్।
మహాప్రభోస్తు సన్మానం దుర్గారణ్య చరోభవేత్॥ 40

తా. సింహరాశియందున్న బుధదశలో నగరాధి పత్యమును, మహాప్రభు సన్మానమును, దుర్గారణ్యములయందు సంచారమును కలుగును

శ్లో॥ కన్యాగతసౌమ్యదశా సుఖప్రదా
యశఃప్రదా రాజ ఫలప్రదాయినీ।
విచిత్రవస్త్రాది సు భూషణప్రదా
కళత్రమిత్రాత్మజ బంధువృద్ధిదా॥ 41

తా. కన్యారాశియందున్న బుధుడు సుఖము నిచ్చువాడును, కీర్తి నిచ్చువాడును, రాజ్యము నిచ్చువాడును, విచిత్ర వస్త్రాదుల నిచ్చువాడును, శ్రేష్ఠమైన భూషణముల నిచ్చువాడును, భార్యాపుత్రాభి వృద్ధిప్రదుడును, మిత్రవృద్ధి కలుగ చేయు వాడును యగును.

శ్లో॥ తౌళిగతసౌమ్య దాయే వాహనలాభం క్షితీశమిత్రత్వం।



ఆలేఖ్యాన్విత గృహాలాభం హ్యన్యస్త్రీ సంగమంకరోతి॥

తా. తులారాశియందున్న బుధదశలో వాహన లాభమును, రాజస్నేహమును, లెక్కలేని గృహలాభములును, అన్యస్త్రీ సంగమంబును కలుగును.

శ్లో॥ వృశ్చికస్థస్య సౌమ్యస్య దశాకష్ట ఫలప్రదా।
బంధు ద్వేషంచ భూనాశం సహోదర వినాశనం॥ 43

తా. వృశ్చిక రాశియందున్న బుధదశలో కష్టఫలము కలుగును. గాకను, బంధు ద్వేషమును, భూనాశమును, భ్రాతృ నాశమును కలుగును

శ్లో॥ ధనుషిభవన సంస్థ సౌమ్యదాయే సుఖంచ
సమరభువి రిపూణాం హానిదం రాజ్యలాభం!
క్షితిపవిభవవృద్ధిం హేమవస్త్రాదిలాభం
సతతవిభవవృద్ధిం గానవిద్యాదిగోష్టిం॥ 44

తా. ధనుస్సుయందున్న బుధదశలో సుఖమును, యుద్ధమునందు శత్రు రాజులచేత హానియు, రాజ్యలాభమును, రాజ విభవమును, హేమలాభమును, వస్త్రప్రాప్తియు, ఎల్లపుడును విభవమును, గాన విద్యాగి గోష్ఠియు కలుగును.

శ్లో॥ మృగస్థస్య సౌమ్యస్య దాయేర్థసిద్ధిం
స్వబంధ్వాది విద్యావినోదం నృపాత్తం।
మనోల్లాస వాక్పౌరుషత్వం వినోదం
సభాపూజ్యతాం మిత్రవర్గాదిసౌఖ్యం॥ 45

తా. మకరరాశియందున్న బుధదశలో అర్థసిద్ధియు, బంధు విలాసమును, విద్యావినోదమును, రాజస్నేహమును, వాగ్విలాసమును, వినోదమును, సభాపూజ్యతయు, మిత్రవర్గ సౌఖ్యమును కలుగును.

శ్లో॥ ఘటభవనసంస్థ చంద్రసూనోః
పరిపాకే నరవాహనాది లాభం।
అతిశయవసనాప్తిం హేమవృద్ధింకరోతి
హ్యతిమధుర సుభోజ్యం గానలోలాదిసౌఖ్యం॥ 46

కుంభరాశియందున్న బుధదశలో నరవాహన లాభము, అనగా పల్లకి వాహనప్రాప్తియు, అతిశయ వస్త్రప్రాప్తియు, హేమవృద్ధియు, అతి మధుర భోజనమును, గానలోలాది సౌఖ్యమును కలుగును.

శ్లో॥ మీనస్థితస్యాపి శశాంకజస్య దశావిపాకే స్వజనానుకోపం।
స్త్రీపుత్రనాశంచసమానినాశం స్వస్థాననాశంహ్యతికష్టమేతి॥

తా. మీనరాశియందున్న బుధదశలో స్వజన కోపము, భార్యాపుత్ర నాశమును, సమాన జన నాశమును, స్వస్థాన నాశమును, అధిక కష్టమును కలుగును.

శ్లో॥ దేహస్థే బుధదాయే దేహారోగ్యం కీర్తివృద్ధించ।
నవ సంభూషణ లాభం విద్యాప్రాప్తిం భూపసన్మానం॥

తా. లగ్నమందున్న బుధదశలో దేహారోగ్యమును, కీర్తివృద్ధియు, శ్రేష్ఠమైన నూతన భూషణ లాభమును, విద్యాప్రాప్తియు, రాజ సన్మానమును కలుగును.

శ్లో॥ ధనస్థితస్యాపి శశాంకజస్య దశావిపాకే ధనలాభమేతి।
కుటుంబసంరక్షణ వాగ్విభూషం ధనాభివృద్ధింఋణహానిమేతి॥

తా. లగ్నమునకు రెండవ యింటియందున్న బుధదశలో ధనలాభమును, కుటుంబ సంరక్షణయు, వాగ్విలాసమును, ధనాభివృద్ధియు, ఋణహానియు కలుగును.

శ్లో॥ తృతీయసంస్థస్య బుధస్యదాయే
సుగానవిద్యా వరభూషణాప్తిం।



సహోదరాణాంచ వివాహసౌఖ్యం
యుద్ధేజయం భూపతి పూజనంచ॥ 50

తా. లగ్నమునకు మూడవ యింటియందున్న బుధదశలో మంచి గాన విద్యాలాభమును, శ్రేష్ఠమైన భూషణప్రాప్తియు, భ్రాతృజన సౌఖ్యమును, కళత్రప్రాప్తియు, యుద్ధమునందు జయమును, రాజ పూజ్యతయు కలుగును

శ్లో॥ బంధుగత సౌమ్యదాయే బంధుసమృద్ధిం ధాన్యవృద్ధించ।
సువిచిత్ర గృహలాభం నటగాయక గోష్ఠిసంఘాని॥ 51

తా. లగ్నమునకు నాల్గవ యింటియందున్న బుధదశలో బంధు సమృద్ధియు, ధాన్యవృద్ధియు, విచిత్ర గృహలాభమును, నటగాయకులయొక్క గోష్ఠియు కలుగును.

శ్లో॥ పుత్రస్థస్య బుధస్య పాకసమయే పుత్రార్థవృద్ధిప్రదం।
జ్ఞానం సజ్జనపూజనం గురుముఖా న్మంత్రాదిసంసిద్ధిదం।
ధాన్యక్షేత్రవివృద్ధిదంచ సుఖదం భూపాలమిత్రంతథా।
తీర్థస్నాన ఫలప్రదం వరమణిం భూషాది సంసిద్ధిదం॥52

తా. లగ్నమునకు పంచమరాశియందున్న బుధదశలో పుత్రార్థ వృద్ధియు, జ్ఞానవృద్ధియు, సజ్జనపూజయు, గురుమూలకముగా మంత్రార్థసిద్ధియు,ధాన్యసమృద్ధియు, క్షేత్రాభివృద్ధియు, సుఖమును, రాజస్నేహమును, తీర్థస్నాన ఫలమును, శ్రేష్ఠమైన మణి భూషణాది సంగ్రహమును కలుగును.

శ్లో॥ షష్ఠగత సౌమ్యదాయే రోగోత్పత్తిం శత్రువృద్ధించ।
బంధువినాశం కలహం భూపక్రోధం స్థాననాశంచ॥ 53

తా. లగ్నమునకు ఆఱవయింటియందున్న బుధదశలో రోగప్రాప్తియు, శత్రుభయమును, బంధు వినాశమును, కలహమును, రాజక్రోధమును, స్థాననాశమును కలుగును.

శ్లో॥ కామస్థితస్య సౌమస్యదాయే సౌఖ్యం శుభప్రదం।
బంధూపకారం కళ్యాణ మపూర్వ ప్రియదర్శనం॥ 54

తా. లగ్నమునకు సప్తమ రాశియందున్న బుధదశలో సౌఖ్యమును, శుభమును, బంధు జనోపకారంబును, కళ్యాణమును, అపూర్వ ప్రియదర్శనమును కలుగును.

శ్లో॥ రంధ్రస్థితస్యాస్య బుధస్యదాయే
సమానశోకం బహుకష్టమేతి।
స్వస్థాననాశంచ మనోవిచారం
చోరాగ్నిబాధా మరివృద్ధిదంచ॥ 55

తా. లగ్నమునకు అష్టమమందున్న బుధదశలో సమాన జన శోకమును, అధిక కష్టమును, స్వస్థాన నాశమును, మనోవిచారమును, చోరాగ్నిబాధయు, శత్రువృద్ధియు, కలుగును.

శ్లో॥ ధర్మస్థస్య బుధస్య పాకసమయే ధర్మాది సంసిద్ధిదం।
జ్ఞానంసజ్జన పూజనం విభవదం దానాదికారంతథా।
క్షేత్రార్థాంబరవాహనాది విభవం రాజాదికారంతథా।
స్త్రీపుత్రాదిషు సౌఖ్యదం పితృజనప్రాబల్యవృద్ధింసుఖం॥

తా. లగ్నమునకు నవమరాశియందున్న బుధదశలో ధర్మకార్య సిద్ధియు, జ్ఞానవృద్ధియు, సజ్జనపూజయు, విభవమును, దానాదికారమును, క్షేత్రార్థ లాభమును, వస్త్రవాహనాది విభవమును, రాజ్యాధికారమును, భార్యాపుత్ర సౌఖ్యమును, పితృజన ప్రాబల్యమును, సుఖవృద్ధియు కలుగును.

శ్లో॥ కర్మస్థితస్య సౌమస్యదాయే కీర్తివివర్ధనం।
కళ్యాణవృద్ధి మతులం ధనలాభం సుఖావహం॥ 57

తా. లగ్నమునకు దశమస్థానమందున్న బుధదశలో కీర్తివృద్ధియు, కళ్యాణప్రాప్తియు, విశేష ధనలాభమును, అధిక



సుఖమును కలుగును.

శ్లో॥ లాభస్థే బుధదాయే బహులాభం క్షేత్రవృద్ధించ।
గోలాభం ధాన్యవృద్ధిం స్వపదప్రాప్తిం వాగ్విలాసంచ॥

తా. లాభస్థానమందున్న బుధదశలో విశేష లాభమును, క్షేత్రవృద్ధియు, గోలాభమును, ధాన్యవృద్ధియు, ఉద్యోగప్రాప్తియు, వాగ్విలాసమును కలుగును.

శ్లో॥ వ్యయగతసౌమ్య దశాయాం స్థానవిరుద్ధం బంధునాశంచ।
క్షేత్రార్థ పశువినాశం నానాకష్టం విదేశవాసంచ॥ 59

తా. వ్యయస్థానమందున్న బుధదశలో స్థాననాశమును, బంధునాశమును, క్షేత్రార్థనాశమును, పశుహానియు, నానావిధ కష్టమును, విదేశవాసమును కలుగును.

---

ఆరోహ బుధదశాఫలం.

శ్లో॥ ఆరోహస్థస్యసౌమ్యస్య దశారాజ్య ఫలప్రదా।
విచిత్ర గృహలాభాచ కళ్యాణాది మహోత్సవా॥ 60

తా. ఆరోహణయందున్న బుధదశలో రాజ్యఫలమును, విచిత్ర గృహలాభమును, కళ్యాణాది మహోత్సవములును కలుగును.

అవరోహ దశాఫలం.

శ్లో॥ అవరోహస్య సౌమ్యస్య దశాకష్ట ఫలప్రదా।
స్వస్థాననాశం కురుతే స్వబంధు కలహంతథా॥ 61

తా. అవరోహణయందున్న బుధదశలో కష్టఫలము సంభవించును. గాకను, స్వస్థాననాశమును, బంధుకలహమును కలుగును.

బుధదశాయాం బుధభుక్తిమాసాః 28. దినాని 27.

కృష్ణిర్యే॥

శ్లో॥ బుధస్యాంతర్గతేసౌమ్యే లగ్నాత్కేంద్రే త్రికోణగే।
తృతీయే లాభగేవాపి హ్యుచ్ఛరాశిస్థితేపివా।
బంధుకళ్యాణవిభవం క్రయమూలా ద్ధనాగమం।
ద్వీపాంతరార్థ సంప్రాప్తిం నానారత్నాది సంగ్రహం
విచిత్రగృహలాభంచ స్వాధికార వివృద్ధిదం।
సత్కథా శ్రవణంచైవ జ్ఞానసిద్ధిం తథైవచ।
నిత్యాన్నదాన విభవం బాంధవానాం సమాగమం।
పుత్రప్రాప్తించ లభతే స్వస్త్రీసౌఖ్యం తథైవచ॥ 1

తా. బుధదశలో స్వభుక్తియందు బుధుడు లగ్నమునకు కేంద్రత్రికోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక తన ఉచ్ఛరాశియం దున్నను, బంధుకళ్యాణ విభవమును, క్రయమూలకముగా ధనాగమంబును, ద్వీపాంతరములనుండి రాబడిన అర్థప్రాప్తియు, నానావిధ రత్న సంగ్రహమును, విచిత్ర గృహలాభమును, అధికార వృద్ధియు, సత్కథా శ్రవణమును, జ్ఞానసిద్ధియు, ఎల్లప్పుడు అన్నదాన విభవమును, బంధుజన సమాగమంబును, పుత్రోత్సవమును, భార్యాసౌఖ్యమును కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టమేసౌమ్యే వ్యయేవా నీచరాశిగే।
పాపగ్రహాయుతే దృష్టే హ్యస్తేవా ధటసంయుతే।
తద్భుక్తౌ బంధువైషమ్యం స్త్రీపుత్రాణాంతు పీడనం।
కార్యనాశం మనఃఖేదం చింతా వ్యాకులమేవచ।
అన్యస్థల ప్రవాసంచ రాజకోపం ధనక్షయం।
కులాచారవిహీనంచ పుష్పిణీస్త్రీ సమాగమం।



అకాలభోజనంచైవ యత్నకార్య వినాశనం॥ 2

తా బుధుడు లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను, తన నీచరాశియందున్నను, పాపగ్రహములతో కూడియున్నను లేక చూడబడినను, అస్తంగతుడైనను లేక తులారాశియందున్నను, ఆభుక్తియందు బంధుజన విరోధమును, భార్యాపుత్రులయొక్క పీడయు కార్యనాశమును, మనోదుఃఖమును, చింతయు, వ్యాకులమును, పరస్థలవాసమును, రాజకోపమును, ధనక్షయమును, కులాచార హీనమును, పుష్పవతియైన స్త్రీతో సమాగమంబును, అకాలభోజనమును, యత్నకార్యభంగమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే దుర్గాదీశత్వ మాప్నుయాత్।
పితృవర్గశుభంచైవ రాజప్రీతిర్న సంశయః॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, దుర్గముల మీఁది విచారణాధికారమును, పితృవర్గజనులకు శుభమును, రాజప్రీతియు, నిస్సంశయముగా కలుగును.

శ్లో॥ శశినాసంయుతే దృష్టే స్వస్త్రీసౌఖ్యం సుతోదయం।
భూషణాని విశేషాణి సంగ్రహం స్వస్యమందిరే॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, స్వంత స్త్రీసౌఖ్యమును, పుత్రోత్పత్తియు, విశేషభూషణ సంగ్రహమును, గృహలాభమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే యుద్ధేశత్రు వివృద్ధిదం।
దాయాది కలహంచైవ వ్యవహారే పరాభవం॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను యుద్ధమునందు శత్రువృద్ధియు, జ్ఞాతులతోడ కలహమును, వ్యవహారమునందు అపజయమును కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే సుతోత్పత్తిర్న సంశయః।
దేవతాదర్శనప్రాప్తి హ్యపూర్వ ప్రియదర్శనం॥ 6

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, నిస్సంశయముగా పుత్రోత్పత్తి కలుగును, గాకను దేవతాదర్శన ప్రాప్తియు, అపూర్వ ప్రియదర్శనమును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే చిత్రవస్త్రాది సంగ్రహం।
యానవాహన సంప్రాప్తి మధికారాది లబ్ధవాన్॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను చిత్ర వస్త్రాది సంగ్రహమును, యానవాహన సంప్రాప్తియు, అధికార లాభమును కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే నిగళంరాజవిద్వరం।
కారాగృహప్రవేశంచ బంధుద్వేషం తథైవచ॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను, బంధన ప్రాప్తియు, రాజనిగ్రహాగమును, కారాగృహ ప్రవేశమును, బంధుద్వేషమును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా హ్యపమృత్యు ర్భవిష్యతి।
తద్దోష పరిహారార్థం విష్ణుసాహస్రకం జపేత్।
లక్ష్మీనారాయణందానం సర్వసంపత్ప్రదాయకం॥ 9

తా. ద్వితీయ సప్తమరాసుల యందున్న యెడల అపమృత్యువు సంభవించును. అదోషపరిహారార్థమై విష్ణుసాహస్రక జపము చేయవలయును. గాకను లక్ష్మీనారాయణ దానము చేసిన యెడల సకలసంపత్తును కలుగును.

---

బుధదశాయాం కేతుభుక్తిమాసాః 11 దినాని 27.

శ్లో॥ సౌమ్యస్యాం తద్గతే కేతౌ లగ్నాత్కేంద్రే త్రికోణగే।
తృతీయే షష్ఠగేలాభే వ్యుచ్చరాశి స్థితేపివా।



కీర్తిప్రతాపవృద్ధించ సమరే శత్రునాశనం।
మహాక్షితీశ సన్మానం యానవాహన వృద్ధికృత్।
స్వనామాంకిత వ్యాపారో భగినీవంశవర్ధనం।
పశ్చిమాందిశమాశ్రిత్య ప్రయాణం రాజదర్శనం।
కృషిక్షేత్రవివృద్ధించ ధాన్యసంగ్రహణం తథా।
శ్రీమూలా ద్ధనలాభస్స్యా ద్యదపూర్వ ప్రియదర్శనం।
దేవతాదర్శనప్రాప్తి ర్యత్నకార్యార్థ సిద్ధిః॥ 1

తా. బుధదశలో కేతుభుక్తియందు కేతువు లగ్నమునకు కేంద్రకోణములయం దున్నను, 3-౬-౧౧ రాసులయం దున్నను, లేక తన ఉచ్చరాశిని పొందియున్నను, కీర్తిలాభమును, ప్రతాపవృద్ధియు, యుద్ధమునందు శత్రునాశమును, రాజసన్మానమును, యానవాహన సమృద్ధియు, తనపేరు అంకితముగాగల వ్యాపారమును, భార్యావంశాభి వృద్ధియు, పశ్చిమదిశకు ప్రయాణమును, రాజదర్శనమును, కృషిలాభమును, క్షేత్రవృద్ధియు, ధాన్యసంగ్రహణమును, శ్రీమూలకముగా ధనలాభమును, అపూర్వ ప్రియదర్శనమును, దేవతాదర్శనమును, యత్నకార్యార్థ సిద్ధియు కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టగే కేతౌ వ్యయేవా నీచరాశిగే।
నీచాంశే పాపసంయుక్తే శత్రుగ్రహయుతేపివా।
చండాలకలహంచైవ తస్మాలా ద్ద్రవ్యనాశనం।
జ్ఞాతీనాం కలహంచైవ నీచసేవా మహద్భయం।
పశుధాన్యవినాశంచ దాయాది కలహంతథా।
స్వస్థాననాశనంచైవ హ్యుద్యోగచలనం తథా।
యత్నకార్య వినాశంచ సమాన జనపీడనం॥ 2

తా. కేతువు లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయం

మున్నను, తన నీచరాశియందున్నను, నీచాంశయందున్నను, పాపగ్రహయుక్తుడైనను లేక శత్రుగ్రహముతో కూడియున్నను, చండాలురతోడ కలహమును, ఆమూలకముగా ద్రవ్యనాశమును, జ్ఞాతులతోడ కలహమును, నీచజనసేవయు, అధిక భయమును, పశుహానియు, ధాన్యనాశమును, దాయాదికలహమును, స్వస్థాననాశమును, ఉద్యోగచలనమును, యత్నకార్య భంగమును, సమాన జనపీడయు కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే శిరోరోగం మహద్భయం।
పైత్యరోగ వివృద్ధించ నృపచోరాగ్ని పీడనం॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను శిరోరోగమును, గొప్పభయమును, పిత్తరోగమును, రాజభీతియు, చోరబాధయు, అగ్నిపీడయు కలుగును.

శ్లో॥ శశినాసంయుతే దృష్టే మాతృనష్టం మనోవ్యథా।
అకాలభోజనంచైవ ధననాశం తథైవచ॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, ఆభుక్తియందు మాతృవియోగమును, మనోవ్యథయును, అకాల భోజనమును, ధననాశమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే భ్రాతృవంశ వినాశనం।
శస్త్రచోరాగ్ని బాధాచ విషసర్పాదిజంభయం॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను భ్రాతృ వంశ వినాశనమును, శస్త్రబాధయు, చోరభయమును, అగ్ని పీడయు, విషసర్పాది భయమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే బాంధవానాం వివృద్ధిదం।
వివాహాదిశుభంచైవ యత్నకార్యార్థ సిద్ధిదం॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, బంధు



జనాభివృద్ధియు, వివాహాదిశుభమును, యత్నకార్యార్థ సిద్ధియు కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే గురుద్వేషం సుతక్షయం।
సుమిత్ర రాజకోపంచ సమాన జననాశనం॥ 7

తా. గురునితో కలసినను లేక చూడబడినను గురు ద్వేషమును, సుతక్షయమును, మిత్రప్రభు కోపమును, సమాన జననాశమును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే స్త్రీపుత్రకలహం తథా।
సర్వత్రకలహంచైవ యానవాహన నాశనం॥ 8

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, భార్యా పుత్రులతోడ కలహమును, సర్వులతోడను కలహమును, యానవాహన నాశమును కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే సమాన జననాశనం।
కృషిక్షేత్రవినాశంచ ధాన్యనాశం తథైవచ॥ 9

తా. శనితో కూడినను లేక చూడబడినను సమాన జన నాశనమును, కృషినష్టమును, క్షేత్రక్షయమును, ధాన్యనాశ మును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయే లాభగేపివా।
షష్ఠేవాశుభసంయుక్తే ధనవృద్ధిం తథైవచ।
గోలాభంచాశ్వలాభంచ స్త్రీసౌఖ్యం బంధుసంయుతం।
విద్యాలాంభ కీర్తిలాభం యత్నకార్యార్థ సిద్ధిదం॥ 10

తా. కేతువు దశానాథునకు కేంద్రకోణముల యందు న్నను, తృతీయలాభముల యందున్నను, షష్ఠస్థానమందు న్నను, లేక శుభగ్రహముతో కూడియున్నను ఆభుక్తియందు ధనవృద్ధియు, గోలాభమును, అశ్వలాభమును, స్త్రీసౌఖ్యము

ను, బంధు సమాగమంబును, విద్యాలాభమును, కీర్తిలాభము ను, యత్నకార్యార్థ సిద్ధియు కలుగును.

శ్లో॥ దాయేశాంధ్రగేవాపి వ్యయేవా పాపసంయుతే।
అతికష్టం మానభంగ మపకీర్తి భయంతథా।
సమాన జననాశంచ స్త్రీపీడా బంధునిగ్రహం।
సమస్తవస్తునాశంచ చతుష్పాజ్జీవనాశనం॥ 11

తా. కేతువు దశానాథునకు ౮-౧౨. స్థానములయం దున్నను, లేక పాపునితో కూడియున్నను, ఆభుక్తియందు అధిక కష్టమును, మానభంగమును, అపకీర్తిభయమును, సమాన జననాశమును, స్త్రీపీడయు, బంధునాశమును, సమస్త వస్తునాశనమును, చతుష్పాజ్జీవనాశనమును కలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే హ్యపమృత్యుర్భవిష్యతి।
తద్దోష పరిహారార్థం మహిషీ దానమాచరేత్॥ 12

తా. ద్వితీయ సప్తమరాసుల యందున్న యెడల అప మృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై మహిషీ దానమాచరించ వలయును.

---

బుధదశాయాం శుక్రభుక్తిమాసాః 34.

కృష్టియ్యే॥

శ్లో॥ బుధస్యాం తర్గతేశుక్రే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయేలాభగేవాపి ఉచ్చరాశి సమన్వితే।
కళ్యాణ భూరి సంపత్తిం ఛత్రచామర వైభవం।
పురాధినాయకత్వంచ నరవాహన సిద్ధిదం।
స్వాధికారవివృద్ధించ మిత్రప్రభు వశాత్సుఖం।
కళత్రపుత్రవృద్ధించ గృహలాభం విచిత్రకం।
విచిత్రవస్త్రలాభంచ భూషణాని పరిగ్రహం।



రత్నమౌక్తికలాభంచ ధాన్యసంగ్రహణం తథా।
స్వవారే రాజసన్మానం బాంధవ ప్రియమేవచ॥ 1

తా. బుధదశలో భుక్తినాథుడగు శుక్రుడు లగ్నము నకు కేంద్రత్రికోణములయం దున్నను, తృతీయలాభముల యందున్నను, లేక తన ఉచ్చరాశిని పొందియున్నను, ఆభుక్తి యందు కల్యాణాది మహోత్సవములును, భూరిసంపత్తియు, ఛత్రచామర విభవమును, పురాధిపత్యమును, నరవాహన ప్రాప్తియు, అధికారాభివృద్ధియు, మిత్రప్రభు మూలకముగా సుఖమును, భార్యాపుత్రాభివృద్ధియు, విచిత్ర గృహలాభము ను, విచిత్రవస్త్రలాభమును, భూషణ సంగ్రహమును, రత్న మౌక్తికలాభమును, ధాన్యసంగ్రహణమును, తనవారము నందు రాజసన్మానమును, బంధుజన ప్రియమును కలుగును.

శ్లో॥ లగ్నాత్షష్టాష్టరాశిస్థే వ్యయేవా నీచరాశిగే।
తద్భుక్తౌ కార్యనాశశ్చ చింతాదుఃఖం తథైవచ।
స్త్రీవియోగో పుత్రపీడా తథాబంధు విరోధతా।
ఋణరోగాదిబాధాచ వాహనాది క్షయోభవేత్॥ 2

తా. శుక్రుడు లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయందు న్నను లేక తన నీచరాశియందున్నను ఆభుక్తియందు కార్య నాశమును, మనోచింతయు, దుఃఖమును, స్త్రీవియోగమును, పుత్రపీడయు, బంధువిరోధమును, ఋణబాధయు, రోగపీడ యు, వాహనాది క్షయమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే రాజకోపో ధనక్షయః।
యత్నకార్య వినాశశ్చ స్వస్థానచలనం భవేత్॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను రాజ కోపమును, ధనక్షయమును, యత్నకార్య వినాశమును, స్వస్థా

నచలనమును కలుగును.

శ్లో॥ చంద్రేణసంయుతే దృష్టే మాతృకష్టం మనోవ్యథాః।
చింతితార్థ వినాశంచ సర్వకార్య వినాశనం॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను మాతృ కష్టమును, మనోవ్యథయును, చింతించిన కార్యభంగమును, సర్వకార్య వినాశమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే స్త్రీమూలా త్కలహోభవేత్।
కళత్ర దేహబాధాచ సోదరద్వేష మాప్నుయాత్॥ 5

తా. కుజునితో కలసినను, లేక చూడబడినను, స్త్రీ మూలకముగా కలహమును, కళత్ర దేహబాధయు, సోదర ద్వేషమును కలుగును.

శ్లో॥ బుధేన సంయుతే దృష్టే ధర్మచింతా పరోభవేత్।
గణితాగమ శిల్పాది విద్యాసంగ్రహ తత్పరః॥ 6

తా. బుధునితో కలసినను, లేక చూడబడినను, ధర్మ కార్యచింతయు, లిపిగణిత కావ్యశిల్పాది వాద్యాసంగ్రహము ను కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే పుత్రవృద్ధిం ధనాగమం।
దేహారోగ్యంచ కీర్తించ సర్వకార్య సుసిద్ధిదం॥ 7

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, పుత్ర వృద్ధియు, ధనాగమంబును, దేహారోగ్యమును, కీర్తియు, సర్వ కార్య సిద్ధియు కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే స్వభృత్య కలహంతథా।
కృషిక్షేత్రవినాశంచ ధనధాన్య వినాశనం॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను తనసేవకుల తోడ కలహమును, కృషినాశమును, క్షేత్రక్షయమును, ధన



ధాన్య వినాశమును కలుగును.

శ్లో॥ దాయేశా త్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా।
శుభగ్రహ యుతేవాపి హేమభూషణ వృద్ధిదం।
దుకూల వస్త్రసంప్రాప్తి మపూర్వ వస్తుసంగ్రహం।
పశువాహన వృద్ధించ గృహేకళ్యాణ సంభ్రమం।
దారపుత్రాది సౌఖ్యంచ మిత్రప్రభు వశాత్సుఖం।
అన్నదాన రతోనిత్యం బంధూనా ముపకారకం॥ 9

తా. శుక్రుడు దశానాథునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక శుభగ్రహ ములతో కూడియున్నను, ఆ భుక్తియందు హేమలాభమును, భూషణ సమృద్ధియు, దుకూల వస్త్ర సంప్రాప్తియు, అపూర్వ వస్తు సంగ్రహమును, పశువృద్ధియు, వాహనవృద్ధియు, యింటి యందు కళ్యాణ సంభ్రమంబును, భార్యాపుత్రాది సౌఖ్య మును, మిత్రప్రభు మూలకముగా సుఖమును, ఎల్లపుడు అన్న దానమును, బంధుజనోప కారమును కలుగును.

శ్లో॥ దాయేశా త్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
నీచరాశి గతేవాపి దారపీడా భవిష్యతి।
సమాన జనపీడాచ యాత్రాయాం కార్యనాశనం।
దూరాద ప్రియవార్తాచ హ్యకస్మా త్కలహ స్తథా॥ 10

తా. శుక్రుడు దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను, లేక పాపులతో కలసియున్నను, లేక తన నీచరాశియం దున్నను, ఆ భుక్తియందు భార్యనాశమును, సమాన జన పీడయు, యాత్రయందు కార్యనాశనమును, దూరదేశము నుండి అప్రియవార్తయు, అకస్మాత్తుగా కలహమును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా అపమృత్యు భయంతథా।

తద్దోష పరిహారార్థం శ్వేతాంగాం దానమాచరేత్।
దుర్గాలక్ష్మీ జపంకుర్యా దాయురారోగ్య వర్ధనం॥ 11

తా. శుక్రుడు ద్వితీయ సప్తమములయం దున్నయెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై తెల్లని గోవుదానము చేయవలయును. గాకను, దుర్గా లక్ష్మీజపము చేసినపిమ్మట ఆయురారోగ్యము కలుగును.

బుధదశాయాం రవిభుక్తిర్మాసాః 10 దినాని 6.

కృష్ణీయే॥

శ్లో॥ బుధస్యాంత ర్గతేసూర్యే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయే లాభగేవాపి ఉచ్చస్వక్షేత్ర సంయుతే।
మహారాజా శ్రయప్రాప్తి ర్వాహనాధి పతిర్భవేత్।
ప్రాచ్యాం ప్రయాణంకురుతే విజయం శత్రునాశనం।
పుత్రదారాది సౌఖ్యంచ పితృవర్గ వివృద్ధిదం।
తద్భుక్తౌ మంత్రసిద్ధించ భాస్కరా రాధనంతథా।
శివదీక్షా ఫలప్రాప్తిం శివపూజాది చింతనం।
మహాత్మనాం దర్శనంచ తీర్థయాత్రాది సంగ్రహం।
తురీయాశ్రమ వృత్తీనాం సమాగమన దర్శనం।
యుద్ధేజయం మణీర్లాభం బాంధవాది సమాగమం॥ 1

తా. బుధదశలో సూర్యభుక్తియందు సూర్యుడు లగ్నమునకు కేంద్రత్రికోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక తన ఉచ్చ స్వక్షేత్రములయం దున్నను, మహారాజాశ్రయ ప్రాప్తియు, వాహనాధి పత్యమును, తూర్పుదిక్కునకు ప్రయాణమును, విజయమును, శత్రునాశమును, భార్యాపుత్ర సౌఖ్యమును, పితృవర్గ వృద్ధియు, మంత్రసిద్ధియు, సూర్యప్రార్థనయు, శివదీక్షా ఫలప్రాప్తియు,



శివపూజాది చింతనయు, మహాత్ముల సందర్శనమును, తీర్థయాత్రాది సంగ్రహమును, తుర్యాశ్రమ ప్రవృత్తివలన సమాగమన దర్శనంబును, యుద్ధమునందు జయమును, మణిలాభమును, బంధుజన సమాగమంబును కలుగును.

గ్రంథాంతరే॥

శ్లో॥ భూమ్యాత్మజేన సందృష్టే హ్యాదౌ భూలాభమేవచ।
లగ్నాధిపేన సంయుక్తే త్వాదౌ సౌఖ్యం ధనాగమం।
మధ్యాంతే క్లేశమాప్నోతి మృతవార్తా గమోభవేత్।
శన్యారఫణిసంయుక్తే పాపదృష్టే థవాయది।
దేహవ్రణో మనస్తాపః కార్యహాని ర్భవిష్యతి॥ 2

తా. సూర్యుడు కుజునితో కూడినను, లేక చూడబడినను, ఆదియందు భూలాభమును కలుగును. లగ్నాధిపతితో కలసియున్నయెడల ఆదిభాగమందు సౌఖ్యమును, ధనాగమంబును, మధ్యభాగమందును, అంత్యభాగమందును, దుఃఖమును, మృతవార్తా గమంబును కలుగును. శని కుజ రాహువులతో కూడినను, లేక పాపగ్రహ దృష్టి కలిగియున్నను, ఆ భుక్తిలో దేహమందు వ్రణబాధయు, మనస్తాపమును, కార్యహానియు కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టగే సూర్యే వ్యయేవా నీచరాశిగే।
శత్రుభిః పీడితో నిత్యం కలహంచ ధనక్షయం।
యుద్ధేశత్రు భయంచైవ చతుష్పా జ్జీవనాశనం।
పితృబంధు వినాశంచ ప్రభుమూలా ద్ధనవ్యయం।
స్వపుత్ర కలహంచైవ యత్నకార్య వినాశనం।
బంధనం ఋణబాధాచ పైత్యక్షయ సముద్భవం॥ 3

తా. సూర్యుడు లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయం

దున్నను, లేక తన నీచరాశిని పొందియున్నను, ఆ భుక్తియందు శత్రుజన పీడయు, నిత్యము కలహమును, ధనక్షయమును, యుద్ధమునందు శత్రుభయమును, చతుష్పాజ్జీవనాశనమును, పితృనాశమును, బంధుజన నాశమును, ప్రభు మూలకముగా ధనవ్రయమును, తన పుత్రులతోడ కలహమును, యత్నకార్య భంగమును, బంధనప్రాప్తియు, ఋణబాధయు, పిత్తరోగమును, క్షయరోగమును కలుగును.

శ్లో॥ శశినా సంయుతే దృష్టే మణిభూషణ సంగ్రహం।
విచిత్ర వస్త్రాభరణం గురుపుత్రాది సౌఖ్యదం॥ 4

తా. చంద్రునితో కలసినను, లేక చూడబడినను, మణిభూషణ సంగ్రహమును, విచిత్ర వస్త్రాభరణ ప్రాప్తియు, గురుపుత్రాది సౌఖ్యమును కలుగును.

శ్లో॥ కుజేన సంయుతేదృష్టే ప్రవాళ మణిలాభకృత్।
రక్తవస్త్రాది లాభంచ ధనవృద్ధిస్తు జాయతే॥ 5

తా. కుజునితో కలసినను, లేక చూడబడినను, ప్రవాళ మణిలాభమును,ఎఱ్ఱని వస్త్రప్రాప్తియు,ధనవృద్ధియు కలుగును.

శ్లో॥ బుధేన సంయుతేదృష్టే నానామూలాద్ధనాగమం।
బంధుకళ్యాణ విభవం వారస్త్రీ సంగమంతథా॥ 6

తా. బుధునితో కలసినను, లేక చూడబడినను, నానామూలకముగా ధనాగమంబును, బంధు కళ్యాణాది విభవమును, వేశ్యాస్త్రీ సంగమంబును కలుగును.

శ్లో॥ గురుణా సంయుతేదృష్టే పుత్రవృద్ధిర్భవిష్యతి।
దేహసౌఖ్యం ధనప్రాప్తిర్బహువస్తు సు సంగ్రహః॥ 7

తా. గురువుతో కలసినను, లేక చూడబడినను, పుత్రవృద్ధియు, దేహసౌఖ్యమును, ధనప్రాప్తియు, విశేష వస్తు



సంగ్రహమును కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతే దృష్టే వాహనం గో వివృద్ధిదః।
వరభూషణలాభశ్చ కళ్యాణం భవతిధ్రువం॥ 8

తా. శుక్రునితో కలసినను, లేక చూడబడినను, వాహన సమృద్ధియు, పశ్వాభివృద్ధియు, శ్రేష్ఠమైన భూషణ లాభమును, కళ్యాణాది మహోత్సవములును సిద్ధించును.

శ్లో॥ శనినా వస్త్రనాశాది వాహనం పశునాశనం।
ఆప్తబంధు వియోగంచ దాసీదాసాది నాశనం॥ 9

తా. శనితో కలసినను, లేక చూడబడినను, వస్త్ర నాశమును, వాహనక్షయమును, పశుహానియు, ఆప్తబంధు వియోగంబును, దాసదాసీజన నాశమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయే లాభగేపివా।
శుభగ్రహేణ సంయుక్తే ఉద్యోగ ప్రాప్తిమేనచ।
తత్వజ్ఞానాది వార్తాభిః కాలక్షేపం సుతోత్సవం।
అపూర్వ బంధుసంప్రాప్తిం నిత్యం సంపద వైభవం॥

తా. సూర్యుడు దశానాథునకు కేంద్రకోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను, లేక శుభగ్రహములతో కూడియున్నను, ఆ భుక్తియందు ఉద్యోగప్రాప్తియు, తత్వజ్ఞానాది వార్తా ప్రసంగమును, పుత్రోత్సవమును, అపూర్వ బంధు సంప్రాప్తియు, నిత్యము సంపత్తులవల్ల కలిగిన విభవమును జరుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠగేవాపి వ్యయేవా రంధ్రగేపివా।
పాపగ్రహయుతేవాపి మనఃక్లేశం ధనవ్రయం।
వివాహే కలహంచైవ స్త్రీపీడాం బంధునిగ్రహం।
ధాన్యార్థ పశునాశంచ అధికార వినాశనం॥ 11

తా. దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను, లేక పాపగ్రహముతో కూడియున్నను, మనోదుఃఖమును, ధనవ్రయమును, వివాహమునందు కలహమును, స్త్రీపీడయు, బంధు వినాశమును, ధాన్యార్థ నాశమును, పశుహానియు, అధికార భంగమును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా అపమృత్యు ర్భవిష్యతి।
తద్దోష పరిహారార్థం సూర్యప్రీతి కరోభవేత్॥ 12

తా. ద్వితీయ సప్తమరాసులయం దున్నయెడల అపమృత్యువు సంభవించును.ఆదోష పరిహారార్థమైసూర్యప్రార్థన చేయవలయును.

---

బుధదశాయాం చంద్రభుక్తిమాసాః 17.

కృష్ణియ్యో॥

శ్లో॥ బుధస్యాంత ర్గతేచంద్రే లగ్నాత్కేంద్రే త్రికోణగే।
తృతీయే లాభగేవాపి ఉచ్చరాశి స్థితేబలీ।
స్వర్క్షే వాస్వాంశగేవాపి గురుణా సంయుతేక్షితే।
గ్రామభూమ్యాధి కారంచ అశ్వాద్యారోహణంతథా।
సమాన ప్రభుసన్మానం మణిభూషణ సంగ్రహం।
బంధుకళ్యాణ సంపత్తిం మిత్రవర్గ వివృద్ధిదం।
పశుదాసాదివృద్ధించ స్వప్రభోస్తు మహత్సుఖం।
ధనధాన్య సమృద్ధించ యత్నకార్య సు సిద్ధిదం।
ద్వీపాంతరా ద్వస్తులాభం సమాన జనవృద్ధిదం॥ 1

తా. బుధదశలో చంద్రభుక్తియందు చంద్రుడు లగ్నమునకు కేంద్రత్రికోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, తన ఉచ్చరాశిని పొందియున్నను, స్వక్షేత్ర స్వనవాంశలయం దున్నను, లేక గురువుతో కూడియున్నను,



గ్రామాధికారమును,భూలాభమును,అశ్వాది వాహనారోహణ ప్రాప్తియు, సమానప్రభు సన్మానమును, మణిభూషణ సంగ్రహంబును, బంధు కళ్యాణ సంపత్తియు, మిత్రవర్గాభివృద్ధియు, పశువృద్ధియు, సేవకాజనవృద్ధియు, తనప్రభువు మూలకముగా సుఖమును,. ధనధాన్య సమృద్ధియు, యత్నకార్య సిద్ధియు, ద్వీపాంతర వస్తు లాభమును, సమాన జనవృద్ధియు కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టగే చంద్రే వ్యయేవా నీచరాశిగే।
పాపగ్రహేణ సందృష్టే క్షీణేవా శత్రురాశిగే।
అపకీర్తి భయంచైవ మనశ్చాంచల్య మేవచ।
వ్యవహారే వినాశశ్చ ఋణబాధా భవిష్యతి।
ధాన్యార్థ పశునాశంచ స్త్రీద్వేషం పుత్రపీడనం।
మాతుర్విరోధ మాలస్యం బంధుభిః కలహంతథా।
వ్యాయామం కార్యనాశంచ నృపక్రోధం తథైవచ॥ 2

తా. చంద్రుడు లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను, తన నీచరాశియం దున్నను, పాపగ్రహములతో కూడియున్నను, లేక చూడబడినను, క్షీణించియున్నను, లేక శత్రురాశియం దున్నను, అపకీర్తి భయమును, మనశ్చాంచల్యమును, వ్యవహార నాశనమును, ఋణబాధయు, ధాన్యార్థ నాశనమును, పశుహానియు, స్త్రీద్వేషమును, పుత్రపీడయు, మాతృ విరోధమును, ఆలస్యమును, బంధువులతోడ కలహమును, వ్యాయామమును, కార్యనాశమును, రాజక్రోధమును కలుగును.

శ్లో॥ రవిణా సంయుతే దృష్టే మార్గసంచార మేవచ।
స్వస్థాననాశం కురుతే ధనహాని ర్భవిష్యతి॥ 3

తా. సూర్యునితో కలసినను, లేక చూడబడినను,

మార్గ సంచారమును, స్వస్థాన నాశనమును, ధనహానియును కలుగును.

శ్లో॥ కుజేన సంయుతే దృష్టే వివాహాది శుభప్రదః।
సహోదరాది వృద్ధిశ్చ బంధువృద్ధి ర్భవిష్యతి॥ 4

తా. కుజునితో కలసినను, లేక చూడబడినను, వివాహాది శుభప్రదమును, సోదర జన వృద్ధియు, బంధు వృద్ధియు కలుగును.

శ్లో॥ బుధేన సంయుతే దృష్టే శాస్త్రాభ్యాసాది చింతనం।
తీర్థస్నాన ఫలప్రాప్తిం వ్యాపార ధనలాభకృత్॥ 5

తా. బుధునితో కలసినను, లేక చూడబడినను, శాస్త్రాభ్యాసాది చింతనయు, తీర్థస్నాన ఫలప్రాప్తియు, వ్యాపార మూలకముగా ధనలాభమును కలుగును.

శ్లో॥ గురుణా సంయుతే దృష్టే గురుభక్తి ర్ద్విజార్చనం।
మంత్రదీక్షా ప్రసంగాది సత్కర్మాది పరిగ్రహః॥ 6

తా. గురువుతో కలసినను, లేక చూడబడినను, గురుభక్తియు, బ్రాహ్మణపూజయు, మంత్రదీక్షా ప్రసంగమును, సత్కర్మప్రాప్తియు కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతే దృష్టే పరస్త్రీ సంగమంతథా।
భూషణాది సమృద్ధించ యత్నకార్య సుసిద్ధిదం॥ 7

తా. శుక్రునితో కలసినను, లేక చూడబడినను, పరస్త్రీ సంగమంబును, భూషణాది సమృద్ధియు, యత్నకార్యసిద్ధియు కలుగును.

శ్లో॥ శనినా సంయుతేదృష్టే నీచానాం కలహస్తథా।
పశుస్త్రీ ధనహానిశ్చ మానహాని ర్భవిష్యతి॥ 8

తా. శనితో కూడినను, లేక చూడబడినను, నీచుల తోడ కలహమును, పశుహానియు, స్త్రీనాశమును, ధనక్షయమును, మానభంగమును కలుగును.



శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయే లాభగేపివా।
శుభగ్రహ యుతేవాపి సుతలాభో ధనాగమః।
అశ్వాది వాహనప్రాప్తిః వరభూషణ లబ్ధవాన్।
యత్నకార్యార్థ సిద్ధిశ్చ మహారాజాశ్రయస్తథా।
దారపుత్రాది సౌఖ్యంచ కృషిధాన్య వివృద్ధిదః।
దానధర్మాది వృద్ధిశ్చ దుర్గారాధన తత్పరః॥ 9

తా. చంద్రుడు దశానాథునకు కేంద్రకోణములయం దున్నను తృతీయలాభముల యందున్నను లేక శుభగ్రహములతో కూడియున్నను, ఆభుక్తియందు పుత్రలాభమును, ధనాగమంబును, అశ్వాది వాహనప్రాప్తియు, శ్రేష్ఠమైన భూషణ లాభమును, యత్నకార్యార్థ సిద్ధియు, మహారాజాశ్రయమును, భార్యాపుత్రాది సౌఖ్యమును, కృషిలాభమును, ధాన్యవృద్ధియు, దానధర్మాది పరోపకారమును, దుర్గారాధనయు కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠ రంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
నానాజనవిరోధశ్చ బంధుద్వేషో మనోవ్యథా।
సర్వకార్యవినాశశ్చ స్వస్థానచలనం తథా।
నీచస్త్రీకలహంచైవ వస్త్రహాని ర్భవిష్యతి॥ 10

తా. చంద్రుడు దశానాథునకు ౬-౮-౧౨. స్థానముల యందున్నను లేక పాపులతో కూడియున్నను నానాజనవిరోధమును, బంధుద్వేషమును, మనోవ్యథయు, సర్వకార్యవినాశమును, స్వస్థానచలనమును, నీచస్త్రీతోడ కలహమును, వస్త్రహానియు కలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే హ్యపమృత్యు ర్భవిష్యతి।

తద్దోషపరిహారార్థం దుర్గాదేవీ జపంచరేత్।
రజతప్రతిమాదానం కుర్యాచ్ఛాంతి మవాప్నుయాత్॥

తా. ద్వితీయ సప్తమరాసుల యందు చంద్రుడున్న యెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై దుర్గాదేవి జపము చేయవలయును. గాకను వెండిప్రతిమ దానము చేసిన పిమ్మట శాంతి కలుగును.

---

బుధదశాయాం కుజభుక్తిమాసాః 11. దినాని 27.

కృష్ణీయే॥

శ్లో॥ బుధస్యాంతర్గతే భౌమే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయే లాభగేవాపి హ్యుచ్చస్వక్షేత్ర సంయుతే।
లగ్నాధిపేనసంయుక్తే స్వవర్గే బలసంయుతే।
రక్తవస్త్రాది వృద్ధించ మణిమాణిక్య సంగ్రహం।
విచిత్రగృహనిర్మాణం గ్రామభూమ్యాది లబ్ధకృత్।
స్వవారే రాజసన్మానం మిత్రప్రభు వశాత్సుఖం।
కృషిక్షేత్రవివృద్ధించ దూరబాంధవ దర్శనం।
శుభకార్యాణి వృద్ధించ సుతలాభం తథైవచ॥ 1

తా. బుధదశలో కుజభుక్తియందు కుజుడు లగ్నమునకు కేంద్రత్రికోణములయం దున్నను, తృతీయలాభముల యందున్నను, ఉచ్చస్వక్షేత్రములయం దున్నను, లగ్నాధిపతితో కూడియున్నను, స్వవర్గమునందు బలము కలిగియున్నను, ఎఱ్ఱని వస్త్రలాభమును, మణిమాణిక్య సంగ్రహమును, విచిత్ర గృహనిర్మాణమును, గ్రామాధిపత్యమును, భూలాభమును, తన వారమునందు రాజసన్మానమును, మిత్రప్రభువు మూలకముగా సుఖమును, కృషిలాభమును, క్షేత్రవృద్ధియు, దూరదేశ బంధు దర్శనమును, శుభకార్యవృద్ధియు, పుత్రోత్సవమును కలుగును.



శ్లో॥ లగ్నషష్ఠాష్టరాశిస్థే వ్యయేవా నీచరాశిగే।
నీచాంశకే స్థితేవాపి క్రూరద్రేక్కాణ సంయుతే।
వాహనోర్వీ ప్రణాశశ్చ ధనధాన్య వినాశనం।
సమాన జనకష్టంచ దాయాది కలహస్తథా।
దారపుత్రవియోగశ్చ యత్నకార్య వినాశనం।
పైత్యభ్రమణరోగాది గ్రహణి క్షయసంభవః।
మిత్రప్రభువిరోధశ్చ ప్రయాణే కార్యనాశనం।
అకస్మాత్కలహశ్చైవ ఋణబాధా భవిష్యతి।
చోరారి విషభీతిశ్చ హ్యున్నతా త్పతనంతథా॥ 2

తా. లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయం దున్నను, తన నీచరాశియందున్నను, నీచాంశయందున్నను, క్రూరద్రేక్కాణమందున్నను, వాహననాశమును, ధనధాన్య నాశమును, సమాన జనకష్టమును, దాయాది కలహమును, భార్యాపుత్ర వియోగమును, యత్నకార్యభంగమును, పిత్తవికారమును, గ్రహణీ క్షయరోగములును, మిత్రప్రభు విరోధమును, ప్రయాణమునందు కార్యనాశనమును, అకస్మాత్తుగా కలహమును, ఋణబాధయు, చోరభయమును, శత్రుబాధయు, విష భీతియు, ఉన్నతస్థలమునుండి పడుటయు కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే మహాప్రభు వశాత్సుఖం।
స్వాధికార వివృద్ధిశ్చ సంగ్రామేవిజయప్రదః॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను మహాప్రభు మూలకముగా సుఖమును, అధికారవృద్ధియు, యుద్ధమునందు జయమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతే దృష్టే క్షీరాన్నాది సుభోజనం।
స్వస్త్రీశయ్యా సుఖప్రాప్తిః గాయకాది సమాగమః॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను క్షీరాన్నముతో గూడిన మృష్టాన్నభోజనమును, తనస్త్రీతో శయ్యాసుఖమును, గాయకాది సమాగమంబును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే బంధుమిత్రాది సంకులః।
వణిజ్యాద్ధనప్రాప్తి స్సర్వ కార్యార్థ సిద్ధిదః॥ 5

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, బంధుమిత్రాది సంకులమును, వర్తకుల మూలకముగా ధనప్రాప్తియు, సర్వకార్యార్థ సిద్ధియు కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే పుత్రపీడా ధనవ్యయః।
గురుద్వేషో ధర్మహాని ర్బుద్ధిభ్రంశ స్తథైవచ॥ 6

తా. గురువుతో కలసినను లేక చూడబడినను పుత్రపీడయు, ధనవ్యయమును, గురుద్వేషమును, ధర్మహానియు, బుద్ధిభ్రంశమును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే గర్భస్రావాది పీడనం।
రక్తసంబంధరోగాశ్చ కళత్రస్య నసంశయః॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను గర్భస్రావాది పీడనయు, భార్యకు రక్తసంబంధమగు రోగభయమును నిశ్చయముగా కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే నీచారికలహం తథా।
పశుదాసాదినాశంచ యత్నకార్య వినాశనం॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను, నీచజనుల తోడను, శతృవులతోడను కలహమును, పశుహానియు, సేవకాజననాశమును, యత్నకార్య భంగమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా।
శుభగ్రహయుతేవాపి ఉచ్చరాశి స్థితేపివా।



వాహనంభూపసన్మానం మణిభూషణ సంగ్రహం।
స్త్రీపుత్ర శుభసంపత్తిం గృహేకళ్యాణ శోభనం।
స్వనామాంకిత ఉద్యోగం కీర్తిలాభం తథైవచ।
నీలవస్త్రాదిలాభంచ నీలోత్పల సుగంధకం।
తీర్థస్నానఫలప్రాప్తిం సేతుస్నానమథాపివా।
స్వప్రభోస్తు మహత్సౌఖ్యం సర్వకార్య సుసిద్ధిదం॥ 9

తా. కుజుడు దశానాథునకు కేంద్రకోణముల యందున్నను, తృతీయలాభముల యందున్నను, శుభగ్రహముతో కూడియున్నను లేక తన ఉచ్చరాశిని పొందియున్నను, ఆభుక్తియందు వాహనప్రాప్తియు, రాజసన్మానమును, మణిభూషణ సంగ్రహమును, స్త్రీపుత్ర శుభసంపత్తియు, యింటియందు కళ్యాణవైభవమును, తనపేరు అంకితముగాగల ఉద్యోగమును, కీర్తిలాభమును, నీలవస్త్రాదిలాభమును, సుగంధ పరిమళ భోగసౌఖ్యమును, తీర్థస్నానఫలప్రాప్తియు, సేతుస్నానఫలమును, తనప్రభువు మూలకముగా విశేషసౌఖ్యమును, సర్వకార్య సిద్ధియు కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా నీచరాశిగే।
పాపగ్రహయుతేవాపి ధననాశ స్తథైవచ।
బంధువర్గవిరోధశ్చ వహ్నిపీడా భవిష్యతి।
స్వదేహేగుద బాధాచ విషసర్ప భయంతథా।
దారపుత్రాది బాధాచ హ్యాప్తబంధు వినాశనం।
సమాన జనవిద్వేషం దాయాది కలహంతథా॥ 10

తా. కుజుడు దశానాథునకు ౬-౮-౧౨. రాసులయందున్నను, నీచరాశిని పొందియున్నను, లేక పాపగ్రహముతో కూడియున్నను, ఆభుక్తియందు ధననాశమును, బంధువర్గవిరో

థమును, అగ్నిబాధయు, దేహమునందు గుదబాధయు, విష భీతియు, సర్పభయమును, భార్యాపుత్రాది పీడయు, ఆప్త బంధు వినాశనమును, సమాన జనవిరోధమును, దాయాది కలహమును కలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే అపమృత్యు ర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థ మనడ్వాహం ప్రదాపయేత్।
మృత్యుంజయజపంవాపి స్కందపూజాం సమాచరేత్॥

తా. ద్వితీయ సప్తమరాసులయం దున్న యెడల అప మృత్యువు సంభవించును. ఆదోషపరిహారార్థమై కుఱ్ఱదూడను దానము చేయవలయును. గాకను మృత్యుంజయ జపముగాని స్కందపూజనుగాని చేసిన యెడల శాంతి కలుగును.

---

బుధదశాయాం రాహుభుక్తిమాసాః ౩౦. దినాని 18.

పారాశర్యే ॥

శ్లో॥ బుధస్యాం తర్గతేరాహౌ లగ్నాత్కేంద్రే త్రికోణగే।
తృతీయే లాభగేవాపి హ్యుచ్చరాశి స్థితేపివా।
శుభాంశేశుభసంయుక్తే శుభగ్రహ నిరీక్షితే।
రాజసల్లాపసంపన్నం నూతన ప్రభుదర్శనం।
చతుష్పాజ్జీవలాభంస్యా త్పుణ్యతీర్థాభిషేచనం।
దేహారోగ్యం మహాత్సౌఖ్యం స్వప్రభోస్తు మహత్సుఖం।
వస్త్రాభరణ భూషాద్య మిష్టసిద్ధి సుఖాధికం॥ 1

తా. బుధదశలో భుక్తినాథుడగు రాహువు లగ్నమునకు కేంద్ర త్రికోణములయం దున్నను, తృతీయలాభముల యం దున్నను, తన ఉచ్చరాశియం దున్నను, శుభాంశయం దున్నను, శుభగ్రహముతో కూడియున్నను లేక శుభగ్రహ వీక్షణ కలిగియున్నను, ఆభుక్తియందు రాజసల్లాపమును, సంపత్తును, నూతన ప్రభుదర్శనమును, చతుష్పాజ్జీవలాభమును, పుణ్యతీర్థస్నానఫలమును, దేహారోగ్యమును, విశేషసౌఖ్యము ను, తనప్రభువు మూలకముగా నధిక సుఖమును, వస్త్రాభరణ భూషణప్రాప్తియు, ఇష్టసిద్ధియు, సుఖాధికమును కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టరాశిస్థే వ్యయేవా నీచరాశిగే।
నీచాంశే నీచసంయుక్తే క్రూరగ్రహ యుతేపివా।
విషచోరాగ్నిభీతిశ్చ దారాక్లేశో భవిష్యతి।
వ్యాధిపీడా మృత్యుభయం స్థానాదిచ్యుతికారకః।
కుళీరసింహ కుంభాది స్థానస్థే కలహోభవేత్।
శత్రురాజ భయంప్రోక్తం సమిరేచ పరాభవం॥ 2

తా. రాహువు లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయం దున్నను, తన నీచరాశియం దున్నను, నీచాంశయం దున్నను, నీచగ్రహముతో కూడియున్నను లేక క్రూరగ్రహముతో కూడి యున్నను, ఆభుక్తియందు విషభీతియు, చోరబాధయు, అగ్ని భయమును, భార్యాశోకమును, వ్యాధిపీడయు, మృత్యుభయ మును, స్థానభ్రంశమును, కలుగును. కర్కాటక, సింహ, కుంభ రాసులయందున్న యెడల కలహమును, శత్రురాజభయమును, యుద్ధమునం దపజయమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే శిరోరోగం తథైవచ।
నేత్రేపటలరోగాదీ పితృవర్గ వినాశనం॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను శిరో రోగమును, నేత్రబాధయు, పితృవర్గ వినాశమును కలుగును.

శ్లో॥ శశినామాతృహానిస్యా స్త్రీవినాశం విరోధకృత్।
సర్వత్రకలహంచైవా హ్యాయత్నేన ధనక్షయం॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను మాతృ

వియోగమును, స్త్రీనాశమును, విరోధమును, సర్వులతోడ కలహమును, ధనక్షయమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే భ్రాతృభిఃకలహం తథా।
దాయాది వృద్ధికలహం బంధుక్షయ మవాప్నుయాత్॥

తా. కుజునితో కలసినను లేక చూడబడినను సహోదరులతోడ కలహమును, దాయాది వృద్ధియు, కలహమును, బంధు క్షయమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే జ్ఞానహీనేన భాషణం।
అయుక్తాలాపవార్తాచ ఋణవృద్ధి ర్భవిష్యతి॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, జ్ఞానశూన్య భాషణమును, యుక్తాయుక్తములేని ప్రసంగమును, ఋణవృద్ధియు కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే గురుపుత్ర వినాశనం।
బుద్ధిజాడ్యం దేహబాధా ధనక్షయ కరోభవేత్॥ 7

తా. గురునితో కలసినను లేక చూడబడినను గురు పుత్ర నాశనమును, బుద్ధిజాడ్యమును, దేహబాధయు, ధన క్షయమును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే స్త్రీపుత్రాణాం శుభంతథా।
వాహనాది శుభప్రాప్తిః కళ్యాణం పుత్రసంభవః॥ 8

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను భార్యాపుత్రులకు శుభమును, వాహనాది శుభప్రాప్తియు, కళ్యాణమును, పుత్రోత్సవమును కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే దేహజాడ్యం మనోవ్యథా।
పశుదాసాదినాశంచ స్వస్త్రీదేహస్య బాధకం॥ 9

తా. శనితో కలసినను లేక చూడబడినను దేహజాడ్య



మును, మనోవ్యథయును, పశుహానియు, సేవకాజన నాశమును, స్వంతస్త్రీకి దేహబాధయు కలుగును.

శ్లో॥ దాయేశా త్కేంద్రకోణేవా దుశ్చిక్యే లాభగేపివా।
షష్ఠేవా శుభసంయుక్తే హ్యపూర్వ ప్రియదర్శనం।
కళత్ర సౌఖ్యమాప్నోతి బంధుసౌఖ్యం భవేత్తదా।
పుత్రమిత్రాది సౌఖ్యంచ సర్వకార్య సుసిద్ధికం॥ 10

తా. రాహువు దశానాథునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, షష్ఠరాశియం దున్నను, లేక శుభగ్రహముతో కూడి యున్నను ఆభుక్తియందు అపూర్వ ప్రియదర్శనమును, కళత్రసౌఖ్యమును, బంధుసౌఖ్యమును, పుత్రమిత్రాది సౌఖ్యమును, సర్వకార్య సిద్ధియు కలుగును.

శ్లో॥ దాయేశా ద్రంధ్రగేవాపి వ్యయేవా పాపసంయుతే।
దేహబాధా మతిభ్రంశః పరదారాది సంగ్రహః।
అపకీర్తి భయంచైవ విధవా కలహస్తథా।
అకాల భోజనప్రాప్తి ర్యత్నకార్యార్థ నాశనం॥ 11

తా. రాహువు దశానాథునకు అష్టమ వ్యయమముల యం దున్నను, లేక పాపులతో కలసినను, ఆ భుక్తియందు దేహబాధయు, బుద్ధిభ్రంశమును, పరస్త్రీ సంగ్రహమును, అపకీర్తి భయమును, విధవా కలహమును, అకాల భోజన ప్రాప్తియు, యత్నకార్యార్థ నాశమును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా హ్యపమృత్యు ర్భవిష్యతి।
తద్దోష పరిహారార్థం రుద్రసాహస్రకం జపేత్।
ఛాగదానం ప్రకుర్వీత సర్వసంపత్ప్రదాయకం॥ 12

తా. ద్వితీయ సప్తమ రాసులయందు రాహువున్న యెడల అపమృత్యువు కలుగును. ఆదోష పరిహారార్థమై రుద్ర సహస్ర జపమాచరించ వలయును. గాకను, ఛాగదానము చేసినపిమ్మట సర్వసంపత్తును కలుగును.

బుధదశాయాం గురుభుక్తిమాసాః 27. దినాని 6.

కృష్ణీయ్యే॥

శ్లో॥ బుధస్యాంత ర్గతేజీవే లగ్నాత్కేంద్రే త్రికోణగే।
తృతీయే లాభగేవాపి హ్యుచ్చరాశి స్థితేపివా।
ఇష్టవస్తు సు సంప్రా పిః ధనధాన్య వివృద్ధిదః।
ఆత్మబంధో ర్దర్శనంచ రాజానుగ్రహ కారకః।
తటాకా రామకూపాది నిర్మాణాదిషు తత్పరః।
శివాలయ ప్రతిష్ఠాతా యజ్ఞకర్మాది సత్క్రియః।
పుత్రాదికార సంప్రాప్తి స్స్వకళత్ర సుఖోభవేత్।
యుద్ధేజయ మణేర్లాభం స్వర్ణభూషణ ధారణం।
యానవాహనసంప్రాప్తిం మంత్రయంత్రాదిసంగ్రహం॥

తా. బుధదశలో గురుభుక్తియందు, గురువు లగ్నమునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక తన ఉచ్చరాశియం దున్నను, ఇష్టవస్తు సంప్రాప్తియు, ధనధాన్య సమృద్ధియు, ఆత్మబంధు దర్శనమును, రాజానుగ్రహమును, చెఱువులు, బావులు, గుంటలు, తోపులు, మొదలగు వాని నిర్మాణమును, శివాలయ ప్రతిష్ఠా ఫలమును, యజ్ఞకర్మాది సత్కర్మసిద్ధియు, పుత్రాధికార సంప్రాప్తియు, కళత్ర సుఖమును, యుద్ధమునందు జయమును, మణిలాభమును, స్వర్ణభూషణ ప్రాప్తియు, యానవాహన సంప్రాప్తియు, మన్త్ర యంత్రాది కర్మ సిద్ధియు కలుగును.



గ్రంథాంతరే॥

శ్లో॥ సౌమ్యస్యాంత ర్గతేజీవే సౌఖ్యసాధన లాభకృత్।
భూమ్యాత్మజేన సంయుక్తే కలహో కేతుసంయుతే।
లగ్నషష్ఠాగే జీవే వ్యయేవా నీచరాశిగే।
శన్యార ఫణి సంయుక్తే కలహం బంధునాశనం।
చోరాద్రాజ్ఞో భయంక్లేశం పితృమాతృ వినాశనం।
జ్వరవ్రణాగ్ని పీడాచ జీవ గో భూమినాశనం॥ 2

తా. బుధదశలో గురుభుక్తియందు సౌఖ్యమును, ధన లాభమును కలుగును. ఆ గురువు కుజునితో కలసినను లేక కేతువుతో కలసి యున్నను కలహము తటస్థించును. గురువు లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయందుగాని, తన నీచరాశి యందుగాని, యున్నను, లేక శని కుజ రాహువులతో కలసి యున్నను, ఆ భుక్తియందు కలహమును, బంధు నాశనమును, చోరబాధయు, రాజ భయమును, దుఃఖమును, మాతాపితృ వియోగమును, జ్వరబాధయు, వ్రణపీడయు, అగ్నిభయమును, పశ్వాది చతుష్పాజ్జీవ నాశమును, భూనాశమును, కలుగునని గ్రంథాంతర వచనము.

శ్లో॥ రవిణా సంయుతేదృష్టే కృషిమూలా ద్ధనాగమం।
ఉద్యోగలాభం కురుతే రాజసన్మానమేవచ॥ 3

తా. సూర్యునితో కలసినను, లేక చూడబడినను, వ్యవసాయ మూలకముగా ధనలాభమును, ఉద్యోగప్రాప్తియు, రాజ సన్మానమును కలుగును.

శ్లో॥ శశినా సంయుతేదృష్టే వస్త్రలాభం శుభోదయం।
మనస్సంతోష సౌఖ్యంచ మాతృవంశ వివర్ధనం॥ 4

తా. చంద్రునితో కలసినను, లేక చూడబడినను, వస్త్ర

లాభమును, విశేష శుభమును, మనస్సంతోషమును, సౌఖ్యమును, మాతృవంశాభి వృద్ధియు కలుగును.

శ్లో॥ కుజేన సంయుతేదృష్టే యుద్ధేజయ మవాప్నుయాత్।
స్వవారే రాజసన్మానం భూమిలాభం తథైవచ॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, యుద్ధమునందు జయమును, తన వారమునందు రాజ సన్మానమును, భూలాభమును కలుగును.

శ్లో॥ బుధేన సంయుతేదృష్టే వస్త్రభూషణ లబ్ధవాన్।
విద్యావినోద గోష్ఠించ పండితైస్స సమాగమం॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, వస్త్రభూషణ లాభమును, విద్యావినోద గోష్ఠియు, పండితులతోడ సమాగమంబును కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతేదృష్టే స్త్రీసౌఖ్యం యానవృద్ధిదం।
స్వప్రభోస్తు మహత్కీర్తిం వస్త్రాభరణ సంగ్రహం॥ 7

తా. శుక్రునితో కలసినను, లేక చూడబడినను, స్త్రీసౌఖ్యమును, వాహన వృద్ధియు, తన ప్రభువువల్ల విశేష కీర్తియు, వస్త్రాభరణ సంగ్రహమును కలుగును.

శ్లో॥ శనినా సంయుతే దృష్టే గళరోగం తథైవచ।
భృత్యవర్గ వినాశంచ పూజ్యానాంతు విరోధకృత్॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను, గళరోగప్రాప్తియు, భృత్యవర్గ వినాశమును, పెద్దలతోడ విరోధమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయే లాభగేపివా।
శుభగ్రహ యుతేవాపి ధనలాభ ముదీరయేత్।
ఉద్యోగలాభం కురుతే కళత్రాదిషు సౌఖ్యదం।



కృషిక్షేత్ర వివృద్ధించ ధాన్యలాభం తథైవచ।
స్వప్రభోస్తు మహాత్సౌఖ్యం స్వవారే నృపదర్శనం।
సాంఖ్యయోగాది శాస్త్రాది గ్రంథార్థంతు విచారణం॥ 9

తా. గురువు దశానాథునకు కేంద్రకోణములయందున్నను తృతీయ లాభములయం దున్నను, లేక శుభగ్రహముతో కూడియున్నను, ఆ భుక్తియందు ధనలాభమును, ఉద్యోగప్రాప్తియు, భార్యాపుత్ర సౌఖ్యమును, కృషిలాభమును, క్షేత్రవృద్ధియు, ధాన్యలాభమును, తన ప్రభువు మూలకముగా విశేష సౌఖ్యమును, తన వారమునందు రాజ దర్శనమును, సాంఖ్యయోగాది శాస్త్రాది గ్రంథార్థ విచారణయు కలుగును

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
బ్రాహ్మణానాం విరోధశ్చ పుత్రద్వేషో భవిష్యతి।
దేహబాధా బుద్ధినాశం కలహం స్థాననాశనం।
సమాన జనకష్టంచ చతుష్పా జ్జీవనాశనం॥ 10

తా. గురువు దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను, లేక పాపగ్రహములతో కలసియున్నను, ఆ భుక్తియందు బ్రాహ్మణులతోడ విరోధమును, పుత్రద్వేషమును, దేహబాధయు, బుద్ధి నాశమును, కలహమును, స్థాన నాశమును, సమానజన కష్టమును, చతుష్పా జ్జీవ నాశనమును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి।
తద్దోష పరిహారార్థం మృత్యుంజయ జపంచరేత్।
కాంచన ప్రతిమాదానం గురుప్రీతికరం తథా॥ 11

తా. ద్వితీయ సప్తమ రాసులయందు గురువున్నయెడల

అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై మృత్యుంజయ జపము చేయవలయును. గాకను, బంగారు ప్రతిమ దానమును గురు ప్రీతికరముగా చేయవలయును.

---

బుధదశాయాం శనిభుక్తిమాసాః ౩. దినాని ౯.

కృష్టిర్యే॥

శ్లో॥ బుధస్యాంత ర్గతేమందే లగ్నాత్కేంద్రే త్రికోణగే।
తృతీయే లాభగేవాపి హ్యుచ్చరాశి స్థితేపివా।
తద్భుక్తౌ పుణ్యతీర్థాది స్నానం దైవత దర్శనం।
పశ్చిమాందిశి మాశ్రిత్య ప్రయాణం రాజదర్శనం।
మాతృబంధు వివృద్ధిశ్చ నృపప్రీతి ర్భవిష్యతి।
దాసదాసీ జనప్రాప్తి శూద్రప్రభు వశాత్సుఖం।
బహుక్షేత్రాభి వృద్ధిశ్చ ధాన్యసంగ్రహణం తథా।
పశురత్నాది లాభశ్చ బంధువృద్ధి స్సుతోదయః॥ 1

తా. బుధదశలో శని భుక్తియందు శని లగ్నమునకు కేంద్రత్రికోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక తన ఉచ్చరాశియం దున్నను, పుణ్య తీర్థాది స్నానమును, దేవతా దర్శనమును, పశ్చిమ దిక్కునకు ప్రయాణమును, రాజ దర్శనమును, మాతృవృద్ధియు, బంధువృద్ధియు, రాజప్రీతియు, దాసదాసీజన సమృద్ధియు, శూద్రప్రభు మూలకముగా సుఖమును, బహు క్షేత్రాభివృద్ధియు, ధాన్య సంగ్రహణమును, పశురత్నాది లాభమును, బంధు జనాభివృద్ధియు, పుత్రోత్సవమును కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టమే మందే వ్యయేవా నీచరాశిగే।
సబంధు కలహంచైవ సమాన జననాశనం।
దేశా ద్దేశాంతరాయాంతి స్వగ్రామే స్థితినాశనం।



స్వాధికార వినాశంచ యుద్ధేభయ మవాప్నుయాత్।
నీచాంత్య జాతి కలహం స్వవారే రాజనిగ్రహం॥ 2

తా. శని లగ్నమునకు ౬-౮-౧౨ రాసులయం దున్నను, లేక తన నీచరాశియం దున్నను, ఆ భుక్తియందు బంధువులతోడ కలహమును,సమాన జన నాశనమును, అన్యదేశ వాసమును, స్వంత గ్రామమునందు స్థితి నాశనమును, అధికార భంగమును, యుద్ధమునందు భయమును, నీచులతోడను, అంత్య జాతులతోడను, కలహమును, తన వారమునందు రాజ నిగ్రహమును కలుగును.

శ్లో॥ రవిణా సంయుతే దృష్టే పితృనాశం ధనక్షయం।
శిరోరోగంచ కలహం మహత్సంగర సంభవం॥ 3

తా. సూర్యునితో కలసినను, లేక చూడబడినను, పితృ నాశమును, ధనక్షయమును, శిరోబాధయు,కలహమును, ప్రబల యుద్ధ సంభవమును కలుగును.

శ్లో॥ శశినా సంయుతేదృష్టే మాతృబంధు వినాశనం।
అకాల భోజనప్రాప్తిం యత్నకార్య వినాశనం॥ 4

తా. చంద్రునితో కలసినను, లేక చూడబడినను, మాతృ వియోగమును, బంధు వినాశమును, అకాల భోజనప్రాప్తియు, యత్నకార్య వినాశనమును కలుగును.

శ్లో॥ కుజేన జాతివైషమ్యం తన్మూలా ద్ధననాశనం।
విషశస్త్రాది బాధాచ ఉష్ణరోగాది సంభవం॥ 5

తా. కుజునితో కలసినను, లేక చూడబడినను, జాతి వైషమ్యమును, ఆ మూలకముగా ధననాశనమును, విషబాధయు. శస్త్రపీడయు, ఉష్ణరోగాది సంభవమును కలుగును.

శ్లో॥ బుధేన సంయుతే దృష్టే లిపివిద్యా విశారదః।

వ్యవహారేతి చాతుర్యః బంధుపోషణ తత్పరః॥ 6

తా. బుధునితో కలసినను, లేక చూడబడినను, కావ్య గణిత విద్యా నిపుణతయు, వ్యవహారమునందు అతి చాతుర్యమును, బంధుపోషణయు కలుగును.

శ్లో॥ గురుణా సంయుతేదృష్టే పుత్రపీడా మతిభ్రమః।
బ్రాహ్మణాది విరోధశ్చ యత్నకార్య వినాశనం॥ 7

తా. గురునితో కలసినను, లేక చూడబడినను, పుత్రపీడయు, బుద్ధిభ్రమణయు, బ్రాహ్మణ విరోధమును, యత్నకార్య భంగమును కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతే దృష్టే హ్యతిలాభో ధనప్రదః।
దారపుత్రాది సౌఖ్యంచ వాహనాధిప సంగ్రహః॥ 8

తా. శుక్రునితో కలసినను, లేక చూడబడినను, విశేష లాభమును, ధనవృద్ధియు, భార్యాపుత్రాది సౌఖ్యమును, వాహన సంగ్రహమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా విక్రమే లాభరాశిగే।
శుభగ్రహ యుతేవాపి శుభశోభన వృద్ధిదః।
అత్యాశ్రయేషు ప్రీతిశ్చ సభా పాండిత్య శీలవాన్।
అపూర్వ వస్తులాభశ్చ వేదాంతార్థ విశారదః।
శూద్రప్రభు వశాత్సౌఖ్యం సర్వకార్యార్థ సంగ్రహః॥

తా. శనైశ్చరుడు దశానాథునకు కేంద్రకోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను, లేక శుభగ్రహముతో కూడియున్నను, ఆ భుక్తియందు శుభశోభన సంపదయు, మేలైన ఆశ్రయమును, ప్రీతియు, సభాపాండిత్య ప్రాజ్ఞతయు, అపూర్వ వస్తు లాభమును, వేదాంతార్థ రహస్య పాండిత్యమును, శూద్రప్రభు మూలకముగా సౌఖ్యమును, సర్వ కార్యార్థ సిద్ధియు కలుగును.



శ్లో॥ దాయేశాత్షష్ఠగేరంధ్రే వ్యయేవా నీచరాశిగే।
పాపగ్రహ యుతేవాపి దేహబాధా భవిష్యతి।
స్వస్థానచలనం హానిః గురుబంధు వినాశనం।
క్షితీశాత్కలహశ్చైవ స్వాధికార వినాశనం॥ 10

తా. శనైశ్చరుడు దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను, లేక పాపగ్రహముతో కూడియున్నను, ఆ భుక్తియందు దేహబాధయు, స్వస్థాన చలనమును, హానియును, గురునాశమును, బంధుహానియు, రాజులతోడ కలహమును, అధికార నాశమును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా హ్యపమృత్యు ర్భవిష్యతి।
తద్దోష పరిహారార్థం మహిషీ దాన మాచరేత్॥ 11

తా. ద్వితీయ సప్తమ రాసులయందు శనైశ్చరుడున్న యెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై మహిషీదానము చేయవలయును.

ఇతి జాతకఫల చింతామణౌ బుధదశాంతర్దశాఫలంనామ
అష్టమప్రకరణం—సమాప్తము.

శుభమస్తు.

# జాతకఫలచింతామణి.

## ఆంధ్ర తాత్పర్య సహితము.

## కేతుదశాంతర్దశాఫలంనామ నవమప్రకరణము.

### కేతుదశా సంవత్సరాః 7.

శ్లో॥ దుఃఖంభయం స్వజన బంధువిరోధకష్టం
క్షేత్రార్థపుత్ర గృహిణి గృహనాశనంచ।
దేశాటనంచ క్షితిపాల విరోధతాంచ
స్యాత్సర్వదా ధ్వజదశాగమనే నపుంసాం॥ 1

తా. కేతుమహర్దశ సంప్రాప్తించిన కాలమందు నరులకు దుఃఖమును, భయమును, స్వజన విరోధమును, బంధు విరోధమును, కష్టమును, క్షేత్రక్షయమును, అర్థహానియు, పుత్రనాశమును, భార్యా వియోగమును, గృహ నాశనమును, దేశాంతర వాసమును, రాజ విరోధము ఎల్లప్పుడును కలుగుచుండును.

శ్లో॥ దశాదౌ సుఖమాప్నోతి దశామధ్యే మహద్భయం।
దశాంతే రాజభీతించ దేహనాశ మథాపివా॥ 2

తా. దశ ఆదిభాగమందు సుఖమును, మధ్యభాగమందు విశేషభయమును, అంత్యభాగమందు రాజభీతియు అథవా దేహనాశమును కలుగును.

శ్లో॥ భాగ్యకర్మేశ లగ్నేశ సంయుతే కేతుదాయగే।
ధనధాన్యాది లాభంచ రాజ్యశ్రీ ధనసంపదాం॥ 3



తా. నవమ దశమాధిపతులతో గాని లేక లగ్నాధిపతితో గాని కేతువు కలసియున్నయెడల ధనధాన్యలాభమును, రాజ్యప్రాప్తియు, లక్ష్మీకటాక్షమువల్ల ధనసంపత్తును కలుగును.

శ్లో॥ వక్రగ్రహ సమాయుక్తే రవిలుప్త గ్రహేణవా।
రాహుకేత్వోర్ద్విపాకేచ కారాగృహ నివేశనం॥ 4

తా. రాహు కేతువులు వక్రగ్రహముతో కూడియున్నను, లేక అస్తంగతులైనను, ఆ దశలయందు కారాగృహ ప్రాప్తి కలుగును.

శ్లో॥ రవీందు గ్రహణకాలే రాహుకేత్వో ర్యథాతథా।
దాయే మరణమాప్నోతి శస్త్రసర్పాగ్ని జాలకైః॥ 5

తా. గ్రహణ కాలములయందు అనగా సూర్యచంద్రులు రాహుగ్రస్తులై యున్నను, లేక కేతుగ్రస్తులైనను ఆదశలయందు మరణము సంభవించును. శస్త్రబాధయు, సర్పభీతియు, అగ్నిభయమును కలుగును.

శ్లో॥ అత్యుచ్చసంస్థస్య ధ్వజస్యదాయే
సుకీర్తిలబ్ధం విజయంచయుద్ధే।
సువర్ణ వస్త్రాభరణాని లాభం
గోవాజిమత్తేభ సమృద్ధిరంచ॥ 6

తా. పరమోచ్చయందున్న కేతుదశలో మంచి కీర్తియు, యుద్ధమునందు విజయమును, సువర్ణ వస్త్రాభరణ లాభమును, గోవులు, గుఱ్ఱములు, ఏనుగులు, మొదలగు వాని లాభమును కలుగును.

శ్లో॥ ఉచ్చస్థ సంస్థస్య ధ్వజస్యదాయే
కీర్తింజయం భూపతిపూజనంచ।
పురాణగీత శ్రవణం వినోదం

మనోవిలాసం మహదాధిపత్యం॥ 7

తా. ఉచ్చరాశియందున్న కేతుదశలో కీర్తియు, జయమును, రాజసన్మానమును,పురాణగీత శ్రవణమును, వినోదమును, మనోవిలాసమును, గొప్ప పదవియు కలుగును.

శ్లో॥ నీచస్థితస్యాపి ధ్వజస్యదాయే
ప్యాచారనాశం హ్యపకీర్తిలబ్ధం।
స్వస్థానవాశంచ మనోవిచారం
స్త్రీపుత్రపీడాగి వితంతుయుద్ధం॥ 8

తా. నీచరాశియందున్న కేతుదశలో ఆచార నాశమును, అపకీర్తియు, స్థానవాశమును, మనోవిచారమును, భార్యాపుత్రపీడయు, వితంతువులతోడ కలహమును కలుగును.

శ్లో॥ అత్యంత నీచస్థ ధ్వజస్యదాయే
పిత్రోద్వినాశం సుతదారనాశం।
గోవాజినాశం ధననాశనంచ
క్షేత్రాదినాశంచ మనోవికారం॥ 9

తా. అతి నీచరాశియందున్న కేతుదశలో పితృవియోగమును, భార్యాపుత్ర నాశనమును, గోవులు, గుఱ్ఱములు, మొదలగు వాని నాశమును, ధననాశనమును, క్షేత్రహానియు, మనోవికారమును కలుగును.

శ్లో॥ ఉచ్చఖేచర సంయుక్తో కేతోర్దాయే మహత్సుఖం।
సన్మానం రాజపూజ్యంచ కించిదర్థ వినాశనం॥ 10

తా. ఉచ్చగ్రహముతో కూడిన కేతుదశలో అధిక సుఖమును, విశేష గౌరవమును, రాజపూజ్యతయు, కొంత అర్థ నాశనమును కలుగును

శ్లో॥ నీచఖేచర సంయుక్త కేతోర్దాయేతి కష్టతా।



పుత్రదారార్థ నాశంచ చోరైః శస్త్రాగ్నిజం భయం॥ 11

తా. నీచగ్రహముతో కూడిన కేతుదశలో అధిక కష్టమును, భార్యాపుత్ర నాశనమును, అర్థనాశమును,చోరభీతియు, శస్త్రపీడయు, అగ్నిభయమును కలుగును.

శ్లో॥ అత్యంతమిత్రర్క్ష గతస్య కేతో
ర్దశావిపాకే ధనలాభమేతి।
కళత్రమిత్రాత్మజ వృద్ధిదంచ
గ్రామాధినాథో నృపమాననన్చ॥ 12

తా. అధి మిత్రక్షేత్రమందున్న కేతుదశలో ధనలాభమును, కళత్రవృద్ధియు, స్నేహ జనాభివృద్ధియు, పుత్రవృద్ధియు, గ్రామాధిపత్యమును, రాజసన్మానమును కలుగును.

శ్లో॥ మిత్రర్క్షస్థస్య కేతోస్తు దశాపాకే సుఖంభవేత్।
యుద్ధే విజయమాప్నోతి శ్వేతఛత్రాది సౌఖ్యదం॥ 13

తా. మిత్రక్షేత్రమందున్న కేతుదశలో సుఖమును, యుద్ధమునందు జయమును, శ్వేతఛత్రాది విభవమునుకలుగును.

శ్లో॥ సమర్క్షస్థితస్యాపి కేతోర్విపాకే
క్వచిల్లాభయుక్తో క్వచిద్గ్రామనాథః।
క్వచిద్ధాన్యలాభో క్వచిద్దానవృద్ధిః
క్వచిన్మిత్రవృద్ధిః క్వచిచ్ఛత్రువృద్ధిః॥ 14

తా. సమక్షేత్రమందున్న కేతుదశలో కొంతలాభమును, అల్పగ్రామాధి పత్యమును, కొంతధాన్యలాభమును, కొంతదానవృద్ధియు, కొంత మిత్రవృద్ధియు, కొంత శత్రువృద్ధియు కలుగును.

శ్లో॥ స్వర్క్షస్థితస్యాపి ధ్వజస్యదాయే
యానార్థ భూషాంబర వృద్ధిమేతి।

నానావిధోపాసన మంత్రసిద్ధిం
నృపాత్సుఖం బంధు జనానుకూలం॥ 15

తా. స్వక్షేత్రమందున్న కేతుదశలో వాహనలాభమును, అర్థప్రాప్తియు, భూషణప్రాప్తియు, వస్త్రలాభమును, నానావిధ ఔపాసన మంత్రసిద్ధియు, రాజమూలకముగా సుఖమును, బంధుజనాను కూలమును కలుగును

శ్లో॥ శత్రుర్క్షగస్యాపి ధ్వజస్యదాయే మనోవిచారస్సుతదారపీడా
నృపాద్భయంశత్రువివృద్ధిరశ్చస్వకీర్తినాశస్స్వజనాపవాదః॥

తా. శత్రుక్షేత్రమందున్న కేతుదశలో మనోవిచారమును, భార్యాపుత్రపీడయు, రాజభయమును, శత్రువృద్ధియు, కీర్తినాశమును, స్వజనులవల్ల అపవాదభయమును కలుగును.

శ్లో॥ అతిశత్రుర్క్షసంస్థస్య కేతోర్దాయే మహద్భయం।
స్థాననాశం పదభ్రంశం దేహజాడ్యం మనోరుజం॥ 17

తా. అతి శత్రుక్షేత్రమందున్న కేతుదశలో విశేష భయమును, స్థాననాశమును, పదభ్రంశమును, దేహజాడ్యమును, మనోదుఃఖమును కలుగును.

శ్లో॥ శుభాన్వితస్యాపి ధ్వజస్యదాయే
కీర్తిం జయం వస్త్రసుభూషణాప్తిం।
క్షేత్రార్థవృద్ధిం పశువృద్ధిదంచ
స్వపుత్రసౌఖ్యం మణిలాభమేతి॥ 18

తా. శుభగ్రహముంతో కూడిన కేతుదశలో కీర్తిలాభమును, జయమును, వస్త్రప్రాప్తియు, భూషణసంగ్రహణమును, క్షేత్రవృద్ధియు. అర్థలాభమును, పశువృద్ధియు, భార్యాపుత్ర సౌఖ్యమును, మణిలాభమును కలుగును.

శ్లో॥ పాపాన్వితస్య కేతుస్తు పాకే రాజ్యవినాశనం।



మిత్రవర్గ విరోధంచ చతుష్పాజ్జీవనాశనం॥ 19

తా. పాపగ్రహముతో కూడిన కేతుదశలో రాజ్యనాశమును, స్నేహజన విరోధమును, చతుష్పా జ్జీవనాశనమును కలుగును.

శ్లో॥ శుభేక్షితస్యాపి ధ్వజస్యదాయే
భూపాలమిత్రం సుతబంధు వృద్ధిం।
ధాన్యార్థలాభం బహుభూషణాప్తిం
విశేషయాత్రాది ఫలప్రపంచ॥ 20

తా. శుభగ్రహ దృష్టిగల కేతుదశలో రాజస్నేహమును, పుత్రవృద్ధియు, బంధుజనవృద్ధియు, ధాన్యార్థలాభమును, బహుభూషణ ప్రాప్తియు, విశేషయాత్రాది పుణ్యఫలమును కలుగును.

శ్లో॥ పాపేక్షిత ధ్వజస్యాస్య పితృదుఃఖం కరోతిచ।
జ్వరాతిసారమేహంచ యాత్రాయాం చోరపీడనం॥ 21

తా. పాపగ్రహవీక్షణ గల కేతుదశలో పితృదుఃఖము కలుగును. జ్వరపీడయు, అతిసారరోగ భయమును, మేహవ్యాధియు, ప్రయాణమునందు చోరపీడయు కలుగును.

### మేషాదిరాశిస్థిత కేతుదశాఫలం.

శ్లో॥ మేషగత కేతుదాయే గోవాజి క్షేత్రనాశంచ।
స్వస్థానస్థితినాశం క్షితిపతి కలహంసమాన కష్టంచ॥ 22

తా. మేషరాశియందున్న కేతుదశలో గోవులు, గుఱ్ఱములు మొదలగువాని నాశమును. క్షేత్రనాశమును, స్వస్థాన నాశమును, రాజకలహమును, సమానజనకష్టమును కలుగును.

శ్లో॥ వృషభనిలయసంస్థే కేతుదాయే సువృద్ధిం
వరమణి వసనాప్తిం క్షోణినాథాద్ధనాప్తిం।

సమరరిపుజయత్వం పుణ్యతీర్థానగాహం
విబుధజన సుపూజాం యజ్ఞకర్మాదిసిద్ధిం॥ 23

తా. వృషభరాశియందున్న కేతుదశలో మంచి అభివృద్ధియు, శ్రేష్ఠమైన మణిలాభమును, వస్త్రప్రాప్తియు, రాజమూలకముగా ధనప్రాప్తియు, యుద్ధమునందు శత్రుజయమును, పుణ్యతీర్థ స్నానఫలమును, పండిత సజ్జనపూజయు, యజ్ఞకర్మాదిసిద్ధియు కలుగును.

శ్లో॥ యుమళస్థ ధ్వజదాయే గోగజవాజియానలాభాదీన్।
గ్రామపురాణామీశో మేధావీ కీర్తిమాన్నీతిజ్ఞః॥ 24

తా. మిథునరాశియందున్న కేతుదశలో గోవులు, గుఱ్ఱములు, ఏనుగులు, వాహనములు మొదలగువాని లాభమును, గ్రామాధిపత్యమును, పురాధిపత్యమును, మేధాశక్తియు, కీర్తియు, మంచి నీతిజ్ఞానమును కలుగును.

శ్లో॥ కుళీరసంస్థస్య ధ్వజస్యదాయే
స్వస్థాననాశం పశునాశనంచ।
గంగోదకస్నాన సుమంత్రసిద్ధిం
ముక్తాదిసద్రత్న సమూహమేతి॥ 25

తా. కటకరాశియందున్న కేతుదశలో స్థాననాశమును, పశునాశనమును, గంగోదక స్నానఫలమును, మంత్రసిద్ధియు, మౌక్తికమాణిక్యాది మంచిరత్నముల సంగ్రహమునుకలుగును.

శ్లో॥ సింహస్థితస్యాపి కేతోర్దశాయాం
పురాధీశమిత్రం సుభూషాంబరాప్తిం।
సువేదార్థవిజ్ఞాన శాస్త్రాదివాదం
నటస్త్రీషుగోష్ఠిం సదాగానగోష్ఠిం॥ 26

తా. సింహరాశి యందున్న కేతుదశలో పురాధిపతి



స్నేహమును, మంచి భూషణ వస్త్రలాభమును, మంచి వేదార్థజ్ఞానమును, శాస్త్రవాదమును, నట స్త్రీలయొక్క గోష్ఠియు, సదా గానగోష్ఠియు కలుగును.

శ్లో॥ కన్యాయాం నిలయస్థ కేతుదాయే
క్షేత్రార్థం స్త్రీసుత నాశనంచ।
భూపక్రోధం వహ్నిశస్త్రాదిబాధాం
వశ్యోః కృత్యందాన ధర్మాదిహీనం॥ 27

తా. కన్యారాశియందున్న కేతుదశలో క్షేత్రార్థనాశమును, భార్యాపుత్ర నాశమును, రాజక్రోధమును, అగ్నిభయమును. శస్త్రపీడయు, ప్రేష్యత్వమును, దానధర్మాది హీనమును కలుగును.

శ్లో॥ తులాసంస్థస్య కేతోస్తు దశాపాకే ధనాగమం।
స్త్రీపుత్రమిత్ర సౌఖ్యంచ బాంధవాది సమాగమం॥ 28

తా. తులారాశియందున్న కేతుదశలో ధనాగమంబును, భార్యాపుత్ర సౌఖ్యమును, మిత్రసౌఖ్యమును, బంధుజన సమాగమంబును కలుగును.

శ్లో॥ కీటస్థకేతుదాయే రిపుభంగం మానభంగంచ।
రిపువృద్ధి ర్ధననాశం క్షేత్రస్థ పశువినాశంచ॥ 29

తా. వృశ్చిక రాశియందున్న కేతుదశలో శత్రు భంగమును, మానభంగమును, శత్రువృద్ధియు, ధననాశమును, క్షేత్రహానియు, పశునాశమును కలుగును.

శ్లో॥ ధనుస్థస్య కేతో ర్దశాప్రాప్తకాలే
ధరాధీశమిత్రం బహుక్షేత్రలాభం।
సదా వేదవాక్యార్థ సంధానబుద్ధిం
మణి హేమలాభం కళత్రాదిసౌఖ్యం॥ 30

తా. ధనుస్సునందున్న కేతుదశలో రాజస్నేహమును, బహు క్షేత్రలాభమును, సదాకాలమందును వేద వాక్యార్థ సంధాన బుద్ధియు, మణిప్రాప్తియు, హేమలాభమును, భార్యా పుత్రాది సౌఖ్యమును కలుగును

శ్లో॥ మృగస్థస్య కేతో ర్దశాయాంచకష్టం
కళత్రస్య బాధాది కారాదినాశం।
ఋణద్రవ్యవృద్ధిం వివాదం వితంతో
శ్శస్త్రేణబాధా వినాశం సుతస్య॥ 31

తా. మకరరాశియందున్న కేతుదశలో కష్టమును, కళత్ర బాధయు, అధికార నాశమును, ఋణవృద్ధియు, వితంతు వివాదమును, శస్త్రబాధయు, పుత్రనాశమును కలుగును.

శ్లో॥ కుంభరాశి గతస్యాస్య కేతోర్దాయే మహద్భయం।
సమాన బంధుకలహం విషశస్త్రాదిజం భయం॥ 32

తా. కుంభరాశియందున్న కేతుదశలో అధిక భయమును, సమాన బంధు కలహమును, విషభీతియు, శస్త్రపీడయు కలుగును.

శ్లో॥ మీనగత కేతు దశాయాం విద్యావృద్ధించ కీర్తిసన్మానం।
వరవస్త్ర ధాన్యలాభం యానమత్తేభరోహణం కురుతే॥

తా. మీనరాశియందున్న కేతుదశలో విద్యావృద్ధియు, కీర్తి సన్మానమును, శ్రేష్ఠమైన వస్త్రప్రాప్తియు, ధాన్య లాభమును, యానారోహణమును, గజారోహణమును కలుగును.

---

తన్వాది భావస్థిత కేతుదశాఫలం.

శ్లో॥ మూర్తిస్థధ్వజదాయే దేహారోగం కాంతిహీనత్వం।
క్రిమికండూ వ్రణబాధాం చింతాకష్టం మానభంగంచ॥

తా. లగ్నమందున్న కేతుదశలో దేహబాధయు, కాన్తి



హీనత్వమును, క్రిమి బాధయు, వ్రణబాధయు, మనోచింతయు కష్టమును, మానభంగమును కలుగును.

శ్లో॥ ధనస్థితస్యాపి ధ్వజస్యదాయే
ధనక్షయం బంధు విరోధకష్టం।
స్వనేత్రబాధాది కుటుంబబాధాం
స్థానచ్యుతిం కుత్సిత భోజనంచ॥ 35

తా. లగ్నమునకు ద్వితీయమందున్న కేతుదశలో ధనక్షయమును, బంధు విరోధ కష్టమును, నేత్రబాధయు, కుటుంబ బాధయు, స్థానచ్యుతియు,కుత్సితాన్న భోజనమును కలుగును.

శ్లో॥ తృతీయరాశిస్థిత కేతుదాయే
కార్యంరణే శత్రు వినాశనంచ।
సుగానవిద్యా కుశలోతిధీర
స్సువస్తు భూషాంబర రత్నసంగ్రహః॥ 36

తా. లగ్నమునకు మూడవ యింటియందున్న కేతుదశలో కార్యనాశమును, యుద్ధమునందు శత్రు వినాశమును, మంచి గానవిద్యా కుశలత్వమును, అతి ధీరత్వమును, మంచి వస్తు సంగ్రహమును, భూషణప్రాప్తియు, వస్త్రలాభమును, రత్న సంగ్రహమును కలుగును.

శ్లో॥ బంధుగత కేతుదాయే బంధువిరోధం క్షేత్రనాశంచ।
మాతుర్నాశం కురుతే తస్కరవహ్నిభయం స్వగృహేషు॥

తా. లగ్నమునకు నాల్గవరాశియందున్న కేతుదశలో బంధు విరోధమును, క్షేత్రనాశమును, మాతృ వియోగమును, యింటియందు చోరపీడయు, అగ్నిభయమును కలుగును.

శ్లో॥ సుతస్థస్య కేతోర్దశాయాంచకష్టం
స్వస్త్రీపితృ భ్రాతృ పుత్రాదినాశం।

స్వబుద్ధిర్వినాశం హ్యకాలాన్నభుక్తం
కులాచారహీనం కుమారస్తగోష్ఠిం॥ 38

తా. లగ్నమునకు పంచమ స్థానమందున్న కేతుదశలో కష్టమును, తన కళత్ర నాశమును, పితృహానియు, భ్రాతృ నాశమును, పుత్రపీడయు, బుద్ధి వినాశమును, అకాల భోజనమును, కులాచార హీనమును కలుగును.

శ్లో॥ రిపుభవనసంస్థస్య కేతోర్దశాయాం
సతిసుత బహుసౌఖ్యం బంధు కళ్యాణవృద్ధిం।
ధరణి విబుధపూజాం శత్రుహానిం
ధనాప్తిం నరపతిజనమోదం కీర్తిలాభంతనోతి॥ 39

తా. లగ్నమునకు ఆఱవ యింటియందున్న కేతుదశలో భార్యాపుత్ర సౌఖ్యమును, బంధు కళ్యాణమును, బ్రాహ్మణ పూజయు, శత్రుహానియు, ధనప్రాప్తియు, రాజ సన్మానమును, కీర్తిలాభమును కలుగును.

శ్లో॥ కళత్రరాశి సంస్తస్య కేతోర్దాయే పదచ్యుతిం।
కళత్ర సుతనాశంచ బంధుద్వేషం మనోవ్యథా॥ 40

తా. లగ్నమునకు సప్తమరాశియందున్న కేతుదశలో పదభ్రంశమును, భార్యాపుత్ర నాశమును, బంధుద్వేషమును, మనోవ్యథయు కలుగును.

శ్లో॥ రంధ్రస్థ కేతుదాయే గ్రహాణిరోగో ద్భవాక్షయంచ।
సమాన జనవియోగం బుద్ధిభ్రంశం మహద్భయంకురుతే॥

తా. లగ్నమునకు అష్టమ రాశియందున్న కేతుదశలో గ్రహాణి రోగ భయమును, లేక క్షయరోగ సంభవమును, సమాన జన వియోగమును, బుద్ధిభ్రంశమును, గొప్ప భయమును కలుగును.



శ్లో॥ నవమస్తస్య కేతోస్తు దశాకాలే పితుర్మృతిః।
గురోర్వ్యావిపదం దుఃఖం శుభకర్మవినాశనం॥ 42

తా. లగ్నమునకు నవమ రాశియందున్న కేతుదశలో పితృవియోగమును, గురునాశమును, ఆర్యజనులకు విపత్తును, దుఃఖమును, శుభకర్మ నాశమును కలుగును.

శ్లో॥ కర్మస్తపాకే కేతోస్తు దశాయాం దుఃఖమేతిచ।
మానహానిం మనోజాడ్య మపకీర్తి మనోరుజం॥ 43

తా. లగ్నమునకు దశమమందున్న కేతుదశలో, దుఃఖమును, మానహానియు,మనోజాడ్యమును, అపకీర్తి భయమును, మనోవ్యాధియు కలుగును.

శ్లో॥ లాభస్థ కేతుసంప్రాప్తే దాయేసౌఖ్యం కరోతిచ।
ఉద్యోగరాజసన్మానం యజ్ఞదాన వివర్ధనం॥ 44

తా. లాభస్థానమందున్న కేతుదశలో సౌఖ్యమును, ఉద్యోగప్రాప్తియు, రాజ సన్మానమును, యజ్ఞసిద్ధియు, దాన వృద్ధియు కలుగును.

శ్లో॥ వ్యయగత కేతుదశాయాం కరోతికష్టం దేహబాధాంచ।
స్వస్య స్వమానస్య భయం దేశాద్దేశాంతరం యాతి॥ 45

తా. వ్యయస్థానమందున్న కేతుదశలో అధిక కష్టమును, దేహ బాధయు, మాన భంగమును, దేశాంతర వాసమును కలుగును.

శ్లో॥ కేంద్రాన్వితస్యాపి ధ్వజస్యదాయే
క్షితీశపూజ్యం వరవస్తులాభం।
సువర్ణభూషాంబర రత్నలాభ
మిష్టార్థసిద్ధిం సుతదారసౌఖ్యం॥ 46

తా. కేంద్రస్థానమందున్న కేతుదశలో రాజ పూజ్యతయు, శ్రేష్ఠమైన వస్తులాభమును,సువర్ణ భూషణ ప్రాప్తియు, రత్న లాభమును, ఇష్టార్థసిద్ధియు, భార్యాపుత్ర సౌఖ్యమును, కలుగును.

శ్లో॥ త్రికోణభవన స్తస్య కేతోర్దాయే శుభంవదేత్।
పుత్రవృద్ధిం కీర్తివృద్ధిం పుణ్యతీర్థాన గాహనం॥ 47

తా. త్రికోణ రాసులయందున్న కేతుదశలో శుభమును, పుత్రవృద్ధియు, కీర్తిలాభమును, పుణ్యతీర్థస్నాన ఫలమును కలుగును.

శ్లో॥ దుస్తస్య కేతోస్తు దశావిపాకే
మనోవిచారం త్వభిమానభంగం।
క్షేత్రార్థనాశం రిపువృద్ధిదంచ
సర్వాణికార్యాణి వినాశమాహుః॥ 48

తా. దుస్థానములయందున్న కేతుదశలో మనోవిచారమును, అభిమాన భంగమును, క్షేత్రహానియు, అర్థ నాశమును, శత్రువృద్ధియు, సర్వకార్య వినాశమును కలుగును.

---

ఆరోహ కేతుదశాఫలం.

శ్లో॥ ఆరోహస్తస్య కేతోస్తు దశాయామతి సౌఖ్యదం।
విచిత్ర రత్నసంప్రాప్తి మశ్వాద్యారోహణంతథా॥ 49

తా. ఆరోహణయందున్న కేతుదశలో అతి సౌఖ్యమును, విచిత్ర రత్నసంప్రాప్తియు, అశ్వాద్యారోహణమును కలుగును.

---

అవరోహ కేతుదశాఫలం.

శ్లో॥ అవరోహస్తస్య కేతోస్తు దశాపాకే మహద్భయం।
మాతరం భగినీవాపి నాశనం బంధువిగ్రహం॥ 50



తా. అవరోహణ స్థితియందున్న కేతుదశలో అధిక భయమును, మాతృ వియోగమును, సోదరీజన వినాశమును, బంధు నాశమును కలుగును.

---

కేతుదశాయాం కేతుభుక్తిమాసాః 4. దినాని 27.

కృష్ణీయే॥

శ్లో॥ ధ్వజే రంతర్గతే కేతౌ లగ్నాత్కేంద్రే త్రికోణగే।
తృతీయే షష్ఠరాశిస్తే బలోవా లాభరాశిగే।
ఉచ్చరాశి స్థితేవాపి శుభాంశక గతేపివా।
గోపురా ద్యంశగేవాపి తద్భుక్తౌ కీర్తిలాభవాన్।
రాజ్యాధికార సంప్రాప్తిం ఛత్రచామర వైభవం।
చోరద్రవ్యాది లాభంచ తీర్థయాత్రా ఫలం లభేత్।
స్త్రీపుత్ర మిత్ర సౌఖ్యంచ ధనలాభం వినిర్దిశేత్।
యుద్ధే విజయమాప్నోతి స్వగృహే చోత్సవంతథా।
దేవతా గురు భక్తిశ్చ దానధర్మ రతోభవేత్।
ఋణద్రవ్యార్జితం చైవ విధవా సంగమంతథా।
భాగ్యకర్మేశ సంయుక్తే శుభదృష్టి సమన్వితే।
తద్దశాయాం పుణ్యతీర్థస్నానం దైవతదర్శనం।
భాగ్యాయాధాధిపే భౌమే భాగ్యేభౌమ సమన్వితే।
నవినాశం మారకేచ సమరే విజయిష్యతి॥ 1

తా. కేతువు తనదశలో స్వభుక్తియందు కేంద్రకోణములయం దున్నను, ౩-౬-౧౧. రాసులయందు బలవంతుడైయున్నను, ఉచ్చరాశియం దున్నను, శుభనవాంశయం దున్నను, లేక గోపురాది అంశలయం దున్నను, కీర్తి లాభమును, రాజ్యాధికార సంప్రాప్తియు, ఛత్రచామర వైభవమును, చోరుల మూలకముగా ద్రవ్యలాభమును, తీర్థయాత్రా ఫల

మును, భార్యాపుత్ర సౌఖ్యమును, మిత్రజన సౌఖ్యమును, ధన లాభమును, యుద్ధమునందు జయమును, ఇంటియందు ఉత్స వాదులును, దేవతాపూజయు, గురుభక్తియు, దానధర్మపరోప కారమును, ఋణ ద్రవ్యార్జితమును, విధవా సంగమంబును కలుగును. ఆ కేతువు నవమ దశమాధిపతులతో కలసియున్నను లేక శుభదృష్టి కలిగియున్నను, ఆ దశయందు పుణ్యతీర్థస్నాన మును, దేవతా దర్శనంబును కలుగును.

శ్లో॥ లగ్నాష్టమే వ్యయేవాపి నీచేవా పాపసంయుతే।
నీచాంశక గతేవాపి క్రూరస్థాన గతేపివా।
తద్భుక్తౌ జ్ఞాతికలహం విధవా కలహంతథా।
కళత్ర పీడితంచైవ పుత్రపీడా భవిష్యతి।
స్థానాంతరాణిగమనం సమానజననాశనం।
ఆప్తబంధు వినాశంచ చతుష్పాజ్జీవనాశనం॥ 2

తా. కేతువు లగ్నమునకు అష్టమ వ్యయమ స్థానములయం దున్నను, నీచులతోగాని పాపులతోగాని కలసియున్నను, నీచాంశను పొందియున్నను, లేక క్రూరస్థానమం దున్నను, ఆ భుక్తియందు జ్ఞాతులతోడ కలహమును, విధవా కలహమును, కళత్రపీడయు, పుత్రపీడయు, దేశాంతర గమనంబును, సమాన జన నాశనంబును, ఆప్తబంధు వినాశంబును, చతుష్పాజ్జీవ నాశనమును కలుగును.

శ్లో॥ రవిణా సంయుతేదృష్టే స్వాధికార వినాశనం।
రాజకోపం కార్యహానిం శిరోరోగం నసంశయః॥ 3

తా. సూర్యునితో కలసినను, లేక చూడబడినను, అధికార భంగమును, రాజ కోపమును, కార్య నాశమును, శిరోరోగమును నిస్సంశయముగా కలుగును.



శ్లో॥ శశినాసంయుతే దృష్టే మాతృవంశ వినాశనం।
మనఃఖేదం మానభంగ మశ్వవాహననాశనం॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను మాతృవంశపు వారికి నాశమును, మనోదుఃఖమును, మానభంగమును, అశ్వవాహన నాశమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే విషశస్త్రాగ్నిజంభయం।
ఉద్యోగహానిం దుఃఖంచ భగినీవంశనాశనం॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను ఆభుక్తియందు విషభీతియు, శస్త్రపీడయు, అగ్నిభయమును, ఉద్యోగనాశమును, దుఃఖమును, సోదరీవంశ నాశనమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే బంధుద్వేష మవాప్నుయాత్।
అకాలభోజనప్రాప్తిం మిత్రబంధు విరోధతాం॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, బంధుద్వేషమును, అకాల భోజన ప్రాప్తియు, బంధుమిత్రవిరోధమును కలుగును

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే గురుపుత్రాదిపీడనం।
దేహబాధా మతిభ్రంశం స్త్రీమూలా ద్ధననాశనం॥ 7

తా. గురువుతో కలసినను లేక చూడబడినను గురుపుత్రాదిపీడయు, దేహబాధయు, బుద్ధిభ్రంశంబును, స్త్రీమూలకముగా ధననాశమును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే కళత్రస్యతు పీడనం।
వాహనాదివినాశంచ స్త్రీమూలా ద్ధననాశనం॥ 8

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, కళత్రపీడయు, వాహనాది నాశమును, స్త్రీమూలకముగా ధననాశమును కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే దాసీదాసాది నిగ్రహం।
కారా గృహాంతర ప్రాప్తిం నిగళం రాజ నిగ్రహం।
అంతర్దాహ మతిక్లేశం కేతో రంతర్దశాఫలం॥ 9

తా. శనితో కలసినను లేక చూడబడినను దాసదాసీ జననాశమును, కారాగృహ ప్రాప్తియు, బంధనప్రాప్తియు, రాజకోపమును, మతిభ్రంశమును, కేతుదశలో కేతుభుక్తి యందు కలుగును.

శ్లో॥ ద్వితీయ ద్యూనరాశిస్థే హ్యపమృత్యు ర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం మృత్యుంజయ జపంచరేత్।
ఉమామహేశ్వర దానం కుర్యాదాయుష్య వర్ధనం॥ 10

తా. ద్వితీయ సప్తమరాసుల యందున్న యెడల అపమృత్యువు సంభవించును. ఆదోషపరిహారార్థమై మృత్యుంజయ జపము చేయవలయును. మరియు, ఉమామహేశ్వర దానము చేసిన పిమ్మట ఆయుర్వృద్ధి కలుగును.

---

కేతుదశాయాం శుక్రభుక్తిమాసాః 14.

శ్లో॥ కేతో రంతర్గతే శుక్రే లగ్నాత్కేంద్రే త్రికోణగే।
తృతీయేలాభగేవాపి హ్యుచ్చరాశి స్థితేపివా।
దశాధిపేనసంయుక్తే దారాపుత్రాది వర్ధనం।
వాహనాదివివృద్ధించ కళ్యాణాది మహోత్సవం।
మిత్రప్రభు వశాత్సౌఖ్యం వేశ్యాస్త్రీసంగమంతథా।
జపకర్మాదిసిద్ధించ చతుష్పా జ్జీవవృద్ధిదం।
యుద్ధేషువిజయంచైవ దేహారోగ్యం మహత్సుఖం।
బంధూపకారం కురుతే రత్నభూషణ సంగ్రహం।
తత్కాలే శ్రియమాప్నోతి భాగ్యేశేన సమన్వితే॥ 1

తా. కేతుదశలో శుక్రభుక్తియందు శుక్రుడు లగ్నమునకు కేంద్రకోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను, ఉచ్చరాశియందున్నను, లేక దశాధిపతితో కలిసియున్నను, భార్యాపుత్రాభివృద్ధియు, వాహనాభివృద్ధియు, కళ్యాణాది మహోత్సవములును, మిత్ర ప్రభు మూలకముగా సౌఖ్యమును, వేశ్యాస్త్రీ సంగమంబును, జపకర్మాదిసిద్ధియు, చతుష్పాజ్జీవ వృద్ధియు, యుద్ధమునందు జయమును, దేహారోగ్యమును, అధిక సుఖమును, బంధుజనోప కారంబును, రత్నభూషణ సంగ్రహంబును, కలుగును. భాగ్యాధిపతితో కూడియున్నకాలమందు ఐశ్వర్యము లభించును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టమేవాపి వ్యయేవా నీచరాశిగే।
పాపగ్రహేణ సంయుక్తే నీచాంశేచాస్తగేపివా।
తద్భుక్తౌ రాజవిద్వేషం ధనధాన్యపశుక్షయం।
ఉత్పాతవిషభీతించ మనశ్చాంచల్యమేవచ।
కళత్రకలహంచైవ బంధుద్వేషం తథైవచ।
అన్యస్థలప్రవాసంచ యత్నకార్యవినాశనం॥ 2

తా. శుక్రుడు లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను, తన నీచరాశిని పొందియున్నను, పాపగ్రహములతో కూడియున్నను, నీచనవాంశను పొందియున్నను, లేక అస్తంగతుడై యున్నను, ఆభుక్తియందు రాజద్వేషమును, ధనధాన్యనాశమును, పశుహానియు, ఉన్నతస్థలముచుండి పడుటయు, విషభీతియు, మనోవికారమును, అన్యస్థలవాసమును, యత్నకార్యభంగమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే రాజానుగ్రహ శాంతికం।
సర్వకార్యవినాశంచ రాజకార్య వినాశనం॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను రాజా

సుగ్రహామువల్ల శాంతియు, సర్వకార్యభంగమును, రాజకార్య నాశనమును కలుగును

శ్లో॥ శశినాసంయుతే దృష్టే రత్నభూషణలాభవాన్।
విచిత్రవస్త్రలాభంచ వాహనాది వివృద్ధిదం॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను రత్న భూషణలాభమును, విచిత్ర వస్త్రలాభమును, వాహనాభివృద్ధియు కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే జ్ఞాతీనాం కలహంతథా।
చోరభీతించ రోగాంశ్చ హ్యపకీర్తిభయంతథా॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, జ్ఞాతులతోడ కలహమును, చోరపీడయు, రోగభీతియు, అపకీర్తి భయమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే విద్యాలాభం ధనాగమం।
బంధూనా ముపకారంచ వణిజ్యాలా ద్ధనాగమం॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను విద్యాలాభమును, ధనాగమంబును, బంధుజనోప కారంబును, వర్తకుల మూలకముగా ధనలాభమును కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే పుత్రవృద్ధి ర్భవిష్యతి।
దేహారోగ్యం చార్థలాభం సర్వకార్య ను సిద్ధిదం॥ 7

తా. గురువుతో కలసినను లేక చూడబడినను పుత్రవృద్ధియు, దేహారోగ్యమును, అర్థలాభమును, సర్వకార్య సిద్ధియు కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే దారాపుత్రాది పీడనం।
సమాన జనశోకంచ పశుక్షేత్ర వినాశనం॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను భార్యా



పుత్రాదిపీడయు, సమాన జనశోకమును, పశుహానియు, క్షేత్ర వినాశమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా।
లక్ష్మీకటాక్షచిహ్నాని మహారాజాశ్రయం తథా।
స్వాధికారవృద్ధించ రత్నలాభం వినిర్దిశేత్।
స్వస్త్రీసౌఖ్యం పుత్రసౌఖ్యం వేశ్యాసంగమనంతథా।
సుఖశయ్యా వివృద్ధించ దాసీదాస ధనాగమం॥ 9

తా. శుక్రుడు దశానాథునకు కేంద్ర కోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను, ఆభుక్తియందు లక్ష్మీకటాక్షమువల్ల ఐశ్వర్యప్రాప్తియు, మహారాజాశ్రయమును, అధికారవృద్ధియు, రత్నలాభమును, స్వంత స్త్రీసౌఖ్యమును, పుత్రసౌఖ్యమును, వేశ్యాసంగమంబును, సుఖశయ్యాసౌఖ్యమును, దాసదాసీ జనాభివృద్ధియు, ధనాగమంబును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠగేరంధ్రే వ్యయేవా పాపసంయుతే।
నీచాంశకగతేవాపి స్త్రీమూలాత్కలహోభవేత్।
ధననాశం మనఃఖేదం బంధువిద్వేష మేవచ।
అన్యస్థల ప్రవాసంచ సమాన జనపీడనం॥ 10

తా. శుక్రుడు దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయందున్నను, పాపులతో కలసియున్నను, లేక నీచాంశను పొందియున్నను, ఆభుక్తియందు స్త్రీమూలకముగా కలహమును, ధననాశమును, మనోదుఃఖమును, బంధుద్వేషమును, అన్యస్థలవాసమును, సమాన జనపీడయు కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా హ్యపమృత్యు భయంవదేత్।
తద్దోషపరిహారార్థం దుర్గాదానంచ కారయేత్॥ 11

తా. ద్వితీయ సప్తమ రాసులయందు శుక్రుడున్న యెడల అపమృత్యుభయము కలుగును. ఆదోషపరిహారార్థమై దుర్గాదానము చేయవలయును.

కేతుదశాయాం రవిభుక్తిమాసాః 4. దినాని 6.

శ్లో॥ కేతోరంతర్గతే సూర్యే లగ్నాత్కేంద్రే త్రికోణగే।
తృతీయే లాభగేవాపి హ్యుచ్చరాశి స్థితేపివా।
శుభగ్రహయుతే దృష్టే రాజానుగ్రహ వైభవం।
స్వాధికార వివృద్ధించ పుణ్యతీర్థ నిషేవణం।
సురభూసుర పూజాంచ యతీనాంచ సమాగమం।
కళత్రపుత్రసౌఖ్యంచ కీర్తివృద్ధించ జాయతే।
అయత్నేకార్యసిద్ధించ స్వవారే రాజదర్శనం॥ 1

తా. కేతుదశలో సూర్యభుక్తియందు సూర్యుడు లగ్నమునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయ లాభముల యం దున్నను, ఉచ్చరాశిని పొందియున్నను శుభగ్రహముతో కలసియున్నను, లేక శుభగ్రహ వీక్షణ కలిగియున్నను, రాజానుగ్రహ విభవమును, అధికారవృద్ధియు, పుణ్యతీర్థాది సేవయు, దైవబ్రాహ్మణపూజయు, యతులయొక్క సమాగమంబును, భార్యాపుత్ర సౌఖ్యమును, కీర్తివృద్ధియు, ప్రయత్నము లేకనే కార్యసిద్ధియు, తన వారమునందు రాజదర్శనమును కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టమే సూర్యే వ్యయేవా నీచరాశిగే।
పాపగ్రహేణ సంయుక్తే శత్రురాశి గతేపివా।
మానహాని ర్మనస్తాప స్స్వాధికారవినాశనం।
అన్యస్థల ప్రవాసశ్చ శత్రువృద్ధి ర్భవిష్యతి।
శిరోక్షికర్ణరోగాది మనస్తాపో భవిష్యతి।
అకస్మాద్దోషసంప్రాప్తిం బంధుద్వేషమ వాప్నుయాత్॥



తా. సూర్యుడు లగ్నమునకు ౬-౮-౧౨ స్థానములయందున్నను, తన నీచరాశియం దున్నను, పాపగ్రహములతో కలసియున్నను, లేక శత్రుక్షేత్రమం దున్నను, ఆభుక్తియందు మానహానియు, మనస్తాపమును, అధికారభంగమును, అన్యస్థళవాసమును, శత్రువృద్ధియు, శిరోబాధయు, నేత్రవ్యాధియు, కర్ణరోగమును, మనస్తాపమును, ఆకస్మాత్తుగా దోషసంప్రాప్తియు, బంధుద్వేషమును కలుగును.

శ్లో॥ చంద్రేణసంయుతే దృష్టే సుఖభోజన వర్జితం।
సువస్త్రాదివిహీనంచ వ్యాపారే ఋణవృద్ధిదం॥ 3

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, భోజన సౌఖ్యవిహీనమును, మంచి వస్త్రనాశనమును, వ్యాపారమునందు ఋణవృద్ధియు కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే శస్త్రభీతిం రణేభయం।
సోదరాణాంతు కలహం నృపచోరాగ్నిపీడనం॥ 4

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, శస్త్రపీడయు, యుద్ధమునందు భయమును, సోదరులతోడ కలహమును, రాజపీడయు, చోరభయమును, అగ్నిభీతియు కలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే జటాధారీ సమాగమం।
తీర్థయాత్రా ప్రసంగాది అధ్యాత్మ జ్ఞానయుక్తవాన్॥ 5

తా. బుధునితో కలసినను లేక చూడబడినను జటలు, ధరించినట్టి, మహాత్ముల సమాగంబును, తీర్థయాత్రా ప్రసంగమును, అధ్యాత్మ జ్ఞానాభివృద్ధియు కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే సుతస్త్రీసౌఖ్యమేనచ।
దేహసౌఖ్యం ధనప్రాప్తి ర్ధర్మబుద్ధి పరోభవేత్॥ 6

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, భార్యా

పుత్ర సౌఖ్యమును, దేహసౌఖ్యమును, ధనప్రాప్తియు, ధర్మ కార్యబుద్ధియు కలుగును.

శ్లో॥ శుక్రేణగంధతాంబూల సిద్ధి సంతుష్టమానసః।
యానవాహన సంప్రాప్తిం కళ్యాణం శుభవృద్ధిదం॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను గంధ తాంబూలాది సుఖమును, సంతోషముతో గూడిన మనస్సును, యానవాహన సంప్రాప్తియు, కళ్యాణమును, శుభవృద్ధియు కలుగును.

శ్లో॥ శనినానీచకలహం మహావ్యాధి భయంతథా।
పశుదాస వినాశంచ స్వప్రభోస్తు మహద్భయం॥ 8

తా. శనితోకలసినను లేక చూడబడినను, ఆభుక్తియందు నీచజనులతోడ కలహమును, మహావ్యాధి భయమును, పశుహానియు, దాసదాసీ జనవినాశంబును, స్వంత ప్రభువువల్ల విశేషభయమును కలుగును.

శ్లో॥ దాయేశా త్కేంద్రకోణేవా తృతీయే లాభగేపివా।
అపూర్వ తీర్థయాత్రాది శివకేశవపూజనం।
నృపమూలా ద్ధనప్రాప్తిం ఋణద్రవ్యా యతింసుఖం।
రిపుహానింజయంచైవ పత్రికా గమనంతథా।
అశ్వాదివాహన ప్రాప్తిం బంధుకళ్యాణ శోభనం।
అన్నదాన రతోనిత్యం సత్కర్మ సహితోనరః॥ 9

తా. సూర్యుడు దశానాథునకు కేంద్రకోణములయందున్నను, లేక తృతీయ లాభములయం దున్నను, అపూర్వతీర్థయాత్రసిద్ధియు, శివకేశవపూజనయు, రాజమూలకముగా ధనప్రాప్తియు, ఋణద్రవ్యార్జనమును, సుఖమును, శత్రుహానియు, జయమును, పత్రికాగమనంబును, అశ్వాదివాహన ప్రాప్తియు,



బంధుకళ్యాణ శోభనంబును, అన్నదాన పరత్వమును, సత్కర్మ కార్యసిద్ధియు కలుగును.

శ్లో॥ దాయేశా త్షష్ఠరాశిస్థే వ్యయేవా మృత్యురాశిగే।
పాపగ్రహ యుతేవాపి సమానస్య మృతింవదేత్।
అకస్మా త్స్థానచలన మాప్తవర్గా ద్భయంవదేత్।
సర్వత్ర కలహంచైవ సర్వకార్య వినాశనం॥ 10

తా. సూర్యుడు దశానాథునకు ౬-౮-౧౨. రాసులయందున్నను, లేక పాపగ్రహములతో కలసియున్నను, ఆ భుక్తియందు సమాన జన నాశనమును, అకస్మాత్తుగా స్థాన చలనమును, ఆప్తవర్గ జనులవల్ల భయమును, సర్వులతోడను, కలహమును, సర్వకార్య వినాశమును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా హ్యపమృత్యు భయంవదేత్।
తద్దోష పరిహారార్థం శివసాహస్రకం జపేత్।
కపిలం వృషభందద్యా చ్ఛాంతిహోమంచ కారయేత్॥

తా. సూర్యుడు ద్వితీయ సప్తమ రాసులయం దున్నయెడల అపమృత్యు భయము కలుగును. ఆదోష పరిహారార్థమై శివసాహస్రక జపము చేయవలయును, గాకను, కపిల వర్ణముగల వృషభదానమును, శాంతి హోమాది కర్మలును చేయవలయును.

---

కేతుదశాయాం చంద్రభుక్తిమాసాః 7.

పారాశర్యే॥

శ్లో॥ కేతోరంతర్గతేచంద్రే స్వక్షేత్రే స్వోచ్చరాశిగే।
కేంద్రేవాథ త్రికోణేవా లాభేవా శుభసంయుతే।
సౌభాగ్యం సౌఖ్యవిజయం ధనలాభం మహత్సుఖం।
రాజసన్మాన కీర్తించ పూర్ణచంద్రే తథైవచ।

తీర్థస్నాన ఫలప్రాప్తిః దేవారాధన తత్పరః।
తటాకా రామకూపాది నిర్మాణాదిషు తత్పరః।
యత్నకార్య సుసిద్ధిశ్చ దేహారోగ్యం తథైవచ॥ 1

తా. కేతుదశలో చంద్రభుక్తియందు చంద్రుడు స్వక్షేత్రమందున్నను, తన ఉచ్చరాశియందున్నను, కేంద్రత్రికోణములయందున్నను, లాభస్థానమందున్నను, లేక శుభగ్రహములతో కూడియున్నను, పూర్ణచంద్రుడైనను, సౌభాగ్యమును, సౌఖ్యమును, విజయమును, ధనలాభమును, విశేష సుఖమును, రాజ సన్మానమును, కీర్తియు, తీర్థస్నాన ఫల ప్రాప్తియు, దేవారాధనయు, చెఱువులు, వనములు, గుంటలు, బావులు, మొదలగు వాని నిర్మాణమును, యత్నకార్య సిద్ధియు, దేహారోగ్యమును కలుగును.

శ్లో॥ షష్ఠాష్ట వ్యయేచంద్రే తృతీయే నీచరాశిగే।
నీచాంశే క్షీణచంద్రేవా శత్రుస్థాన గతోపివా।
తద్భుక్తౌ మాతృనాశస్స్యాత్ సమాన జననాశనం।
ఆప్తబంధు వియోగశ్చ క్షేత్రధాన్య వినాశనం।
స్త్రీ వివాదశ్చకలహః నృపబాధా భవిష్యతి।
యత్నకార్య వినాశంచ శిరోరోగ స్తథైవచ॥ 2

తా. చంద్రుడు ౬-౮-౧౨. రాసులయందున్నను,తృతీయ స్థానమందున్నను, తననీచరాశియందున్నను, నీచాంశనుపొంది యున్నను, క్షీణచంద్రుడైనను, లేక శత్రుస్థాన గతుండైనను, ఆ భుక్తియందు మాతృ వియోగమును, సమాన జన నాశమును, ఆప్తబంధు వియోగమును, క్షేత్రహానియు, ధాన్యనాశనమును, స్త్రీ వివాదమును, కలహమును, రాజబాధయు, యత్నకార్య భంగమును, శిరోరోగమును కలుగును.



శ్లో॥ రవిణా సంయుతే దృష్టే సంతాపం కలహంతథా।
స్థాననాశంచ కురుతే వ్యుద్యోగ చలనంతథా॥ 3

తా. చంద్రుడు సూర్యునితో కలసినను లేక చూడబడినను, సంతాపమును, కలహమును, స్థాననాశమును, ఉద్యోగ చలనమును కలుగును.

శ్లో॥ కుజేన సంయుతే దృష్టే వాహనాది వివృద్ధిదం।
గోధాన్య ధనవృద్ధించ సోదరాణాం వివృద్ధిదం॥ 4

తా. చంద్రుడు కుజునితో కలసినను లేక చూడబడినను, వాహనాభివృద్ధియు, పశువృద్ధియు, ధాన్యవృద్ధియు, సోదరాభివృద్ధియు కలుగును.

శ్లో॥ బుధేన సంయుతేదృష్టే బంధువృద్ధిం సుఖంవదేత్।
వేదాంత శ్రవణంచైవ నృపాలాత్సుఖమశ్నుతే॥ 5

తా. బుధునితో కలసినను, లేక చూడబడినను, బంధుజన వృద్ధియు, సుఖమును, వేదాంత శ్రవణమును, రాజమూలకముగా సుఖమును కలుగును.

శ్లో॥ గురుణా సంయుతే దృష్టే పుత్రరాజ్య వివృద్ధిదం।
ధనలాభం నృపాద్భీతిం యత్నకార్యార్థ సిద్ధిదం॥ 6

తా. గురువుతో కలసినను, లేక చూడబడినను, పుత్రరాజ్యాభివృద్ధియు, ధనలాభమును, రాజభీతియు, యత్నకార్యార్థ సిద్ధియు కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతే దృష్టే వస్త్రభూషణ సంగ్రహం।
వాహనాది వివృద్ధించ స్వస్త్రీసౌఖ్యం తథైవచ॥ 7

తా. శుక్రునితో కలసినను, లేక చూడబడినను, వస్త్రప్రాప్తియు, భూషణ సంగ్రహమును, వాహనాభివృద్ధియు, స్వస్త్రీ సౌఖ్యమును కలుగును.

శ్లో॥ శనినా సంయుతేదృష్టే దాసీదాస సుతక్షయం।
పశుధాన్య వినాశంచ నీచసేవాం తథైవచ॥ ౭

తా. శనితో కలసినను, లేక చూడబడినను, దాసదాసీ జన నాశమును, సుతక్షయమును, పశుహానియు, ధాన్య నాశమును, నీచజన సేవయు కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యే లాభ గేపివా।
శుభగ్రహ యుతేవాపి ధనభూషణ లాభవాన్।
శుభశోభన సంప్రాప్తిం సంతానాది మహోత్సవం।
నరవాహన యోగంచ రాజ్యలాభం మహత్సుఖం।
విద్యావినోద గోష్టించ నానామూలా ధనాగమం॥ ౮

తా. చంద్రుడు దశానాథునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక శుభగ్రహములతో కూడియున్నను, ఆభుక్తియందు ధనప్రాప్తియు, భూషణ సంగ్రహంబును, శుభశోభన సంప్రాప్తియు, పుత్రోత్సవాది మహోత్సవంబును, పల్లకీ యోగమును, రాజ్యలాభమును, విశేష సుఖమును, విద్యావినోద గోష్టియు, నానామూలకముగా ధనాగమంబును కలుగును.

శ్లో॥ దాయేశాష్టమగే షష్ఠే వ్యయేవా పాపసంయుతే।
అపకీర్తి సంభవంచైవ రోగబాధా భవిష్యతి।
విదేశవాస సంప్రాప్తిం బంధుద్వేష మవాప్నుయాత్।
యత్నకార్య వినాశంచ హ్యకాలే భోజనం వదేత్॥ 9

తా. చంద్రుడు దశానాథునకు ౬-౮-౧౨. రాసులయం దున్నను, లేక పాపులతో కలసియున్నను, ఆ భుక్తియందు అపకీర్తి భయమును, రోగబాధయు, విదేశ వాసమును, బంధుద్వేషమును, యత్నకార్య భంగమును, అకాల భోజనమును కలుగును.



శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా హ్యపమృత్యు ర్భవిష్యతి।
తద్దోష పరిహారార్థం దుర్గాసాహస్రకంజపేత్।
రజితాశ్వ ప్రదానేన హ్యాయురారోగ్య వర్ధనం॥ 10

తా. ద్వితీయ సప్తమ రాసులయందు చంద్రు డున్న యెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై దుర్గాసాహస్ర జపము చేయవలయును. గాకను, వెండిగుఱ్ఱము దానము చేసినపిమ్మట ఆయురారోగ్యము కలుగును.

---

కేతుదశాయాం కుజభుక్తిమాసాః 4. దినాని 27.

పారాశర్యే॥

శ్లో॥ కేతోరంత ర్గతేభౌమే లగ్నాత్కేంద్రే త్రికోణగే।
పాపదాయే పాపభుక్తౌ ధనధాన్య వినాశనం।
ప్రజాక్షోభం నృపాణాంచ సమరే శత్రువర్ధనం।
మండలాధి పతేర్మృత్యు ర్హతాశ్వో హతసైనికః।
బంధుద్వేషంచ కలహం శత్రుపీడాభి వర్ధనం।
క్షయాపస్మార పీడాంచ హ్యున్మాద భ్రాంతిమాదిశేత్।
స్థానచ్యుతిం ప్రాణనాశం వ్యాధిపీడా భయంధ్రువం॥ 1

తా. కేతుదశలో కుజాంతరమునందు కుజుడు లగ్నమునకు కేంద్రత్రికోణములయం దున్నను, పాపదశలో పాపభుక్తియందు ధనధాన్య వినాశమును, ప్రజాక్షోభమును, రాజులకు యుద్ధమునందు శత్రువృద్ధియు, మండలాధిపతివల్ల మృత్యువును, కొట్టబడిన సైన్యమును, బంధుద్వేషమును, కలహమును, శత్రుపీడయు, క్షయాపస్మార పీడయు, ఉన్మాద భ్రాంతియు, స్థానచ్యుతియు, ప్రాణనాశమును, వ్యాధిపీడయు, భయమును, నిశ్చయముగా కలుగును.

శ్లో॥ శుభాంశే శుభసంయుక్తే స్వోచ్చే స్వక్షేత్రసంయుతే।
కించిత్సుఖం తదాదౌతు మధ్యేసౌఖ్యం ధనంవదేత్।
అంతేక్లేశం కరంచైవ సత్కర్మాది వినాశనం॥ 2

తా. శుభాంశయం దున్నను, శుభగ్రహముతో కూడి యున్నను, తన ఉచ్చయం దున్నను, లేక స్వక్షేత్రమం దున్నను, ఆభుక్తి ఆదియందు కొంత సుఖమును, మధ్యభాగమందు సౌఖ్యమును,ధనమును, అంత్యభాగమందు దుఃఖమును, సత్కర్మ వినాశమును కలుగును.

శ్లో॥ షష్ఠాష్ట మవ్యయేభౌమే పాపగ్రహ సమన్వితే।
జ్వరాగ్ని శత్రుబాధాంచ రోగపీడా మహద్భయం।
ప్రయాణే చోరభీతించ హ్యతిసార జ్వరంతథా।
అకస్మాత్కలహంచైవ హ్యశుభం దారనాశనం।
శుభయుక్తే విత్తలాభం భూలాభం సౌఖ్యమేవచ।
ఆదౌసౌఖ్య కరంచైవ మధ్యాంతే క్లేశమాప్నుయాత్॥3

తా. కుజుడు ౬-౮-౧౨. రాసులయం దున్నను, లేక పాపగ్రహములతో కూడియున్నను, ఆ భుక్తియందు జ్వర బాధయు, అగ్నిభయమును, శత్రుపీడయు, రోగపీడయు, అధిక భయమును, ప్రయాణమునందు చోరభీతియు, అతిసార జ్వర భయమును, అకస్మాత్కలహమును, అశుభమును, దారనాశ మును కలుగును. శుభగ్రహముతో, కూడియున్నయెడల ధన లాభమును, భూలాభమును, సౌఖ్యమును, ఆది భాగమందు సౌఖ్యమును, మధ్య అంత్య భాగములయందు దుఃఖమును, కలుగును.

శ్లో॥ రవిణా సంయుతేదృష్టే జ్వరస్ఫోటం వ్రణాద్భయం।
అరణ్య పథసంచారం హ్యపక్వాన్నాది భోజనం॥ 4



తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, జ్వర స్ఫోటకాది భయమును,వ్రణభయమును, అరణ్యమార్గ సన్చార మును, అపక్వాన్నాది భోజనమును కలుగును.

శ్లో॥ చంద్రేణ సంయుతేదృష్టే మాతృవంశ వినాశనం।
నేత్రబాధా మనస్తాపం మహారోగ వివృద్ధిదం॥ 5

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, మాతృవంశపువారికి నాశనమును, నేత్రబాధయు, మనస్తాపమును, మహారోగ వృద్ధియు కలుగును

శ్లో॥ బుధేన సంయుతేదృష్టే బంధువృద్ధిశ్చ జాయతే।
క్వచిత్కలహ సంతాపం దూరవార్తాగమం వదేత్॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను బంధు వృద్ధియు, కొంత కలహమును, సంతాపమును, దూరవార్తా గమనంబును కలుగును.

శ్లో॥ గురుణా సంయుతేదృష్టే రోగవిస్మృతి మాప్నుయాత్।
విశేష ధనహానిశ్చ శస్త్రపీడా తథైవచ॥ 7

తా. గురువుతో కలసినను, లేక చూడబడినను, రోగ భయమును, జ్ఞాపకశక్తి లేకపోవుటయు, విశేష ధనహానియు, శస్త్రపీడయు కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతేదృష్టే యానవాహన వృద్ధిదం।
వివాహాదిసు సౌఖ్యంచ వస్త్రాభరణ సంగ్రహం॥ 8

తా. శుక్రునితో కలసినను, లేక చూడబడినను, యాన వాహన వృద్ధియు, వివాహాది సౌఖ్యమును, వస్త్రాభరణ సంగ్ర హమును కలుగును.

శ్లో॥ శనినా కలహంచైవ ధననాశం తథైవచ।
అన్యస్థల ప్రవాసంచ సమాన జన నాశనం॥ 9

తా. శనితో కలసినను లేక చూడబడినను, ధన నాశమును, పరస్థళ వాసమును, సమాన జననాశనమును కలుగును.

శ్లో॥ దాయేశా త్కేంద్రరాశిస్థే వ్యయేవా మృత్యురాశిగే।
పాపగ్రహా యుతేవాపి గృహారాను వినాశనం।
కుస్త్రీకలాపం విఫలం కృషిమూలా ద్ధనక్షయం।
చోరాగ్ని శత్రుబాధాంచ సమాన జననాశనం।
అకస్మా త్కలహంచైవ వ్యవహారే భయంతథా।
విషూచికాది బాధాంచ సర్వకార్య వినాశనం॥ 10

తా. కుజుడు దశానాథునకు కేంద్రములయం దున్నను, అష్టమ వ్యయములయం దున్నను, లేక పాపగ్రహములతో కూడియున్నను, గృహనాశమును, ఆరామ వినాశమును, కుత్సిత స్త్రీ కలాపమును, నిష్ఫలమును, కృషిమూలకముగా ధననాశమును, చోరపీడయు, అగ్ని భయమును, శత్రుబాధయు, సమాన జననాశమును, అకస్మా త్కలహమును, వ్యవహారమునందు భయమును, విషూచికాది భయమును, సర్వకార్య వినాశమును కలుగును.

శ్లో॥ దాయేశా త్షష్ఠగేవాపి తృతీయే లాభగేపివా।
పంచమే నవమేవాపి శుభగ్రహా యుతేపివా।
నానామూలా ద్ధనప్రాప్తిం ఋణద్రవ్యా యతింతథా।
పురాధిపతి సన్మానం సర్వకార్యార్థ సిద్ధిదం॥ 11

తా. కుజుడు దశానాథునకు ౬-౩-౧౧. స్థానములయం దున్నను, పంచమ నవమంబులయం దున్నను, లేక శుభగ్రహముతో కూడియున్నను, ఆ భుక్తియందు నానామూలకముగా ధనప్రాప్తియు, ఋణద్రవ్యార్జనమును, రాజ సన్మానమును, సర్వకార్యార్థ సిద్ధియు కలుగును.



శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా దేహతాపం జ్వరాదికం।
దారాపీడాం మహాక్లేశ మపమృత్యు భయంతథా।
తద్దోషపరిహారార్థం సుబ్రహ్మణ్య జపంచరేత్।
తైలకుంభప్రదానేన సుఖమారోగ్య మేష్యతి॥ 12

తా. ద్వితీయ సప్తమరాసుల యందున్న యెడల దేహతాపమును, జ్వరాదికమును, కళత్రపీడయు, విశేషదుఃఖమును, అపమృత్యు భయమును కలుగును. ఆదోష పరిహారార్థమై సుబ్రహ్మణ్యజపము చేయవలయును. గాకను నూనెపాత్రమును దానముచేసిన పిమ్మట ఆరోగ్యము కలుగును.

---

కేతుదశాయాం రాహుభుక్తిమాసాః 12. దినాని 18.

కృష్ణీయ్యే॥

శ్లో॥ కేతోరంతర్గతేరాహౌ బ్రహ్మరాక్షస పీడనం।
అపస్మారభయంచైవ భూతావేశ జ్వరాద్భయం।
విధవాకలహంచైవ ఋణదారిద్ర్య పీడనం।
సర్వత్రజనవిద్వేషం భూపాల కలహంతథా।
నీచసేవా మానభంగం స్వస్త్రీవ్యాధి ప్రపీడనం।
క్షేత్రధాన్య వినాశంచ శూద్రప్రభు వశాద్భయం।
దేశాంతరాదిగమనం స్వకులాచార నాశనం।
లగ్నాద్వ్యయగతే రాహౌ కేంద్ర రాశిగతేపివా।
పాపగ్రహాయుతేవాపి హ్యేవంఫల ముదీరయేత్॥ 1

తా. కేతుదశలో రాహుభుక్తియందు బ్రహ్మరాక్షస పీడయు, అపస్మారభయమును, భూతావేశమును, జ్వరభయమును, విధవాకలహమును, ఋణపీడయు, దారిద్రావస్థయు, సర్వజనులతోడను ద్వేషమును, రాజకలహమును, నీచజనసేవయు, మానభంగమును, స్వస్త్రీవ్యాధియు, పీడయు, క్షేత్రహానియు,

ధాన్యనాశమును, శూద్ర ప్రభుమూలకముగా భయమును దేశాంతరాది గమనమును, తనకులాచార నాశమును కలుగును, ఈఫలమంతయు, రాహువు, లగ్నమునకు వ్యయరాశియందున్నను, కేంద్రస్థానములయం దున్నను లేక పాపగ్రహములతో కూడియున్నను చెప్పదగినది

శ్లో॥ లగ్నాత్తృతీయమష్టేవా లాభేవా వృచ్చరాశిగే।
దుర్గాధికార సంప్రాప్తిఃమహారాజ ప్రసాదతః॥
దారపుత్రాది సౌఖ్యంచ పశుధాన్య వివృద్ధిదం।
గృహారామాది నిర్మాణం తీర్థయాత్రాది తత్పరః।
పశ్చిమాందిశిమాశ్రిత్య ప్రయాణం రాజదర్శనం।
యత్నకార్యార్థసిద్ధించ నానామూలా ద్ధనాగమం॥ 2

తా. రాహువు లగ్నమునకు ౩-౬-౧౧ రాసులయందున్నను, లేక తన ఉచ్చరాశియం దున్నను, దుర్గముల మీాది విచారణాధికారమును, మహారాజానుగ్రహమును, భార్యాపుత్రాది సౌఖ్యమును, పశువృద్ధియు, ధాన్యవృద్ధియు, గృహనిర్మాణమును, ఆరామాది ప్రతిష్ఠయు, తీర్థయాత్రాది ఫలమును, పశ్చిమదిక్కునందు ప్రయాణమును, రాజదర్శనమును, యత్నకార్యార్థసిద్ధియు, నానామూలకముగా ధనాగమంబును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే కలహం రాజనిగ్రహం।
అధికారవినాశంచ శిరోభ్రమణ మేవచ॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను కలహమును, రాజకోపమును, అధికార భంగమును, శిరోభ్రమణయు కలుగును.

శ్లో॥ చంద్రేణసంయుతే దృష్టే మనఃఖేదం తథైవచ।



చింతాశోకాది కలహం మాతృవంశ వినాశనం॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను మనోదుఃఖమును, చింతాశోకమును, కలహమును, మాతృవంశపు వారికి నాశనమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే స్వదేహే శస్త్రపీడనం।
సహోదరవినాశంచ గ్రహణీ రోగసంభవం॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను దేహమునందు శస్త్రపీడయు, భ్రాతృవినాశంబును, గ్రహణీ రోగసంభవమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే వ్యవహారే ధనక్షయం।
పూర్వబంధు వినాశశ్చ దుష్కర్మ నిరతోయదా॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను వ్యవహారమునందు ధనక్షయమును, పూర్వబంధు వినాశమును, దుష్కర్మసిద్ధియు కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే గురుపుత్రవినాశనం।
స్వదేహే రోగబాధాంచ ధననాశం తథైవచ॥ 7

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, గురుహానియు, పుత్రవినాశనమును, తన దేహమునందు రోగబాధయు, ధననాశమును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే సుఖశయ్యాది నాశనం।
వస్త్రభూషణ నాశంచ గర్భస్రావాది పీడనం॥ 8

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, సుఖశయ్యా విహీనమును, వస్త్రహానియు, భూషణనాశమును, గర్భస్రావాదిపీడయు, కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే నీచసేవాం మహద్భయం।

భృత్యమూలా త్థానసనాశం సమాన జననాశనం॥ 9

తా. శనితో కలసినను లేక చూడబడినను నీచ జన సేవయు, విశేషభయమును, సేవకుల మూలకముగా స్థాననాశ మును, సమాన జననాశనమును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా హ్యాపమృత్యుర్భవిష్యతి।
మహాకూశ్మాండదానేన హ్యాయురారోగ్య వర్ధనం॥ 10

తా. రాహువు ద్వితీయ సప్తమములయందున్న యెడల అపమృత్యు భయము కలుగును. ఆదోషపరిహారార్థమై మహా కూశ్మాండ దానముచేసిన యెడల ఆయురారోగ్యము కలుగును.

కేతుదశాయాం గురుభుక్తిమాసాః 11. దినాని 6.

పారాశర్యే॥

శ్లో॥ కేతోరంతర్గతే జీవే భాగ్యాధిప సమన్వితే।
లగ్నాధిపేన సంయుక్తే ధనధాన్యాది వృద్ధికృత్।
చతుష్పాజ్జీవలాభం స్యా ద్వివాహం పుత్రసంపదం॥ 1

తా. కేతుదశలో గురుభుక్తియందు గురువు నవమాధి తోగాని లగ్నాధిపతితోగాని కలసియున్న యెడల ధనధాన్యాది వృద్ధియు, చతుష్పాజ్జీవలాభమును, వివాహప్రాప్తియు, పుత్ర సంపదయు, కలుగును.

గ్రంథాంతరే॥

శ్లో॥ కేతోరంతర్గతే జీవే లగ్నాత్కేంద్రే త్రికోణగే।
తృతీయే లాభగేవాపి హ్యుచ్చరాశి స్థితేపివా।
తద్భుక్తౌ తీర్థయాత్రాది మిత్రబంధు సమాగమం।
సమాన జనసంపత్తిం గృహేకళ్యాణ మేవచ।
పుత్రోత్సవాది సంతోషం ధనధాన్యాది లాభకృత్।
మహారాజప్రసాదేన పురగ్రామాధి పత్యవాన్।



స్వవారేనృపసన్మానం సర్వేషాం సౌఖ్య మాప్నుయాత్॥ 2

తా. కేతుదశలో గురుభుక్తియందు గురువు లగ్నము నకు కేంద్రకోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక తన ఉచ్చరాశియం దున్నను, తీర్థయాత్ర ఫల ప్రాప్తియు, మిత్రబంధు సమాగమంబును, సమాన జనసంప త్తియు, యింటియందు కళ్యాణాది శుభములును, పుత్రోత్స వాది సంతోషమును, ధనధాన్యాది లాభమును, మహారాజా నుగ్రహము వలన పురాధిపత్యమును, గ్రామాధిపత్యమును, తనవారమునందు రాజసన్మానమును, సర్వసౌఖ్యమును కలుగును.

శ్లో॥ లగ్నాత్షష్టాష్టగే జీవే వ్యయేవా నీచరాశిగే।
పాపగ్రహేణ సంయుక్తే శతృక్షేత్ర గతోపివా।
స్థాననాశం నృపాద్భీతిం యాత్రాయాం కార్యనాశనం।
బంధుభిఃకలహంచైవ దేహోపద్రవసంభవం।
పుత్రదారాదికలహం తన్మూలా ద్ద్రవ్యనాశనం।
బ్రాహ్మణై స్సహవిద్వేషం నీచకార్యాది తత్పరః॥ 3

తా. గురువు లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయం దున్నను, తన నీచరాశియం దున్నను, పాపగ్రహముతో కూడి యున్నను, లేక శతృక్షేత్రమందున్నను, ఆభుక్తియందు స్థాన నాశమును, రాజ భయమును, యాత్రయందు కార్యనాశ మును, బంధువులతోడ కలహమును, దేహమునందు ఉప ద్రవంబును, భార్యాపుత్రులతోడ కలహమును, ఆమూలకముగా ద్రవ్యనాశమును, బ్రాహ్మణులతోడ ద్వేషమును, నీచకార్య ప్రవర్తనయు కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే పుత్రాణాం కలహంతథా।
ధననాశం మానభంగ ముద్యోగచలనం తథా॥ 4

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను పుత్రులతోడ కలహమును, ధననాశమును, మానభంగమును, ఉద్యోగచలనమును కలుగును.

శ్లో॥ చంద్రేణసంయుతే దృష్టే హ్యాదికారాది లాభవా౯।
వాహనాభరణప్రాప్తి బంధుసన్మాన మేవచ॥ 5

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, అధికారప్రాప్తియు, వాహనాభరణ ప్రాప్తియు, బంధుసన్మానమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే తనుతాపం విసిర్దిశేత్।
నానామూలాత్కలాపంచ చింతాశోకం తథైవచ॥ 6

తా. కుజునితో కలసినను లేక చూడబడినను దేహతాపమును, నానామూలకముగా కష్టమును, మనోవ్యాకులమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే విద్యాభ్యాసాది తత్పరః।
ఋణద్రవ్యా యతిప్రాప్తిర్జీవనం సుఖదం భవేత్॥ 7

తా. బుధునితో కలసినను లేక చూడబడినను విద్యాభ్యాసమునందు విశేషశ్రద్ధయు, ఋణద్రవ్యార్జనమును, జీవనమును, సుఖమును, కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే వేశ్యాస్త్రీ నటసంకులం।
కళ్యాణాది సుఖప్రాప్తిం టీకాగ్రంధాది సంగ్రహః॥ 8

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను వేశ్యాస్త్రీలయొక్కయు, నటులయొక్కయు సమాగమంబును, కళ్యాణాది సుఖప్రాప్తియు, టీకాగ్రంథ సంగ్రహంబును కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే దాసీదాసాది నిగ్రహం।
సమాన జననాశంచ ధాన్యనాశం తథైవచ॥ 9



తా. శనితో కలసినను, లేక చూడబడినను, దాసదాసీ జననాశమును, సమాన జననాశమును, ధాన్యనాశమును కలుగును.

శ్లో॥ దాయేశా త్కేంద్రకోణేవా దుశ్చిక్యే లాభగేపివా।
శుభగ్రహాయుతేవాపి ధనలాభం శుభప్రదం।
శివదీక్షా ఫలంసిద్ధిం దారాపుత్రాది సౌఖ్యదం।
యత్నకార్యార్థ సిద్ధించ కృషిక్షేత్ర వివృద్ధిదం।
గోధనానిసమృద్ధించ గురుదేవ సుదర్శనం॥ 10

తా. గురువు దశానాథునకు కేంద్ర కోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను, లేక శుభగ్రహములతో కూడియున్నను, ఆభుక్తియందు ధనలాభమును, శుభప్రదమును, శివదీక్షా ఫలసిద్ధియు, భార్యాపుత్రాది సౌఖ్యమును, యత్న కార్యార్థసిద్ధియు, కృషిలాభమును, క్షేత్రవృద్ధియు, గోధన సమృద్ధియు, గురుదర్శనమును, దేవతాదర్శనమును కలుగును.

శ్లో॥ దాయేశా త్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
ద్రవ్యనాశం మనఃఖేద మపకీర్తి భయంతథా।
పుత్రదారా వియోగంచ దుఃఖవ్యాధి భయంతథా।
గురుద్వేషం స్థాననాశం పితృవంశ వినాశనం॥ 11

తా. గురువు దశానాథునకు ౬-౮-౧౨ స్థానములయందున్నను, లేక పాపగ్రహములతో కూడియున్నను, ఆభుక్తియందు ద్రవ్యనాశమును, మనోవ్యసనమును, అపకీర్తి భయమును, భార్యాపుత్ర వియోగమును, దుఃఖమును, వ్యాధిభయమును, గురుద్వేషమును, స్థాననాశమును, పితృవంశ వినాశమును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా హ్యాపమృత్యు ర్భవిష్యతి।
తద్దోష పరిహారార్థం తిలదానం ప్రకల్పయేత్॥ 12

తా. ద్వితీయ సప్తమరాసులయందు గురువున్న యెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై తిలదానము చేయవలయును.



కేతుదశాయాం శనిభుక్తిమాసాః 13. దినాని 9.

కృష్ణిర్యో॥

శ్లో॥ కేతోరంతర్గతే మందే లగ్నాత్కేంద్ర త్రికోణగే।
తృతీయేలాభగేవాపి హ్యుచ్చరాశి స్థితేపివా।
పాపగ్రహయుతేవాపి వాహనాది వినాశనం।
బంధుభిఃకలహశ్చైవ భ్రాతౄణాం నాశనంతథా।
సమాన జననాశశ్చ హ్యాప్తబంధు వినాశనం।
నీచసేవా మహత్కష్టం నీచకృత్యం భవిష్యతి।
క్షేత్రధాన్య వినాశంచ పశుభాగ్య వినాశనం।
ఋణరోగ వివృద్ధించ యత్నకార్య వినాశనం।
పాపదాయే పాపభుక్తౌ నానామూలా ద్ధనవ్యయం।
స్థానభ్రష్టం మనస్తాపం నానారోగా ద్భయంతథా॥ 1

తా. కేతుదశలో శని భుక్తియందు శని లగ్నమునకు కేంద్ర త్రికోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, తన ఉచ్చరాశియం దున్నను, లేక పాపగ్రహముతో కూడియున్నను, వాహనాది వినాశమును, బంధువులతోడ కలహమును, భ్రాతృనాశమును, సమాన జననాశమును, ఆప్త బంధు వినాశమును, నీచజనసేవయు, అధిక కష్టమును, నీచ కృత్యమును, క్షేత్రహానియు, ధాన్యనాశమును, పశుక్షయమును,



భాగ్య నాశమును, ఋణవృద్ధియు, రోగ భయమును, యత్న కార్యవినాశమును కలుగును. పాపదశలో పాపభుక్తియందు, నానామూలకముగా ధనవ్యయమును, స్థానభ్రష్టమును, మన స్తాపమును, నానారోగ భయమును కలుగును.

శ్లో॥ లగ్నాత్షష్ఠమేవాపి వ్యయేవా నీచరాశిగే।
శుభగ్రహయుతేవాపి గృహధాన్య వివృద్ధిదం।
ప్రభుసన్మానకీర్తించ కుంజరాశ్వాది లాభకృత్।
దారాపుత్రాది సౌఖ్యంచ గృహేకళ్యాణ వృద్ధిదం।
భుక్త్యంతేతు క్వచిత్కష్టం నానామూల ద్ధనవ్యయం॥

తా. శని లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయం దున్నను, తన నీచరాశిని పొందియున్నను, లేక శుభగ్రహములతో కూడియున్నను, ఆభుక్తియందు గృహలాభమును, ధాన్యవృద్ధియు, రాజసన్మానమును, కీర్తియు, గజాశ్వాది లాభమును, భార్యాపుత్రాది సౌఖ్యమును, యింటియందు కళ్యాణవృద్ధియు, భుక్తి అంత్యభాగమందు కొంతకష్టమును, నానామూలకముగా ధనవ్యయమును కలుగును.

శ్లో॥ రవిణా సంయుతే దృష్టే పితృబంధు వినాశనం।
ఉద్యోగ నాశనంచైవ ద్రవ్యనాశం మహద్భయం॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను పితృ వియోగమును, బంధునాశమును, ఉద్యోగనాశమును, ద్రవ్య నాశనమును, అధిక భయమును కలుగును.

శ్లో॥ శశినాసంయుతే దృష్టే మాతృవంశ వినాశనం।
శిరోరోగాది బాధాంచ సంతాప కలహంతథా॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను మాతృవంశపువారికి నాశనమును, శిరోరోగమును, సంతాపమును,

కలహమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే భ్రాతృవంశ వినాశనం।
యుద్ధే శత్రు భయంచైవ అగ్నిబాధా మనోవ్యథా॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, సోదర వంశ వినాశమును, యుద్ధమునందు శత్రుభయమును, అగ్ని బాధయు, మనోవ్యథయును కలుగును.

శ్లో॥ బుధేన సంయుతే దృష్టే బాంధవక్షయ మావిశేత్।
స్వస్థాన నాశనంచైవ మిత్రబంధు విరోధకృత్॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను బంధు క్షయమును, స్వస్థాననాశమును, మిత్రబంధు విరోధమును కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే పుత్రనాశం వినిర్దిశేత్।
గురుద్వేషం ద్రవ్యనాశం నానాకార్య వినాశనం॥ 7

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, పుత్ర నాశమును, గురుద్వేషమును, ద్రవ్యనాశమును, నానావిధ కార్యనాశమును కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతే దృష్టే స్త్రీద్వేషం బంధునిగ్రహం।
పరదారాదిగమనం ద్రవ్యనష్టంచ జాయతే॥ 8

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను స్త్రీద్వేషమును, బంధునిగ్రహమును, పరస్త్రీగమనంబును, ద్రవ్యనష్టమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయే లాభగేపివా।
శుభగ్రహ యుతేవాపి పశులాభం వినిర్దిశేత్।
స్వస్త్రీసౌఖ్యం బంధువృద్ధిం ధనధాన్యవివృద్ధిదం।
మిత్రప్రభు వశాత్సౌఖ్యం యుద్ధే శత్రువినాశనం।



యత్నకార్య సుసిద్ధించ సర్వత్రారోగ్యమేవచ॥ 9

తా. భుక్తినాథుడగు శని దశానాథునకు కేంద్రకోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను, లేక శుభగ్రహములతో కూడియున్నను, ఆభుక్తియందు పశులాభమును, స్వంత స్త్రీ సౌఖ్యమును, బంధువృద్ధియు, ధనధాన్య సమృద్ధియు, మిత్రప్రభు మూలకముగా సౌఖ్యమును, యుద్ధమునందు శత్రువినాశమును, యత్నకార్యసిద్ధియు, సర్వులకును ఆరోగ్యమును కలుగును.

శ్లో॥ దాయేశాత్ షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
వ్యాపార ధననాశశ్చ సర్వధాన్య వ్యయోభవేత్।
మిత్రప్రభు విరోధశ్చ స్వస్థాన చలనంతథా॥ 10

తా. శని దశానాథునకు ౬-౮-౧౨. రాసులయందున్నను, లేక పాపులతో కూడియున్నను, ఆభుక్తియందు వ్యాపార మూలకముగా ధననాశమును, సకల ధాన్యవ్యయమును, మిత్ర ప్రభు విరోధమును, స్వస్థానచలనమును కలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే హ్యపమృత్యు ర్భవిష్యతి।
తద్దోష పరిహారార్థం యమదానేన శామ్యతి॥ 11

తా. ద్వితీయ సప్తమరాసుల యందున్న యెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై యమప్రతిమను దానముచేసిన యెడల శాంతి కలుగును.

---

కేతుదశాయాం బుధభుక్తిమాసాః 11. దినాని 27.

పారాశర్యే॥

శ్లో॥ కేతోరంతర్గతే సౌమ్యే కేంద్రేకోణే శుభైర్యుతే।
స్వోచ్చస్వక్షేత్రసంయుక్తే తృతీయే లాభగేపివా।
గోపురాంశేచ వృద్వంశే రాజ్యలాభం మహత్సుఖం।

మహారాజ ప్రసాదేన వాహనాంబర లాభకృత్।
చతుష్పాజ్జీవలాభంస్యాత్పుత్రలాభం మహోత్సవం।
భాగ్యాధిపేనసంయుక్తే గజాశ్వాంబర సంకులం।
సత్కథా శ్రవణందానం ధర్మవృద్ధిం మహత్సుఖం।
వాహనాధిప సంయుక్తే గృహక్షేత్రాభి వృద్ధికృత్।
మిత్రాత్మప్రభుసన్మానం జితశత్రు రణేపిచ॥ 1

తా. కేతుదశలో భుక్తినాథుడగు బుధుడు లగ్నమునకు కేంద్రకోణములయం దున్నను, శుభగ్రహములతో కూడి యున్నను, తన ఉచ్చస్వక్షేత్రములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక గోపురాంశ యందుగాని మృద్వంశయందుగాని యున్నను, రాజ్యలాభమును, విశేష సుఖమును, మహారాజానుగ్రహమువల్ల వాహనలాభమును, వస్త్రప్రాప్తియు, చతుష్పాజ్జీవలాభమును, పుత్రలాభమును, మహోత్సవమును, కలుగును, నవమాధిపతితో కలసియున్న యెడల గజాశ్వాంబర సంకులమును, సత్కథాశ్రవణమును, దానబుద్ధియు, ధర్మసిద్ధియు, మేలైన సుఖమును కలుగును. చతుర్థాధిపతితో కలసియున్న యెడల గృహలాభమును, క్షేత్రాభివృద్ధియు, మిత్రపుత్రాదులవల్ల గౌరవమును, రాజ సన్మానమును, యుద్ధమునందు శత్రుజయమును కలుగును.

శ్లో॥ లగ్నాత్షష్ఠాష్టమేసౌమ్యే వ్యయేవా నీచరాశిగే।
బంధుమిత్ర విరోధంచ ఆప్తబంధు విరోధతాం।
వ్యవహారేర్థనాశంచ పశుధాన్య వినాశనం।
నృపక్రోధం ద్రవ్యనాశం పత్నీగర్భస్య పీడనం।
స్వస్థానచలనంచైవ సర్వకార్య వినాశనం॥ 2

తా. బుధుడు లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయం



దున్నను లేక తన నీచరాశియం దున్నను, ఆభుక్తియందు బంధువిరోధంబును, స్నేహజనవిరోధంబును, ఆప్తబంధు విరోధమును, వ్యవహారమునందు అర్థనాశమును, పశుహానియు, ధాన్యనాశమును, రాజక్రోధమును, ద్రవ్యనాశమును, పత్నీగర్భస్రావమును, స్వస్థానచలనంబును, సర్వకార్య వినాశమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే ఉద్యోగం లభతేధ్రువం।
పుత్రమిత్రాది సౌఖ్యంచ ధనధాన్య వివృద్ధిదం॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను నిశ్చయముగా ఉద్యోగప్రాప్తియు, పుత్రమిత్రాది సౌఖ్యమును, ధనధాన్య సమృద్ధియు, కలుగును.

శ్లో॥ శశినాసంయుతే దృష్టే మాతృబంధు వివృద్ధిదం।
వస్త్రాభరణసంప్రాప్తి మాప్తబంధు ముఖాత్సుఖం॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, మాతృవృద్ధియు, బంధువృద్ధియు, వస్త్రాభరణ సంప్రాప్తియు, ఆప్తబంధు జనులవల్ల సౌఖ్యమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే యుద్ధేశత్రు భయంతథా।
చోరాది విషబాధాంచ చింతాశోకం తథైవచ॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, యుద్ధమునందు శత్రుభయమును, చోరాది విషబాధయు, చింతాశోకమును కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే సుతలాభో భవిష్యతి।
ధనలాభం దేహసౌఖ్యం మిత్రబంధు వివృద్ధిదం॥ 6

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, పుత్రలాభమును, ధనప్రాప్తియు, దేహసౌఖ్యమును, మిత్రవృద్ధియు, బంధువృద్ధియు కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే వాహనం భూషణాన్వితం।
వివాహ శుభకార్యాణి గృహభూమ్యాది లాభవాన్॥

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, వాహనప్రాప్తియు, భూషణ సంగ్రహమును, వివాహాది శుభకర్మసిద్ధియు, గృహలాభమును, భూలాభమును కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే బంధునాశం ధనక్షయం।
స్వభృత్యై కలహంచైవ పశుధాన్య వినాశనం॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను, ఆభుక్తియందు బంధునాశమును, ధనక్షయమును, తన సేవకులతోడ కలహమును, పశుక్షయమును, ధాన్యనాశమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయే లాభగేపివా।
శుభగ్రహాయుతేవాపి విద్యాలాభం ధనవ్రయం।
బంధుమిత్ర వివృద్ధించ క్షేత్రలాభం తథైవచ।
విష్ణుపూజాదిభక్తించ యత్నకార్యార్థ సిద్ధిదం॥ 9

తా. బుధుడు దశానాథునకు కేంద్రకోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను, లేక శుభగ్రహములతో కూడియున్నను, ఆభుక్తియందు విద్యాలాభమును, ధనవ్రయమును, బంధుమిత్ర వృద్ధియు, క్షేత్రలాభమును, విష్ణుపూజాది భక్తియు, యత్నకార్యార్థ సిద్ధియు కలుగును.

శ్లో॥ దాయేశాష్టమరాశిస్థే వ్యయేవా షష్ఠరాశిగే।
పాపగ్రహయుతేవాపి మిత్రాణాంతు విరోధతా।
నానామూలాద్ద్రవ్యహానిః పశునాశస్తథైవచ।
అకస్మాత్కలహప్రాప్తిః పుష్పిణీస్త్రీ సమాగమం॥ 10

తా. బుధుడు దశానాథునకు ౬-౮-౧౨. రాసులయందున్నను లేక పాపగ్రహములతో కూడియున్నను, ఆభుక్తి



యందు మిత్రులతోడ విరోధమును, నానామూలకముగా ద్రవ్యహానియు, పశునాశమును, అకస్మాత్తుగా కలహమును, ఋతుమతియైన స్త్రీతో సమాగమంబును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా హ్యపమృత్యు ర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం మృగదానేన శామ్యతి॥ 11

తా. ద్వితీయ సప్తమరాసులయందు బుధుడున్న యెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై మృగదానముచేసిన యెడల శాంతి కలుగును.

ఇతి జాతకఫల చింతామణౌ కేతుదశాంతర్దశాఫలంనామ
నవమ ప్రకరణం—సమాప్తం.

శుభమస్తు.

# జాతకఫలచింతామణి.

## ఆంధ్ర తాత్పర్య సహితము.

## శుక్రదశాంతర్దశాఫలంనామ దశమప్రకరణము.

శుక్రదశా సంవత్సరాః. 20.

శ్లో॥ శుక్రేస్థాన బలాధికే నరపతే స్సన్మానసం భూషణం।
విద్యావివాద వినోదగోష్ఠి రసికం నామత్స్వయంసంభ్రమం।
తస్మిన్ దృక్ప్రబలాన్వితే బహుయశః పుత్రార్థదారాంబరం।
శుక్రేకాల బలాన్వితే సుఖధనం కీర్తించ నామాంకితం॥ 1

తా. శుక్రుడు జననకాలమందు స్థానబలము కలిగి యున్న యెడల ఆ దశాకాలమందు రాజులవల్ల బహుమానాది సన్మానములును, భూషణప్రాప్తియు, సర్వదా విద్యా నిమిత్తిక

మగు వివాదగోష్ఠియు, వ్యవహారనామంబు గాక మరియొక గౌరవనామంబును లభించును. అట్టి శుక్రుడు దృష్టిబలము గలిగియున్నయెడల బహు యశస్సును, పుత్రులు, ధనము, భార్యా వస్త్రములు, వీటి లాభమును కలుగును. శుక్రుడు కాలబలముతో కూడియున్నయెడల సుఖము ధనము, కీర్తి, నామాంకితమగు బిరుదు లభించును.

శ్లో॥ నిసర్గవీర్య యుక్తస్య భృగోర్దాయే మహత్సుఖం।
వృషగో భూమివిత్తాది భ్రాతృమాతృ సుఖీభవేత్॥ 2

తా. జన్మకాలమందు శుక్రుడు నైసర్గిక బలముతో కూడియున్నయెడల ఆ దశాకాలమందు అధికమైన సుఖమును, వ్యవసాయ వృద్ధియు, పశువృద్ధియు, భూలాభమును, ధనప్రాప్తియు, భ్రాతృవృద్ధియు, మాతృ సుఖమును కలుగును.

శ్లో॥ వక్రంగతస్యాపి భృగోస్సుతస్య
దశావిపాకే త్వతిరాజపూజ్యం।
మృదంగభేరీ రవయుక్తయానం
విచిత్రవస్త్రాభరణాదిసౌఖ్యం॥ 3

తా. వక్రగతియందున్న శుక్రదశాకాలమందు రాజులవల్ల అధికమగు బహుమానాది పూజ్యతయు, మద్దెల, భేరీ, మొదలగు వాద్య విశేషములయొక్క శబ్దములతో గూడియుండు వాహన లాభమును, విచిత్ర వస్త్రాభరణ ప్రాప్తియు, సుఖమును కలుగును.

శ్లో॥ దిగ్వీర్యయుక్తస్య భృగోర్విపాకే
యజ్ఞంచసత్కర్మ కరోతికాలే।
విద్యావిలాసం శయనాంబరంచ
నృపాభిషేకం కలహం విరోధం॥ 4



తా. దిగ్బలముగల శుక్రదశలో యజ్ఞాది సత్కర్మ సిద్ధియు, విద్యావిలాసమును, శయన దుకూల వస్త్రములయొక్క సౌఖ్యంబును. రాజ్యాభిషేకమును, కలహమును, విరోధమును కలుగును.

శ్లో॥ క్రూరషష్ట్యంశ యుక్తస్య భృగోర్దాయే రిపోద్భయం।
చోరాగ్ని రాజభీతించ కృషిగో భూమినాశనం॥ 5

తా. క్రూర షష్ట్యంశలయందున్న శుక్రదశలో శత్రుభయమును, చోరులచేతను, అగ్నిచేతను, రాజులచేతను, భయోత్పాతనంబును, వ్యవసాయము, గోవులు, భూమి వీనికి నాశనంబును కలుగును.

శ్లో॥ సౌమ్యషష్ట్యంశ యుక్తస్య భృగోఃపాకే మహత్సుఖం।
కూపారామ తటాకానాం నిర్మాణం దేవపూజనం॥ 6

తా. జన్మకాలమందు శుభ షష్ట్యంశలతో గూడిన శుక్రదశాకాలమందు అధిక సుఖమును, బావులు, ఉద్యాన వనములు, తటాకములు, వీనియొక్క నిర్మాణంబును, దేవతారాధన ఫలప్రాప్తియు కలుగును.

శ్లో॥ వైశేషికాంశ యుక్తస్య భృగోర్దాయే మహత్సుఖం।
వాహనం భూపసన్మానం భ్రాతృస్త్రీ ధనసంపదః॥ 7

తా. జన్మకాలమందు శుక్రుడు వైశేషికాంశయందున్నయెడల అట్టి దశాకాలమందు అధిక సుఖమును, వాహన ప్రాప్తియు, రాజ సన్మానమును, సహోదర సహోదరీలయొక్కయు, స్త్రీలయొక్కయు ధన సంపదలును లభించును.

శ్లో॥ క్రూరద్రేక్కాణ సంయుక్త భృగోర్దాయేతి భీతిదం।
కారాగృహ మహత్కష్టం నిగళం చోరపీడనం॥ 8

తా. క్రూర ద్రేక్కాణమందున్న శుక్రదశలో శత్రు

భయమును, కారాగృహ ప్రాప్తియు, అధిక కష్టమును, సంకెళ్ల చే బంధనమును, చోరపీడయు కలుగును.

శ్లో॥ అత్యుచ్చసంస్థస్య భృగోర్దశాయాం
క్షేత్రార్థసిద్ధిం కురుతే నరాణాం।
స్వనామపద్యాంకిత కీర్తిజాలం
ప్రౌఢాంగనా సంగమ కేళిసౌఖ్యం॥ 9

తా. పరమోచ్చయందున్న శుక్రుడు తన దశాకాలమందు క్షేత్రసిద్ధియు, ధనలాభమును, తనపేరు అంకితముగాగల పద్యములచే పొగడింపబడిన కీర్తిలాభమును, ప్రౌఢలైన స్త్రీలతో కేళీసౌఖ్యమును కలుగును.

శ్లో॥ ఉచ్చస్థితస్య భృగుజస్య దశావిపాకే
రాజ్యాధికార విభవం పురనాథమిత్రం।
గోవాజిసంఘ గజయాన సమృద్ధిదంచ
తాంబూలగంధకుసుమా ద్యనులేపనాని॥ 10

తా. తనఉచ్చరాశిగతుండైన శుక్రదశాకాలమందు రాజ్యాధికార విభవమును, రాజస్నేహమును,గోవులు,గుఱ్ఱములు, ఏనుగులు, వాహనములు వీనియొక్క సమృద్ధియు, తాంబూల గంధకుసుమాది సుగంధ లేపన సుఖ భోగములును కలుగును.

శ్లో॥ ఉద్యోగరోగకళత్తః కర్మసువిఫల స్స్వదారభీతిశ్చ।
అతినీచ గతస్యదాయే శుక్రస్యాత్మార్థ దారపుత్రార్తిం॥

తా. పరమ నీచయందున్న శుక్రదశలో ఉద్యోగనాశమును,రోగపీడయు,కర్మనాశమును,కళత్రభీతియు, దేహపీడయు, అర్థ నాశమును, భార్యాపుత్ర కష్టమును కలుగును.

శ్లో॥ నీచస్థితస్యాపి భృగోర్విపాకే
ధనాని వస్త్రాణిచ నాశనాని।



స్వస్త్రీవివాద శ్చకలహం ధనక్షయం
సమానగోత్రస్య వినాశమాహుః॥ 12

తా. నీచరాశియందున్న శుక్రదశలో ధనహానియు, వస్త్రనాశమును, స్వంతస్త్రీతోడ వివాదమును, కలహమును, ధనక్షయమును. సమాన గోత్రజుల వినాశమును కలుగును.

శ్లో॥ ఉచ్చస్థితస్య సహితస్య భృగోర్దశాయాం
రాజ్యంమహత్త్వ మమరాధి పతిత్వమేతి।
హేమాంబరాది మణిభూషణ యానలాభం
భేరీమృదంగ పరివాది నివాద్యఘోషైః॥ 13

తా. తన ఉచ్చస్థానమునం దుండునట్టి గ్రహముతో గూడిన శుక్రదశలో రాజ్యప్రాప్తియు,గొప్పధనమును,దేవాధిపతిత్వమును, బంగారము, వస్త్రము, మణులు, భూషణములు, వాహనములు వీనియొక్క లాభమును, భేరీమృదంగాది పరివారముతో నిండిన వాద్యఘోష విభవమును కలుగును.

శ్లో॥ నీచఖేచర సంయుక్త భృగోర్దాయే మహద్భయం।
అపవాద కృతందోషం లభతే పాతకంమహత్॥ 14

తా. నీచరాశియందున్న గ్రహముతో కూడిన శుక్రదశలో అధిక భయమును,పరులవల్ల తనయందు చేయబడినఅపవాద దోషఫలంబును,అధికముగు పాపకర్మప్రాప్తియు కలుగును.

శ్లో॥ ఉచ్చాంశే శుక్రయుక్తశ్చే న్నీచరాశి సమన్వితే।
కృషిగోభూమి వాణిజ్యై ర్ధనధాన్య వినాశనం॥ 15

తా. శుక్రుడు ఉచ్చాంశయం దున్నను, నీచరాశిని పొందియున్నయెడల కృషినాశమును, పశుహానియు, భూనాశమును, వ్యాపార మూలకముగా ధనధాన్య నాశనమును కలుగచేయును.

శ్లో॥ నీచాంశే శుక్రయుక్తశ్చే దుచ్చరాశి సమన్వితే।
కరోతి సుఖ సౌభాగ్యం దారాపుత్రాది వర్ధనం॥ 16

తా. శుకృడు నీచాంశను పొందియున్నయెడల ఉచ్చరాశియం దున్నయెడల సుఖమును సౌభాగ్యము, భార్యాపుత్రాభి వృద్ధియు కలుగచేయును.

శ్లో॥ మూలత్రికోణ నిలయస్య భృగోర్దశాయాం।
విద్యావినోద విభవం మణిహేమలాభం।
చిత్రాంబరాద్విరభూషణ వస్తులాభం।
స్త్రీపుత్రసౌఖ్యవిభవం సకలార్థసిద్ధిం॥ 17

తా. మూలత్రికోణ రాశియందున్న శుక్రదశలో విద్యావినోద విభవమును, మణులు, బంగారము, వీని లాభమును, విచిత్ర వస్త్ర లాభమును, శ్రేష్ఠమైన భూషణ ప్రాప్తియు, వస్తు సంగ్రహమును, భార్యాపుత్ర సౌఖ్యవిభవమును,సకలార్థ సిద్ధియు కలుగును.

శ్లో॥ స్వక్షేత్ర సంస్థస్య భృగోర్విపాకే
స్త్రీపుత్రసౌఖ్యం క్షితినాయకత్వం।
క్షేత్రాదివృద్ధించ గృహాదిలాభం
స్వబంధుపూజ్యం నరవాహనాప్తిం॥ 18

తా. స్వక్షేత్రమందున్న శుక్రదశాకాలమందు భార్యాపుత్రసౌఖ్యమును, భూమ్యాధి పత్యమును, క్షేత్రాదివృద్ధియు, గృహలాభమును, స్వబంధు పూజ్యతయు, నరవాహన ప్రాప్తియు కలుగును.

శ్లో॥ అత్యంతమిత్ర నిలయస్య భృగోర్దశాయాం।
యానాది సౌఖ్య విభవం మణివస్త్రలాభం।
విద్యావినోద విభవం స్వజనాను మోదం।



క్షేత్రాభివృద్ధిం ధనధాన్య సమృద్ధిదంచ॥ 19

తా. అధి మిత్ర క్షేత్రమందున్న శుక్రదశాకాలమందు వాహనాది సౌఖ్య విభవమును, మణిలాభమును, వస్త్రప్రాప్తియు, విద్యావినోద విభవమును, స్వజనాను మోదమును, క్షేత్రాభివృద్ధియు, ధనధాన్య సమృద్ధియు కలుగును.

శ్లో॥ మిత్రర్క్షగస్యాపి భృగోర్విపాకే
వారాంగనా సంగమ కేళిసౌఖ్యం।
మనోవిలాసం నరనాథమిత్రం
స్వగ్రామభూమ్యాధి పతిత్వమేతి॥ 20

తా. మిత్రక్షేత్రమందున్న శుక్రదశలో వేశ్యాస్త్రీ సంగమ కేళీసౌఖ్యమును, మనోవిలాసమును, రాజస్నేహమును, స్వగ్రామ భూమ్యాధి పత్యమును కలుగును.

శ్లో॥ సమర్క్షగస్య శుక్రస్య దశాపాకే క్వచిత్సుఖం।
క్వచిద్గ్రామాధి పత్యంచ క్వచిద్ధాన్యాది సంగ్రహం॥

తా. సమక్షేత్రమందున్న శుక్రదశలో కొంతసుఖమును, అల్ప గ్రామాధి పత్యమును, కొంత ధాన్యాది సంగ్రహమును కలుగును.

శ్లో॥ శత్రుర్క్ష సంస్థస్య భృగోర్విపాకే
స్త్రీపుత్రపీడాం ధననాశమేతి।
మనోవిచారం స్వజనానురోధం
క్షేత్రార్థనాశం పదవిచ్యుతించ॥ 22

తా. శత్రుక్షేత్రమందున్న శుక్రదశలో భార్యాపుత్ర పీడయు, ధననాశమును, మనోవిచారమును, స్వజన విరోధమును,క్షేత్రనాశమును,అర్థహానియు,పదభ్రంశమును కలుగును.

శ్లో॥ భృగోర్దశాయా మతిశత్రురాశే
గ్గతస్యపుత్రార్థక శత్రుహానిం।
ప్రభగ్నసంసార విశీర్ణదేహం
గుల్మాదిరోగం గ్రహణీ ప్రకోపం॥ 23

తా. అతి శత్రుక్షేత్రమందున్న శుక్రదశలో పుత్రనాశమును, ధనహానియు, శత్రునాశమును, సంసార భగ్నముచేత కృశత్వము చెందిన దేహమును, గుల్మాది రోగ సంభవమును, గ్రహణీ వ్యాధి ప్రకోపమును కలుగును.

శ్లో॥ శుభాన్వితస్యాపి భృగోర్దశాయాం
సౌభాగ్య మిత్రాత్మజ ధాన్యలాభం।
నరేశపూజ్యం గజవాజి సంఘం
ప్రవాళముక్తామణి యానలాభం॥ 24

తా. శుభగ్రహముతో గూడి నటువంటి శుక్రుని దశా కాలమందు సౌభాగ్యమును, మిత్రులు, పుత్రులు, ధాన్యము వీనిలాభమును, రాజపూజ్యతయు, ఏనుగులు, గుఱ్ఱములు, వీని యొక్క గుంపులును, పవడములు, ముత్యములు, మణులు, నర వాహనము వీని లాభమును కలుగును.

శ్లో॥ పాపాన్వితస్యాపి భృగోర్దశాయాం
స్థానచ్యుతిం బంధు జనై ర్విరోధం।
ఆచారహీనం కలహప్రదంచ
కృష్యర్థ భూమ్యాత్మజ దారనాశం॥ 25

తా. పాపగ్రహముతో కూడిన శుక్రదశా కాలమందు స్థానచలనమును, బంధు జనవిరోధమును, ఆచారహీనమును, కలహమును, వ్యవసాయమును, ధనము, భూమి, పుత్రులు, భార్య వీనినాశమును కలుగును.



శ్లో॥ శుభేక్షితస్యాపి భృగోర్దశాయాం
ధనాయతిం భూపతిపూజనంచ।
జనాధిపత్యం స్వశరీరకాంతిం
కళత్రమిత్రాత్మజ సౌఖ్యమేతి॥ 26

తా. శుభగ్రహ వీక్షణగల శుక్రదశాకాలమందు ధనలాభమును, రాజపూజ్యతయు, జనాధిపత్యమును, మంచి తేజస్సును, భార్యాపుత్ర సౌఖ్యమును, స్నేహ జన సౌఖ్యమును కలుగును.

శ్లో॥ పాపేక్షితస్యాపి భృగోర్దశాయాం
మానార్థహానిం సముపైతి దుఃఖం।
స్త్రీయావిరోధం స్వపదచ్యుతించ
విదేశవాసం నిజకర్మహీనం॥ 27

తా. పాపగ్రహ వీక్షణగల శుక్రదశలో మానహానియు, అర్థనాశమును, దుఃఖప్రాప్తియు, స్త్రీతోడ విరోధమును, స్థాననాశమును, విదేశవాసమును, కులాచార హీనమును, కలుగును

శ్లో॥ అర్కగత శుక్రదశాయాం జన్మగృహవాస జనవిరోధంచ।
లభతే దారవినాశం భ్రాతృవియోగంచ కలహంచ॥ 28

తా. సూర్యునితో గూడిన శుక్రదశా కాలమందు జన్మగృహవాసమును, జనవిరోధమును, భార్యావియోగమును, భ్రాతృనాశమును, కలహమును, కలుగును.

శ్లో॥ త్రికోణసంస్థస్య భృగోర్దశాయాం
యానాంబరప్రాప్తి విశేషసౌఖ్యం।
స్వనామపద్యాంకిత కీర్తిలాభం
వారాంగనాసంగమ కేళిలోలః॥ 29

తా. త్రికోణరాసులయందున్న శుక్రదశలో యానాంబర ప్రాప్తియు, విశేష సౌఖ్యమును, తనపేరు అంకితముగాగల పద్యములచే పొగడ్తయు, కీర్తి లాభమును, వేశ్యాస్త్రీ సంగమ కేళీ విలాసమును కలుగును

శ్లో॥ కేంద్రాస్పదస్య భృగుజస్య దశావిపాకే।
స్త్రీపుత్రసౌఖ్య విభవం మణివస్త్రలాభం।
భూపాత్సుఖంచ నరవాహన వృద్ధిదంచ।
ధాన్యాదివృద్ధిమతులం పశుదాసవృద్ధిం॥ 30

తా. కేంద్రస్థానములయందున్న శుక్రదశలో భార్యాపుత్ర సౌఖ్య విభవమును, మణిలాభమును, వస్త్రప్రాప్తియు, రాజువల్ల సుఖమును, నరవాహన వృద్ధియు, బహుధాన్యవృద్ధియు, పశువృద్ధియు, సేవకజన వృద్ధియు కలుగును.

శ్లో॥ దుస్థానసంస్థస్య భృగోర్విపాకే
స్త్రీపుత్రపీడాం కలహం ధనక్షయం।
మనోవిచారం స్వజనానురోధం
గోవాజియానాది సమస్తనాశం॥ 31

తా. దుస్థానములయందున్న శుక్రదశలో భార్యాపుత్ర పీడయు, కలహమును, ధనక్షయమును, మనోవిచారమును, స్వజనాను రోధమును, గోవాజి యానాది సమస్త నాశమును కలుగును.

---

మేషాది రాశిస్థిత శుక్రదశాఫలం.

శ్లో॥ మేషస్థితస్యాపి భృగోర్దశాయాం
స్వస్యాధికారం నరనాథమిత్రం।
విచిత్ర హర్మ్యాదిత లేషువాసం
సువస్త్రభూషాంబర హేమవృద్ధిం॥ 32



తా. మేషరాశియందున్న శుక్రదశాకాలమందు స్వతంత్ర అధికారమును, రాజస్నేహమును, విచిత్రమేడలతో గూడిన గృహవాసమును, మంచి వస్త్రభూషణ ప్రాప్తియు, హేమలాభమును కలుగును.

శ్లో॥ వృషభగత శుక్రదాయే గోగజలాభంచ యానలాభంచ।
వారవధూవిభవసుఖం బంధుసమృద్ధిం పురాధిపత్యంచ॥33

తా. వృషభ రాశియందున్న శుక్రుడు తన దశాకాలమందు గోవులు, ఏనుగులు వీనిలాభమును, యానలాభమును, వేశ్యాస్త్రీ విభవసుఖమును, బంధుసమృద్ధియు, పురాధిపత్యమును కలుగును.

శ్లో॥ యుగ్మస్థితస్యాపి భృగోర్దశాయాం
కళత్రమిత్రాత్మజ బంధుసౌఖ్యం।
స్వగ్రామవాసం నరవాహనాప్తిం
భూమ్యర్థ హేమాభరణాదిలాభం॥ 34

తా. మిథునరాశి యందున్న శుక్రదశలో భార్యాపుత్ర సౌఖ్యమును, బంధుమిత్ర సౌఖ్యమును, స్వగ్రామవాసమును, నరవాహన ప్రాప్తియు, భూలాభమును, అర్థప్రాప్తియు, హేమాభరణ సంగ్రహమును కలుగును.

శ్లో॥ కటకస్థే భృగోర్దాయే స్వపదభ్రంశం విదేశవాసంచ।
చింతితకార్యవినాశం స్త్రీమూలాత్కలహం ధనక్షయంచ॥

తా. కటక రాశియందున్న శుక్రదశలో స్థానభ్రంశమును, విదేశవాసమును, చింతించిన కార్యభంగమును, స్త్రీమూలకముగా కలహమును, ధనక్షయమును కలుగును.

శ్లో॥ సింహస్థితస్యాపి భృగోర్విపాకే
క్షితీశకోపం కలహం ధనక్షయం।

స్వస్త్రీవిరోధంచ గిరిప్రచారం
క్షేత్రాది దాసీజన నాశనంచ॥ 36

తా. సింహరాశియందున్న శుక్రదశలో రాజకోపమును, కలహమును, ధనక్షయమును, స్వంతస్త్రీతోడ విరోధమును, గిరిసంచారమును, క్షేత్రాదినాశమును, సేవకా జననాశనమును కలుగును.

శ్లో॥ కన్యాగతాయాంచ భృగోర్దశాయాం
స్వస్త్రీవినాశం హ్యధికారనాశం।
మనోవిచారం కలహంవిరోధం
క్షేత్రార్థ గోధాన్యవినాశనంచ॥ 37

తా. కన్యారాశి యందున్న శుక్రదశలో స్వస్త్రీనాశనమును, అధికారనాశమును, మనోవిచారమును, కలహమును, విరోధమును, క్షేత్రనాశమును, అర్థక్షయమును, పశుహానియు, ధాన్యనాశమును కలుగును.

శ్లో॥ తులాస్థస్యశుక్రస్య దాయేర్థలాభం
క్షితీశస్యమిత్రం కళత్రాదిసౌఖ్యం।
స్వదేశాధికారాది సంప్రాప్తిమేతి
ఇష్టార్థసిద్ధిం మనోల్లాసమేతి॥ 38

తా. తులారాశియందున్న శుక్రదశలో అర్థలాభమును, రాజస్నేహమును, భార్యాపుత్ర సౌఖ్యమును, స్వదేశాధికార సంప్రాప్తియు, ఇష్టార్థసిద్ధియు, మనోల్లాసమును కలుగును.

శ్లో॥ వృశ్చికస్థస్య శుక్రస్య దశాయాం కష్టమేవచ।
జ్ఞాతిశత్రు వివృద్ధించ స్త్రీద్వేషం ధననాశనం॥ 39

తా. వృశ్చికరాశియందున్న శుక్రదశలో కష్టమును,జ్ఞాతివృద్ధియు,శతృవృద్ధియు, స్త్రీద్వేషమును,ధననాశమును కలుగును.



శ్లో॥ ధనుస్థితస్యాస్య భృగోర్దశాయాం
సత్కీర్తిలాభం సురపూజనంచ।
యాగాదిసత్కర్మ ఫలప్రదంచ
పురాణగీత శ్రవణంవినోదం॥ 40

తా. ధనస్సుయందున్న శుక్రదశలో మంచికీర్తియు, దేవతాపూజయు, యాగాధిసత్కర్మ ఫలప్రాప్తియు, పురాణగీత శ్రవణవినోదమును కలుగును.

శ్లో॥ మృగగతశుక్ర దశాయాం వాహనలాభం మనోవిలాసంచ।
అన్యస్థలసంచారం స్త్రీసుఖరహితం సుభాషణాప్తించ॥ 41

తా. మకరరాశి యందున్న శుక్రదశలో వాహనలాభమును, మనోవిలాసమును, అన్యస్థళ సంచారమును, స్త్రీసుఖారహితమును, మంచి భాషణాశక్తియు కలుగును.

శ్లో॥ ఘటస్థస్య శుక్రస్యదాయే సుఖత్వం
సదా వేదశాస్త్రార్థ విజ్ఞానబోధం।
క్షేత్రాదివృద్ధి కళత్రాదిసౌఖ్యం
నృపాప్తిం మణిహేమ వస్త్రాదిలాభం॥ 42

తా. కుంభరాశి యందున్న శుక్రదశలో సుఖమును, సదా వేదశాస్త్రార్థ విజ్ఞానబోధనయు, క్షేత్రాదివృద్ధియు, కళత్రాది సౌఖ్యమును, రాజస్నేహమును, మణిలాభమును, హేమ వస్త్రాదిలాభమును కలుగును.

శ్లో॥ మీనాన్వితస్య భృగుజస్య దశావిపాకే
రాజ్యాధికార విభవం మణిరత్నలాభం।
యానాదివాహన సమృద్ధి కళత్రసౌఖ్యం
క్షేత్రార్థవృద్ధి పశుధాన్య సమృద్ధిదంచ॥ 43

తా. మీనరాశి యందున్న శుక్రదశలో రాజ్యాధికార విభవమును, మణిలాభమును, రత్నలాభమును, యానాది వాహన సమృద్ధియు, కళత్రసౌఖ్యమును, క్షేత్రార్థవృద్ధియు, పశుధాన్య సమృద్ధియు కలుగును.

తన్వాదిభావస్థిత శుక్రదశాఫలం.

శ్లో॥ తనుగత శుక్రదశాయాం దేహారోగ్యం కీర్తివృద్ధించ।
స్వగృహ విభవసమృద్ధిం వరభూషణవస్త్రసంగ్రహణం॥

తా. లగ్నమందున్న శుక్రదశా కాలమందు దేహారోగ్యమును, కీర్తివృద్ధియు, తనయింటియందు విభవ సమృద్ధియు, శ్రేష్ఠమైన భూషణ సంగ్రహమును, వస్త్రప్రాప్తియు కలుగును.

శ్లో॥ ధనస్థితస్యాపి భృగోర్దశాయాం
ధనాధికారం వరవస్తులాభం।
విద్యావినోదం స్వజనానుమోదం
కుటుంబ సంరక్షణ వాగ్విలాసం॥ 45

తా. లగ్నమునకు రెండవయింటి యందున్న శుక్రదశలో బొక్కసపుమీది అధికారమును, శ్రేష్ఠమైన వస్తులాభమును, విద్యావినోదమును, స్వజనాను మోదమును, కుటుంబసంరక్షణ వాగ్విలాసంబును కలుగును.

శ్లో॥ విక్రమస్థస్య శుక్రస్య దశాశౌర్య వివృద్ధిదా।
వస్త్రాభరణ సంప్రాప్తి ర్గానవిద్యారతో భవేత్॥ 46

తా. లగ్నమునకు తృతీయరాశి యందున్న శుక్రదశలో పరాక్రమవృద్ధియు, వస్త్రాభరణ సంప్రాప్తియు, గాన విద్యాపాండిత్యమును కలుగును.

శ్లో॥ బంధుస్థితస్యాస్య భృగోర్దశాయాం
బంధూపకారం వరయానలబ్ధం।



స్త్రీపుత్రసౌఖ్యం గృహభూమిలాభం
శయ్యాదిసౌఖ్యం వరవస్తులాభం॥ 47

తా. లగ్నమునకు నాల్గవయింటి యందున్న శుక్రదశలో బంధు జనోపకారమును, శ్రేష్ఠమైన వాహనప్రాప్తియు, భార్యా పుత్రసౌఖ్యమును, గృహలాభమును, భూలాభమును, శయ్యాది సౌఖ్యమును, శ్రేష్ఠమైన వస్తులాభమును కలుగును.

శ్లో॥ సుతస్థస్య శుక్రస్య దాయేర్ధలాభం
నృపాప్తిం మణిహేమ రత్నాదిలాభం।
సువస్త్రాదిలాభం సుపుత్రాది వృద్ధిం
ఉద్యోగలాభం సుభూమ్యాధిపత్యం॥ 48

తా. లగ్నమునకు పంచమ రాశియందున్న శుక్రదశలో అర్థలాభమును, రాజస్నేహమును, మణిరత్న హేమలాభమును, మంచి వస్త్రప్రాప్తియు, పుత్రవృద్ధియు, ఉద్యోగలాభమును, భూమ్యాధిపత్యమును కలుగును.

శ్లో॥ రిపుగృహ గతశుక్ర పాకకాలే
రిపుజనకృతపీడా పుత్రదారార్థనాశః।
అధిక కలహకష్ట శ్చాత్మబంధు ర్వినాశం
కరితురగపదార్థీ హంతి మానక్షయస్స్యాత్॥ 49

తా. లగ్నమునకు ఆఱవయింటి యందున్న శుక్రదశలో శత్రుజనపీడయు, భార్యాపుత్ర నాశమును, అర్థక్షయమును, అధిక కలహమును, కష్టమును, ఆత్మబంధు వినాశమును, ఏనుగులు, గుఱ్ఱములు, మొదలగువాని నాశమును, మానభంగమును కలుగును.

శ్లో॥ కళత్రసంస్థస్య భృగోర్దశాయాం
కళత్రసౌఖ్యం వరభూమిలాభం।

యానాదివృద్ధించ సుభూషణాప్తిం
విచిత్రవస్త్రాణి శుభాని వృద్ధిం॥ 50

తా. లగ్నమునకు సప్తమ రాశియందున్న శుక్రదశలో కళత్రసౌఖ్యమును, శ్రేష్ఠమైన భూలాభమును, యానాదివృద్ధియు, సుభూషణప్రాప్తియు, విచిత్ర వస్త్రాభరణ ప్రాప్తియు, శుభవృద్ధియు కలుగును.

శ్లో॥ రంధ్రగత భృగుదాయే దేహార్తిం బంధుపీడాంచ।
క్షేత్రధన పశువినాశం పరగృహవాసం పరాన్నభుక్తంచ॥

తా. లగ్నమునకు అష్టమ రాశియందున్న శుక్రదశలో దేహబాధయు, బంధుపీడయు, క్షేత్రహానియు, ధనక్షయమును, పశునాశమును, పరగృహవాసమును, పరాన్నభోజనమును కలుగును.

శ్లో॥ భాగ్యస్థభార్గవదశా సత్కీర్తిసన్స్నానదా।
విద్యాప్రాప్తి విశేషసౌఖ్యఫలదా విజ్ఞానసంసిద్ధిదా।
వాపీకూపతటాక కర్మఫలదా నానార్థసిద్ధిప్రదా।
యుద్ధే శత్రువినాశదా విజయదా రాజ్యాధికార ప్రదా॥

తా. నవమ రాశియందున్న శుక్రదశలో సత్కీర్తియు, సన్స్నానమును, విద్యాప్రాప్తియు, విశేషసౌఖ్యమును, మంచి జ్ఞానసిద్ధియు, గుంటలు, భావులు, తటాకములు మొదలగు వాని నిర్మాణ ఫలప్రాప్తియు, నానావిద అర్థసిద్ధియు, యుద్ధమునందు శత్రునాశమును, విజయమును, రాజ్యాధికారమును కలుగును.

శ్లో॥ కర్మస్థితస్యాపి భృగోర్దశాయాం
సత్కీర్తిలాభం స్వజనానుమోదం।
యానాంబరాభరణ భూషణ రత్నలాభం



నృపాలమిత్రం హ్యధికారవృద్ధిం॥ 53

తా. లగ్నమునకు దశమ మందున్న శుక్రదశలో సత్కీర్తిలాభమును, స్వజనాను మోదమును, యానాంబరాభరణ భూషణరత్నలాభమును, రాజస్నేహమును, అధికార వృద్ధియు కలుగును.

శ్లో॥ లాభస్థస్య భృగోర్విపాక సమయే ఇష్టార్థసిద్ధిప్రదం
జ్ఞానం సజ్జనపూజనంచ సుఖదం రాజ్యాధికారప్రదం।
వారస్త్రీనటగాయకైః పరివృతం దారాత్మజైస్సంవృతం
నానాధాన్య సమృద్ధిదం సుమణిభిర్భూషాంబర ప్రాప్తిదం॥

తా. లాభరాశియందున్న శుక్రదశలో ఇష్టార్థసిద్ధియు, జ్ఞానసిద్ధియు, సజ్జనపూజయు, సుఖమును, రాజ్యాధికారమును, వేశ్యాస్త్రీలయొక్క నటగాయకుల యొక్కయు సమూహంబును, భార్యాపుత్త్రాభి వృద్ధియు, నానాధాన్య సమృద్ధియు, మంచి మణులతో గూడిన భూషణప్రాప్తియు, వస్త్రలాభమును కలుగును.

శ్లో॥ వ్యయస్థస్య భృగోర్దాయే దారాపీడాం ధనక్షయం।
కలహం బంధువైషమ్యం చాప్తబంధు వినాశనం॥ 55

తా. వ్యయరాశియందున్న శుక్రదశలో కళత్రపీడయు ధనక్షయమును, కలహమును, బంధుద్వేషమును, ఆప్తబంధు వినాశమును కలుగును.

---

ఆరోహ శుక్రదశాఫలం.

శ్లో॥ ఆరోహసంస్థస్య భృగోర్విపాకే
స్వస్యాధికారాది సమస్తసౌఖ్యం।
ఉద్యోగలాభం మణిరత్నలాభం
సమానబంధు ప్రియవృద్ధిదంచ॥ 56

తా. ఆరోహణ స్థితియందున్న శుక్రదశలో స్వతంత్రాధికారమును, సమస్తసౌఖ్యమును, ఉద్యోగలాభమును, మణిరత్నలాభమును, సమాన బంధుప్రియమును కలుగును.

### అవరోహస్థ శుక్రదశాఫలం.

శ్లో॥ అవరోహస్థ శుక్రస్య దశాకష్టఫలప్రదా।
సమాన జనవిద్వేషి చతుష్పాజ్జీవనాశదా॥ 57

తా. అవరోహణయందున్న శుక్రదశ కష్టఫలము నిచ్చును,సమాన జన ద్వేషమును,చతుష్పాజ్జీవనాశనమునుకలుగును.

### శుక్రదశాయాం శుక్రభుక్తిమాసాః 40.

కృష్ణీయే॥

శ్లో॥ శుక్రస్యాంతర్గతేశుక్రే లగ్నాత్కేంద్రే త్రికోణగే।
తృతీయే లాభగేవాపి హ్యుచ్చరాశి స్థితేపివా।
యానవాహన సంప్రాప్తిం పురగ్రామాధి పత్యతాం।
వరభూషణ సంప్రాప్తి మిష్టసిద్ధిం సుఖాధికం।
గృహేకళ్యాణ సంపత్తి మాప్తబంధు వశాత్సుఖం।
అపూర్వ వస్తుసంప్రాప్తిం నవమందిర మాప్నుయాత్।
స్వప్రభోస్తు మహాత్సౌఖ్యం యుద్ధే శత్రువినాశనం।
దారాపుత్రాది సౌఖ్యంచ కళ్యాణం పుత్రసంభవం॥ 1

తా. శుక్రదశలో స్వభుక్తియందు శుక్రుడు లగ్నమునకు కేంద్రత్రికోణములయందున్నను,తృతీయ లాభములయందున్నను, లేక తన ఉచ్చరాశియందున్నను, యానవాహన సంప్రాప్తియు, పురాధిపత్యమును, లేక గ్రామాధి పత్యమును, శ్రేష్ఠమైన భూషణ సంప్రాప్తియు, ఇష్టసిద్ధియు, సుఖాధిక



మును,యింటియందు కళ్యాణసంపత్తియు,ఆప్తబంధు మూలకముగా సుఖమును, అపూర్వ వస్తు సంప్రాప్తియు, నూతన గృహలాభమును, తన ప్రభువువల్ల సుఖమును, యుద్ధమునందు శత్రు నాశమును, భార్యాపుత్రాది సౌఖ్యమును, కళ్యాణమును, పుత్ర సంభవమును కలుగును.

పారాశర్యే॥

శ్లో॥ పరమోచ్చాంశగే శుక్రే స్వోచ్చ స్వక్షేత్ర కేంద్రగే।
నృపాభిషేక సంప్రాప్తిం వాహనాంబర భూషణం।
గజాశ్వ పశులాభంచ నిత్యమృష్టాన్న భోజనం।
అఖండలక్ష్మీ సామ్రాజ్య రాజసన్మానమేవచ।
మృదంగ వాద్యఘోషైశ్చ రాజానుగ్రహ శాంతికం॥ 2

తా. శుక్రుడు పరమోచ్చయందున్నను, స్వోచ్చ స్వక్షేత్రములయందున్నను,లేక కేంద్రస్థానములయందున్నను, ఆ భుక్తియందు రాజ్యాభిషేక సంప్రాప్తియు, వాహనాంబర భూషణమును, ఏనుగులు, గుఱ్ఱములు, పశువులు, వీని లాభమును, నిత్యము మృష్టాన్న భోజనమును, అఖండ లక్ష్మీ సామ్రాజ్య యోగమును, రాజ సన్మానమును,మృదంగ వాద్య ఘోషమును, రాజానుగ్రహమును, శాంతియు కలుగును.

శ్లో॥ షష్ఠాష్ట మవ్యయేశుక్రే నీచేవా శత్రురాశిగే।
ఆప్తబంధు జనక్లేశం దారావర్గాది పీడనం।
వాహనాంబర నాశంచ ధనధాన్య పశుక్షయం।
స్థానభ్రంశం మవాప్నోతి మానహాని ర్భవిష్యతి॥ 3

తా. శుక్రుడు లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయందున్నను, తన నీచరాశియందున్నను, లేక శత్రుక్షేత్రమందున్నను, ఆభుక్తియందు ఆప్త బంధు జన దుఃఖమును, కళత్ర

వర్గ పీడయు, వాహనాంబర నాశమును, ధన ధాన్య క్షయమును, పశు నాశమును, స్థాన భ్రంశమును, మాన హానియు కలుగును.

శ్లో॥ భాగ్యకర్మాధి పత్యేన లగ్నవాహన రాశిగే।
తద్దాయేచ మహాత్సౌఖ్యం దేశగ్రామాధి పత్యతాం।
గజాం తైశ్వర్యమాప్నోతి సేనాపత్యం తథైవచ॥ 4

తా. శుక్రుడు లగ్నమునం దున్నను, చతుర్థ నవమ, దశమ రాసులయం దున్నను, ఆ భుక్తియందు అధిక సుఖమును, దేశాధి పత్యమును, లేక గ్రామాధి పత్యమును, గజాం తైశ్వర్యమును, సేనాధిపత్యమును కలుగును.

శ్లో॥ రవిణా సంయుతేదృష్టే నృపక్రోధా ధనక్షయం।
సంచారంచ శిరోరోగం పితృవర్గ వినాశనం॥ 5

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, రాజక్రోధమును, ధనక్షయమును, సంచారమును, శిరోరోగమును, పితృవర్గ వినాశమును కలుగును.

శ్లో॥ చంద్రేణ సంయుతేదృష్టే సుగంధంచ సుభోజనం।
శయ్యాసౌఖ్యం యానలాభం నటగాయక సంకులం॥ 6

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను,సుగంధ లేపనమును, సుభోజనమును, శయ్యా సౌఖ్యమును, యాన లాభమును, నటగాయక సంకులమును కలుగును.

శ్లో॥ కుజేన సంయుతేదృష్టే భ్రాతౄణాం కలహంతథా।
యత్నకార్య వినాశంచ స్వప్రభో ర్ద్వేషమాప్నుయాత్॥

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, సోదరుల తోడ కలహమును, యత్నకార్య భంగమును,తన యజమానుని తోడ ద్వేషమును కలుగును.



శ్లో॥ బుధేన సంయుతేదృష్టే వేదశాస్త్రాది చింతనం।
విద్యావినోద గోష్టించ వణిజ్యాలా ద్ధనాగమం॥ 8

తా. బుధునితో కలసినను లేక చూడబడినను వేద శాస్త్రాది చింతనయు,విద్యావినోద గోష్టియు, వర్తకుల మూలకముగా ధనాగమంబును కలుగును.

శ్లో॥ గురుణా సంయుతేదృష్టే స్వపుత్రస్య వివృద్ధిదం।
దేహారోగ్యం ధనప్రాప్తిం దేవబ్రాహ్మణ పూజనం॥ 9

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, పుత్ర వృద్ధియు, దేహారోగ్యమును, ధనప్రాప్తియు, దేవబ్రాహ్మణ పూజయు కలుగును.

శ్లో॥ శనినా సంయుతేదృష్టే శూద్రస్త్రీ కలహంతథా।
పశుక్షేత్ర వినాశంచ ఆప్తవర్గ వినాశనం॥ 10

తా. శనితో కలసినను లేక చూడబడినను, శూద్రస్త్రీ తోడ కలహమును, పశుహానియు, క్షేత్రనాశమును, ఆప్తవర్గ వినాశమును కలుగును.

శ్లో॥ ద్వితీయ ద్యూననాథేవా దేహజాడ్యం మనోరుజం।
తద్దోషపరిహారార్థం రుద్రజప్యంచ కారయేత్।
శ్వేతాంగాంమహిషీందద్యా చ్ఛాంతికుర్యాద్యథావిధిః॥

తా. శుక్రుడు ద్వితీయ సప్తమ రాసులయం దున్న యెడల దేహ జాడ్యమును, మనోవ్యాధియును కలుగును. ఆ దోష పరిహారార్థమై రుద్రజపము చేయువలయును. గాకను, తెల్లని గోవును, ఎనుమును, యథావిధిగా దానము యిచ్చిన పిమ్మట శాంతి కలుగును.

శుక్రదశాయాం రవిభుక్తిమాసాః 12.

శ్లో॥ శుక్రస్యాంతర్గతే సూర్యే లగ్నాద్విక్రమ లాభగే।
రాజప్రసాద విభవం యుద్ధేశత్రు వినాశనం।
వరభూషణ సంప్రాప్తిం దూరాద్వాహన పత్రికాం।
శుక్రస్యాంతర్గతే సూర్యే సంతాప జ్వరవిడ్వరం।
రాజాది కలహంచైవ వ్యవహార మథాపివా॥ 1

తా. శుక్రదశలో రవిభుక్తియందు సూర్యుడు తృతీయ లాభములయం దున్నయెడల రాజానుగ్రహమువల్ల విభవమును, యుద్ధమునందు శత్రువినాశమును, శ్రేష్ఠమైన భూషణ సంప్రాప్తియు, దూరదేశమునుండి పత్రికా గమనమును, సంతాప జ్వరపీడయు, రాజులతోడ కలహమును, వ్యవహారమునందు నష్టమును కలుగును.

శ్లో॥ ఉచ్చస్వక్షేత్రగే సూర్యే మిత్రక్షేత్రే శుభైర్యుతే।
స్వప్రభోశ్చ మహాత్సౌఖ్యం రాజ్యశ్రీ ధనసంపదః।
నష్టరాజ్య ధనప్రాప్తిం గృహేకళ్యాణ వైభవం।
మిత్రరాజ ప్రసాదేన గ్రామభూమ్యర్థ లాభకృత్॥ 2

తా. సూర్యుడు తన యుచ్చ స్వక్షేత్రములయం దున్నను, మిత్రక్షేత్రమం దున్నను, లేక శుభగ్రహములతో కూడి యున్నను, ఆ భుక్తియందు తన ప్రభువు మూలకముగా విశేష సౌఖ్యమును, రాజ్యలాభమును, లక్ష్మీకటాక్షమువల్ల కలిగిన ధనసంపత్తును, నష్టరాజ్య ధనప్రాప్తియు, యింటియందు కళ్యాణ విభవమును, మిత్ర రాజానుగ్రహమువల్ల గ్రామలాభమును, భూలాభమును, అర్థప్రాప్తియు కలుగును.

శ్లో॥ కేంద్రత్రికోణగే సూర్యే హ్యల్పభాగ్య ఫలప్రదః।
పితృక్లేశ ఫలంచైవ దాయాది జననాశనం।
ఆదౌశత్రు భయంక్లేశం మధ్యేసౌఖ్యం వినిర్దిశేత్।
అంతేసన్మాన కీర్తించ స్వప్రభోస్తు మహత్సుఖం॥ 3

తా. సూర్యుడు కేంద్రత్రికోణములయం దున్నయెడల అల్పభాగ్యమును, పితృదుఃఖమును, దాయాదిజన నాశనమును కలుగును. ఆది భాగమందు శత్రుభయమును, దుఃఖమును, మధ్య భాగమందు సౌఖ్యమును, అంత్యయందు గౌరవమును, కీర్తియు, తన ప్రభువు మూలకముగా విశేష సుఖమును కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టమే సూర్యే వ్యయేవా నీచరాశిగే।
కలహో ధననాశశ్చ నృపక్రోధో భవిష్యతి।
పశుక్షేత్ర వినాశశ్చ హ్యకస్మాత్కలహస్తథా।
దాయాదివర్గ కలహ స్స్వాధికార వినాశనం।
స్వదేహ పీడనంచైవ పుత్రదారాది నిగ్రహం।
కారాగృహాంతర ప్రాప్తిం ధననాశం సమాదిశేత్॥ 4

తా. సూర్యుడు లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయం దున్నను, లేక తన నీచరాశియం దున్నను, ఆ భుక్తియందు కలహ మూలకముగా ధననాశమును, రాజక్రోధమును, పశుహానియు, క్షేత్రనాశమును, అకస్మాత్తుగా కలహమును, దాయాది జనులతోడ విరోధమును, అధికార భంగమును, దేహపీడయు, భార్యాపుత్ర వియోగమును కలుగును.

శ్లో॥ శశినా సంయుతేదృష్టే మాతృవంశ వివృద్ధిదః।
ధనధాన్యాంబరప్రాప్తి రిష్టసిద్ధే సుఖీభవేత్॥ 5

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, మాతృ వంశమునకు అభివృద్ధియు, ధనధాన్య లాభములును, వస్త్రప్రాప్తియు, ఇష్టసిద్ధియు, సుఖమును కలుగును.

శ్లో॥ కుజేన సంయుతే దృష్టే ధాన్యక్షేత్ర వినాశనం।
పరస్త్రీ కలహప్రాప్తిం జ్ఞాతీనాం కలహంతథా॥ 6

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, ధాన్య నాశమును, క్షేత్రక్షయము పరస్త్రీతోడ కలహమును, జ్ఞాతులతోడ కలహమును కలుగును.

శ్లో॥ బుధేన సంయుతే దృష్టే విద్యాలాభం ధనాగమం।
బంధూనా ముపకారత్వం గృహేకళ్యాణ వృద్ధిదం॥ 7

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, విద్యా లాభమును, ధనప్రాప్తియు, బంధుజనోప కారంబును, యింటియందు కళ్యాణాది విభవములును కలుగును.

శ్లో॥ గురుణా సంయుతే దృష్టే పుత్రప్రాప్తి ర్భవిష్యతి।
చింతితార్థ ఫలప్రాప్తి స్సర్వకార్య సుసిద్ధిదః॥ 8

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, పుత్ర ప్రాప్తియు, చింతించినట్లు అర్థఫలమును, సర్వకార్య సిద్ధియు కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతే దృష్టే వాహన క్షేత్రనాశనం।
వస్త్రాభరణ హానిశ్చ స్వస్త్రీవ్యాధి ర్భవిష్యతి॥ 9

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, వాహన క్షయమును, క్షేత్ర నాశనమును, వస్త్రాభరణ హానియు, స్వంత స్త్రీకి వ్యాధి సంభవమును కలుగును.

శ్లో॥ శనినా సంయుతే దృష్టే దాసీదాసాది పీడనం।
సమాన జనశోకార్తిం పితృవర్గ వినాశనం॥ 10

తా. శనితో కలసినను లేక చూడబడినను, దాసదాసీ జన పీడయు, సమానజన శోకమును, పితృవర్గ వినాశమును కలుగును.



శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యే లాభగేపివా।
శుభగ్రహ యుతేవాపి హ్యధికార వివృద్ధిదం।
అపూర్వ వస్తుసంప్రాప్తిం స్వస్త్రీసుత సుసౌఖ్యదం।
కృషిధాన్య వివృద్ధించ పశువృద్ధిం ధనాగమం।
సర్వకార్యసుసిద్ధించ దాసీదాసాది సంగ్రహం॥ 11

తా. సూర్యుడు దశానాథునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక శుభగ్రహ ముతో కూడియున్నను, ఆభుక్తియందు అధికారవృద్ధియు, అపూర్వవస్తు సంప్రాప్తియు, స్వంతభార్యాపుత్ర సౌఖ్యమును, కృషిలాభమును, ధాన్యవృద్ధియు, పశువృద్ధియు, ధనాగమంబును, సర్వకార్యసిద్ధియు, దాసదాసీ జనసంగ్రహంబును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
స్వస్త్రీవియోగః కలహః ప్రాణహాని ర్భవిష్యతి।
ఆప్తవర్గవిరోధశ్చ సమాన జననాశనం।
కలహోరాజ భీతిశ్చ శత్రుబాధా భవిష్యతి॥ 12

తా. దశానాథునకు సూర్యుడు ౬-౮-౧౨. రాసులయం దున్నను, లేక పాపగ్రహ సంబంధము కలిగియున్నను, ఆభుక్తి యందు భార్యావియోగమును, కలహమును, ప్రాణహానియు, ఆప్తవర్గ విరోధమును, సమాన జననాశమును, కలహమూలక ముగా రాజభీతియు, శత్రుబాధయు కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా హ్యపమృత్యు ర్భవిష్యతి।
తద్దోష పరిహారార్థం భాస్కర ప్రార్థనం చరేత్।
ఛాయాదానం ప్రకుర్వీత శాంతిమాప్నో త్యసంశయః॥

తా. సూర్యుడు మారక స్థానములగు ద్వితీయ సప్తమ రాసులయం దున్నయెడల అపమృత్యువు సంభవించును. ఆ

దోష పరిహారార్థమై సూర్యప్రార్థన చేయవలయును. గాకను ఛాయదానము చేసినపిమ్మట నిస్సంశయముగా శాంతికలుగును.

శుక్రదశాయాం చంద్రభుక్తిమాసాః 20.

శ్లో॥ శుక్రస్యాంత ర్గతేచంద్రే లగ్నా త్కేంద్ర త్రికోణగే।
తృతీయే లాభ గేవాపి హ్యుచ్చ రాశి స్థితేపివా।
శుభ యుక్తే పూర్ణచంద్రే లగ్నాధిప సమన్వితే।
తద్భుక్తౌ వాహనప్రాప్తిః ప్రియబంధు సమాగమః।
అగాధికార సంప్రాప్తిః ఛత్రచామర వైభవం।
మహారాజ ప్రసాదేన యిష్టసిద్ధి స్సుఖావహం।
మిత్రప్రభు వశాత్సౌఖ్యం రత్నభూషణ సంగ్రహః।
క్షీరాన్నాది సుభోజ్యంచ సువస్త్రాణ్యథ సంగ్రహః।
యుద్ధేజయ శత్రునాశం దారాపుత్రాది సౌఖ్యదః।
వివాహ శుభ కార్యాణి గృహేవృద్ధి ర్భవిష్యతి॥ 1

తా. శుక్రదశలో చంద్రుడు లగ్నమునకు కేంద్ర త్రికోణములయం దున్నను,తృతీయ లాభములయం దున్నను, తన యుచ్చరాశియం దున్నను, శుభగ్రహ సంబంధము కలిగి యున్నను, పూర్ణచంద్రుడైనను,లగ్నాధిపతితో కూడియున్నను, ఆ భుక్తియందు వాహనప్రాప్తియు, ప్రియబంధు సమాగమం బును, అగాధికార సంప్రాప్తియు, ఛత్రచామర వైభవమును, మహారాజానుగ్రహమువల్ల యిష్టసిద్ధియు, విశేష సుఖమును, మిత్రప్రభుమూలకముగా సౌఖ్యమును, రత్నభూషణ సంగ్రహ మును క్షీరాన్నాది సుఖభోజనమును, శ్రేష్ఠమైన వస్త్రాభరణ సంగ్రహమును, యుద్ధమునందు జయమును, శత్రునాశమును, భార్యాపుత్ర సుఖమును, వివాహాది శుభకార్య మహోత్సవ ములును, యింటియందు అభివృద్ధియు కలుగును.



శ్లో॥ లగ్నషష్ఠాష్టమేవాపి వ్యయేవా నీచరాశిగే।
పాపగ్రహేణ సంయుక్తే క్షీణచంద్ర స్తథైవచ।
మాతృవంశ వినాశశ్చ స్త్రీవివాదో భవిష్యతి।
ఆప్తబంధు విరోధశ్చ పశునాశ స్తథైవచ।
శరీరేవాతరోగాద్యై రన్న ద్వేషోహ్యరోచకః।
స్వాధికారవినాశశ్చ క్షేత్రపశ్వాదినాశనం।
సమాన జనవిద్వేష మాత్మప్రభు వశాద్భయం॥ 2

తా. భుక్తినాథుడగు చంద్రుడు లగ్నమునకు ౬-౮-౧౨. రానులయం దున్నను, తన నీచరాశియం దున్నను, పాపగ్రహ ములతో కూడియున్నను లేక క్షీణించియున్నను, ఆభుక్తి యందు మాతృవంశపు వారికి నాశనమును, స్త్రీలతోడ కలహ మును, ఆప్తబంధు విరోధమును, పశుహానియు, శరీరమునందు వాతరోగాది భీతియు, అన్నద్వేషమును, అరోచకమును, అధి కారభంగమును, క్షేత్రనాశమును, పశ్వాదిహానియు, సమాన జనద్వేషమును, ఆత్మ ప్రభు మూలకముగా భయమును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే నృపప్రీతి స్సుఖీభవేత్।
వనదుర్గప్రచారశ్చ నేత్రరోగా ద్భయంతథా॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను రాజ ప్రీతియు, సుఖమును, వనములు దుర్గములు వీటిమీాది అధి కారమును, నేత్రరోగభయమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే శత్రుచోరాది పీడనం।
యుద్ధే ఖడ్గభయప్రాప్తిః జ్ఞాతీనాం కలహ స్తథా॥ 4

తా. కుజునితో కలసినను లేక చూడబడినను శత్రు భయమును, చోరజనపీడయు, యుద్ధమునందు ఖడ్గభయ

ప్రాప్తియు, జ్ఞాతులతోడ కలహమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే విద్యాలాభో ధనాగమం।
బంధుకళ్యాణ వృద్ధించ చింతితార్థస్య సాధనం॥ 5

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, విద్యాలాభమును, ధనాగమంబును, బంధు కళ్యాణవృద్ధియు, చింతించిన కార్యసాధనయు కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే సుతలాభం ధనాగమం।
విప్రప్రభు వశాత్సౌఖ్యం ధనధాన్య వివృద్ధిదం॥ 6

తా. గురువుతో కలసినను లేక చూడబడినను సుతలాభమును, ధనాగమంబును, బ్రాహ్మణ ప్రభు మూలకముగా సౌఖ్యమును, ధనధాన్యాభివృద్ధియు కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే స్వస్యకళ్యాణశోభనః।
యానవాహన సంప్రాప్తిం పుత్రస్త్రీ సౌఖ్యమేవచ॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను వివాహప్రాప్తియు, యానవాహన సంప్రాప్తియు, భార్యాపుత్రసౌఖ్యమును కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే దాసీదాస సుతక్షయం।
క్షేత్రధాన్య వినాశంచ శూద్రాణాం కలహంతథా॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను దాసదాసీజనక్షయమును, పుత్రహానియు, క్షేత్రహానియు, ధాన్యనాశమును, శూద్రులతోడ కలహమును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయే లాభగేపివా।
శుభగ్రహ యుతేవాపి ధాన్యవృద్ధిం ధనాగమం।
వివాహశుభసంప్రాప్తిం మిత్రస్త్రీ సౌఖ్యవృద్ధిదం।
మిత్రప్రభు వశాత్సౌఖ్యం రాజ్యప్రాప్తిం శుభోదయం।



యుద్ధే శత్రువినాశస్స్యా త్స్వవారే రాజదర్శనం॥ 9

తా. భుక్తినాథుడగు చంద్రుడు దశానాథునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను లేక శుభగ్రహములతో కూడియున్నను, ఆభుక్తియందు ధాన్యవృద్ధియు, ధనాగమంబును, వివాహ శుభసంప్రాప్తియు, మిత్రస్త్రీసౌఖ్యవృద్ధియు, మిత్ర ప్రభు మూలకముగా సౌఖ్యమును, రాజ్యప్రాప్తియు, శుభమును, యుద్ధమునందు శత్రునాశమును, తన వారమునందు రాజదర్శనమును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
ధననాశం మనస్తాపం బంధుమిత్రాది విగ్రహం।
అపకీర్తిభయంచైవ పరస్త్రీ కలహంతథా।
అకాలభోజనప్రాప్తిం సర్వత్ర కలహంతథా॥ 10

తా. చంద్రుడు దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను, లేక పాపగ్రహ సంబంధము కలిగియున్నను, ఆభుక్తియందు ధననాశమును, మనస్తాపమును, బంధుమిత్రాది విగ్రహమును, అపకీర్తిభయమును, పరస్త్రీ కలహమును, అకాలభోజన ప్రాప్తియు, సర్వజనులతోడను కలహమును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా హ్యపమృత్యు ర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం దుర్గాదేవీ జపంచరేత్।
మృగదానం ప్రకుర్వీత రోగశాంతిం ప్రయచ్ఛతి॥ 11

తా. చంద్రుడు ద్వితీయ సప్తమరాసుల యందున్నయెడల అపమృత్యువు కలుగును. ఆదోషపరిహారార్థమై దుర్గాదేవి జపము చేయవలయును. మేకదానముచేసిన పిమ్మట రోగశాంతి కలుగును.

శుక్రదశాయాం కుజభుక్తిమాసాః 14.

శ్లో॥ శుక్రస్యాంతర్గతే భౌమే లగ్నాత్కేంద్రే త్రికోణగే।
షష్ఠేవాలాభగేవాపి తృతీయస్థే ధవాభువి।
ఉచ్చరాశి స్థితేవాపి మిత్రక్షే బలసంయుతే।
లగ్నాధిపేన సంయుక్తే కర్మభాగ్యప సంయుతే।
లక్ష్మీకటాక్ష చిహ్నాని నష్టరాజ్య ఫలప్రదం।
దేశాధిపతి సన్మానం ప్రవాళ మణి లబ్ధవాన్।
రక్తవస్త్రాదిలాభంచ భూలాభం పుత్రవర్ధనం।
యజ్ఞకర్మఫలప్రాప్తిం పాకశాలాధి పత్యతాం।
పశుధాన్య వివృద్ధించ స్వస్త్రీసౌఖ్యం తథైవచ।
ఋణద్రవ్యా యతించైవ జ్ఞాతిశత్రు వినాశనం॥ 1

తా. శుక్రమహార్ధశలో కుజభుక్తి సంప్రాప్తించినపుడు కుజుడు లగ్నమునకు కేంద్ర త్రికోణములయందున్నను, ౩-౬-౧౧. రాసులయందున్నను, ఉచ్చరాశియందున్నను, మిత్రక్షేత్రమునందు బలముతో కూడియున్నను, లగ్నాధిపతితో కూడియున్నను, లేక నవమ దశమాధిపతులతో కలిసియున్నను, ఆభుక్తియందు లక్ష్మీకటాక్షమువల్ల గలిగెడు చిహ్నములును, నష్టరాజ్య ఫలప్రాప్తియు, రాజసన్మానమును, ప్రవాళము, మణులు మొదలగు వాటిలాభమును, రక్తవస్త్రాది లాభమును, భూలాభమును, పుత్రవృద్ధియు, యజ్ఞకర్మ ఫలప్రాప్తియు, పాకశాలాధి కారమును, పశువృద్ధియు, ధాన్యలాభమును, తన భార్యాసౌఖ్యమును, ఋణద్రవ్యార్జనయు, జ్ఞాతి శత్రు వినాశమును కలుగును.

శ్లో॥ లగ్నాదష్టమగే భౌమే వ్యయేవా నీచరాశిగే।
తద్భుక్తౌ స్థానహానిస్స్యా త్సమాన జననాశనం।



గృహక్షేత్ర వినాశశ్చ ధనధాన్య వినాశనం।
దాయాది కలహంశ్చైవ ఋణబాధా భవిష్యతి।
విషశస్త్రాగ్ని బాధాంచ స్త్రీమూలా ద్ధననాశనం।
సర్వత్ర కలహంచైవ యత్నకార్య వినాశనం॥ 2

తా. కుజుడు లగ్నమునకు ౮-౧౨. రాసులయందున్నను, లేక తన నీచరాశిని పొందియున్నను, ఆభుక్తియందు స్థానహానియు, సమాన జనహానియు, గృహనాశమును, క్షేత్ర నాశమును, ధనక్షయమును, ధాన్యనష్టమును, దాయాది కలహమును, ఋణబాధయు, విషపీడయు, శస్త్రబాధయు, అగ్నిభీతియు, స్త్రీమూలకముగా ధననాశనమును, సర్వులతోడను కలహమును, యత్నకార్య భంగమును కలుగును.

శ్లో॥ రవిణా సంయుతే దృష్టే స్ఫోటిక జ్వరపీడనం।
అతిసారాది రోగంచ బుద్ధిభ్రంశం ధనవ్యయం॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను స్ఫోటక భయమును, జ్వరపీడయు, అతిసారాది రోగభయమును, బుద్ధివికారమును, ధనవ్యయమును కలుగును.

శ్లో॥ చంద్రేణసంయుతే దృష్టే క్షీరాన్నాది సుభోజనం।
అశ్వవాహన సంప్రాప్తిం యత్నకార్యార్థ సిద్ధిదం॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను క్షీరాన్నాది సుఖభోజనమును, అశ్వవాహన సంప్రాప్తియు, యత్నకార్యార్థ సిద్ధియు కలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే బాంధవానాం విరోధతః।
వ్యాపారే ధనహానిస్స్యా న్మాతులాది వినాశనం॥ 5

తా బుధునితో కలసినను లేక చూడబడినను బంధువులతోడ విరోధమును, వ్యాపార మూలకముగా ధనహాని

యు, మేనమామలకు హానియు కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే దేహసౌఖ్యం ధనాగమం।
స్వాధికార వివృద్ధించ హ్యపూర్వ ప్రియదర్శనం॥ 6

తా. గురువుతో కలసినను లేక చూడబడినను దేహ సౌఖ్యమును, ధనాగమంబును, అధికారవృద్ధియు, అపూర్వ ప్రియ దర్శనమును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే గృహేకళ్యాణ శోభనం।
యానవాహన సంప్రాప్తి మధికార వివృద్ధిదం॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను యింటి యందు కళ్యాణాది శుభకార్యములు జరుగుటయు, యానవాహన సంప్రాప్తియు, అధికారాభి వృద్ధియు కలుగును.

శ్లో॥ శనినా సంయుతే దృష్టే దాసీదాస విరోధకృత్।
వాతరోగాది బాధాచ సర్వత్ర కలహ స్తథా॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను దాసదాసీ జనులతోడ విరోధమును, వాతరోగాది బాధయు, సర్వుల తోడ కలహమును కలుగును.

శ్లో॥ దాయేశా త్కేంద్రకోణేవా తృతీయే లాభగేపివా।
లాభేవా షష్ఠరాశిస్థే శుభగ్రహ యుతేపివా।
వివాహం మతసౌభాగ్యం దారాసౌఖ్యం తథైవచ।
పశువాహన వృద్ధించ ధాన్యసంగ్రహణం తథా।
యుద్ధేషు జయమాప్నోతి గృహారామాది వర్ధనం।
విచిత్రవస్త్రసంప్రాప్తిం సర్వకార్య సుసిద్ధిదం॥ 9

తా. భుక్తినాథుడగు అంగారకుడు దశానాథునకు కేంద్రకోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, ఆఱవయింటియం దున్నను, లేక శుభగ్రహముతో కూడియు



న్నను, ఆభుక్తియందు వివాహప్రాప్తియు, పుత్రలాభమును, సౌభాగ్యమును, భార్యసౌఖ్యమును, పశువాహన వృద్ధియు, ధాన్యసంగ్రహణమును, యుద్ధమునందు జయమును, యింటి యందు తోటలు మొదలగువాటి అభివృద్ధియు, విచిత్ర వస్త్ర సంప్రాప్తియు, సర్వకార్యసిద్ధియు కలుగును.

శ్లో॥ దాయేశా ద్వ్యయగేరాశౌ హ్యష్టమే పాపసంయుతే।
భ్రాతృభిఃకలహశ్చైవ శత్రువృద్ధి ర్భవిష్యతి।
వ్రణశస్త్రాది బాధాచ జ్వరరోగాది పీడనం।
సమాన జనశోకార్తిం స్థాననాశం నృపాద్భయం॥ 10

తా. కుజుడు దశానాథునకు అష్టమ వ్యయరాసులయం దున్నను, లేక పాపగ్రహ సంబంధము గలిగియున్నను, ఆభుక్తి యందు అన్నదమ్ములతోడ కలహమును, శత్రువృద్ధియు, వ్రణశస్త్రాదిబాధయు, జ్వరరోగాది పీడయు, సమాన జనపీడయు, స్థాననాశమును, రాజభయమును కలుగును.

శ్లో॥ ద్వితీయ ద్యూనరాశిస్థే హ్యపమృత్యు భయంతథా।
తద్దోష పరిహారార్థం స్కందపూజాం సమాచరేత్।
అనడ్వాహం ప్రకుర్వీత శాంతిమాప్నోత్య సంశయః॥

తా. ద్వితీయ సప్తమరాసుల యందున్న యెడల అపమృత్యు భయము కలుగును. ఆదోష పరిహారార్థమై స్కంద పూజ జేయవలయును. వృషభదానము చేసిన పిమ్మట నిస్సంశయముగా శాంతి కలుగును.

---

శుక్రదశాయాం రాహుభుక్తిమాసాః 36.

కృష్టీయ్యే॥

శ్లో॥ శుక్రస్యాంతర్గతేరాహౌ కేంద్రే లాభత్రికోణగే।
ఉచ్చేవా వీర్యసంయుక్తే యోగకారక సంయుతే।

లగ్నాదుపచయే రాహౌ తద్భుక్తౌ సుఖదో భవేత్।
శత్రునాశం మహోత్సాహం రాజ్యప్రీతి కరంశుభం।
భుక్త్యాద్యా శరమాసేషు వాతజ్వర మజీర్ణకృత్।
కార్యవిఘ్న మవాప్నోతి సంచారంచ మనోవ్యథా।
తత్పరంరాజయోగంచ ధనధాన్య సమున్నతే।
దినేదినే వృద్ధిమేతి శుక్లపక్షే శశీయథా।
యత్నకార్యార్థ సిద్ధిస్స్యా త్స్వదేశం పునరేష్యతి॥ 1

తా. శుక్రదశలో రాహుభుక్తియందు రాహువు లగ్నమునకు కేంద్ర కోణములయందున్నను, లాభస్థానమందున్నను, బలగ్రహములతోడను యోగకారకుల తోడను కలిసి ఉచ్చరాశిని, పొందియున్నను, లేక లగ్నమునకు ఉపచయ రాసులయందున్నను, ఆభుక్తియందు సుఖమును, శత్రునాశమును, మహోత్సాహమును, రాజ్యప్రీతికరంబును, శుభమును కలుగును. భుక్తి ఆదిభాగమందు ఆఱునెలలు వాతజ్వర బాధయు, అజీర్ణరోగ సంభవమును, కార్యభంగమును, వృథా సంచారమును, మనోవ్యథయును, కలిగి అటుపిమ్మట రాజయోగమును, ధనధాన్య సమృద్ధియు, శుక్లపక్షపు చంద్రునివలె దినేదినే అభివృద్ధియు, యత్నకార్యసిద్ధియు, అర్థలాభమును, మరల స్వదేశాను గమనంబును కలుగును.

శ్లో॥ పాపయుక్తే ధవాదృష్టే రంధ్రేవా వ్యయరాశిగే।
అశుభం లభతేకర్మ పితృమాతృ జనాపది।
సర్వత్ర జనవిద్వేషం నృపమూలా ద్ధనాపహం॥ 2

తా. భుక్తినాథుడగు రాహువు పాపగ్రహసంబంధముగాని వీక్షణగాని కలిగియున్నను, లేక అష్టమ వ్యయరాసులయందున్నను అశుభము కలుగును. మాతాపితృవుల యొక్క కర్మప్రాప్తియు, సర్వజనులతోడ విరోధమును, రాజమూలకముగా ధనసష్టమును సంభవించును

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే శిరోవ్యాధి భయంతథా।
చిత్తవైకల్య బుద్ధించ నృపాలా ద్ధననాశనం॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను శిరోవ్యాధియు, చిత్తవైకల్యమును, రాజమూలకముగా ధననాశమును కలుగును.

శ్లో॥ చంద్రేణసంయుతే దృష్టే మాతృవంశ వినాశనం।
అకాల భోజనప్రాప్తిం స్వభార్యాయాం విరోధతా॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను మాతృవంశపు వారికి నాశనమును, అకాల భోజనప్రాప్తియు, తన భార్యతోడ విరోధమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే సోదరక్షేత్రనాశనం।
వివాద యుద్ధేతిభయం శిరోరోగ మతిభ్రమం॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను సోదరనాశమును, క్షేత్రనాశమును, వివాదమునం దపజయంబును, యుద్ధమునందు విశేష భయమును, శిరోరోగంబును, బుద్ధివికారమును కలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే బాంధవాది భయంభవేత్।
స్వజాతికలహోద్బాధాం ధనంసర్వం వినాశనం॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను బంధుజనులవల్ల భయమును, స్వజాతి జనులవల్ల కలిగిన కలహబాధయు, సర్వధననాశమును కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే దారాపుత్రాది నాశనం।
సమాన జనశోకార్తిం మానభంగం మతిభ్రమం॥ 7

తా. గురువుతో కలసినను లేక చూడబడినను భార్యా పుత్ర వినాశమును, సమాన జనదుఃఖమును, మానభంగమును, బుద్ధిభ్రంశమును కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే హ్యశ్వేభ్యః పతనంభవేత్।
వస్త్రభూషణ హానించ బంధుమిత్ర విరోధకృత్॥ 8

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను గుఱ్ఱమునుండి పడుటయు, వస్త్రహానియు, భూషణనష్టమును, బంధుమిత్ర విరోధమును కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే వాతరోగాది పీడనం।
సమాన జనశోకార్తిం పుత్రదారాది నిగ్రహం॥ 9

తా. శనితో కలసినను లేక చూడబడినను వాతరోగాది పీడయు, సమాన జనశోకమును, భార్యాపుత్ర నిగ్రహమును కలుగును.

శ్లో॥ దాయేశా త్కేంద్రగేరాహౌ త్రికోణేషష్ఠలాభగే।
అయత్నకార్య సిద్ధిశ్చ సర్వశత్రు వినాశనం।
కృషిధాన్యాది వృద్ధిశ్చ సుతలాభో భవిష్యతి।
స్వప్రభోస్తు మహత్సౌఖ్యం స్వస్థాన ప్రాప్తిరుచ్యతే।
అపూర్వవస్తు సంప్రాప్తి ర్బాంధవ ప్రియదర్శనం।
యత్నకార్యార్థ సిద్ధిశ్చ హ్యారోగ్యం నృపపూజ్యదా॥

తా. రాహువు దశానాథునకు కేంద్రకోణములయందున్నను, షష్ఠలాభరాసులయందున్నను, ఆభుక్తియందు ప్రయత్నము లేకనే కార్యానుకూలమును, సర్వశత్రు వినాశమును, కృషిలాభమును, ధాన్యాభివృద్ధియు, పుత్రలాభమును, తన ప్రభువువల్ల విశేషసౌఖ్యమును, స్వస్థానప్రాప్తియు, అపూర్వవస్తు సంప్రాప్తియు, బంధు ప్రియదర్శనమును, యత్నకార్యార్థ సిద్ధియు, ఆరోగ్యమును, రాజపూజ్యతయు కలుగును.



శ్లో॥ దాయేశా ద్వ్యయగేవాపి హ్యష్టమే పాపసంయుతే।
తద్భుక్తౌ మానభంగంచ మిత్రబంధు విరోధతా।
అశుభం లభతేకర్మ పితృమాతృ వినాశనం॥ 11

తా. దశానాథునకు అష్టమ వ్యయ రాసులయందు రాహువున్నను లేక పాపగ్రహ సంబంధము కలిగి యున్నను, ఆభుక్తియందు మానభంగమును, మిత్రబంధు విరోధమును, అశుభకర్మ ప్రాప్తియు, మాతాపితృ వినాశనమును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా హ్యపమృత్యు ర్భవిష్యతి।
తద్దోష పరిహారార్థం దుర్గాదేవి జపంచరేత్।
మహాకూశ్మాండదానేన శాంతి మాప్నోత్యసంశయః॥ 12

తా. ద్వితీయ సప్తమ రాసులయందున్న యెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై దుర్గాదేవి జపమాచరించ వలయును. గుమ్మడికాయి దానమువల్ల నిస్సంశయముగా శాంతి కలుగును

---

శుక్రదశాయాం గురుభుక్తిమాసాః 32.

కృష్ణియ్యో॥

శ్లో॥ శుక్రస్యాంత ర్గతేజీవే లగ్నా త్కేంద్రే త్రికోణగే।
తృతీయే లాభగేవాపి హ్యుచ్చరాశి స్థితేపివా।
వస్త్రాభరణసంప్రాప్తిః పుత్రప్రాప్తి ర్భవిష్యతి।
కళ్యాణాది శుభప్రాప్తిః తన్మూలాత్సర్వ సిద్ధిదః।
ఉత్తరాం దిశిమాశ్రిత్య ప్రయాణం రాజదర్శనం।
స్వవారే రాజసన్మానం వస్త్రభూషణ సంగ్రహః।
పుత్రాధికార సంప్రాప్తిః యుద్ధేశత్రు జయస్తథా॥ 1

తా. శుక్రదశలో భుక్తినాథుడగు గురువు లగ్నమునకు

కేంద్ర త్రికోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక తనఉచ్చరాశిని పొందియున్నను, ఆభుక్తియందు వస్త్రాభరణ సంప్రాప్తియు, పుత్రోత్సవమును, కళ్యాణాది శుభప్రాప్తియు, ఆమూలకముగా సర్వకార్యసిద్ధియు, ఉత్తరదిక్కునకు ప్రయాణమును, రాజదర్శనమును, తన వారమునందు రాజసన్మానమును, వస్త్రభూషణ సంగ్రహంబును, పుత్రాధికార సంప్రాప్తియు, యుద్ధమునందు శత్రుజయమును కలుగును.

శ్లో॥ లగ్నాత్షష్ఠాష్టమేజీవే వ్యయేవా నీచరాశిగే।
తద్భుక్తౌ కార్యహానించ బ్రాహ్మణా ద్భయమావిశేత్।
నృపక్రోధం స్థాననాశం కలహాయాసమేవచ।
స్వగురోఃకలహంచైవ యుద్ధే శస్త్రాదిపీడనం।
అకస్మాద్భయ సంప్రాప్తిం క్షేత్రధాన్యాది నాశనం।
దారాపుత్ర వియోగాది బుద్ధిభ్రంశం తథైవచ॥ 2

తా. గురువు లగ్నమునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను, లేక తన నీచరాశిని పొందియున్నను, ఆభుక్తియందు కార్యహానియు, బ్రాహ్మణుల మూలకముగా భయమును, రాజక్రోధమును, స్థాననాశమును, కలహమును, ఆయాసమును, తన గురువుతోడ కలహమును, యుద్ధమునందు శస్త్రాదిపీడనయు, అకస్మాత్తుగా భయమును, క్షేత్రధాన్యాది నాశనమును, భార్యాపుత్ర వియోగమును, బుద్ధిభ్రంశంబును కలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే నృపమూలా త్సుఖీభవేత్।
స్వస్యగ్రామాధిపత్యంచ తీర్థస్నానాది లాభవాన్॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను రాజమూలకముగా సుఖమును, గ్రామాధిపత్యమును, తీర్థస్నానాది లాభమును కలుగును.



శ్లో॥ చంద్రేణసంయుతే దృష్టే వాహనాది వివృద్ధిదం।
భూషణాంబర సంప్రాప్తిః స్త్రీమూలా ద్ద్రవ్యలాభకృత్॥

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను వాహనాభివృద్ధియు, భూషణప్రాప్తియు, వస్త్రలాభమును, స్త్రీమూలకముగా ధనార్జనయు కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే గురుపుత్రాది నాశనం।
సర్వత్ర జనవిద్వేష కర్మవైకల్య మాదిశేత్॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను గురుపుత్రాది వినాశమును, సర్వజనులతోడను ద్వేషమును, కర్మహీనతయు కలుగును.

శ్లో॥ బుధేన సంయుతే దృష్టే సత్కథా శ్రవణంతథా।
సత్కర్మ సిద్ధిదంచైవ గురుదేవ ద్విజార్చనం॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను సత్కథా శ్రవణమును, సత్కర్మసిద్ధియు, దేవబ్రాహ్మణ పూజయు, గురుభక్తియు కలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే నరవాహన లాభవాన్।
వివాహాది శుభప్రాప్తి స్వస్త్రీగర్భో భవిష్యతి॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను నరవాహనప్రాప్తియు, వివాహాది శుభకర్మఫలమును, స్వస్త్రీగర్భోత్పత్తియు కలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే నీచస్త్రీ కలహస్తథా।
స్వస్య స్థితిర్వినాశశ్చ ప్రాణబాధా భవిష్యతి॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను నీచస్త్రీతోడ కలహమును, తన స్వంత స్థితినాశమును ప్రాణబాధయు కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రగే లాభే త్రికోణేవా తృతీయగే ।
శుభగ్రహ యుతేవాపి హ్యర్థలాభ ముదీరయేత్ ।
యుద్ధే శత్రువినాశశ్చ ఋణద్రవ్యా యతిస్తథా ।
స్వప్రభోస్తు మహత్సౌఖ్యం శివపూజాది తత్పరః ।
వ్యవసాయాది వృద్ధిశ్చ నానామూలా ద్ధనాగమః ।
ఆప్తప్రభు వశాత్సౌఖ్యం విద్యావృద్ధి ర్భవిష్యతి॥ 9

తా. గురువు దశానాథునకు కేంద్ర కోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక శుభగ్రహముతో కూడియున్నను ఆభుక్తియందు అర్థలాభమును, యుద్ధమునందు శత్రువినాశమును, ఋణద్రవ్యార్జనయు, తన స్వంత ప్రభువువల్ల విశేషసౌఖ్యమును, శివపూజాది చింతయు, వ్యవసాయాభివృద్ధియు, నానామూలకముగా ధనాగమంబును, మిత్ర ప్రభువువల్ల సౌఖ్యమును, విద్యాభివృద్ధియు కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే।
గురుద్వేషం కార్యహానిం సమాన జననాశనం।
దేశా ద్దేశాంతరేభీతిం కలహం సముపేష్యతి।
యత్నకార్య వినాశంచ బంధుమిత్రాది పీడనం॥ 10

తా. గురువు దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను లేక పాపగ్రహములతో కూడియున్నను, గురుద్వేషమును, కార్యహానియు, సమాన జననాశనమును, దేశాంతర సంచారభీతియు, కలహమును, యత్నకార్య భంగమును, బంధుమిత్రాదిపీడనయు కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా హ్యపమృత్యు ర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం రుద్రజప్యం వినిర్దిశేత్ ।
స్వర్ణగర్భిత కూశ్మాండ దానే నారోగ్యమావిశేత్॥ 11



తా. ద్వితీయ సప్తమ రాసులయందున్న యెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై రుద్రజపము చేయవలయును, గాకను బంగారుతో నిండిన గుమ్మడికాయి, దానముచేసిన పిమ్మట ఆరోగ్యము కలుగును.

---

శుక్రదశాయాం శని భుక్తిమాసాః 38

పారాశర్యే ॥

శ్లో॥ శుక్రస్యాంత ర్గతేమందే యోగ ప్రాబల్యమాదిశే।
సమాన ప్రభుసన్మానం పుత్రికా గమనంతథా ।
స్వోచ్చమూలత్రికోణేవా కేంద్రే స్వక్షేత్రసంయుతే।
త్రికోణేలాభగేవాపి ప్రభుప్రీతి కరోభవేత్ ।
తత్కాలే రాజ్యసంప్రాప్తిః రాజసన్మాన వైభవం।
యోగం దదాతి భృగునందన భుక్తికాలే।
సౌఖ్యం తదా నృపతితుల్య ముపైతిలక్ష్మీః।
శ్రేయాంశ్చ శత్రువిజయం బహురాజ్యలాభం।
వైశేషికాంశయుతే ప్రబలాధిపత్యం॥

తా. శుక్రదశా శని భుక్తియందు ప్రబలయోగమును, సమాన ప్రభుసన్మానమును, పుత్రికా గమనంబును, కలుగును, ఆ శని తనఉచ్చ మూల త్రికోణములయం దున్నను, కేంద్ర స్వక్షేత్రములయం దున్నను, త్రికోణ లాభములయం దున్నను, రాజప్రీతియు, ఆకాలమందు రాజ్యసంప్రాప్తియు, రాజసన్మాన విభవమును, విశేష యోగమును, సౌఖ్యమును, రాజ సమానమగు అష్టైశ్వర్య సంప్రాప్తియు, శ్రేయస్సును, శత్రువిజయమును, బహు రాజ్యలాభమును కలుగును. వైశేషికాంశతో గూడియున్నయెడల ప్రబల అధికారప్రాప్తియు కలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టమే మందే వ్యయేవా నీచరాశిగే ।
భుక్త్యాదౌ దేహమాలస్యం మధ్యాంతే సౌఖ్యమావిశేత్ ॥

తా. లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయందైనను లేక తన నీచరాశియందైనను శనియున్నచో భుక్తి ఆదియందు దేహాలస్యమును, మధ్య అంత్య భాగములయందు సౌఖ్యమును కలుగును.

గ్రంధాంతరే॥

శ్లో॥ భుక్త్యాదౌతు ఋతుర్మాసం ధననాశం తథైవచ ।
తత్పరం సౌఖ్యవిజయం పుత్రవృద్ధిం ధనాగమం ।
పాపయుక్తేథవా దృష్టే ధనధాన్య వినాశనం ।
రాజకోపం కార్యనాశం స్వస్థాన స్థితినాశనం ।
సమాన జనశోకంచ చతుష్పాజ్జీవనాశనం ॥ 3

తా. భుక్తి ఆదియందు ఆరుమాసములు ధననాశమును, పిమ్మట సౌఖ్యమును, విజయమును, పుత్రవృద్ధియు, ధనాగమంబును, కలుగును. పాపగ్రహ సంబంధము గాని, వీక్షణ గాని కలిగియున్న యెడల ధననాశమును, ధాన్యనష్టమును, రాజకోపమును, కార్యభంగమును, స్వస్థాన చలనమును, స్థితి నాశమును, సమాన జనశోకమును, చతుష్పాజ్జీవనాశనమును కలుగునని గ్రంథాంతర వచనము.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే పదభ్రంశం ధనక్షయం ।
యుద్ధే శత్రుభయంచైవ సర్వత్ర కలహంతథా ॥ 4

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను స్థాన నాశమును, ధనక్షయమును, యుద్ధమునందు శత్రుభయమును, సర్వజనులతోడ కలహమును కలుగును.



శ్లో॥ శశినాసంయుతే దృష్టే మాతృవంశ వినాశనం ।
స్త్రీమూలా ద్ధననాశస్స్యా త్స్థాననాశ స్తథైవచ॥ 5

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను మాతృవంశపు వారికి నాశమును, స్త్రీ మూలకముగా ధననాశమును, స్థాననాశమును కలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే భ్రాతృభిః కలహంతథా ।
క్షేత్రధాన్య వినాశంచ ఋణశస్త్రాది పీడనం ॥ 6

తా. కుజునితో కలసినను లేక చూడబడినను సోదరులతోడ కలహమును, క్షేత్రనాశమును, ధాన్యనష్టమును, ఋణ పీడయు, శస్త్రబాధయు కలుగును.

శ్లో॥ బుధేన బుద్ధిహీనశ్చ పాపచింతారతో భవేత్ ।
మిత్రబంధువిరోధస్స్యా దకస్మా ద్భయమావిశేత్ ॥ 7

తా. బుధునితో కలసినను లేక చూడబడినను, బుద్ధిహీనతయు, పాపకార్యచింతయు, మిత్రబంధు జనులతోడవిరోధమును, అకస్మాత్తుగా భయమును కలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే గురుద్వేష స్తథైవచ ।
పరాపవాదనిందాచ కలహశ్చ భవిష్యతి ॥ 8

తా. గురువుతో కలసినను లేక చూడబడినను గురుద్వేషమును పరాపవాదమును, నిందయు,కలహమునుకలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే స్వస్త్రీవ్యాధిర్భవిష్యతి ।
నీచారి జనసంసర్గః వాహనాదిపశుక్షయః ॥ 9

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను స్వంత స్త్రీవ్యాధియు, నీచ జనులతోడను, శత్రువులతోడను సంసర్గమును, వాహనాది పశుక్షయమును, కలుగును.

శ్లో॥ దాయేశా త్కేంద్రకోణేవా తృతీయే వ్యా లాభగేపివా।

శుభగ్రహ యుతేనాపి విత్తలాభ ముదీరయేత్ ।
ధాన్యార్థ పశువృద్ధిస్స్యాద్భృత్యమూలాత్సుఖీభవేత్ ।
అపూర్వవస్తు సంప్రాప్తిం బాంధవ ప్రియమావిశేత్ ॥

తా. భుక్తినాథుడగు శని దశానాథునకు కేంద్రకోణములయం దున్నను తృతీయ లాభములయం దున్నను, లేక శుభగ్రహములతో కూడియున్నను ఆభుక్తియందు ధనలాభమును, ధాన్యలాభమును, అర్థసిద్ధియు, పశువృద్ధియు, తనసేవకుల మూలకముగా సుఖమును, అపూర్వ వస్తుసంప్రాప్తియు, బంధుజనప్రియంబును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా నీచరాశిగే ।
కలహం ధాన్యనాశంచ స్వాధికార వినాశనం ।
సర్వత్ర జనవిద్వేషం శూద్రాణాం కలహంతథా ॥ 11

తా. దశానాథునకు ౬-౮-౧౨. రాసులయందైనను లేక తననీచరాశియందైనను, శనియున్న యెడల కలహమును, ధాన్యనాశమును, అధికారభంగమును, సర్వజనులతోడ విరోధమును, శూద్రులతోడ కలహమును కలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా మృత్యుమాప్నోత్యసంశయః ।
తద్దోషపరిహారార్థం మహిషీదాన మాచరేత్ ॥ 12

తా. ద్వితీయ సప్తమరాసుల యందున్న యెడల నిశ్చయముగా మృత్యుభయము కలుగును. ఆదోష పరిహారార్థమై ఎనుము దానము చేయవలయును.

---

శుక్రదశాయాం బుధభుక్తిమాసాః 34.

శ్లో॥ శుక్రస్యాంతరగతే సౌమ్యే లగ్నాత్కేంద్రే త్రికోణగే ।
తృతీయే లాభగేవాపి హ్యుచ్చరాశిస్థితే పివా ।
శుభగ్రహయుతే వాపి రాజప్రీతికరం శుభం ।



సౌభాగ్యం పుత్రలాభంచ సన్మార్గే ధనలాభకృత్ ।
స్వపుత్రకోద్వాహ మతీవసౌఖ్యం ।
యానాంబరాప్తి ధనధాన్య సమృద్ధిలక్ష్మీం ।
పురాణధర్మ శ్రవణాదిగానం ।
శృంగారకేళీ జనసంగలోలం ।
యజ్ఞకర్మాది సిద్ధిశ్చయుద్ధే శత్రువినాశనం ।
సమాన జనసన్మానమన్నదాన రతోభవేత్ ॥ 1

తా. శుక్రమహర్దశలో భుక్తినాథుడగు బుధుడు లగ్నమునకు కేంద్రత్రికోణములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, తన ఉచ్చరాశియం దున్నను, లేక శుభగ్రహములతో కూడియున్నను ఆకాలమందు రాజప్రీతియు, శుభమును, సౌభాగ్యమును, పుత్రలాభమును, న్యాయమార్గమున ధనలాభమును, పుత్రులకు వివాహమును, విశేషసౌఖ్యమును, వస్త్రవాహనప్రాప్తియు, ధనధాన్యసమృద్ధియు, లక్ష్మీకరంబును, పురాణశ్రవణంబును, ధర్మ కథాశ్రవణంబును, గానశృంగారవినోదలోలయు, నటనాయకుల సంగమంబును, యజ్ఞకర్మాది సిద్ధియు, యుద్ధమునందు శత్రువినాశంబును, సమానజనసన్మానంబును, అన్నదాన పరత్వంబును కలుగును.

శ్లో॥ లగ్నాత్షష్ఠాష్టమే వాపి వ్యయేవా నీచరాశిగే ।
పాపగ్రహేణ సంయుక్తే మానభంగం మతిభ్రమం ।
బంధుభిః కలహంచైవ మాతులస్య వినాశనం ।
అపకీర్తి భయంచైవ మిత్రబంధు మనోవ్యథా ।
స్వాధికార వినాశంచ ధనధాన్య వినాశనం ॥ 2

తా. బుధుడు లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయం దున్నను, నీచరాశియం దున్నను, లేక పాపగ్రహములతో

కూడియున్నను, ఆ భుక్తియందు మానభంగమును, మనోవికారంబును, బంధువులతోడ కలహమును, మేనమామలకు హానియు, అపకీర్తి భయమును, మిత్రులవల్లను, బంధువులవల్లను, మనోవ్యథయు, అధికార భంగమును, ధనధాన్య నాశమును కలుగును

శ్లో॥ రవిణా సంయుతేదృష్టే పైత్యరోగ భయంతథా।
జ్వరాతిసార కష్టాది మాతృవర్గ వినాశనం॥ 3

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, పైత్యరోగ భయమును, జ్వరబాధయు, అతిసారాది రోగ పీడయు, మాతృవర్గపువారికి వినాశమును కలుగును.

శ్లో॥ శశినా సంయుతేదృష్టే అశ్వాద్యారోహణం తథా।
సమాన బంధుసన్మానం మణివస్త్రాది సంగ్రహం॥ 4

తా. చంద్రునితో కలసినను లేక చూడబడినను, అశ్వారోహణ ప్రాప్తియు, సమాన బంధు సన్మానంబును, మణివస్త్రాది సంగ్రహంబును కలుగును.

శ్లో॥ కుజేన సంయుతేదృష్టే ఋణరోగాది పీడనం।
సహోదరాది నాశంచ స్వస్త్రీగర్భ వినాశనం॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, ఋణరోగాది పీడయు, సోదరుల నాశనంబును, స్వంతస్త్రీ గర్భనాశంబును కలుగును.

శ్లో॥ గురుణా సంయుతేదృష్టే సుతలాభం ధనాగమం।
దేహారోగ్యం కీర్తిలాభం గురుదేవ ద్విజార్చనం॥ 6

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, పుత్రలాభమును, ధనార్జనయు, దేహారోగ్యంబును, కీర్తి లాభంబును, గురుపూజయు, దేవబ్రాహ్మణ పూజయు కలుగును.



శ్లో॥ శుక్రేణ సంయుతేదృష్టే కావ్యాలంకార సంగ్రహం।
గానవిద్యా రతోనిత్యం గృహేకళ్యాణ సంభవం॥ 7

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, కావ్యాలంకార సంగ్రహంబును, గానవిద్యా కుశలత్వంబును, నిత్యము ఇంటియందు కళ్యాణాది శుభ మహోత్సవంబులును కలుగును.

శ్లో॥ శనినా సంయుతేదృష్టే చతుష్పాజ్జీవనాశనం।
సమాన జనశోకంచ మానహానిం తథైవచ॥ 8

తా. శనితో కలసినను లేక చూడబడినను,చతుష్పాజ్జీవనాశనంబును,సమానజన శోకంబును,మానహానియు కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయే లాభగేపివా।
శుభగ్రహ యుతేవాపి ధనలాభ ముదీరయేత్।
వాహనం భూమిలాభంచ యత్నకార్యార్థ సిద్ధిదం।
వివాహాది శుభప్రాప్తిం దూరాదాహ్వాన పత్రికా।
ధాన్య సంగ్రహణంచైవ ఋణద్రవ్యా యతిం తథా।
కృషిమూలా ద్రవ్యలాభం మిత్రప్రభు వశాత్సుఖం॥ 9

తా. బుధుడు దశానాథునకు కేంద్రకోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను, లేక శుభగ్రహములతో కూడియున్నను, ఆ భుక్తియందు ధనలాభమును, వాహనప్రాప్తియు, భూలాభమును, యత్నకార్యార్థ సిద్ధియు, వివాహాది శుభకర్మ ప్రాప్తియు, దూరదేశమునుండి పత్రికాగమనంబును, ధాన్య సంగ్రహణమును, ఋణద్రవ్యార్జనయు, కృషిమూలకముగా ద్రవ్యలాభమును, మిత్రప్రభు మూలకముగా సుఖమును కలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠగేరంధ్రే వ్యయేవా పాపసంయుతే।
కలహం రాజకోపంచ బంధుద్వేషం మనోవ్యథాః।

ఆప్తబంధు వినాశంచ ఋణరోగాది పీడనం।
పుత్రవర్గాది కలహం సర్వకార్య వినాశనం॥ 10

తా. బుధుడు దశానాథునకు ౬-౮-౧౨. స్థానములయం దున్నను, లేక పాపగ్రహములతో కూడియున్నను, ఆ భుక్తి యందు కలహమును, రాజకోపమును, బంధుద్వేషమును, మనో వ్యథయును, ఆప్తబంధువినాశమును, ఋణరోగాదిపీడయు, పుత్ర జనులతోడ కలహమును, సర్వకార్య వినాశమును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా హ్యపమృత్యు ర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం విష్ణుపూజాం సమాచరేత్।
లక్ష్మీనారాయణం దానం కుర్యా త్తద్దోషశాంతయే॥

తా. ద్వితీయ సప్తమరాసులయందు బుధుడున్నయెడల అపమృత్యువు సంభవించును. ఆదోష పరిహారార్థమై విష్ణు పూజ చేయవలయును. గాకను, లక్ష్మీ నారాయణ ప్రతిమ దానము చేసినపిమ్మట శాంతికలుగును.

### శుక్రదశాయాం కేతుభుక్తిమాసాః 14.

శ్లో॥ శుక్రస్యాంత ర్గతే కేతౌ సుప్రభాంశ శ్చజాతకే।
శుభమే తత్ఫలం బ్రూయా త్తీర్థయాత్రాది కర్మణాం।
భుక్త్యాదౌ శుభమాధిక్యం నిత్యమృష్టాన్న భోజనం॥

తా. శుక్రదశలో కేతుభుక్తియందు కేతువు సుప్రభాంశయం దుండగా, ఆ జాతకునకు విశేష శుభఫలమును, తీర్థయాత్రాది కర్మసిద్ధియు, భుక్తి ఆదియందు అధిక శుభమును, నిత్యము మృష్టాన్న భోజనమును కలుగును.



గ్రంథాంతరే॥

శ్లో॥ శుక్రస్యాంత ర్గతే కేతౌ లగ్నాత్కేంద్రే స్థితేపివా।
తృతీయే లాభగేవాపి షష్ఠరాశి స్థితేపివా।
తద్భుక్తౌ తీర్థయాత్రాది దేవతా దర్శనంతథా।
మణిమంత్రాది సిద్ధిశ్చ ఔషధాదిషు సిద్ధిదః।
అత్యంత కలహశ్చైవ శత్రువృద్ధి ర్భవిష్యతి।
విషాగ్ని శస్త్రబాధాచ స్త్రీపుత్రాది వినాశనం।
గరదోషాది సంప్రాప్తిం స్థాననాశం నృపాద్భయం।
పశుక్షేత్ర వినాశంచ సర్వకార్య వినాశనం।
విధవా కలహంచైవ కుత్సితాన్నాది భోజనం॥ 2

తా. శుక్రదశలో కేతుభుక్తియందు కేతువు లగ్నమునకు కేంద్రస్థానములయం దున్నను, తృతీయ లాభములయం దున్నను, లేక ఆఱవయింటియం దున్నను, ఆ భుక్తియందు తీర్థ యాత్రాది ఫలమును, దేవతా దర్శనంబును, మణిమన్త్రాది సిద్ధియు, ఔషధాది సిద్ధియు, అత్యంత కలహమును, శత్రు వృద్ధియు, విషపీడయు, అగ్నిభీతియు, శస్త్రబాధయు, భార్యా పుత్రాది నాశనంబును, కరదోషాది సంప్రాప్తియు, స్థాన నాశంబును, రాజభయమును, పశుహానియు, క్షేత్రనాశం బును, సర్వకార్య వినాశంబును, విధవా కలహంబును, కుత్సి తాన్నాది భోజనంబును, కలుగునని గ్రంథాంతర పాఠము.

శ్లో॥ లగ్నషష్ఠాష్టమే వాపి వ్యయేవా నీచరాశిగే।
భుక్త్యాదౌ పంచమాసేషు కష్టం కలహమేవచ।
పైత్యరోగ వికారాది శిరోభ్రమణ మేవచ।
స్వదేహపీడా కలహం తత్పరం సౌఖ్యమేవచ।
యత్నకార్యార్థ సిద్ధించ నృపసన్మాన మేవచ॥ 3

తా. కేతువు లగ్నమునకు ౬-౮-౧౨. రాసులయం దున్నను, లేక తన నీచరాశిని పొందియున్నను, ఆ భుక్తి ఆది యందు ఐదునెలలు కష్టమును, కలహమును, పిత్తరోగ వికారంబును, శిరోభ్రమణయు, దేహపీడయు కలుగును. అటు పిమ్మట సౌఖ్యమును, యత్నకార్యార్థ సిద్ధియు, రాజసన్మానమును కలుగును.

శ్లో॥ రవిణా సంయుతేదృష్టే కలహం దేహతాపకృత్।
చంద్రేణ సంయుతేదృష్టే మాతులాది వినాశనం।
వస్త్రభూషణ హానించ వ్యవహారే ధనక్షయం॥ 4

తా. సూర్యునితో కలసినను లేక చూడబడినను, కలహమును, దేహతాపమును కలుగును. చంద్రునితో కలసినను, లేక చూడబడినను, మేనమామలకు వినాశమును, వస్త్రహానియు, భూషణ నష్టమును, వ్యవహార మూలకముగా ధనక్షయమును కలుగును.

శ్లో॥ కుజేన కలహోవ్యాధిః మార్గే చోర భయంతథా।
సమానజనశోకంచ విత్తనాశం నృపాద్భయం॥ 5

తా. కుజునితో కలసినను లేక చూడబడినను, కలహమును, వ్యాధి భయమును, మార్గమునందు చోరభయమును, సమాన జన శోకమును, విత్త నాశమును, రాజ భయమును కలుగును.

శ్లో॥ బుధేన సంయుతేదృష్టే బంధుభిః కలహంతథా।
ఋణాద్రవ్యం మానహానిం స్థానవిచ్యుతి మేవచ॥ 6

తా. బుధునితో కలసినను లేక చూడబడినను బంధువులతోడ కలహమును, ఋణబాధయు, మానహానియు, స్థాననాశంబును కలుగును.



శ్లో॥ గురుణా సంయుతేదృష్టే పుత్రదారాది నిగ్రహం।
దేహతాపం మహత్కష్టం దుష్కర్మ ఫలసిద్ధిదం॥ 7

తా. గురువుతో కలసినను లేక చూడబడినను, భార్యాపుత్రాది నిగ్రహమును, దేహతాపమును, అధిక కష్టమును, దుష్కర్మ ఫలసిద్ధియు కలుగును.

శ్లో॥ శుక్రేణ సంయుతేదృష్టే స్వస్త్రీగర్భ వినాశనం।
స్త్రీమూలా ద్ధననాశంచ శయ్యాసౌఖ్యాది నాశనం॥ 8

తా. శుక్రునితో కలసినను లేక చూడబడినను, స్వంత స్త్రీయొక్క గర్భ నాశనమును, స్త్రీమూలకముగా ధననాశనమును, శయ్యాసౌఖ్య విహీనంబును కలుగును.

శ్లో॥ శనినా సంయుతేదృష్టే స్వభృత్యా కలహంతథా।
నీచసేవా మహత్కష్టం సమానజననాశనం॥ 9

తా. శనితో కలసినను, లేక చూడబడినను, తన సేవకులతోడ కలహమును, నీచజనసేవయు, అధిక కష్టమును, సమాన జననాశనంబును కలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యే లాభగేపివా।
షష్ఠేవా శుభసంయుక్తే ధనలాభ ముదీరయేత్।
స్త్రీసౌఖ్యం పుత్రవృద్ధించ యత్నకార్య సుసిద్ధినం।
గృహేకళ్యాణ వృద్ధించ చతుష్పాజ్జీనలాభకృత్।
పశ్చిమాం దిశిమాశ్రిత్య ప్రయాణం రాజదర్శనం।
మహారాజ ప్రసాదేన ఇష్టసిద్ధి ర్భవిష్యతి॥ 10

తా. కేతువు దశానాథునకు కేంద్ర కోణములయందున్నను, తృతీయ లాభములయందున్నను, ఆఱవ యింటియందున్నను, లేక శుభగ్రహములతో కూడియున్నను, ధనలాభము వచింపతగినది. గాకను, స్త్రీసౌఖ్యమును, పుత్రవృద్ధియు,

యత్నకార్య సిద్ధియు, యింటియందు కళ్యాణ వృద్ధియు, చతుష్పా జ్జీవలాభమును, పశ్చిమదిశకు ప్రయాణంబును, రాజ దర్శనంబును, మహారాజానుగ్రహము వలన ఇష్ట సిద్ధియు కలుగును.

శ్లో॥ దాయేశాష్టమ రాశౌవా వ్యయేవా పాపసంయుతే।
స్త్రీవివాదం దారనాశం మానభంగం తథైవచ ।
అష్టభూపా ద్భయప్రాప్తిం స్థాననాశం తథైవచ॥ 11

తా. దశానాథునకు ౮-౧౨, స్థానములయం దున్నను లేక పాపగ్రహములతో కూడియున్నను, స్త్రీవివాదమును, కళత్రనాశమును, మానహానియు, మిత్రరాజు మూలకముగా భయమును, స్థాననాశమును కలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా హ్యపమృత్యు ర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం మృత్యుంజయ జపంచరేత్ ।
ఛాగదానం ప్రకుర్వీత సర్వసంపత్ప్రదాయకం॥ 12

తా. కేతువు ద్వితీయసప్తమ రాసులయందున్న యెడల అపమృత్యువు సంభవించును, ఆదోషపరిహారార్థమై మృత్యుంజయ జపము చేయవలయును, మేక దానముచేసిన పిమ్మట సకలసంపత్తును సిద్ధించును.

ఇట్లు జాతకఫలచింతామణి యందలి,
శుక్రదశాంతర్దశా ఫలమునెడి
దశమ ప్రకరణం.
సమాప్తము.



శ్రీ ర స్తు.

# జాతకఫలచింతామణి.

ఆంధ్ర తాత్పర్య సహితము.

మారక దశాంతర్దశా ఫలంనామ
ఏకాదశ ప్రకరణము.

శ్లో॥ అష్టమం హ్యాయుషస్థానం అష్టమాదష్టమంచతత్।
తయోరపివ్యయస్థానం మారకస్థాన ముచ్యతే॥ 1

తా. తృతీయాష్టమ స్థానములు ఆయుస్థానము లనియు, ద్వితీయ సప్తమ స్థానములు మారకస్థానములని చెప్పుదురు.

శ్లో॥ తత్రాప్యాద్య వ్యయస్థానా దుత్తరం బలవత్తరం।
తదీశతు స్తత్రగతాః పాపిన స్తేన సంయుతాః॥ 2

తా. ద్వితీయ సప్తమ స్థానములలో సప్తమ మారక స్థానముకంటె ద్వితీయ మారక స్థానము ప్రబలమనియు ద్వితీయాధిపతియు ద్వితీయ మందున్నవారును ద్వితీయాధిపతితో కలసినవారును ప్రబల మారకులనియుం జెప్పబడియున్నది.

శ్లో॥ జాయానేత్రపతీ స్వపాకస్మృతిదౌ తత్రస్థితాః పాపినోరిఫే।
శోపిచరిప్ఫగః ఖలఖగోనోచే చ్ఛుభత్వాన్వితః।
రంధ్రేశస్సహజేశ్వర శ్శుభయుతో నోచేచ్ఛ షష్ఠేశ్వరః।
స్వక్షేత్రోచ్చభకోణపోసమృతికృ చ్ఛంద్రార్కఖేటావినా॥

తా. సప్తమ ద్వితీయాధిపతులు తమ దశలయందు మారకమును చేయుదురు. ద్వితీయ సప్తమములందున్నవారును మారకులగుదురు. వ్యయాధిపతి వ్యయమందున్నను మారకుడే, వ్యయమందున్న వారును మారకులే, వ్యయాధిపతికిగాని వ్యయమందున్న వారికిగాని శుభత్వము కలిగిన మారకత్వము లేదు. తృతీయాష్టమాధి పతులతోడను శుభగ్రహముల తోడను చేరని యెడల మారకులగుదురు. శుభులతో చేరని షష్ఠాధి పతియు మారకుడగును. తృతీయ షష్ఠాధిపతులకు స్వక్షేత్రోచ్చమూలత్రికోణములలో స్థితి కలిగిన యెడల మారకులు గారు. ఉచ్చాది శుభత్వము కలిగినను రవి చంద్రుల మారకులు రవి చంద్రులకు మారకత్వ సంబంధమున్న యెడల తప్పక మారకత్వము చేయుదురు. ఇది సామాన్య వచనము. రవి చంద్రులు స్వక్షేత్రోచ్చలయం దున్నను మారకులు కారు. యెట్లనగా మిథున లగ్నమునకు చంద్రుడు ద్వితీయమందుండినను, మేషలగ్నమునకు ద్వితీయమందు చంద్రుడున్నను మారకులు కారు. సప్తమాధిపతి కంటె ద్వితీయాధిపతి ముఖ్యమారకుడని చెప్పినను అనుభవరీత్యా ద్వితీయాధిపతి కంటె సప్తమాధిపతి మారకత్వమును చేయుచున్నాడు. మేష లగ్నమునకు ద్వితీయ సప్తమాధిపతి యగు శుక్రుడు ద్వితీయ సప్తమములందుండిన మారకుడగును. ఇతర స్థానములందుం



డెనేని మారకుడు కాడు. ద్వితీయమునం దున్నప్పుడు ఇతర గ్రహ సంబంధమున్న యెడల యుగ్మత బాహుళ్యముగా జేసి నిష్కర్షించును.

శ్లో॥ ద్వితీయ సప్తమాధీశో భృగుః కామ స్థితో యది।
మారకోన ద్వితీయస్థో శుభదో అన్యరాశిగః॥ 4

తా. ద్వితీయ సప్తమాధిపతి యగు శుక్రుడు సప్తమమందుండెనేని మారకుడగును. ద్వితీయమున నున్న శుక్రుడు మారకుడు కాడు. ఇతర రాసులందు శుభుడగును.

శ్లో॥ వ్యయాధిప దశాయాంతు ద్వితీయేశస్తుమారకః।
ద్వితీయేశ దశాయాంతు వ్యయస్యాధి పతిస్తథా॥ 5

తా. వ్యయాధిపతి దశయందు ద్వితీయాధిపతి మారకుడగును. ద్వితీయాధిపతి దశలో వ్యయాధిపతి మారకుడగును. సప్తమాధిపతి సప్తమమందుండి వాని దశరాకపోయినను, వానిచే జూడబడు వానిదశలో మారకత్వము కలుగును. వ్యయాధిపతి దశలో ద్వితీయమందున్నవారును, ద్వితీయాధిపతి దశలో షష్ఠాధిపతియు, మారకులగుదురు. షష్ఠవ్యయాధిపతులు పరస్పరదశాంతర్దశలలో మారకులు, వృషభలగ్నమునకు సప్తమ వ్యయాధిపతియగు కుజుడు మారకుడు కాడు. కర్కాటక లగ్నమునకు శని మారకుడు కాడు. తులాలగ్నమున ద్వితీయ సప్తమాధిపతి యగు కుజుడు మారకుడు కాడు. సింహలగ్నమునకు శని మారకుడు కాడు. పాపగ్రహములకు కేంద్రాధిపత్య దోషము లేదుగాన వీరిద్దరు మారకులు కారు. స్పష్టముగా మారకముచేయు వారెవ్వరనగా! మేషలగ్నమునకు శుక్రుడు,

వృషభ లగ్నమునకు బుధుడు, మిధున లగ్నమునకు గురుడు, కర్కాట లగ్నమునకు శుక్రుడు, సింహమునకు శుక్రుడు, కన్యకు గురుడు, తులకు చంద్రుడు, వృశ్చికమునకు శుక్రుడు, ధనస్సునకు బుధశనులు, మకరమునకు శుక్ర గురు చంద్రులు, కుంభమునకు గురునిచే చూడబడువారును, గురుడును, మీనమునకు బుధశనులును, వీరు ముఖ్య మారకులగుదురు. వీరితో సంబంధించినవారును మారకులగుదురు. మిధున లగ్నమునకు చంద్రుడు, ద్వితీయమం దున్నను మారకుడుకాడు. కర్కాటక లగ్నమునకు ద్వితీయాధిపతి యగు రవి ద్వితీయ మందున్నను మారకుడు కాడు. సింహమునకు బుధుడు, కన్యాలగ్నమునకు శుక్రుడును, తులకు కుజుడు, వృశ్చికమునకు గురుడు, ధనస్సునకు శనియు, మకరమునకు శనియు, కుంభమునకు శనియు, మీనమునకు గురుడును, మారకులు కారు. మీనమునకు కుజుడు, ద్వితీయమందున్న యెడల మారకుడగును. తులా లగ్నమునకు చంద్రుడెచ్చట నున్నను మారకుడగును. మీన లగ్నమునకు గురుడు దశమమందుండి వాని దశవచ్చిన యెడల మారకము గలుగును. మిధున లగ్నమునకు గురుడు, సప్తమ దశమాధిపతియై వానిదశ రాకపోయినను, వానిచేత చూడబడు వానిదశలో మారకము గలుగును. కుంభలగ్నమునకు ద్వితీయమందు రవి శుక్రులుండి యాశుక్రదశవచ్చి యాదశ వెళ్లు కాలములో మారకము కలుగును. కర్కాట లగ్నమునకు శుక్రుడు చతుర్థలాభములలో నెచ్చట నున్నను, వానిదశలో వానిచేత చూడబడు వానిదశలో మారకము గలుగును. వృషభలగ్నమునకు బుధుడు ద్వితీయమందున్నను మరియొక చోట నున్నను మారకము తప్పదు. కర్కాటమునకు గురుడు మారకు



డగును. లగ్నాధిపతి యగు చంద్రుడును మారకుడే మీనలగ్నమునకు ద్వితీయాధిపతి యగు కుజుడు. వానితో సంబంధించిన వారును ద్వితీయమున నున్నవారును మారకులగుదురు.

శ్లో॥ షష్ఠాష్టమవ్యయగతో నిధనాధిపతిర్యది।
తద్భావేతదధీశానా మంతర్భుక్తౌ మృతిర్భవేత్॥ 6

తా. అష్టమాధిపతి షష్ఠాష్టమము లందుండెనేని యారాశినాధునియొక్క దశయందు అష్టమాధిపతియొక్క భుక్తియందు మరణము కలుగును.

శ్లో॥ శన్యధిష్ఠితరాశీశ దశాయాం నిధనస్థితః।
అంతర్భుక్తిం యదాకుర్యాత్తదా దేహవియోగతా॥ 7

తా. శనియున్న రాశినాధునియొక్క దశయందు అష్టమాధిపతియొక్క భుక్తి మరణము కలుగును.

శ్లో॥ యస్మిన్రాశౌ కర్మనాధస్తదధీశదశాయదా।
భవేదంతర్దశా రాహో స్తత్రవాసురణం ధృవం॥ 8

తా. కర్మాధిపతి యేరాశియందుండునో ఆరాశినాధుని దశయందు రాహువుయొక్క భుక్తియందు మరణము కలుగును.

శ్లో॥ అష్టమేశ దశాయస్య జన్మకాలేతు దేహినః।
లగ్నేశాంతర్దశాకాలే తస్యకష్టా ప్రబాధవేత్॥ 9

తా. జన్మకాలమందు అష్టమాధిపతి దశవచ్చెనేని లగ్నాధిపతియొక్క భుక్తియందు మరణము కలుగును.

శ్లో॥ కేంద్రత్రికోణే తనురంధ్రనాధయుక్తేతు కే
చిద్గగనేచరాశ్చేత్ ।




తేషాం దశాయాం బలవర్జితస్య
గ్రహస్య దాయే మరణం ప్రయాతి॥ 10

తా. లగ్నాష్టమాధిపతులు కేంద్రత్రికోణము లందుండగా మరికొన్ని గ్రహములు కలసియుండిరేని వారిలో బలహీనుడగు వానియొక్క దశయందు మరణము గలుగును.

శ్లో॥ ఆయుస్థానేపి లగ్నేచే ద్వర్తతే సూర్యనందనః।
విపదస్తద్దశాయాంతు జాతస్యమరణం ధ్రువం॥ 11

తా. శని లగ్నమందైనను అష్టమమందైనను ఉండెనేని ఆశనియొక్క దశయందు మరణము కలుగును.

శ్లో॥ పంచమే నవమేయస్య జన్మకాలేరవిస్థితః।
స్యాజ్జన్మకాలికాసారేః దశాచే త్పితృనాశనం॥ 12

తా. పంచమమందైనను నవమమందైనను రవియుండగా జననకాల దశ శనిదశ యయ్యెనేని పితృనాశము కలుగును.



మారక దశాంతర్దశా ఫలంనామ
ఏకాదశ ప్రకరణము.

23/365 సమాప్తం.



